ఓమ్

నమోభగవతే శ్రీరమణాయ.

శ్రీ భారతీ దేవ్యైనమః.

# ఆంధ్ర ధ్వన్యాలోకము



## -: కృతి సమర్పణము :-

౧

శ్రీవాగ్ బ్రహ్మమయ స్వరూపిణి, నలంకృత్యుజ్జ్వలన్, సద్గుణ
ప్రావిర్భావ, మనోజ్ఞవృత్తిని, రసధ్వన్యాత్మ, నాభారతీ
దేవిన్-భక్తి నిగూఢ బద్ధమతినై, దివ్యాభినవ్యాత్మ, వి
ద్యా వాల్లభ్య కవిత్వ సంభృతికినై, ధ్యానింతు నశ్రాంతమున్॥

౨

త్రాణ ప్రాణ కళామణి ప్రసర విభ్రాజత్ కిరీటా! జగద్
వీణానాద! కృపావలోక మధుమూర్తీ! తాళహారోల్లసత్
పాణీ! జ్ఞాన సుధాకరాస్య! నటనప్రావణ్య మంజీర ని
క్వాణాంచత్ పదపద్మ! మన్నయనపర్యాకార! వాగ్దేవతా!

౩

శ్రీవాక్ప్రాణ నిగూఢశక్తి హితమూర్తి జ్ఞాన సౌందర్య వి
ద్యా విద్యోత రస స్వరూపిణికి, రమ్యానందగమ్య స్వరూ
పావిష్కార సుఖానుభూతికి, తదీయాద్వైత సంభావనా
భావాలోక విశోకమీ తెలుఁగు ధ్వన్యాలోక మర్పించెదన్॥

౪

కృతిమూర్తిన్ వినిని, కావ్యదర్శనము నిర్మింపంగ సూత్రధ్వని
శ్రుతిమూర్తిన్ గని, తత్పరిష్కృతికి నాలోకాకృతింబూని, సం
స్కృతిమూర్తిన్ గొని, లోచనప్రసృతి నున్మేషించి, రమ్యప్రభా
మతి మూర్తిన్ మను కావ్యవాణినెద సంభావించి సేవించెదన్॥

౫

శ్రుతి మధురార్థ శబ్దమయి, సుందరి, సంఘటనా గుణౌచితీ
చతుర కథా విభావిత రసధ్వనిమూర్తి, అలంక్రియా విభూ
షిత రుచిరాంగదీధితి, విచిత్ర వివిక్త హితోపదేశ శా
శ్వత-నియమ ప్రవృత్తి, కవిభారతి, మమ్ము ననుగ్రహించెడిన్॥

## శ్రీ బ్రాహ్మీ పరివస్యాంజలిత్రయి

౧

శ్రీవాగ్ దేవీ! పర వి
ద్యా విభవోల్లాసినీ! మహానంద కళా
భావుక హృదయోదిత రస
భావాదిమయ స్వరూప! ప్రగుణకలాపా!

౨

ఆకర్ణాంత విశాలలోలనయన వ్యాపారనిర్యత్ ప్రభా
శ్రీకేళీ విగళత్ కళాభువన పారిజాత సౌందర్య నా
శీకాకృష్టవిముగ్ధచిత్తరసికాళీ! ప్రాంచదర్థ ప్రణా
ళీ! కల్యాణగుణావళీ! జనని! కాళీ! భార్గవీ! భారతీ!

౩

శ్రీమత్కావ్యామృత రస
ధామ కటాక్షచ్ఛటా కృతక్షేమ జన
స్తోమ! శుభశ్యామ! ధృత
క్షౌమ! లసత్ కామహేమ జగదభిరామా!

౪

చలదిందీవర పత్రనేత్రియుగళీ సంజాత కాంతిచ్ఛటా
కలనాలాస్య విలాస సంపదనురక్త ప్రేయసీ ప్రేయసో
జ్వల శృంగార కథావిధానరచనాచాతుర్యవత్సూక్తి మం
జుల దివ్యాకృతి! శ్రీ సరస్వతి! యశశ్శోభావతీ! భారతీ!॥

౨ విభక్తులలో ప్రథమ

నాదానందిని, నాదరూపిణి, జగన్నాద పరిభూతాత్మ, త
న్నాద బ్రహ్మవిహార, నాదలయ, నాదాధార, నాదాఖ్య, శ్రీ
నాదాలాపిని, నాదదేవత, లసన్నాదాగమోపాస్య, ఓం
నాదాధీశ్వరి, శ్రీ సరస్వతి, ననున్ నాదాఢ్యుఁగావించెడిన్॥

౩ సంబోధన ప్రథమ

దివ్యాలంకృతి! దివ్యలోచన! లసద్దివ్యాంబరోద్భాసినీ!
దివ్యాచారిణి! దివ్యదీధితి! మహాదివ్య స్వభావోజ్జ్వలా!
దివ్యానందిని! దివ్యకావ్య రచనోద్దీప్తక్రియా కౌశలా!
దివ్యజ్ఞాన విశేష భాసురమతీ! దివ్యాకృతీ! భారతీ!

౪ ద్వితీయ

శారద, సంగీత రస
క్షీరద, హృదయైకవేద్య సిద్ధాంత సుధా
పూర, దయాపార, స్మితా
సారదశనవార, ధీవిశారద నెంతున్॥

౫ తృతీయ

సుపచిరరాగ సంకలిత, సూక్తి విహారిణిచే, పదార్థ వి
స్ఫురణకృదాననోచ్చలిత భూరివిలాస విశేషచే, ప్రహ
ర్ష రుచి సముల్లసత్ పులక సంగతిచే, మధువాణిచే, మనో
హరగతిఁజాలువారు రసమాని కృతార్థుఁడనై తరించెదన్॥

౬ చతుర్థి

రసదేవతకొఱకు, సుధా
రసదేవతకొఱకు, పాణి, రాగ, కళా, ష
డ్రస దేవతకొఱకు, జగద్
రసదేవతకొఱకు, "కావ్యరస సమర్పింతున్"॥

౧౦ పంచమి

నిర్మలార్థ శరీరకం౦బె, వినిగూఢ
ధర్మపథకంబె, కామహృదబ్జకంబె,
ముక్తి దృష్టికంబెను, పరాశక్తికంబె
నాశ్రియార్ణమ్మయిన పౌరుషార్థమున్నె?

౧౧ షష్ఠి

వాణికి, భావేందిందిర
వేణికి, నిగమాంత పుష్పవిలసనతుష్యత్
ప్రాణికి, శుభగుణరత్న
శ్రేణికి "మత్కావ్యశాస్త్రకృతి సర్పింతున్"

౧౨ సప్తమి

శ్రుతిశాస్త్ర పురాణ కథా
కృతియం, దఖిలేశ్వర ప్రకృతియందు, సర
స్వతియందు, భక్తి భావో
న్నతిఁగలదగుచుండు నామనస్సెల్లపుడున్॥

౧౩

శ్రీరమణస్వరూపిణివి, చిన్మతి, వీశ్వరి, వక్షరాత్మ, వా
కార గుణాదిపూర్ణవు, వికార విచార విదూర; వద్భుతా
చార, వసంతమూర్తివి, ప్రసారితదివ్య కటాక్ష విస్ఫురత్
సారసపత్ర సంభవవు, శాశ్వతకీర్తివి; నీవు, శారదా!

౧౪

వీణన్, దాళము, హారమున్, గొని, కళావిద్దృష్టి వాత్సల్య స
ప్రాణంబై వెలుఁగొంద స్వప్నసరణిన్ బ్రత్యక్షమై-తల్లసత్
పాణిల్ నాశిరమందుఁజేర్చుచు నెదోభాషించి-దీవించు శ్రీ
వాణీదేవి, మదంబనెల్లపుడు సంభావించి ధ్యానించెదన్॥

౧౫

కలమున్ జేకొని తల్లినాత్మఁదలఁపంగానే దయామూర్తి, ఉ
జ్జ్వల కావ్యాత్మ రస స్వరూపమున నా స్వాంతంబునందోచి, నా
కలముంగైకొని, తానె వ్రాయునటులన్ గాకున్న నజ్ఞుండ నా
కు లసద్భావ పదార్థ తత్త్వరచనాకూతంబు సిద్ధించునే?

౧౬

'అన్నపూర్ణాంబవై'యాంధ్రభారతము నాఱేండ్లనాడే ప్రబోధించినావు
'పేరన్నతాతవై' ప్రేమతో నమరాంధ్రములఁబఠించెడి రీతిఁదెలిపినావు
'వేంకటరామమూర్త్య'ంకిత పితవౌచు కావ్యపాఠములెల్లఁగరపినావు
పదపద్యరూపవై పదవమేటనె తోచి, నను'బాలకవి'గా నొనర్చినావు

పరిథిత రామానుజార్య రూపవయి కరుణ
సాంస్కృతిక సాహితీ విశేష మిడినావు
'గురునికర' మూర్తివై విద్యఁగూర్చినావు
'నీవొకతెవయ్యు' తల్లి! వాణిమతల్లి!

౧౭

నమ్మకదుష్టమైనది-మనస్సిది, నీవచనమ్ములున్, విలో
కమ్ములు, రూపుఁ,జూడగనె కమ్మని చక్కని తీయనైన మా
ఘమ్మవు నీవుగాఁదెలిసె, నద్భుతమైన భవత్ప్రభావమున్
నమ్మెదనింక,, నర్థములు నాల్గుగడించు బలమ్మునిమ్మమా!

౧౮

ఏనే జన్మంబునందో నాబ్రతుకు తల్లి నీకు నర్పించి యు
న్నానీ 'నే' నను నామతిన్ భవదధీనన్ జేయ యత్నించు చు
న్నా, నారోగ్య బలాదిశక్తులనుసంధానించి, రక్షించి, నా
లో నర్తించి, భవత్ స్వరూపము సమాలోకింపనిమ్మీశ్వరీ!

౧౯

శ్రుతిజాడ్యమ్ము వదల్చి, భూషణ కళా శుద్ధాత్ముఁగావించి, వాక్
సతి! నీకుంబురుషాత్ముఁడౌనితని శాస్త్ర బ్రహ్మ నర్పించితిన్

పతికిన్ బత్నినొసంగు న్యాయమిచటన్ వ్యత్యస్త మౌచుండినన్
గృతియే యీతఁడుగాన నీపురుషభర్తృత్వమ్ముఁగొమ్మీశ్వరీ!

౨౦

పచ్చి దరిద్రురాలవని స్వాంతమునందుఁదలంపనైతి, నీ
కిచ్చితి మత్కృతిన్ దమి భరింపక తప్పదు నీకుఁ,గాన నీ
విచ్చకమాడి యత్తయగు నిందిరచిత్తము మెత్తచేసెదో!
బిచ్చముఁదెచ్చి పెట్టెదవొ,!-ప్రేయసి యీ కృతినీకు భారతీ!

౨౧

ఆదిన్ నైగమబోధరూపయయి-శ్రుత్యాఖ్యంబ్రవర్తించి, యా
మీఁదన్ శాస్త్రకళామయాత్మయగుచున్-స్మృత్యాఖ్యభాసించు, భా
షా దేవీ మధుర స్వరూపము-పరాశక్తి స్వరూపమ్ముగా
వేదోక్తంబగు, నట్టి సత్యరస సంవిన్మూర్తిఁబూజించెదన్॥

౨౨

వాక్కునయందు వర్తిలుచు, వాక్కునకంతరమై వెలుంగుచున్,
వాక్కె శరీరమై వెలయ, వాక్కునకందక-లోననుండి-యీ
వాక్కునకున్ నియంత్రివయి, భాసిలు నీయమృత స్వరూపమున్
నిక్కముగా గణించెద, గుణించి, భజించి, గ్రహించి-నించెదన్!

౨౩

స్తనముల్ నాలుగునీకు-నందు విబుధుల్ 'స్వాహా' 'వషట్', కారముల్
గొనిహర్షింతురు, 'హంత' కారమును మర్త్యుల్ గొంద్రుప్రీతిన్, 'స్వధా'
అనుదానిన్ బితరుల్ గ్రహింత్రు, వృషభంబౌ ప్రాణమున్, వత్సమౌ
మనసున్, గల్గిన కామధేనువుగదమ్మానీవు! వాగ్దేవతా!

౨౪

అనృతజగమ్ము-సత్యమగునట్లు, జడమ్మగు లోకమెల్ల-చే
తనమగునట్లు, దుఃఖనిహతమ్ము-మనమ్ము "రస" స్వరూపమై
తనిసెడు నట్లొనర్చు పరతత్త్వము-నీసవిలాసహాసమున్
మనమున నే నుపాసనమొనర్తు ననుంగృపఁబ్రోవు భారతీ!

౨౫

అంగలతన్ రచింపఁగ పదార్థములున్, గుణవృత్తులన్ ఘటిం
పం గుణవృత్తులున్, రసశుభాత్మ నొనర్ప రసం, బలంకరిం
పంగనలంకృతుల్, సుకవి భావములం దుదయింపఁజేసి, కా
వ్యాంగన సృష్టిసేయు లలితాత్మవు నీవెగదమ్మ! శారదా!

౨౬

కారాగారములో స్వతంత్రుఁడెవఁడో, గాఢాంధకారంబులో
దారుల్ గుర్తిడఁజాలు ధీరుఁడెవఁడో, దావాగ్నిమధ్యంబులో
ధీరుత్వంబుఁదొలంగు శూరుఁడెవఁడో, పెద్దమ్మనాట్యంబులో
సారస్యంబు గ్రహించు ప్రాజ్ఞుఁడెవఁడో, చంచన్మరుత్క్షోణిఁదృ
ష్ణా రాహిత్యముఁగాంచు విజ్ఞుఁడెవఁడో, సాంద్రాగ్నితప్తాక్రాంతిలో
సారళ్యంబు వహించు వీరుఁడెవఁడో, సత్కావ్యనిర్మాణ వి
ద్యారాసిక్య కళాపరియుక్త రచనాధారా సుధాపూర వి
స్తారుండాకవితా విహారుఁడు నమస్కారార్హుఁడో భారతీ!

౨౭

ఒకనరుఁడైంద్రజాలికుఁడెదో యొక తంత్రమొనర్ప, దాని నిం
చుకయు గ్రహింపనేర, నతిచోద్య, వనిర్వచనీయ, మైంద్ర జా
లికవయి-నీవె స్వాత్మఁగికురించి, అనాత్మగఁజూప-దాని నె
ట్లకట! గ్రహింపనేర్తును? యథార్థముఁదెల్పు ముమా! రమా! ప్రమా!

౨౮

నన్నీపంజరమందు నుంచి-ఇటు లానందింతువే "నాకు" నీ
కన్నన్ వేరొకదిక్కులేదు, బలమున్ గాన్పింప, దీకుండలో
మన్నే మున్నదొకాని, దుర్బలము-ధర్మార్థవ్యర్థ సంధాన సం
పన్న శ్రీకము కాదు, కాచుకొనుమమ్మా! నన్ను లోకేశ్వరీ!

౨౯

బ్రహ్మాద్వైత పరాత్మవై, ప్రకృతి, వవ్యక్తాత్మవై. పిమ్మటన్
బ్రహ్మాండోదయ సూక్ష్మకారణ మహద్వ్యక్తాత్మవై, తత్ పర

బ్రహ్మాంశాచ్యుత, శంభు, ధాతృ, కమలా, ర్యా, శారదా, రూపవై
బ్రహ్మాండాత్మికవైన నిన్ను హృదినారాధింతు సర్వేశ్వరీ!

౩౦

ఈవేయక్షర, మీవెశబ్దమును, నీవేయర్థ, మీవేనుడుల్,
నీవేరీతులు, నీవె వృత్తులు, నహో! నీవే రసాది ధ్వనుల్,
నీవేకావ్యము, లీవెయాగమములున్, నీవే జగంబంతయున్,
నీవే తక్కనికొండులేదనిమదిన్ నేనెంతు వాగీశ్వరీ!

ఓమ్. తత్. సత్.

ఓం నమోభగవతే శ్రీ రమణాయ.

## పూజా ప్రసూనమాలిక

సిద్ధిసమృద్ధులయ్యు సురశేఖరులందొకఁడైన సత్క్రియా
బద్ధజగత్సమీహిత శుభార్థమవిఘ్నగతిన్ ఘటించు సం
సిద్ధతఁగాన, రగ్రసరుఁజేసి భజింతురు నిన్నె, మత్కృతిన్
సిద్ధముగా నొనర్చి, నను సిద్ధి గణేంద్ర! యనుగ్రహింపుమీ॥
ఎంతగరిష్ఠ పండితులనేని మహాద్భుత తీక్ష్ణవాద సి
ద్ధాంతమునన్ జయించుచు స్వతంత్రతఁగన్న మహాత్ముఁడాశురూ
పాంతరశాలిగద్యపదపద్యమనోజ్ఞకృతిప్రణేత శ్రీ
పంతుల బ్రహ్మదేవ కవి పండితు-మాపెద తాతఁగొల్చెదన్॥

శ్రీ కిడాంబి - రామానుజాచార్య ప్రశంస.

వత్సా! రమ్మని పద్దునిచ్చె, నను నద్వాన్స కక్ష్యలోఁజేర్చె, భా
స్వత్సౌమ్యాకృతియై-మదీయములెవో పద్యాలు విన్పింపఁగా
ప్రోత్సాహమ్ముగ వించుమెచ్చె, దొసఁగుల్ బోధించె, నాయందెదేన్
వాత్సల్యమ్మది; యట్టి తాతఁగొలుతున్ రామానుజాచార్యునిన్॥

శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గురుదేవ ప్రశంస.

నీయమృతోక్తి-బీజముగ, నీ పరిశీలన-రక్షగా, సమీ
క్షాయత, లోచనప్రకృతి ప్రాణముగా, నుదయించి-భామతి
ధ్యేయము, పేయమౌచు-వికసించిన యీ సుకృతి ప్రసూనమున్,
రాయడు శాస్త్రిదేవ! యభిరామముగా సమనుగ్రహింపవే.

శ్రీ నౌడూరి వేంకటశాస్త్రి గురుమూర్తి ప్రశంస.

మాయాదుర్జయ పూర్ణమైన కలిలో మాత్సర్య నిష్కాసితా
ప్తయౌదార్థ్య, సునీతి, శాంతి, గుణ, విద్యా, శీలముల్ తన్ను ని
ర్మాయున్ జేరగ నాశ్రయంబిడిన నిర్మాత్సర్యు, శాస్త్రోదిత
న్యాయున్, వేంకటశాస్త్రి, మద్గురువిభున్ నౌడూరుజున్ గొల్చెదన్.

చతురస్రగతి కొర్రివిరి. [అపూర్వమగు జాతీయపద్యము]

అత్యాశ్చర్యసుకీర్తివి! విధాతకంతేవాసివి! విద్యామూర్తివి
నిత్యానంద రసోపదేశ రమణీయ నాట్యవేదకృతిస్ఫూర్తివి!
సత్యనిగూఢ చతుశ్శ్రుతి నిర్గత చతుర్విధాభినయామృతవర్షీ!
స్తుత్య కళామయ జగదాశ్రయ కృతిశోధనహర్షివి! భరతమహర్షీ!

[ఖండగతి] జయభద్రలీల. ఆనంద ప్రశంస.

ఆనందమే విభావాది సంవలిత చిత్తే రసమ్మగుచుండునని విశేషించితివి
ఆనందరసమె-ధ్వన్యాత్మగ నిరూపించి, ఆ రసధ్వనియె-కావ్యాత్మగ విధించితివి
ఆనందులయ్యు కావ్యాత్మమూఢులగుకావ్యార్థవేత్తలకుధ్వన్యాత్మ రూపించితివి
ఆనందవర్ధన! కళానందవర్ధన! ప్రజానందవర్ధన! నమస్తే, నమస్తే.

అభినవప్రశంస.

సీ॥ వరనరసింహగుప్తను, వ్యాకృతియయి, భట్టేందు రాజార్యు, సాహిత్యమగుచు,
ప్రథితోత్పలతనూజ-లక్ష్మణగుప్తనాథ- బుధేశ్వరుల, త్రికదర్శనమయి,

వామనాథుని, ద్వయా ద్వయతంత్రమై, భట్టతౌతార్య, నాట్య
వేదార్థమగుచు,
భూతిరాజాచార్య, భూమవిద్యాస్వరూపమయి, తత్త్వనయుఁ
శైవమతమగుచుఁ

గీ॥ ఆశ్రయించి పృథక్ పృథక్కగు నుపాధు
లందు భిన్నాత్మయగు శారదాంబ-వారి
శిష్యు నినుఁజేరి-ఏకాత్మ సిద్ధిఁబడసె,
గురుకళామోద! అభినవగుప్తపాద!

శ్రీ కళ్యాణ గుణప్రబంధు, కరుణాసింధున్, స్వబంధున్, శుభ
శ్లోక శ్లోక సహృద్యగద్య రచనాశూరున్ సుధీరున్, ప్రశ
స్తా కుండ్యన్వయ కీర్తివాకు, ఘనవిద్యాలోకు, సంపత్కళా
శ్రీకున్ వేంకటశాస్త్రి మద్గురు విభున్ సేవింతు నెల్లప్పుడున్.

అమృతతరంగ మూ భవదపాంగము చందనలేప, మానిమే
షమునసెై జ్యోతిఁజూపఁగల సాధన, మాయరుణాద్రి నీ మహా
సముఖముననన్ గనుంగొనిన సౌఖ్యమె-సౌఖ్యము, దానినేప్రభూ!
రమణమహర్షి! నిల్పు, మభిరామ మకామము నక్షరమ్ముగన్.

ముక్తాహార బహూకృతిన్ దనుఁగడున్ భూపుత్రిమన్నింప నా
సక్తిన్ బండ్లిగిలించి గైకొని, నిరాశన్ దానిఖండించి, త
న్ముక్తా రాశిఁబగిల్చి, రామపదమున్ గుర్తించువానిన్ మహా
భక్తాగ్రేసరు నమ్మరుత్తనయి సంభావించి ధ్యానించెదన్॥

శ్రీ యువతీ మనోనయన శీల పరిభ్రమణంబు మాన్పఁగన్
దోయజ మందిరంబునఁగనుంగవ రేపవలుంచి దానినిన్
మూయుచు విప్పుచున్ స్థిరతఁబూన్చిన శ్రీహరి, నన్ను లక్ష్మినా
రాయణ నామధేయుని నిరంతరమున్ గృపనేలుఁగావుతన్.

సీ॥ ఫాలాక్షమందగ్నికీల-జాటాజూటరంగమందుత్తుంగ గాంగలీల
కంఠభాగమునన్నుగ్రవిషప్రసక్తి-శీర్షమునయందమృతాంశు
శైత్యయుక్తి

అఖిలావయవములందహిఫణాఫూత్కార-మాస్యదేశమునశంఖా
రవంబు
అర్ధాంగమునపౌరుషాకృతి-తదితరార్ధాంగమ్మునందుస్త్రైణా
కృతియును

గీ॥ అద్భుతముగ, విరుద్ధ పదార్ధ, గుణ వి
రావ రూపములకు సమాశ్రయము నొసఁగి
రౌద్ర శృంగార రసముల రుద్రశంక
రాఖ్యలధ్వనించు శివదేవు నభినుతింతు॥

సమమయి, నిర్విశేషమయి, సద్ఘన, చిద్ఘన, ముద్ఘన స్వరూ
పమయి,యతీంద్రపేయ,మనపాయ,మమాయ,మమేయమై,శుభా
ర్థిమతి సమిద్ధమై, రస సమృద్ధము, సిద్ధము, శుద్ధమైన, బ్ర
హ్మము- మధురస్వరూప విభవానుభవ ప్రభవమ్ముఁగూర్చెదున్॥

ఓమ్, తత్, సత్.

ఓమ్.

శ్రీ మద్గురు సార్వభౌములగు

బ్రహ్మశ్రీ "మహామహోపాధ్యాయ", "కళాపరిపూర్ణ"

## తాతా సుబ్బారాయ శాస్త్రిలవారి

అశీఃపూర్వకమగు — అభిప్రాయము.

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచే "ఆంధ్ర ధ్వనాలోకము" అను పేరిట రచింపఁబడిన ధ్వన్యాలోకాంధ్రీకరణమును నేను సమగ్రముగా వింటిని. ఇతఁడు నాయొద్దఁజదివియుండుటచే విశేషించి ప్రశంసోక్తులను వ్రాయుటకు నా మనస్సు- అంగీకరించి యుండలేదు.

పుత్రాదుల ఉత్కర్షోక్తి ఆత్మప్రశంసారూపమై వికత్థన మగు నని నే ననుకొనుచున్నాను.

వీరి యీ గ్రంథరచనను గూర్చి కవిసార్వభౌములును, మహామహోపాధ్యాయులును, కళాపరిపూర్ణులును, శ్రీకృష్ణ భారత గ్రంథ నిర్మాతలును, అగు బ్రహ్మశ్రీ-శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారును, విద్వత్కవీంద్రులును, శతాధిక సంస్కృతాంధ్ర గ్రంథ నిర్మాతలును, కళాపరిపూర్ణులును అగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారును, ఇతర విద్వాంసులును, సంతోషపూర్వకముగా నభిప్రాయముల నిచ్చియున్నారు. కాని యవియుఁగూడ ఈ గ్రంథముయొక్క ఘనతను సా క ల్యా ము గ చెప్పలేకపోయినవేమోయని తలంచు చున్నాను. ఘనమైన వస్తువును సాకల్యముగ నిరూపించుట కష్ట సాధ్యముగదా!

నేను చెప్పవలసిన దొక్కవిషయము :—

సంస్కృతభాషలో ఆరితేరని ఆంధ్ర విద్వాంసులకు సంస్కృత ధ్వన్యాలోకాపేక్ష అక్కరలేకయే ఈ గ్రంథము కవితాతత్త్వమును బోధింపఁగలదని తలంచుచున్నాను. ఈ గ్రంథకర్త చిరాయువుఁ

గలిగి, యిట్టివనేక గ్రంథములను రచించి, ఆంధ్రలోకమున కుపక రించునటులు భగవంతుఁడనుగ్రహించుఁగాక! అని ఆశీర్వదించు చున్నాను.

విజయనగరము, 2-2-42. } ఇట్లు, మహామహోపాధ్యాయ-కళాప్రపూర్ణ, తాతా సుబ్బారాయశాస్త్రి.

---

శ్రీమత్పర దేవతాయైనమః

# పీఠిక

( శ్రీ తిరుపతి వెంకటేశ్వరులలో నొకరగు )

(కళాప్రపూర్ణ శతావధాని, ఆంధ్రాస్థానకవి)

కీ॥ శే॥ శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారు వ్రాసినది.

## ఆంధ్ర ధ్వన్యాలోకము

దీని రచయిత :-

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

ఇతఁడు విద్యాబుద్ధులలో వృద్ధయ్యు, నాకన్న వయసులోఁగడుం గడుఁ జిన్నవాఁడగుటచే, నేను ఏకవచనముతోడనే యిందు వ్యవహరింతును.

ఇతనికి వ్యాకరణ శాస్త్ర గురువులు, సుప్రసిద్ధులు బ్ర॥ శ్రీ అప్పల్ల జోగన్నశాస్త్రిలుగారు.

ప్రస్తుతమైన ధ్వన్యాలోకమేమి, ఇతరాలంకార గ్రంథము లేమి, మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు, బ్ర॥ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిలవారి యొద్దను, కీ॥ శే॥లు సుప్రసిద్ధులు, నౌడూరి వేంకటశాస్త్రిలవారియొద్దను అభ్యసించినవాఁడు, సహజ మైన కవిమాత్రమేకాదు. కవితారంభప్రియంభావుకమైన వంశము నందు జన్మించిన ధన్యుఁడు. ఈభాగ్యమెవ్వరికోగాని సంఘటింపదు. కావుననే భూషణభట్టు

శ్లో॥ ఆర్యం యమర్చతి గృహేగృహ ఏవలోకః
పుణ్యైః కృతశ్చయత ఏవమయాఽఽత్మలాభః
సృష్టాచయేనచకథేయ మనన్యశక్త్యా,
వాగీశ్వరం పితరమేవతమానతోఽస్మి॥

అని చెప్పికొనియున్నాడు. (కాదంబరి. చూ) ఈయన పెద్ద తాతగారు పంతుల బ్రహ్మన్నశాస్త్రులవారిని గూర్చి, లోకములో-

అందును విశాఖపట్టణ ప్రాంతమందును, ఇంకను విజయనగరము, బొబ్బిలి ప్రాంతములయందును, ఆబాలగోపాలమును జెప్పికొనెడికథలు-పెక్కులుగలవు. విస్తరభీతిచే నవియేవియు నిందుదాహరించనైతిని. ఇతఁడట్టి మహాకవి వరేణ్యుని వంశమువాఁడని మాత్రము పాఠకలోకమునకుఁదెల్పుచున్నాఁడను.

కౌపీనధారణమే మొదలితఁడు కవిత్వము రచించువాఁడు. అప్పుడప్పుడా శైశవదశలోఁగూడ నేనాప్రాంతములకు వెళ్లినతఱి నితనిరచనవిని-ఆనందించు చుండెడివాఁడను.

శ్లో॥ "బీజంయస్య పురార్జితం సుచరితంప్రజ్ఞా నవీనోఽఙ్కురః,
కాణ్డః పణ్డిత మణ్డలీ పరిచయః" (ప్రసన్న రాఘవము)

అనుచొప్పున, ఉదయించిన కవితకు నెన్నిఁటితోఁజుట్టరిక ముండవలయునని ఆ శ్లోకములో జయదేవుఁడు చెప్పెనో, అవి యన్నియు నితనికి సమకూరినవనినచో; సూత్రప్రాయముగా నితని ప్రజ్ఞను నుడివినట్లగును-ఏగ్రంథము నితఁడాంధ్రీకరించెనో ఆధ్వాన్యాలోకమును శ్రీ మహామహోపాధ్యాయుల వారియొద్ద నధ్యయన మొనర్చుటట్లుండ; అనువాదము సైతము-శ్రీవారికి వినిచి సంస్కరించు కొనియెను.

ఇట్టి గ్రంథమునకు నేను పీఠికవ్రాయుట బాగుగఁబరిశీలించి నచో విడంబనంబుగ నుండుననుట నిర్వివాదము.

అసలే చూడలేదనినచో సన్పతదోషము తగులునని యట్లు వ్రాయఁజాలనుగాని, నేనాలంకారిక గ్రంథములను గురుముఖమున వ్యాసంగమొనర్చిన వాఁడనుగాను. ఇతఁడీ గ్రంథమును వినుచు నపుడు ప్రత్యక్షరమును వింటిని.

ఆయా శ్లోకముల యాంధ్రీకరణము—

శ్లో॥ "వత్సే! మాగావిషాదమ్" లోనైన శ్లోకముల యను వాదము నాకు మిక్కిలి సంతృప్తిని కల్గించినది. శ్రీనాథాదులు సైత మిట్టిపట్టుల నుపేక్షించుచుండిరి-కావుననే—

"శ్రీనాథాదు లిప్పట్టునన్ । నతులర్పించిరి నిక్క;
మియ్యవి పరిమాణంబుల్ తదుద్గ్రంథముల్"

అని శ్రీనివాసవిలాస పీఠికలో వ్రాసియున్నారము. నైషధము నందలి-"చేతోఽనలంకామయతే" లోనైనవాని యాంధ్రీకరణము తిలకించినవారికీవిషయము విస్పష్టము కాఁగలదు. ఇతఁడిప్పటికే కవితాప్రపంచమునందు మంచిస్థానము నార్జించియున్నాఁడు.ఇంకను పరమోన్నతికి రాఁగలఁడని నాకు దృఢమైన నమ్మిక—

ఆంధ్రీకరణమునందలి ధారాశుద్ధిని దెల్పుటకై కొంచె ముదా హరింతును.

వదనము వంచి-లజ్జ, గురువర్గమునొద్ద నురోజయుగ్మకం
పదమగుచున్న మన్యువును మానసమందె యడంచి బాష్పమున్
విడులుచుచున్ విభీతహరిణీ విలసన్నయన 'త్రిభాగమున్'
పొదిగొన నాపయిన్ బఱపి-పోవలదంచు మిటారి తెల్పదే?

[ద్వితీయ భా, 30 పేజి, తృతీయోద్ద్యోతమునందలిది].

కం॥ అనవరతనయనజలలవ
పరిణిపతనామృషితపత్రి రచనాంతము, హ
స్త నిషణ్ణమునగు నీయా
నన మెవనికిఁ దాప కారణముగాదబలా?

[ద్వితీయ భా, 40 పేజీ, తృతీయోద్ద్యోతము.]

అయీ యనువాదము-సర్వథా (ఉభయ) భాషా ప్రవీణాది పరీక్షలకుఁజదువు విద్యార్థులకేకాక, యఫ్. ఏ., బి. ఏ.లకుఁజదువు విద్యార్థులకుఁగూడ మిక్కిలిగా నుపయోగించునని నాయాశయము.

విద్యాశాఖాధికారు లీయన పరిశ్రమకు సార్థక్యము కలిగింతురని నమ్మెదను-భగవంతుఁడితనికి నాయురారోగ్య భాగ్యములనిచ్చి కాపాడుఁగాకయని యాశీర్వదించుచున్నాఁడను.

బెజవాడ,
1-1-1942.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

శ్రీరస్తు.

కవిసార్వభౌములు బ్రిహ్మశ్రీ

## శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారి

అభిప్రాయము :

విజయనగరనివాసులు శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి గారు సంస్కృతాంధ్రములయందు నిశితమైన సాహిత్యముగలవారు. సాహిత్య విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, అను పరీక్షలయందుత్తీర్ణులై శ్రీ విజయనగరము మహారాజావారి కాలేజీయందు సంస్కృతాంధ్రోపాధ్యాయులుగా నున్నవారు. వీరు సంస్కృతాంధ్రముల యందు పెక్కు కృతులు రచియించియున్నవారు.

వీరు బ్రహ్మశ్రీ పట్రాయని సీతారామశాస్త్రిగారియొద్ద సంగీతము నభ్యసించినవారు. కావున మంచి గేయ ప్రబంధములనుగూడ రచించియున్నారు. వీరు రచించిన గేయములు నేను రెండు మూడు వినియున్నాఁడను. "గురువులఘువుచేసి కుందించి కుందించి,లఘువు గురువుచేసి లాగి లాగి" అనునట్లుగాక యెంతో మనోహరముగా నున్నవి. మఱియు వీరు కొన్నియుపనిషత్తులు తెలిఁగించి ముద్రింపించి యున్నారు.

ఇప్పుడు 'ధ్వన్యాలోకము' అను నలంకార శాస్త్రమును చక్కని శైలితో నిర్దుష్టముగా సరసముగా వ్రాసియున్నారు. శ్రీ మహామహోపాధ్యాయ, తాతా సుబ్బారాయ శాస్త్రిగారియొద్ద అలంకార శాస్త్రము నభ్యసించుటంజేసి, పాండితీయుక్తమగు వీరి కవిత్వము మిక్కిలి చక్కనిపాకమునఁబడియున్నది. వీరి కవిత్వమునందు తెలుఁగు పదములకన్న సంస్కృత పదము లధికములైయున్నవి. శైలి మృదు మధురముగానుండి పాఠకుల నాకర్షింపఁ గలదని నా యభిప్రాయము.

ఇట్టి వీరు-సర్వాలంకార శాస్త్ర గ్రంథములను పరిశీలించి పండిత సాహాయ్యముంగొని, తెలుఁగున స్వతంత్రముగా నొక అలంకార గ్రంథమును రచించి, తెలుఁగువారికింగల లోటును తీర్పఁ గలరని కోరుచు పరమేశ్వరుఁడు వీరి కాయురారోగ్యైశ్వర్యముల నొసఁగుఁగాతమని అశీర్వదించుచున్నాఁడను.

రాజమహేంద్రవరము,
30-12-41.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాథ,
ఆంధ్రాస్థానకవి.
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

శ్రీ రామాయనమః.

మ॥ రా॥ శ్రీ "మహోపాధ్యాయ" శ్రీమాన్

## మేదేపల్లి వేంకట రమణాచార్యులుగారి

అభిప్రాయము :—

గీ॥ అహహ! వివరింపనేరికియ్యవనిశక్య
మయ్య? ధ్వనిశాస్త్రమీరీతి నతివిశదత;
పిన్నవాఁడయ్యు, వయసునఁ బెద్దగాఁడె?
శాస్త్ర పాండితి నొరులకీ శక్తిగలదె?

గీ॥ విమలతరవారిసదృశంబు విపులబుద్ధి
అడ్డదెందుననైన నవ్యాహతముగ;
నీకె చెల్లినదీరీతి నిర్మలోక్తిఁ
గవితఁ జెప్పఁగ నొరులకుఁ గలుగుటెట్లు?

గీ॥ కపట మెదఁబూనఁ డెప్పుడు; కల్లలేదు,
పలుకఁడెవ్వరితోనైన పరుషముగను;
లోకమందున్న జనుల నస్తోకమైత్రిఁ
జూచునెప్పుడు మాశాస్త్రి-సుగుణపేటి.

గీ॥ ఉపనిషత్తుల గూఢార్థ మొప్పఁదీసి
కృతుల రచియించి, యీతడు నుతులఁబడసె
ప్రజ్ఞలుగఁలాడు పెక్కులు, ప్రాజ్ఞనుతుఁడు,
శాస్త్రి నారాయణాఖ్యుండు, చతురబుద్ధి.

విజయనగరము,
29-10-42.

ఇట్లు బుధజన విధేయుఁడు,
"మహోపాధ్యాయ"
మేడేపల్లి వెంకట రమణాచార్యుఁడు.
Retired Senior Sanskrit Pandit
Maharajah's College
Vizianagram.

బ్రహ్మశ్రీ
చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారి
అభిప్రాయము :—

విజయనగర నివాసులు, శ్రీ మహారాజావారి కళాశాలలో నాంధ్రగీర్వాణోపాధ్యాయులు, శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు-తాము తెనిఁగించిన "ధ్వన్యాలోక"మను నలంకార శాస్త్రములోని కొంతభాగమును వారే స్వయముగా వినిపింపఁగా విని సంతసించితిని. ఈ యలంకారశాస్త్రమును

మున్నెవ్వరును తెనిఁగింపలేదు. దీని నాంధ్రీకరించుట మిక్కిలి కష్టము. అయిన నీగ్రంథము రసవంతమై, సుబోధకమైయున్నది. ఇదిగాక వీరుపనిషత్తులఁ గొన్నిటిని బద్యములుగా నాంధ్రీకరించిరి. కవిత్వముగూడ రసవంతమై, ప్రశంసనీయమైయున్నది. ఇదిగాక వీరు కొన్నికృతులుకూడ రచియించిరి. అవి వీరికి సంగీత సాహిత్యములందుఁగల ప్రజ్ఞను చాటుచున్నవి. చిఱుతప్రాయమునందున్న ఈకవి యుత్తరోత్తరాభివృద్ధినొంది సారస్వతసేవ నితోఽధికముగాఁ జేయునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక.

రాజమహేంద్రవరము, 30–12–41. } చిలకమర్తి లక్ష్మి నరసింహం.

వైణిక గాయక, నటక, కవి, శిఖామణులు, హరికథా పితామహులును, అగు బ్రహ్మ శ్రీ శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి
అభిప్రాయము—

శ్లో॥ త్రిలిఙ్గ భాషయా ధ్వన్యాలోక మన్వవదీదయమ్ ।
'పన్తులా' న్వయ రాకేన్దు 'లక్ష్మీనారాయణః' 'కవిః'॥

గీ॥ నాటు తెలుఁగున-వేలుపుమాటగుట్టు
తెలుపఁజాలిన చదువరి కలుగు టరుదు;
ఈనుడుల కూరుపరి పిన్నయైనఁగాని,
పెద్దపనిచేసె, మిక్కిలి-పేరుపొందు॥

ఆంధ్ర విశ్వకళాపరిష దాంధ్రోపన్యాసక పదవినుండి విశ్రాంతిని గైకొనిన కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారి
అభిప్రాయము—

సాహిత్యవిద్యాప్రవీణోభయభాషాప్రవీణ, పంతుల లక్ష్మి నారాయణ కవీంద్రాంధ్రీకృత ధ్వన్యాలోకమునఁ గొంతభాగమును సావధానముగ వినినాఁడను.

సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథములలో ధ్వన్యాలోక మగ్ర గణ్యమనుట - అతిశయోక్తి కాదు. తర్కవ్యాకరణశాస్త్ర వైదుష్య మును, అలంకార శాస్త్రాఽసాధారణ పాండిత్యమును, సంస్కృతాంధ్ర భాషాసునిశిత సాహిత్యమును, నిరర్గళాంధ్రకవితా చాతురియుఁ-గలవారికి మాత్రమే ధ్వన్యాలోకాంధ్రీకరణము సాధ్య మగును. అట్టి వివిధ కళాసామగ్రి కలంకారముగ-నీయన కవిత సుప్రసన్న మధురమగుటయు, నీతని ఛందోరీతి—

సంగీత ప్రసాదిత శ్రావ్యతాపరిమిళిత మగుటయుఁ బ్రశంస నీయములు.

"ఆంధ్ర వాగ్దేవత యేతాదృశ గ్రంథరత్నమును వెలయింప నెంచియే యిట్టి దుర్లభ సామగ్రికేకత్రావస్థానమును బ్రసాదించె"నని నాయభిప్రాయము.

ఆంధ్రమున నలంతిగనున్న కావ్యాలంకార సంగ్రహాది గ్రంథములు విద్యార్థుల కలంకారశాస్త్ర పరిచయమాత్ర మొదవింపఁ జాలునే కాని, లోచనాది వ్యాఖ్యాన విషయములతో సైతము విస్తర ముగ వివరింపఁబడియున్న యీ యాంధ్ర ధ్వన్యాలోకమువలె నలం కార శాస్త్ర పాండిత్యము నొదవింపఁజాలవు.

ఆంధ్ర భాషామతల్లి నిట్టి యపూర్వామూల్యాలంకారముచే నలంకరించిన యీతఁడాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రుఁడగుచున్నాఁడు.

ఇట్టి గ్రంథరత్నములను వెలయించుచు నీయన చిరకాలము వర్ధిల్లుఁగాక!

కోడుగంటివారివీధి,
విజయనగరము.
3-3-1944.

ఇట్లు సుజన విధేయుఁడు,
వఝుల చిన సీతారామస్వామిశాస్త్రి.

శ్రీ శ్రీ శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలా ప్రధానాంధ్ర పండిత పదవినుండి విశ్రమించి, ప్రస్తుతము శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయ పండితులైయున్న బ్రహ్మశ్రీ ఆకుండి వేంకటశాస్త్రి గారి లేఖారూపమగు నభిప్రాయము, తే 1–3–1943 ది.

శా॥ మూలాంశమ్ము పరిత్యజింపకయె, సొంపుల్గల్గ నాంధ్రినసూ
క్ష్మాలోకమ్మొనరించు పండితుల కాహ్లాదంబు సంధిల్ల; ధ్వ'
న్యాలోక'మ్మిటు వ్రాయుటన్ భవదుదారాంధ్రోక్తి, గీర్వాణ
వాక్, శ్రీలాలిత్యముఁదెల్లమౌనుగద! లక్ష్మీపూర్వనారాయణా!

1. కవితా విశారదా! నాఁడు మీవలన విన్న మీ యాంధ్రీకృతాలంకార రాజము-నాక కాదే యాంధ్రునకును గర్ణభూషణము కాకపోదని నా నిశ్చయము.

2. నేను ప్రకృతము స్థలాంతరవాసినగుట మీ యమూల్య గ్రంథమునందలి యా యా స్థల విశేషములంగల క్రొత్తవన్నెలు, మెఱుఁగులు, నిరూపించి-మీ పరిశ్రమను ససాక్షికముగఁ బ్రశంసించుట కనువుపడమిఁజింతిల్లుచు - సామాన్యముగా వ్రాసినందులకు సందియ మందుచున్నాఁడను.

3. మహా పండితైక సాధ్యమగు నిట్టికార్య మొనరించి-బుధజనోపకారముచేయుట మీయట్టి, సాహిత్య విద్యా ప్రవీణోభయ భాషా ప్రవీణులకు (సాహిత్యశిరోమణి, విద్వత్ కవులకుఁ)దక్కఁ దక్కువారికి నిక్కముగా సాధ్యపడని పనియనిచెప్పుట సాహసము కానేరదు.

4. పలువిధములగు రచనలతో గ్రంథములువ్రాసి—వ్రాయుచు వ్రాయనుద్దేశించియున్న — మిమ్ముఁబెక్కులిట్టివి వ్రాయుఁడని ప్రోత్సహించుట పునరుక్తమగుటను, త్రికాలములయందును మీకుఁ

దగు నారోగ్యము భగవానుఁడు ప్రసాదించుఁగాతమని కోరుటయే మేలని తలంచెదను.

5. మీయుత్తమాలోకము - తేజోవంతమయ్యుఁ; జూచువారి కన్నులకు వెన్నెలవలెఁజల్లనై - చిత్తముల కమందానంద మొదవించుచు, భవత్కౌముదీ పరిషత్సభ్యతను సార్థకము చేయునని నమ్ముచున్నాఁడను.

ఇట్లు మీ ప్రియమిత్రుఁడు

గీ॥ విజయనగర కళాశాల విబుధపదవిరతుఁడు, శ్రీ పీఠికాఖ్య పురాధినాథ
సూర్యరాయాంధ్ర సత్కోశకార్యనిలయ పండితాకుండి వేంకటాహ్వయబుధుండు॥

## కృతి సమర్పణము

[ ఆంధ్రపత్రిక ]

విజయనగరం, 1944 సెప్టెంబరు 25.

నిన్నటి సాయంకాలము 4-30 గంటలకు అయ్యకోనేటి పడమటి గట్టుననున్న ఉపనిషద్విహార భవనములో శ్రీ కౌముదీ పరిషత్ప్రాంగణమున సరస్వతీపూజలు జరిగినవి. తత్సభ్యులు సాహిత్య విద్యాప్రవీణ, ఉభయ భాషాప్రవీణ, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరించిన ధ్వన్యాలోకమును వాగ్దేవతయగు శ్రీ భారతీదేవికి సమర్పించిరి. మహామహోపాధ్యాయ, పేరి లక్ష్మీనారాయణశాస్త్రి గారి అధ్యక్షతతో, శ్రీ కానుకుర్తి వెంకట కృష్ణారావు పంతులుగారి ధార్మికతతో, సభ జయప్రదముగా సాగినది. శ్రీ చెళ్లపిళ్ళ వెంకట శాస్త్రిగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, తదితర ఆంధ్రప్రముఖులు, లేఖలమూలముగా సందేశములు పంపిరి. అనేకమంది పండితులు ప్రశంసించిరి. ఇప్పటికి జరిగిన యాంధ్రీకరణములలోనిది మిన్నయని తలఁచిరి.

# కృతి సమర్పణ సమయ సందేశములు

శ్రీమత్పరదేవతాయైనమః.

## * ఆశీర్వచనము

౧

శ్లో॥ యశ్శివో నామ రూపాభ్యాం
యా దేవీ సర్వమంగళా
పాయాస్తాం, తావిమం
లక్ష్మీనారాయణ కవీశ్వరమ్.

౨

పంతుల బ్రహ్మన్న పండిత సత్కవీ
శ్వరుని పేరెఱుఁగని వారు లేరు
అత్యాశుకవితకు నా విజ్ఞుఁ బోలిన
విద్వత్కవీంద్రులు పృథివిలేరు
నలువదేండ్లకు మున్ను పలువు రమ్మహనీయు
చిత్ర చరిత్రంబు చెప్పవింటిఁ;
బిమ్మటఁదద్వంశ్యుఁ బిన్నవయ్యును బుద్ధి
మత్తచే పెద్దవై మలయు నిన్నుఁ
గాంచి యమ్మహితాత్ముని గనని కొఱఁతఁ
దీర్చికొంటిని, నీ కబ్బు దీర్ఘమైన
మంచి జీవిత; మీవు రచించు పొత్త
మలరుఁగాక ధ్వన్యాలోక మిలఁజిరంబు!

---

* 1944 సం॥రం సెప్టెంబరు 24 తేదీని, విజయనగరమందు మహా మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారి అధ్యక్షత క్రింద వాగ్దేవతకు ఆంధ్ర ధ్వన్యాలోక కృతి సమర్పణ మహోత్సవము జరుపఁబడినది. ఆ సందర్భమున బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు గ్రంథకర్తయందుఁగల వాత్సల్యముచే నంపిన "ఆశీర్వచనము" ఇచట ప్రకటితము.

౩

శాఖవాఁడవు, నాకన్నఁ జాలఁ జిన్న
వాఁడ, వాశీస్సు లందెడి వాఁడ వౌట
వర్ణనీయంబు-నీ బుద్ధి వైభవంబు
నించుక స్పృశించియును విస్తరించనైతి.

౪

భగవంతుం డిడుఁగాక నీకుఁగవితా
వంశంబుతో పాటు హె
చ్చగు సద్వంశపు వృద్ధి; భూపతుల దీ
వ్యద్దివ్య సంస్థానముల్
సుగుణు న్నిన్ను బహూకరించుత। బుధ
శ్లోక్యంబు నీ శ్లోకమై
నెగడుం గావుత నీవు మేల్మి సిరులన్
దీపింతు గాకెల్లెడన్।

౫

ఇప్పుడనుకొన్న నేమగు, నీవు నల్వ
దేఁడులకు మున్ను జనియించి తేని అల్ల
శ్రీ మదానంద గజపతి శ్రీ మహేశుఁ
జూచి యుందు వాతండు భోజుండు ధ్రువము.

క్షీరసాగరం బిల్డింగ్సు,
గవర్నరు పేట,
బెజవాడ.
తే 15-9-44 ది.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ
శ్రేయోభిలాషి,
చెళ్లపిళ్ల, వేంకటశాస్త్రి.
శతావధాని.

* Andhra University
Vice-Chancellor :
Sri C. R. Reddy, K.T.,
Hon. D. Litt., M.L.C.

Guntur,
D/ 18th Sept'44.

*My Dear Sir,*

I am glad to hear that the Dedication and Rangadhirohanam cermonies of the well-known Pandit, Sri Lakshminarayana Sastry's Telugu Translation of Dhvanyalokam will be celebrated on the 24th Sept. The Pandit is a scholar of first-rate capacity and I am sure that the Telugu Dhvanyalokam will be a clossic in its line. My greetings, congratulations and best wishes for the occasion.

*Yours Sincerely,*
C. R. Reddy.

---

* ఇది-ఏతత్ సందర్భమున శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు పరిసాదించిన సందేశము.

"............శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారి కృతి సర్వాంధ్ర లోక శిరోధార్యమైనది. అచ్చముగా మాతృకానువాదము ధ్వన్యాలోకమునకుఁ గావలసియేయున్నది. శ్రీ అవ్వారివారు సూత్రములను (మాత్రమే) పద్యములలో వ్రాసిరి. బందరువారు (ఒక యుద్ద్యోతమును మాత్రమే) గచ్ఛద్వ్యాఖ్యగా వ్రాసిరి. అట్లుగాక శ్రీ శాస్త్రులవారు చేసినది నిజముగ సత్యుత్తమమైన కార్యము.................. మీ రచన నాకు శిరసాగ్రాహ్యముగా నున్నది.................."

బెజవాడ,
30–9–1944.

కవి సమ్రాట్,
విశ్వనాథ, సత్యనారాయణ.

పట్రాయని సీతారామశాస్త్రి,
Vocal Professor, Music College, Vizianagaram.
Founder, Sarada Gana Pathasala, Salur.

విజయనగరము,

తే 21-9-1944 దీ.

కవులు ప్రసిద్ధ పండితులు, కావ్యరస గ్రహణైకదృష్టి, నీ
దవు కవితా విలాసముల యర్థమెఱింగి నుతింప, నీ కృతిన్
రవిశశి తారకంబుగను రంజిల, వాణికినిచ్చి; ధన్యతన్
పరివిమల కీర్తిఁగన్న కవిరాజవు! నీకొకరుండు సాటియే?

బాల్య మిత్రుఁడ, హామీద బాంధవుఁడవు,
గానవిద్యను గైకొన్న కవివి, తత్త్వ
శాస్త్రవేత్తవు, నీపాటి సాటివాని
ఖ్యాతినెన్నుట కంటె భాగ్యంబుగలదె?

ఔరా! పంతుల లక్ష్మీ నారాయణ సుకవి మనము నవరసభరితం
బౌరా వాణీవిలసన మౌరా ఔరా యనంగ నౌ రాజగతిన్॥

---

## అ భి ప్రా య ము లు

["ఆంధ్ర ధ్వన్యాలోకము" ప్రథమభాగము (ప్రథమ ముద్రణము) పై సహృదయుల అభిప్రాయములలో కొన్ని]

C. R. Reddy,
Vice-Chancellor,
Andhra University.

Camp, Chittoor,
Dated 11 - 10 -'44.

*Dear Sir,*

I have read your Telugu Translation of Dhvanyalokam with great pleasure. You deserve the warmest congratulations of the Telugu Public on our successful rendering of a classical treatise.

*Yours Sincerely,*
C. R. Reddy.

"..................మూలాన్ని లేశమాత్రమూ అతిక్రమించకుండా ధారాశుద్ధితో, పద్యరచనలో శాస్త్రీయ విషయకమైన జటిలత్వాన్ని నిరూపించేరు..........."

కళా ప్రపూర్ణ, రావు సాహేబు,
హిందూకేసరి,
గిడుగు, వేంకట రామమూర్తి పంతులుగారు.

"....తమ ధ్వన్యాలోకము....మిక్కిలి సరళముగాను,మృదు మధురముగను, హర్షదాయకముగను, మనోహరముగనున్నది. ఇట్టి యుత్కృష్టాలంకార గ్రంథము తమరాంధ్రీకరించుటెంతయు నాంధ్రుల మహాభాగ్యోదయము.....పద్యములు హృదయంగమములు. ఆంధ్ర వివరణమును మిక్కిలి యుపయోగకరము........మూలాను సారముగా భావశబలత, అర్థగాంభీర్యము, రసౌచిత్యము మొదలగు విషయములు వీరువోకుండ నాంధ్రీకరించితిరి........తమకృషి యెంతయు శ్లాఘనీయము. శాస్త్ర గ్రంథమగుటవలన శాస్త్రీయములగు పారిభాషికపదములు తెలిసికొనుటకు గురు సాహాయ్య మవసరము. నా హృదయము చాల సంతసించినది".

బెజవాడ,
20-3-1954.

కవిరాజ, కవిరత్న
చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు.

విద్వాన్, కావ్యతీర్థ
బ్రహ్మశ్రీ మద్దులపల్లి
వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి
సదభిప్రాయము.

కవితా సామ్రాజ్యము
నంద్యాల
పార్థివ అధిక చైత్ర బౘ శని
31—3—45.

ఆర్యా!

తాము దయతోనంపిన తమరచితమైన ఆంధ్ర ధ్వన్యాలోకమను గ్రంథము వందనాంజలులతో నందుకొనఁబడినది. ఆంధ్ర

విద్యార్థిలోకమునకుఁ దాముచేసిన మహోపకారము సూరిజనస్తవ నీయమై యున్నది. అందులకుఁ గృతజ్ఞతావందనము లందుకొను భారము తమకిఁకముందు తీఱనిదిగా నుండఁగలదు. జగన్నియంత యట్టి తరుణము నేర్పాటు చేయఁగలఁడు. అట్లు భారపడుచున్న మిమ్ముఁజూచి యానందపడఁగల కాలమునకై యెదురు చూచు చున్నారము.

ఉడుత కుడుత భక్తివలె హృదయాహ్లాదమునఁగాన్కవెట్టునా యీ ప్రశంసాపద్యములు చంద్రునకు నూలిపోఁగన్న సామెతగ కవి చంద్రులాదరింపఁగలరనివ్రాసి పంపుకొన్నాఁడను. చిత్తగింతురుగాక.

స్వభావోక్తి నిగూఢఁజెప్పఁజాలని యస్మదాదులవాక్కు లప కర్షకములు గాకుండవలెనని భగవంతు నర్థించుచుందుము.

"........స్తుతా కవీనాం........త్వంకారయుక్తాహిగిరః ప్రశస్తాః"

కం॥ ఔరా! పంతుల లక్ష్మీ నారాయణ శాస్త్రివర్యా! నయముగ శ్రీ తా
తారాయ శాస్త్రి, గురువరు, ధీరున్ వొప్పించు కృతులఁ దెర
లించితివో!

శా॥ విన్యాసోచిత గద్య పద్య రచనా విఖ్యాతి సంపత్తిచే
ధ్వన్యాలోకము తెన్గుసేసితివి తాతా సుబ్బరాట్ఛాస్త్రి స
న్మాన్యాశీర్వచనంబుఁగొంటి వన సామాన్యమ్మొకో! నీదె పో
ధన్యమ్మైనది జన్మ, భావికృతి సంధానంబు లేపాటివో!

శా॥ ఆనందప్రికట శ్రుతిప్రియము ధ్వన్యాలోక, మాలంక్రియ
జ్ఞానోపజ్ఞము, సర్వశాస్త్ర కలనా సంధానితంబైన వి
జ్ఞానాఖ్యున్నతిఁదెన్గుసేసి తఖిలాంధ్రస్వీయు లార్జింప ల
క్ష్మీ నారాయణశాస్త్రి! నీదగు మనీషిత్వంబు శ్లాఘ్యంబహో!

మ॥ అరరే! ప్రాయములోనఁబిన్నవట! ధ్వన్యాలోక సంస్కారచా
తురిలో పెద్దవుగాఁ గనంబడుదు వెందున్ జూచినన్; గౌముదీ

పరిషత్ప్రభకిఁ దావలంబయితి; ఏ ప్రారబ్ధ భోగంబు నీ
కరయన్ విన్నఁటనాఁటఁగాదె కవిచంద్రా! లోకసాక్ష్యంబుగన్.

ఇట్లు భవదీయుఁడు,
మ. వెం. సు. శాస్త్రి.

ఆర్య మహోదయ!

మీ గ్రంథమును సొంతముగ సంస్కృత గ్రంథమును దగ్గఱ నుంచుకొని చూడఁగల్గితిని. పరీక్షావ్యాసక్తిచే సంపూర్ణముగఁ జింతన చేయుటచే విషయము మఱింత సుదృఢముగా హత్తికొనినది .. .... "శిఖరిణీశ్వనునాము" అనువాదము ముద్దుగానున్నది.

" ....కస్యవణహోజ్ఞ రోసో, అను పద్యమునకు వ్యంగ్యార్థములను బహువిధములుగ నూహించి వ్రాసితిరి. అన్నివిధములయిన వ్యంగ్యార్థములు - ఇదివఱకు నాకననుభూతములగుటచేత విస్మయముగాఁ జూచితిని. ప్రాప్త శ్రీ రేష కస్మాత్ అను పద్యానువాద సందర్భమునను తదితరోదాహరణానువాద సందర్భమునను, మీ యాంధ్రీకృతి చాల బాగుగానున్నది. ఇంతకంటె నాకుఁ దోచిన ముఖ్యవిశేషము మఱియొకటి కానఁబడుచున్నది. లక్షణ శ్లోకములఁ గూడ యథాతథముగ ననువదించుచు-మక్కికి మక్కి యనునట్లు తోచకుండఁ జేయుట. ఇది "అర్థమైన శబ్దమైన " అను నీ ధ్వనిలక్షణమునఁ బూర్తిగాఁ జూడఁగల్గితిని-యతి ప్రాసాది నియమములను జూచుకొనుచు నింత మనోజ్ఞముగా లక్షణము నాంధ్రీకరించుట మీకే చెల్లినది. మీ పుస్తకమునుజూచిన నాకుఁ బరిపూర్ణతృప్తి కలిగినది ......"

చిలుమూరు,
18—9—49.

అవ్వారి వాసుదేవశాస్త్రిగారు.

# పత్రికాభిప్రాయములు

"మనభాషలో మొన్న మొన్నటిదాకా సాహిత్యవిమర్శ గ్రంథాలు తక్కువ తరగతివే అయినవి. స్వతంత్రంగా గానీ, అనువాదాలుగా గానీ ఉత్తమగ్రంథాలు (ఏభాషలోనివైనా) మనభాషలో వెలువడనేలేదు. ఛందోగ్రంథాల పాటిగానైనా అవి లేక పోయినవి. ఇటీవల సంస్కృత అలంకార శాస్త్ర భాండారంనుంచి చక్కని గ్రంథములను మన పండితులు అనువదిస్తున్నారు.

సంస్కృత అలంకారశాస్త్రంలో ధ్వన్యాలోకమునకుఁగల స్థానం చాలా ముఖ్యమయినది. చాలా ప్రామాణికమైన ఆగ్రంథాన్ని శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు అనువదించారు. మహామహులు అయిన రాయుడు శాస్త్రిలవారి దగ్గర చదువుకుని, మననంచేసి- తెలుగులకు ఆ ఆనందమును అందజేసే పూనికతో చేసిన వీరి ఈ ప్రయత్నం ఎంతైనా గౌరవార్హమైంది.

సాహిత్యప్రియులు తమ "రసన"ను చక్కబరచుకోటానికి యిలాంటి గ్రంథాలను ఎంత మథిస్తే అంత లాభంపుంటుంది.

—ఆంధ్రపత్రిక, **12** నవంబరు **1944.**

ఆంధ్రధ్వన్యాలోకము : ఇది ప్రఖ్యాత సంస్కృతాలంకారికుఁడైన ఆనందవర్ధనుని ధ్వన్యాలోక గ్రంథమునకు తెలుగు. ధ్వన్యాలోక వ్యాఖ్యాతలలో నొకరైన అభినవగుప్తపాదుల లోచనవ్యాఖ్య కూడ ఈ గ్రంథమందు ఆంధ్రీకృతమై యున్నది. మాతృకలోని లక్ష్య శ్లోకములు దీనిలో పద్యరూపముగా నున్నవి.

శబ్దమును ఆశ్రయించి యుండునది-అర్థము. ఆ యర్థమేగాక మరియొకటి స్ఫురించిన దానిని "ధ్వని"యనియు, "వ్యంగ్య"

మనియు, అందురు. "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర" అను మనుచరిత్ర పద్యము చదివినప్పుడు పద్యమునకు గల అర్థమొకటి, స్ఫురించెడి యర్థము వేరొకటి. దీనినే ధ్వని యందురు. ఉత్తమ కావ్యములు ధ్వనిద్యోతకములుగా నుండును.

ధ్వని యనునది వేరేలేదనియు, కలయర్థమంతయు శబ్దమందే యున్నదనియు పూర్వపక్షము. తత్ ఖండనము, సిద్ధాంతము, ధ్వని నిరూపణము, దానిని సాధించురీతులు, మొదలైన విషయము లీ గ్రంథములో వివరింపఁబడియున్నవి.

సంస్కృతభాషాపరిచయము గలవారికి ఈ గ్రంథము బోధపడునట్లు ఇతరులకు బోధపడదేమో యని తోచుచున్నది. తెలుగు పద్యములు సంస్కృతపద భూయిష్ఠములుగా నుండుటయు, ఆంధ్ర వివరణమును అట్లే యుండుటయు దానికి కారణములు.

ఆంధ్రీ కృతికర్తలయిన లక్ష్మీనారాయణశాస్త్రిగారి గురువులు కళాప్రపూర్ణ, తాతా సుబ్బారాయశాస్త్రిగారు వ్రాసిన యభిప్రాయములో గ్రంథప్రాశస్త్యమును జెప్పుచు "బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ల వెంకట శాస్త్రిగారు మొదలైన మహా విద్వాంసులును, సంతోష పూర్వకముగా యిచ్చిన యభిప్రాయములు సైతము ఈ గ్రంథముయొక్క ఘనతను సాకల్యముగా చెప్పలేకపోయినవేమో యని తలచుచున్నాను" అని వ్రాసిరి. ఇంక ఇతరుల విషయము చెప్పనక్కరలేదు.

( శ్రీ శాస్త్రిగారు ఈ గ్రంథముయొక్క ద్వితీయభాగమును త్వరలో ప్రచురించి పండితుల కృతజ్ఞకు పాత్రులగుదురని నమ్ముచున్నాను.) (ద్వితీయభాగము 1953లో ప్రకటితమైనది. తృతీయ భాగము గూడ రచితమైయున్నను ప్రకటితము కావలసియున్నది.)

"భారతి" నవంబరు 1944.

# ఆంధ్ర ధ్వన్యాలోక ప్రశంస.

౧

మాన్యాభ్యున్నతభావపుష్పసుషమా మాధుర్యమున్, షట్పదీ
విన్యాసమ్మును, నిర్ఝరాంబు రస గాంభీర్యమ్మును, న్డోచనీ
"ధున్యా" యందు కవీంద్ర సంతతులు సంతోషింప నాంధ్రమ్మునలో
ధ్వన్యాలోకవనమ్ము నిల్పితివి విద్యాదేవిఁబూజింపఁగన్.

౨

హర మూర్ధస్థల నిర్య దుచ్ఛలిత దివ్యాంభః ప్రవాహ ప్రభా
సరణిన్ మించెడి నీ సువాగ్ ఝరికి షట్ఛాస్త్రార్థ విజ్ఞాత లె
ల్లరు నోహో యన సుప్రసాదగుణ లీలా మాధురింగూర్చి తె
వ్వరుఁ గావింపని యద్భుతార్థ కృతి, దీవ్యత్ సాహితీ సత్కృతీ!

౩

తన సత్కావ్యముఁదెల్గుఁజేసికొనఁగాఁదత్కర్త ఆనంద వ
ర్ధనుఁడే నీవయిపుట్టి సాంస్కృతిక ధారావాహినింగల్గి చ
క్కని తెల్గున్ సిరిపంట కాల్వఁబడి పొంగంజేసెనాఁదోచు నీ
యనఘమ్మైన తెనుంగు సేత సుకవిత్వాధ్యాపకాగ్రేసరా!

విజయనగరము,
6—9—48.

ఇట్లు విధేయుఁడు,
మూలా - పేరన్నశాస్త్రి.



మహామహోపాధ్యాయ. దివాన్‌బహద్దూర్.
శ్రీ రా. రా. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

ఓం తత్ సత్

శ్రీ

గురు,

శిష్యులు.

(1938 సం)



ఆంధ్రప్రతికర్త :
పంచాంగం లక్ష్మీనారాయణశాస్త్రి.

ఓం నమో భగవతే శ్రీరమణాయ
శ్రీభారతీదేవ్యైనమః.

VICE - PRESIDENT
INDIA.
NEW DELHI.
*December 3, 1958*

Dear

Shri Pantula Lakshmi Narayan,

I read your book with interest and I have no doubt that it will be used by students of ALANKARASASTRA.

Yours Sincerely,
S. RADHA KRISHNAN.

# సమాలోకము

*[శతావధానులు, బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి మహాశయులు ప్రసాదించినది.]*

ఎవరును కన్ను తెఱవకముందే భరతముని కావ్యార్థము రసమని చెప్పెను. పిదపఁబిదప ఆఱవ శతాబ్దిమొదలుకొని తొమ్మిదవ శతాబ్దివఱకును కావ్యప్రపంచమును కలకలలాడునటు లొనరించిన ఆచార్యులలో కొందఱు-కావ్యరస మాస్వాదించియు, నొకరు-కావ్యమునకాత్మ 'అలంకార' మనియు, నింకొకరు-'గుణము'నియు, వేఱొకరు-'రీతి'యనియు, వేఱువేరు త్రోవలు త్రొక్కిరి. ఉరమరిక తొమ్మిదవ శతాబ్దిలోనివాఁడగు రుద్రటుఁడు - 'ప్రయత్నించి కావ్యమును రసములతోఁ గూడుకొనునటు లొనర్చునది' అని

చెప్పియు, 'భావము' అనునలంకారమును వివరించుపట్ల 'వ్యంగ్యము కావ్యమునకు ఆత్మ' అను తలఁపుముంగిటఁగాలు వెట్టియు, వెనుదిరిగిపోయి 'కావ్యమలంకారప్రధానము' అని యనెను. పదునొకండునాఁటి వాఁడగు నన్నయ - 'మృదుమధుర రసభావ భాసుర నవార్థవచనరచనా విశారదులయిన మహాకవులును' [ఆది - ౧. ౫] అనిచెప్పుట గమనింపఁదగినది. ఇటులు కావ్యాత్మ నొకరేటికిని, ఇంకొకరు కోటికిని, లాగుచుండఁగా **860-'90** ల నడుమ కవితా పాండితీ ప్రతిభ చూపిన ఆనందవర్ధనుఁడు-'కవితాకాంతకు ఆత్మ-ధ్వనియనియు, శబ్దార్థములు - శరీరమనియు, అలంకారము లలంకారములేయనియు, గుణములు - గుణములేయనియు, ఎలుఁగెత్తి చెప్పెను. ఇది విద్వత్సభలలో కల్లోలము కలిగించెను. అవుననువారొకరిరువురు. కాదనువారు పలువురు. అట్టియెడ మనోరథుఁడను విమర్శకుఁడు - "అర్థాలంకారములతోఁగాని, శబ్దాలంకారములతోఁగాని, మంచి సంఘటనతోఁగాని, కూడిన కావ్యము హృదయాహ్లాదకమగునుగాని, ఇవియేదియునుకాని ధ్వనియెటులు హృదయాహ్లాదమొనరించును ?. కావ్యమునకు ధ్వని - ఆత్మ యేమిటయ్యా మూఢుఁడా! 'ధ్వనియననేమి ?' అని మేము నిలువఁదీసి యడిగినచో 'వెప్పెపె మెమ్మెమె' అనికాక మఱి యేమందువో" అని, అర్థమగునటులీ పద్యము చెప్పెను.

యస్మిన్నస్తి నవస్తు కిఞ్చనమనః ప్రహ్లాది సాలంకృతి
వ్యుత్పన్నై రచితంచ నైవవచనై, ర్వక్రోక్తి శూన్యంచయత్
కావ్యం తద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యాప్రశంసన్ జడో
నోవిద్మోఽభిదధాతి కింసుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః.

మ. హృదయాహ్లాది, యలంకృతార్థ, మగునేయే వస్తువున్ లేనిదె
య్యది. వ్యుత్పన్నవచోవిహీనకృతియే, దెచ్చోటవక్రోక్తియుం

డదో, దానిన్-ధ్వని యుక్తకావ్యమని, మూఢాత్ముండు - ప్రీతాత్ముఁడై
వదరున్, విజ్ఞుఁడుతెల్పుమన్న, ధ్వనిరూపమ్మేమిభాషించెడిన్?.
[పం. ల. నా. శాస్త్రి.]

ఇది - విని, ఆనందవర్ధనుఁడు - ఈప్రశ్నములకును, వీనిని బట్టి తలయెత్తిన ప్రశ్నములకును, సమాధానము చెప్పుటకునడుము బిగించెను. ఈమనోరథునిమాట యిటుండగా, ఇంకొకఁడు - 'కావ్యమునకు ధ్వనియే జీవితమాయెనేని, కంచే - కావ్యము కావలసి వచ్చునే! కావ్యకాంతకు ధ్వనిజీవితమా?' అని యిటులొక పద్దెమల్లెను.

కాంస్యం కావ్యం కుతో నస్యాత్
కావ్యస్యాత్మా ధ్వనిర్యది ?
కింకాంస్యవద్ ధ్వనేత్ కావ్యం ?
కంఠం భజ్త్వాఽపి పశ్యతామ్.

ఆ॥వె॥ ధ్వనియె కావ్యజీవితంబగు నెడలను
కంచు కబ్బమేల కాదొ చెపుమ!
కంచుమ్రోఁగునట్లు కబ్బంబు మ్రోగునా ?
గొంతుచించుకొంచుఁ గూయిడినను.

ఈ పద్యమువిని ఆనందవర్ధనుఁడు నవ్వుకొని యుండును. అతఁడు-"అయ్యా! మేముచెప్పునదదికాదు. సహృదయులు మెచ్చుకొను నర్థమొకటికలదు - అది ప్రతీయమానము. అనఁగా తోఁచు బడియగునది. దానికి ధ్వనియనిపేరు"అని. ఇటులగుచో, ఇంకొక శంకకలుగుచున్నది. అశ్లీలము, అసుందరము, ఈమొదలగునర్థము తోఁచుబడియగునేని, అదియు-కావ్యమున కాత్మయా? ఈశంకించిన వారును, ఒకపద్యమేచెప్పిరి.] కాదు, దానిని సహృదయులేకాదు. అ సహృదయులును కొందఱు మెచ్చుకొనరు. (అసుందరమగు దానిని

గుఱించి 283వ పుటయందలి దిగువ ప్రభామతిని "ఆప్రయోజనమును గూఢముగాఁ జెప్పినంతమాత్రముననది-ధ్వనికాదు.... అసుందరమగు ప్రయోజన రూపార్థమును- గూఢముగాఁ జెప్పినను, ప్రకటముగాఁ జెప్పినను, గూడ - విశేషములేదు." అనుదానిని పాఠ(జూచునది) కొనిందు! దానిని ధ్వనియని యెవరేని చెప్పిరా ?. విద్వదగ్రగణ్యు లగు వైయాకరణులు - "పలికినదె తడవుగా వర్ణములు మాయమై పోవుచున్నవి. అటులయ్యు వానివలనమనకర్థమగుచున్నది. కావున నిత్యశబ్దముండవలయును. కార్యశబ్దమునందలి పూర్వపూర్వవర్ణముల అనుభవముచేఁగలిగిన సంస్కారముతోఁగూడి, చిట్టచివర మొరయు వర్ణము, లేక, నాదము-ధ్వని. ఈధ్వని-అనిత్యశబ్దమును వ్యక్తము చేయును, వ్యక్తమగు నాశబ్దము - స్ఫోటము. దానమనకర్థము భానమగును, ఈదెస, ఇచట ధ్వని - వ్యంజకము. స్ఫోటము - వ్యంగ్యము," అనిచెప్పిరి. ఈపోలికనుబట్టికావ్యమునకాత్మయగుప్రతీయమానమును మేమును ధ్వనియని వ్యవహరింతుము' [ఆంధ్రధ్వన్యాలోకము-ప్రథమోద్ద్యోతమున 204 పుటలో 'ధ్వనతీతి ధ్వనిః' ఈ - మొ. ఘట్టములు - చూ.] అనిచెప్పి ఆనందవర్ధనుఁడు ధ్వని సంప్రదాయ ప్రవర్తకుఁడాయెను. ఇది ధ్వన్యాలోకావతార చరిత్ర. ఇదియా ? ఇటులగుచో ఆలంకారిక పితామహుఁడు భామహుఁడు,-

శపథైర పిచాదేయం వచోనస్ఫోటవాదినామ్
నభః కుసుమ మస్తీతి శ్రద్దధ్యాత్కస్సచేతనః ?

[భామహాలంకార - ౬-౧౨]

ఈదెస స్ఫోటము-నభఃకుసుమమనిచెప్పెనే! మఱియు భగవదుపవర్షుఁడును, దేవతాధికరణమున శంకరభగవత్పాదులును, కుమారిలుఁడు వార్త్తికమునను, ఖండదేవుఁడు ౧-౪-౧౧అధికరణమునను, పార్థసారథి మిశ్రుఁడు శాస్త్రదీపికలో ౧-౧ పంచమాధికరణమునను, జయంతభట్టుఁడు - న్యాయమంజరిలో ౬వ ఆహ్నికమునను, శ్రీరామానుజులు జిజ్ఞాసాధికరణమునందును, వేదాంతదేశికులు

వాచస్పతి మొదలగువారును, 'స్ఫోటము-బరువు' అనిఖండించిరే! అనియందురు కావలయు; అది - వేఱుమాట. మఱియు వర్ణపద వాక్యభేదముచే స్ఫోటము- త్రివిధము. అది-మరల జాతివ్యక్తిభేద ముచే ఆఱువిధములు. అఖండపద, వాక్య, స్ఫోటములు - రెండు. వెరసి - స్ఫోటమెనిమిది విధములు. స్ఫోటము - ఆంతరప్రణవ రూపము. పరాపశ్యంతులు - శబ్దబ్రహ్మవ్యంజకములగు వాక్కులు. వైఖరీనాదరూపమగు ధ్వనిని - చెవివినును. అది- భేరీనాదాదికము వలె, అర్థహీనము. మధ్యమానాదము - అర్థవాచకమగు స్ఫోటా త్మక శబ్దమునకు వ్యంజకము. 'స్ఫోటము - ఉపాధిభేదముచే బహు విధముగాని, నిక్కమున కాకాశమువలె నొక్కటియే.' అని మంజూ షలో నాగేశుఁడు - మఱియు - నతఁడే -

"వైయాకరణ నాగేశః స్ఫోటాయన ఋషేర్మతమ్।
పరిష్కృత్యోక్తవాంస్తేన ప్రీయతా ముమయాశివః॥"

అనిచెప్పుటచే స్ఫోటవాదము- పాణినికి పూర్వము. "సంగ్రహము' అనుగ్రంథమున వ్యాడి- నిత్యశబ్దమును, కార్యశబ్దమును,జెప్పెను". అని మహాభాష్యము. హరి, కైయట, భట్టోజీ, నాగోజీలు దీనినివివ రించిరి. భాగవతము ౧౨-౬-౩ మొదలగు సుమారు పంద్రెండుతా వుల స్ఫోటమునుచెప్పెను. 'ప్రాకృతధ్వని - స్ఫోటమును గ్రహిం చుటలో హేతువు'. అనిహరి. శంకరభగవత్పాదులును వ్యవహార దశలో నిత్యశబ్దమును గ్రహించిరి. దానఁజేసియే, ఆనందుఁడు - తనయాలోకమున - "ఈ గ్రంథోద్దేశము ధ్వనియున్నదని స్థాపిం చుటకాదు. మఱివ్యంగ్యమున్నదనియు, అది రసాది రూపమనియు, చూపుట."

"అతఏవచేతి వృత్తమాత్రవర్ణన ప్రాధాన్యేఽఙ్గాఙ్గిభావ రహితరసభావనిబం ధేనచ కవీనామేవంవిధాని స్ఖలితానిభవన్తీతి రసాదిరూపవ్యఙ్గ్య తాత్పర్యమేవైషాం యుక్తమితి యత్నోఽస్మాభిరారబ్ధోనధ్వనిప్రతిపాదనమాత్రాభినివేశేన"

"ఇతివృత్తమాత్రవర్ణనమే ప్రధానమగునపుడు అంగాంగి భావరహితము లగునట్లు రసభావములను నిబంధించుటచేత కవుల కేవంవిధములగు స్ఖలితములు (ప్రమాదములు) సంభవించును. కావున వీరికి (కవులకు) రసాదిరూపవ్యంగ్య తాత్పర్యమే యుక్తమని మేమీయత్నము నారంభించితిమి. కాని, ధ్వనిప్రతిపాదన మాత్రాభినివేశముచేఁగాదు." అనిచెప్పెను.

(ఆంధ్ర ధ్వన్యాలోకము 3 ఉ. ౧౧౩ పుట)

కావున ధ్వని - వ్యంజకము, స్ఫోటము - వ్యంగ్యము. అను వైయాకరణుల పోలికను - ఆనందుఁడు తీసికొని ఈ వ్యంగ్య ప్రస్థానమునకు 'ధ్వని' అనిపేరుపెట్టెను.

## -: వ్యంగ్యము :-

పేరులో పోరు ఇటుల సమసెను. ఇఁక వ్యంగ్యమగు అర్థములో పోరు. ఈకయ్యమునకు ముందితఁడు చాటువులను అందఱకును ప్రమాణమగు ఆదికావ్యములు రామాయణ మహాభారతములను, కాళిదాసాదికవుల గ్రంథములను, సుమారు ఏఁబదింటిని అక్షయతూణీరములనుగాఁగొని సవ్యసాచియాయెను. ఇఁకనితఁడాదికావ్యములనుండి యొసఁగిన లక్ష్యముల నొకటి రెండు చూపుట పాడి.

(౧)

"రవిసంక్రాన్త సౌభాగ్యస్తుషారావృతమణ్డలః
నిశ్వాసాన్ధ ఇవాదర్శశ్చన్ద్రమా న ప్రకాశతే" (రామాయణము)

దీనికి, శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి ఆంధ్రీకృతి యిది :—

గీ॥ అర్కసంక్రాంత సౌభాగ్యుడయి, తుషార
సంవలిత మండలుండైన, చంద్రముఁడు
తనరకున్నాఁడిపుడు, నిశ్వసనముతోడి
స్పర్శమున, నంధమైన [గ్రుడ్డిదైన] యాదర్శమట్లు (3)

ఇందలి, అంధశబ్దము [అత్యంతతిరస్కృతవాచ్యము.] "నిట్టూర్పులు సోఁకిన గ్రుడ్డియద్దమువలె చంద్రుఁడు ప్రకాశించుటలేదు." (రామా) అద్దమునకు

చూపేమి, అది గ్రుడ్డిదగు పేమి ? కాననిచట ముఖ్యార్థము పొసఁగదు. ఈనిమిత్త ముచే అంధశబ్దము-'అద్దము-పదార్థములనుస్ఫుటీకరించుశక్తి లేనిది'. అనిముఖ్యార్థ ముతోసంబద్ధమగు నర్థమునులక్షింపఁజేయును. పిదపవ్యంజనచే-నిట్టూర్పుతోసంబం ధమునొందినయర్థము-అత్యంత మలినము, ఉపయోగహీనము, సౌందర్యరహితము, ఈ మొ. లక్షణాప్రయోజనరూపమగు వ్యంగ్యార్థమును తెలుపును.

(ఆంధ్ర ధ్వన్యాలోకము - ౨ ఉ. ౧౩-౧౪ పుటలు చూ.)

(౨)

గీ॥ ప్రత్యుపస్థిత ఘోరరూపమ్ములగుచు
కాలములతిక్రమిత సౌఖ్యలీలలయ్యె
దినదినమ్మును, పాపీయదివసయగుచు
విగతయౌవనయయ్యె పృథ్వీలతాంగి.

ఇందుకృత్ - తద్ధిత - వచనములచేత - అసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనియు, "దినదినమ్మన్" "విగతయౌవన" అనువానిచేత - అత్యంతతిరస్కృత వాచ్య ధ్వనియుఁ బ్రకాశింపఁజేయఁబడినవి.

ప్రా :— అతిక్రాన్త సుఖాః కాలాః
ప్రత్యుపస్థిత దారుణాః
శ్వః శ్వః పాపీయ దివసా
పృథివీగతయౌవనా.

అనునది వ్యాసభగవానుని మూలశ్లోకము.

(ఆంధ్రధ్వన్యాలోకమున,తృతీయోద్ద్యోతముగలద్వితీయభా.95,96పుటలు-చూ.)

మీఁది పద్యమునందు, ఉపస్థిత, అతిక్రమిత, గత, అనునవి (క్తరూప) కృత్తులు. "పాపీయ" అనునది- ఛ ప్రత్యయ తద్ధిత. "కాలములు" అనునది - బహువచనము.

'ప్రత్యుపస్థిత' అనుచోట'క్త' ప్రత్యయముచే- దుఃఖములిదివఱకే ప్రాప్తిం చియుండుటయు, అవి - నిరాకరింపరానివగుటయు, 'అతిక్రమిత' అనుచోట భూతకాలార్థక 'క్త' ప్రత్యయముచేత - సుఖమున కింకెప్పుడును వర్తమానకాలి కత్వములేకుండుటయు, ఆకారణమున కాలము భయంకరమైనదగుటయు, 'గత' అనుచోటఁగల 'క్త' ప్రత్యయముచే-పృథివికి తిరుగ యౌవనము రాకుండుటయు, దానినామె నిస్సారయగుటచే విడువఁదగియుండుటయు, పాపిజనసంబంధబోధ

కమగు 'ఛ' ప్రత్యయముచే :- దివసములు నీచములగుటయు, 'కాలములు' అను చోటనున్న బహువచనముచేత-కాలములు నానావిధములైయుండుటయు, వానిని ద్రోసిపుచ్చుటకు వీలులేకుండుటయు, వానిని క్లేశముచే గడుపవలసియుండుటయు, 'దినదినమ్మను' అనుటచే-ఒకనాటి కొకనాఁడు పాపీయములగు దివసముల యొక్కయు, 'విగతయౌవన' అనుటచే వృద్ధస్త్రీవలెనసంభావ్యమాన సంభోగయగు పృథివియొక్కయు, దౌర్భాగ్యమత్యధికమగుచుండుటయు, ప్రకాశింపఁజేయఁబడు చున్నవి. కాలము స్వభావముచేతనే దుఃఖమయము. అందును పాపిష్ఠజనస్వామిక పృథివీ లక్షణదేశ దౌరాత్మ్యమువలన మఱియునది విశేషించి దుఃఖమయమగు చున్నదనిభావము. మీఁది కృదాపులన్నిఁటిచేతను-నిర్వేదద్వారమున శాంతరసము ధ్వనింపఁజేయఁబడుచున్నది. జడమగు పృథివియందు యౌవనము సంభవింపకుం డుటవలన 'విగతయౌవన' 'అనుపదము' ''పృథివి-ఉపభోగసమర్థముకానేరదు.'' అను లక్ష్యార్థమును ప్రదర్శించుటచేత - ఇందత్యంతతిరస్కృతవాచ్యధ్వనికూడ కలదని యెఱుంగునది. (ఆంధ్రధ్వ... ద్వితీయభాగము - ౯౫-౬ పుటలు చూ.)

ఇఁక చాటువులలోను, కాళిదాసాది పద్యములలోను, గల వ్యంగ్యమును ఆంధ్రధ్వన్యాలోకమునఁజూచునది. ఆనందవర్ధనుఁడీ రీతిగా వ్యంగ్యార్థము కలదనిచూపి చాటుటకు మనోరథుఁడు, ప్రతీహారేందురాజు, భట్టనాయకుఁడు, మహిమభట్టు, కుంతకుఁడు, మొదలగు వారితో సంకులసమర మొనరింపవలసివచ్చెను. ఇటులో నరించి యుండితఁడు జయించెను. జగన్నాథపండితరాయలంతవానిచే జయపతాకయుఁబడసెను. నిక్కమునకతని జయపతాక - "లోచ నమే".

* "ఈధ్వనిశాస్త్రము-సాహిత్యచరిత్రమును దివ్యచరిత్రము గానొనర్చి'' దానియందొక క్రొత్తశకమును ప్రవేశపెట్టెను. ఇది - వ్యాకరణ శాస్త్రమునకు పాణినీయమువంటిది. వేదాంత శాస్త్రము నకు బ్రహ్మసూత్రములవంటిది. "ధ్వన్యాలోకమలంకారశాస్త్రమున, అనుసరింపఁదగిన సరణిని వ్యవస్థాపించెను."అనిరసగంగాధరము." అని మహామహోపాధ్యాయులు పి. వి. కాణేగారి యభిప్రాయమెవ రికి శిరోధార్యముకాదు ?

ధ్వన్యాలోకము పాణినీయమగుచో లోచనము మహాభాష్యము. ధ్వన్యాలోకము బ్రహ్మసూత్రములగుచో లోచనము శంకరభాష్యము. *అభినవుని గుఱించి శ్రీ జ. మాధవరామశర్మగారి నాట్యవేదము పీఠికలో వివరించితిని, గాన ఇచట నిఁక విసివింపను. ధ్వనికర్తయు, ఆలోకకర్తయు, నొకరా ? యిరువురా ? అను విషయము - పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారే వివరింతురు. పాఠకులు 'కారికాకారవృత్తికార ద్వైతాద్వైతములు' అను వ్యాసమును చూచునది.

—• ఆంధ్రీకరణమేల ? •—

వాదయుగము నందెపుడో యవతరించిన యీ గ్రంథము నాంధ్రీకరింపనేల ? మఱియు నీధ్వన్యాలోకమునే యాంధ్రీకరించుట కెందఱెందఱో 'నేనునేనని' యెగఁబడిరేల ?

మంచిమాట! జాకోబీ దీనిని జర్మన్ భాషలోనికేల యనువదించెనో ? శబ్దమునకు పాణినీయమెట్టిదో, కావ్యశబ్దార్థముల కిది - యట్టిదికావలయును. కావుననే జర్మన్ కవులకును సహృదయులకును ఉపయుక్తమగునని తలపోయక, యతఁడిటులు చేయునా ? ఈ సాహిత్యశాస్త్రరత్నము - సకలభాషలయందును అనూదితము కావలయును. మనకుచేతకాక, యింతకాలమునుండియు మిన్నులు చూచుచుంటిమి. ఇపుడు మనకృతజ్ఞతకు పాత్రము కావలయువారు ఆంధ్రీకరించిరి. గ్రంథప్రయోజనమును-మూలమిటులుచెప్పుచున్నది. చూడుఁడు!.

'ఇత్యుక్త లక్షణోయో
ధ్వనిర్వివేచ్యః ప్రయత్నతస్సద్భిః
సత్కావ్యం కర్తుం వా
జ్ఞాతుంవా సమ్యగభియుక్తైః' (౩-౪౫)

'సత్కావ్యమును రచించుటకుఁగాని, తెలిసికొనుటకుఁగాని, ధ్వనినివివేచింపవలయును.' కావున కవులకును, కవులను అర్థము చేసికొను సహృదయులకును, అత్యావశ్యకము. శ్రీ పంతుల లక్ష్మీ నారాయణశాస్త్రిగారు-కవులు, మఱియు సహృదయులు. విశేషించి శాస్త్రజ్ఞులు. ఇట్టివారు దీనికి దొరఁకొనుట జాడులు ప్రసాదము.

—• ప్రభామతి •—

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు ఈ ధ్వన్యాలోక మును సంపూర్ణమగు లోచనముతో శాస్త్రీయముగను, సుందరము గను, అనువదించి, తెలుగులకు వెలుఁగులు చూపిరి. ఆలోకము న్నను కన్నులేనిచో ఏదియుకానరాదని అభినవుఁడు మనకు లోచన మొసఁగెను. లోచనమున్నను, మతిలేనిదే తిన్నగా కానరాదని, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు - కౌముదీ ధవళితమగు 'ప్రభా మతిని' మనకొసఁగిరి.

—• ఆంధ్రీకరణ పద్ధతి •—

శాస్త్ర గ్రంథములను తెలిఁగించునపుడు - ప్రతిపదాంధ్రీకర ణము మేలని కొందఱందురు. పాఠముచెప్పి ప్రవచనముచేయురీతికి దరిదాపుగా నుండునటులు విపులమగు వ్యాఖ్యావ్రాయుపద్ధతి మేలని కొందఱందురు.

* ధ్వనికారికలును, వృత్తియు, మాత్రమున్నచో మనకు లోచ నములేనిచందమే. అదిదైవికముగా నేటికి ఏర్పాఱినది. 'అగస్త్యుఁ డొకయెత్తు; అతని కమండలమొకయెత్తు'. అనునటులు - ధ్వన్యా లోక మొకయెత్తు; లోచనమొక యెత్తు. ముక్కూటమూఁడే ఈధ్వని శాస్త్రము. ఈమూఁటిలో నేయక్షరము మనకు తెలియకపోయినను మనకన్ను గ్రుడ్డికన్నే. కావున శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

గారు ఈమూఁటిలోను దేనినిని పోనీక ఆంధ్రీకరించుటయేకాక పాఠముచెప్పి, ప్రవచనము చేయురీతికి దరిదాపుగా నుండునటులు విపుల వ్యాఖ్యారూపముగా ప్రభామతిని సంతరించి మనకొసఁగిరి. * మఱియు ప్రభామతి ప్రథమోద్ద్యోతమున శ్రీమదుత్తుంగోదయుని కౌముదిచే-అభినవుఁడెత్తుకొనిన వాదఘట్టముల మూలమూలలచీకటు లను పాఱఁద్రోలినది. * విద్యార్థులును కవులును ఈ ప్రభామతితో ఆంధ్రధ్వన్యాలోకమును స్వయముగాఁ జదివికొని సాహిత్యశాస్త్ర మున వ్యుత్పత్తిని సంపాదింపఁగలరు. * కఠినమగు ఘట్టములిందు పెక్కులు. అట్టివానిలో నిందలి ప్రథమోద్ద్యోతము- ధ్వనిలేదనువారి వాదములు మూఁటిని, ధ్వని లక్షణాంతర్గతమనువారి వాదమును, ధ్వని అనాఖ్యేయమనువారివాదమును లెస్సగా పరిశీలించి,ఖండించి, సోపానక్రమమున సాధించి, 'ధ్వనిఉన్నది' అని స్థాపించును. *ప్రభామతి యిట్టిపట్ల- అభిధాశక్తిచేతనే, లక్షణాశక్తిచేతనే, తాత్ప ర్యశక్తిచేతనే, అనుమానముచేతనే, వ్యంగ్యార్థమేల గతార్థముకాదు? మఱిస్మృతిలో నేలచేరదు ? మఱియు లక్షితలక్షణచేతనే యేలసిద్ధిం పదు ?. అనుగహనములగు నీఘట్టములందన్నియెడలను పాఠకుల కెచటఁ దెలియకపోవునోయని కంట వత్తిడుకొని ఉత్తరప్రత్యుత్తర ములతో మెట్లు మెట్లుగా వివరించు కొనుచుఁబోవును. ఇటులు చేయుటకెంత 'విజ్ఞత', 'బోధకత', 'ఓపిక', ఉండవలయునోకదా! *

ప్రథమోద్ద్యోతము-మఱియు 'కబ్బములందువాచ్యముఅనియు' ప్రతీయమానము అనియు, రెండర్థములున్నవి. వానిలో అలంకార రూపమగు వాచ్యమెల్లరెఱిఁగినదే! మఱి ప్రతీయమానము, స్త్రీలలో ప్రసిద్ధములగు నవయవములకంటె వేఱగు లావణ్యమువలె వాచ్యా దులకంటె వేఱా? అనినవేఱే. ఈప్రతీయమానము-రసవస్త్వలంకార భేదముచే ముత్తెఱఁగులు. ఈముత్తెఱఁగులయు, భిదలలో ముక్కోటి భిదలు. ఈ వ్యంగ్యార్థము - వ్యాకరణ జ్ఞానమాత్రమునఁ దెలియు నదికాదు. ఇది సహృదయైక వేద్యము. ఇట్టి ప్రతీయమానార్థము -

ప్రధానముగా భాసించుకావ్యమే- ధ్వనికావ్యము. సమాసోక్తి మొద లగు కొన్ని అలంకారములలో ప్రతీయమానమగు అర్థమున్నను, వాచ్యార్థమే ప్రధానమగును, గాన నట్టి అలంకారములు మాత్రమే ఉన్నకావ్యము-ధ్వనికావ్యము కాదు. రామాయణ మహాభారతాదు లలోకనఁబడు నీధ్వని-మాచేలక్షితమైనది. ఇది - ఇఁక అనాఖ్యేయ మెట్లు ?" అను నంశములతో ముగిసినది.

* చూచాయగాఁ జెప్పిన పైవిషయములలో-లోచనము లోఁతు లోఁతులు పరికించి చెప్పిన, ప్రతీయమానమగు నర్థమునందలి లౌకి కత్వము, కావ్యవ్యాపారైక గోచరత్వము, రసాది ధ్వనిత్వము, మఱియురసాదులకున్వశబ్దావాచ్యత్వము, మొదలుగాఁగల ఎన్నియో రహస్యములు-ఈప్రభామతిసాయముచే మనకవగతములగును. *
ఈకాలమున కొందఱాంగ్ల విమర్శకుల త్రోవఁబడి - శిల్పమునం దును, కావ్యమునందును, 'సౌందర్యము సౌందర్యము' అని ఒక ఘంటాఘోషము వినఁబడును. ఇది కీట్స్ చెప్పిన 'A thing of beuty is a joy for ever' "సుందరమగు వస్తువు శాశ్వతానంద (కర)ము"అనుదానికిప్రతిధ్వని. కీట్స్‌కు వెనుకనున్నవారునుదీనిని చెప్పలేదనరాదు. కానికీట్స్‌తోదీనికి ముద్రపడెను. అయీసౌందర్య ప్రతీతియే - కావ్యాత్మయా? అను విషయమెంతయో శాస్త్రయుక్త ముగా విచారించిన యీలోచనమును, దానిని బాలురకును దెలియు నటులు వివరించిన వీరితేట తెలుఁగు వివరణమును, 203వ పుటలో నరయునది. మఱియు అవివక్షిత వాచ్యధ్వని కుదాహరణమగు

'సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః।
శూరశ్చకృత విద్యశ్చయశ్చజానాతి సేవితుమ్.

అను [భార - ఉద్యోగ - ౩౫ అధ్యా - ౭౪] శ్లోకమును వీరెంతయో సొగసుగా.

క. పరిచరణ కృతియు, విద్యా
పరిచయ యుక్తుఁడును, శౌర్యవంతుఁడు, ననఁగన్
బరగునరులు, చయనింతురు
పురుషులు - ముగ్గురు - సువర్ణపుష్పగఁబృథివిన్.
అని తెలిఁగించి,- (ప్ర. 75వ పేరా)

''పృథివిని సువర్ణములను బుష్పించుదానినిగా చయనింతురు' . అనఁగా 'సంఘటింతురు'' అనునది-వాచ్యార్థము. ఇందు 'సువర్ణానిపుష్ప్యతి' అని లోచన మునఁజెప్పఁబడినది - విగ్రహవాక్యముకాక, అర్థప్రదర్శకముమాత్రమేఅగును. కనుక, నిచట- [సువర్ణమేవ పుష్పం యస్యాస్సా] సువర్ణమే పుష్పముగాఁగలది. ''సువర్ణపుష్ప'' అను బహువ్రీహి-యుక్తము. కాఁగా 'భూమి బంగారు పూలను బూచునది' అనునర్థముగాని, 'భూమి బంగారుపూలుగలది' అనునర్థముగాని, ఏద యినను - సంభవించునదియగు నర్థముగలదికాదు. కనుక, లక్షణచేత- 'సేవానిపు ణుఁడును, విద్వాంసుఁడును, శూరుఁడును,' అని తెలుపఁబడిన ప్రత్యేకములగు, సముచ్చయములచేత-'వీరిలో నెవఁడయిననుగూడ- అనాయాసముగనే విపులమగు ధనమును పొర్జించును' - అను లక్ష్యార్థము లక్షితమగును. తదుపరి 'ఈలోకము నందు ఈముగ్గురే - అధికోత్కర్షముగలవారు' అనునర్థము వ్యంగ్యమగును. ఈ వ్యంగ్యము మిక్కిలి నిగూఢముగాక యించుక గూఢమైయుండుటవలన ''ఘన తరఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ స్తనగతిఁదేటగాక, యరచా టగు నాంధ్రవధూటి చొక్కపుంజనుగవవోలె'నుండును.'' అనితెలియునది. అని చక్కగా వివరించిరి. ఇచట మహామహోపాధ్యాయులు శ్రీ కుప్పుస్వామి శాస్త్రి పాదులు తమ ఉపలోచనమున,—

'సువర్ణాని పుష్ప్యతీతి సువర్ణపుష్పా' అని లోచనము. ఇటకావ్యానుశాసన కారులు, - 'చిన్వన్తి = దైనందినమును సారముఁగొందురు. (గృహీతసారనొన రింతురు.) మేమన్ననో ఇటులు వక్కాణింతుము.- 'చిఞ్ ధాతువు-ద్వికర్మకము; సువర్ణపుష్ప ప్రధానకర్మ; పృథివి అప్రధానకర్మ - (కాఁగా; కాంచన లతను, పృథివిని, పుడుకుదురు, లేక, కోయుదురు. అనియర్థము.) సువర్ణపుష్ప అనునది ఉత్ప్రేక్షించిన ఒకానొక కాంచనలత; ఆంగ్లభాషలో 'పగోడా ట్రీ' 'Pagoda tree' ఇట్టిదే. ఇది లతార్థకమేని - 'సాకకర్ణపర్ణపుష్పఫలమూలవాలోత్తర పదాచ్చ' అని జీష్ - ఏలరాలేదు ? ఇది - అప్రసిద్ధమును, గగనకుసుమమువంటి దియు, నగులత. కాన జాతివాచికాదు, గానరాదు. 'సువర్ణానిపుష్ప్యతీతి సువర్ణ

పుష్పా' అనిచెప్పిన లోచనకారుల అభిప్రాయము - ఇదే' అని వ్యాకరించిరి. ఈ యూహ విననింపుగనేయున్నది. పాఠకులు పరికించి చూతురుగాక !.

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు - తమ ఆంధ్రధ్వన్యాలోకమున నానందవర్ధనుఁడు - ఉదాహరణమున కొసఁగిన శ్లోకములనే (సూత్రములతోఁగూడ) తెలిఁగించిరి. మఱియు, లోచనోదాహృత శ్లోకములనన్నింటిని (లక్షణములతోఁగూడ) తెనిఁగించిరి. ఇది - ఎంతయు సాహసమనకతప్పదు. కాని వీరికిది- తగిన సాహసమే. వీరితెలిఁగింపులో నూటికి తొంబది చొప్పున స్వతంత్రపద్యములనియే తోచును. గ్రంథగౌరవభీతివిడిచి యిచట నొకటి రెంటి నుదాహరింపకమానను :- (వీరు స్వతంత్రముగా నిబంధించిన నవలా అనుఛందస్సు). ఇది - లోచనోదాహృత శ్లోకమున కాంధ్రకృతిరూపము.

'శాణోల్లీఢమయిన మణి - శరదాశ్యానపులినయగు తరంగిణి- మద
క్షీణుఁడయిన నాగాధిపుఁడు-కళాశేషుఁడయిన శ్రీ కుముదభాంధవుఁడు,
ప్రాణేశ ప్రియసురతమృదితయగుబాల - హేతిదళితుఁడురణ విజయియుఁ-
దానర్థులయెడ గళిత విభవుఁడగు దాతయు- 'కృశించియును శోభింతురు'.

(ఆంధ్ర ధ్వ - ప్ర. 223 పేజీ)

చూడఁగలరా యిందొక పొల్లేనిపొల్లు ?. ఇంకొకటి :- లోచనోదాహృతమున కాంధ్రకృతి రూపమే.

శా. నాకేలా పొరుగిండ్లవార్తలివి; యైనన్ దాక్షిణాత్యస్వభా
వైకాత్మన్, క్షణమూరకుండఁ, బ్రకృతిన్ వాచాలుఁడన్ నేను, భూ

పా। కాంతున్ బ్రతిగేహమందు, విపణిన్, పానీయగోష్ఠ్యాదులన్
నీకీర్త్యంగన పిచ్చిదానివలె హా। నిత్యభ్రిమిన్ నర్తిలున్"
(ఆం. ప్ర 253 పేజీ)

తెలుఁగునాడులో ప్రసిద్ధమగు-

చ॥ వెలమ కులంబునందు నిలువెల్లరు కొంతలటంచుఁబల్కు స
ప్పలుకులసత్యమయ్యెఁగులపావనుఁడీఘనుఁడప్పరాయరాట్
కలభముకీర్తికాంత, కృతికాంత, మహీజయకాంత యిప్పుడీ
కలిజగమంతటన్ దిరుగఁగాఁ గనుఁగొంటిమిచిత్రమారయన్."

అను పద్యము - పైచాటువునకే పశ్యతోహరము. అదియ టుండె. ఈగ్రంథము- శాస్త్రగ్రంథమయినను, శాస్త్రగ్రంథమువలె చదువుటకు విసువుఁగలిగింపక, పెక్కుచోట్ల ప్రశ్నోత్తరరూపమున విషయమును వివరించుచు, చక్కని నాటకమో, నవలయో, చదువు నప్పుడు కలుగు నానందమును గలిగించుచున్నది. మఱియునీ తెనిఁగింపు - సాహిత్య విషయమునను, భాషయందును, సామాన్య జ్ఞానముగలవారికిఁగూడ-తెలియునంత సులభముగనున్నది. వీరిచేత వెనుక 1944 లో లఘువ్యాఖ్యతోఁబ్రకటింపబడిన ప్రథమభాగము నందలి (ప్రథమముద్రిణమునందలి) భాషాకాఠిన్యమీ ప్రిచురణము నందు పూర్తిగాఁ బరిత్యజింపఁబడినది. భావగాంభీర్యము భావకాఠి న్యమువలె, తోఁచును. ఆభావగాంభీర్యమును త్యజించినయెడల, ఈశాస్త్రమునకు - గౌరవమేముండును ? కనుక, అది-ఈయాంధ్రీ కృతియందు-పరిపుష్టమైనది. శ్రద్ధాయుక్తులగు పాఠకులకు గ్రహణ సౌలభ్యమును గలిగించు విషయమున, ఈ యాంధ్రీకృతికర్త - చేయవలసినదంతయుఁ జేసియేయుండెను.

ఆంధ్రధ్వన్యాలోకమునందుప్రగాఢములును, నిగూఢములు, నగుశాస్త్రచర్చలపట్లఒజ్జలయలఁతిసాయమున వలఁతిగాఁదెలిసినవారు ధ్వనిలేనిచోట ధ్వనియున్నదని వ్రాయసాహసింపరు. "ఇట్టివారు (సాహసించినవారు) ఉందురా"? అనియందురేమో? 1956 సం॥

సెప్టెంబరు భారతిలో 'అమృత్' అనువారి 'కొన్నిధ్వనులు' అను వ్యాసమును చూడుఁడని మనవి. మఱియు, ఈ వ్యాసమున చూపఁబడిన కొన్నిఉదాహరణములకంటె వింతలగునుదాహరణములనిచ్చి సమన్వయపఱుప శ్రమించినవారును ఉన్నారు. అభినవు 'డిటుల నును,-'కేవలం తునయమనవలంబ్యాపశ్రవణే (అర్థశ్రవణేన)నాత్మ సంస్కార ఇత్యనార్యచేష్టితమ్-' ఇటులు చెప్పుచుఁ బోయినను ఈ గ్రంథమునందలి మెలకువలెన్నియో మిగిలియే యుండును. అన్నారుకదా, శ్రీరాయఁడు శాస్త్రిలవారు,-"వీరి యీగ్రంథమును గూర్చి శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిలుగారును, చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారును, ఇతర విద్వాంసులును, సంతోషపూర్వకముగా నభిప్రాయము లిచ్చియున్నారు. కాని యవియుఁగూడ నీగ్రంథము యొక్క ఘనతను సాకల్యముగ చెప్పలేకపోయెనేమోయని తలఁచుచున్నాను. ఘనమైన వస్తువును సాకల్యముగ నిరూపించుట కష్టసాధ్యముగదా!" అని. లఘువ్యాఖ్యతోఁ బ్రకటించినపుడే, శ్రీశాస్త్రిలవారిటులభిప్రాయపడిరి. శిష్యవత్సలులగు శ్రీశాస్త్రిల వారిపుడు జీవించియున్నచో, సాంగమును, సలక్షణమును, సంపూర్ణమును, ముద్రితమును, అగు, ఆంధ్రధ్వన్యాలోకమును జూచి - శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారి నాశీర్వదించి యెంత మురిసిపోయెడివారో కదా! అస్తు.

స్కూలుఫైనల్ మొదలుజేసి యమ్మే (M.A.) వఱకును తెలుఁగుగాని, సంస్కృతముగాని, ప్రధానముగాఁగాని, అప్రధానముగాఁగాని, చదువు విద్యార్థుల కనుగుణముగా-ఈగ్రంథము నలుతెఱఁగుల నవదరించి, పాఠ్యముగాఁ జేసినచో తెలుఁగునాడున శబ్దజ్యోతిని నిలుపుటయ యగునని విద్యాధికారులకు విన్నవింతును.

ఈ బంగారునగకు నావెలిగార మెక్కుడయినది. వలసినంత వట్టు దీనిని దుడిచి అలంకరించుకొందురుగాక!.

చిరివాడ
25–2–'59

వేలూరి శివరామశాస్త్రి,
శతావధాని.

ఓమ్. తత్. సత్.

# ప రి చ యా లో క ము

[శ్రీ విజయనగర మహారాజ సంస్కృత కళాశాలాధ్యక్షులుగానుండి. ఆంధ్రీ కృతికర్తృ ప్రభృతులకు- సంస్కృత వాఙ్మయ,భాషా, చరిత్రములను బోధించిన సద్గురువులును, తిరుపతిలో S. V. O. ఇన్స్టిట్యూటునందు డైరెక్టరుపదవి నధిరోహించి ప్రస్తుతము విశ్రాంతిఁగొనినవారుసునగు, శ్రీమత్ పరవస్తురామానుజస్వామి M. A. వారి, సదభిప్రాయము.]

శాస్త్రమనఁగా శాసనకరణము. శాసనమనఁగా; ప్రమాణాంతరానధిగతార్థ జ్ఞాపనము. వేరొక ప్రమాణముచేతఁ దెలుపఁబడని, రసాలంకారగుణాదివిషయక మగు జ్ఞానమును. సాధించునదియగు సాహిత్యమును - శాస్త్రమనుటలో, విజ్ఞులు- సంశయింపరు. మఱియు, విశేషించి ఈధ్వన్యాలోకము - ప్రమాణాంతరముచేత- అధిగతముకాని, ధ్వనిస్వరూపమును ముఖ్యముగాఁ బ్రతిపాదించుచున్నది. కనుక. అలంకార శాస్త్రములలో శిరోమణివంటిదగు దీనిని - 'సాహిత్యశాస్త్ర'మనుట యందు విప్రతిపత్తికి తావులేదు. శ్రీరాజశేఖరుఁడు - కావ్యమీమాంసయందు "పఞ్చమీసాహిత్యవిద్యా' ఇతియాయావరీయః" అను సమీక్షయందు, 'సాహిత్యము - శాస్త్ర'మను నంశమును నిస్సంశయము నొనర్చెను. సర్వశాస్త్రపారంగతుఁడగు, శ్రీమదాచార్యాభినవగుప్తపాదుఁడుకూడ- లోచనమున "ఆనందుఁడు" అనునది - గ్రంథకర్తయొక్క నామముకూడనగుచున్నది. ఆయానందవర్ధనాచార్యుఁడు [ఏతచ్ఛాస్త్రద్వారేణ] ఈ శాస్త్రద్వారమున, దేవుఁడు - దేవతాయతనాదులయందువలె సహృదయహృదయములయందు - అనశ్వరియగు (నశింపని) స్థిరస్థితి (ప్రతిష్ఠ) నొందుఁగాక!" అని ప్రవచించెను. †

ధ్వన్యాలోకము - సాహిత్యశాస్త్రములన్నిఁటియందును ప్రధానమగుట వలన - ప్రథమస్థానము నలంకరించుననుట - నిర్వివాదము. దీనియందు-'కావ్యమునకాత్మ - ధ్వని' అను, అపూర్వ (నూతన) సిద్ధాంతము - నిరూపింపఁబడినది. సకల సత్కవి కావ్యోపనిషద్భూతమును, సల్లక్షణ లక్షితమును. వ్యంజనావృత్తి ప్రతిపాదనమును, భేదప్రభేద ప్రసారితమును, నగు ధ్వనిస్వరూపమును- ప్రతివాది మతనిరసన పురస్సరముగను, రమణీయశయ్యాలితముగను, నిరూపించిన

---

† 1. ఈవిషయమును, ఆంధ్రధ్వ - ప్ర. 74వ పేజీ చివరనున్న లోచనమునందును, 75వ పేజీ మొదటనున్న ప్రభామతియందును, జూచునది.

మహాదార్శనిక చక్రవర్తి - శ్రీమదానందవర్ధనాచార్యుఁడు. ఈతఁడు- సహృదయ చక్రవర్తి; విమర్శకాగ్రేసరుఁడు; వివిధశాస్త్రవిజ్ఞాత: మహాకవి.

* సర్వాలంకారిక ప్రమాణభూతమగు, ధ్వన్యాలోకమునకు, 'సహృదయాలోకము,' 'కావ్యాలోకము,' అనునామాంతరములు న్నవి. కావ్యతత్త్వము నెఱుఁగఁగోరిన కవులకును, (గద్యపద్యరచయితలకును) సాహితీవిమర్శనలాలసులగు విమర్శకులకును, కావ్యరసాస్వాదన పరాయణులగు సహృదయులకును, నిది-కల్పవృక్షమనుట-అతిశయోక్తి కాదు. *

మహాదార్శనికుఁడగునీమహాకవి, దేవీశతకము, అర్జునచరితమహాకావ్యము, వినిశ్చయ టీకావివృతి, విషమబాణలీల, తత్త్వాలోకము, అనుగ్రంథములనుగూడ రచించినట్లు తెలియుచున్నది. ఈగ్రంథమున - కారికలు, (ధ్వని,) వృత్తి, (ఆలోకము,) అనుభాగములు - రెండున్నవి. కారికలు - 'ధ్వని'యనియు, వృత్తి - 'ఆలోక'మనియుఁ జెప్పఁబడుటవలన-దీనికి- (ధ్వని + ఆలోకము) 'ధ్వన్యాలోకము' అనునామమేర్పడినది. ఆలోకకర్త-ఆనందవర్ధనుఁడనుట నిర్వివాదము. అతఁడే . కారికాకర్తయను విషయము - నిశ్చయించుటకు వీలుకలుగకున్నది. ఇప్పటికి లభించిన యుక్తులవలన - కారికావృత్తులు రెండింటికినిగూడ, కర్త-ఆనందవర్ధనుఁడేయని నిర్ణయింపఁబడినది. †

"ముక్తాకణః శ్శివస్వామీ, కవిరానన్దవర్ధనః।
ప్రథాంరత్నాకర శ్చాసీత్ సామ్రాజ్యేవన్తివర్మణః."

అని రాజతరంగిణియందు కల్హణునిచేతఁ దెలుపఁబడుటవలనను, తదితరపరిశోధనలవలనను, శ్రీమదానందవర్ధనాచార్యుఁడు-క్రీస్తువెనుక, సం॥ 855 నుండి 884 వఱకును కాశ్మీరదేశమునేలిన అవంతివర్మమహారాజు నాస్థానమున సమ్మానితుఁడైయుండినట్లు చరిత్రకారులు తెలుపుచున్నారు. భట్టనాయకుఁడను సాహిత్య విమర్శకుఁడు - స్వవిరచితమగు హృదయదర్పణమున నితనిధ్వని సిద్ధాంతమును ఖండించినట్లు లోచనమున నుదాహరింపఁబడుటవలన-9వ శతాబ్దము చిరనున్నట్లు

† 2. ఆంధ్రీకృతికర్తృ రచితమగు (కారికాకార - వృత్తికార) 'ద్వైతాద్వైతములు' అనువ్యాసమును ద్వి. ఉ. చివరనున్న యనుబంధమునఁ జూచునది.

నిశ్చయింపఁబడిన, భట్టనాయకునికంటెు - ఇతఁడింమక ముందలివాఁడుగా నిర్ణ యింపఁబడవలసియుండును. కనుక, నీయాచార్యుఁడు - 9వ శతాబ్దము నడుమ నున్నట్లు నిర్ణయింపఁదగునని తోఁచెడిని. లోచన సమున్మీలితమయిన యీధ్వని సిద్ధాంతము - శ్రీజగన్నాథపండితరాజు వఱకునుగల సర్వాలంకారిక శిరోమణుల చేతనుగూడ - శిరోధార్యమయి, సుప్రతిష్ఠితమయినది. ఉత్తమమగు ప్రిణాళిక తోను, అనితర సాధారణమగు విషయప్రతిపాదన చాతుర్యముతోను, గంభీరమగు విషయముతోను, సమున్నతమగు శైలితోను, కవి, పండిత సహృదయానంద సంధాయకమగునట్లు ధ్వనితత్త్వమును నిబంధించి, అన్వర్థసంజ్ఞుఁడగు నానంద వర్ధనుని

> ''ధ్వనినాతిగభీరేణ కావ్యతత్త్వనివేశినా।
> ఆనన్దవర్ధనః కస్యనాఽసీదానన్ద వర్ధనః.''

అని, కవికుల శేఖరుఁడగు రాజశేఖరుఁడు - ప్రశంసించెను. ఈగ్రంథము నకు 10వ శతాబ్దమునకు ముందే - రెండువ్యాఖ్య లుదయించినవి. కాని, అందు మొదటిదగు చంద్రిక - ఇపుడు లభించుటలేదు. రెండవది - లోచనము, మొదటి దగు చంద్రిక - లోచనమునఁబెక్కుస్థలములయందు ఖండింపఁబడుటవలననిది - లోచనముకంటెు ముందుండెడిదనుట నిస్సంశయము.

శ్రీమదాచార్యాభినవ గుప్తపాదుఁడు - లోచనకర్త. ఇతఁడును కాశ్మీరదేశీ యుఁడే. ఇతఁడు వివిధములగు శాస్త్రములను - వివిధగురువులయొద్ద నభ్యసించి- సర్వశాస్త్రపారంగతుఁడయ్యెను. †

ఇతనితాత, వరాహగుప్తుఁడు. తండ్రి - చుఖులుకుఁడను నామాంతరముగల నరసింహగుప్తుఁడు. విద్యాభ్యాసకాలమున, ఒకానొక వలభియందీయభినవుఁడు సముపవిష్టుఁడై తనసహాధ్యాయుల నతిక్రమించునట్లు పఠింప; గురుఁడీతనిని 'బాల వలభీభుజంగు'ఁడని పేర్కొనెనట. 'ధ్వన్యాలోకలోచనము,' 'అభినవభారతి' (భరత నాట్యవేద వ్యాఖ్యానము) భగవద్గీతా సంగ్రహము, దేవీస్తోత్ర వివరణము, పర మార్థసారము, బృహతీవిమర్శిని, నాట్యాలోచనము, మున్నగు గ్రంథములను - లెక్కించుటకశక్యములగు నన్నిఁటి నితఁడు రచించెను. సరస్వతీస్వరూపుఁడగు

† 3. ఆంధ్రధ్వన్యాలోక ప్రథమోద్ద్యోత సంపుటమున 9వ పేజీయందు ''సీ. వరనరసింహగుప్తను'' అనుపద్యమును జూచునది.

నితని పాండిత్యము - మహాపండితైక గోచరము. ఆనందవర్ధనుని జన్మస్థలమగు కాశ్మీరమే - ఇతని నివాసస్థలము. ఇతఁడు- స్వవిరచితబృహతీ విమర్శిని చివరను, కర్మస్తోత్ర, భైరవస్తోత్రముల చివరను, జెప్పుకొనిన శ్లోకములవలననితఁడు - క్రీ॥ శ. 10వ శతాబ్దము చివరను 11వ శతాబ్దము మొదటను, ఉన్నట్లు సుస్పష్ట మగుచున్నది.

* "ఏసాహిత్యాభిలాషి అభినవగుప్త లోచనము నామూలా గ్రమును గ్రహించునో; ఆసాహిత్యవేత్తయే - ఆలంకారిక గోష్ఠుల యందు ప్రథమగణనార్హుఁడు" అనునభియుక్తోక్తి-ఈలోచన ప్రాశ స్త్యమును దెలుపుటకుఁ జాలియున్నది. *

ఆంధ్రకృతికర్తయగు పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు- ధ్వనికారికలను పద్యరూపముననను, వృత్తిని - గద్యరూపముననను, అన్యూనానతిరిక్తమగునట్లు, స్పష్టమును, సరళమధురమును, నగు శైలితో నాంధ్రీకరించిరి.

* ఆనందవర్ధనునిచేత వృత్తియందుదాహరింపఁబడిన, వాల్మీకి, వ్యాస, కాళిదాసాదిమహాకవి ప్రోక్తములగు శ్లోకములలో దేనినిగూడ విడువక, అందలి యర్థగాంభీర్యము నేమాత్రమును గోల్పోనీక వానినన్నిటినిఁగూడ - అన్యూనాతిరిక్తమగు విధమున నాంధ్రీకరించిరి. యథామాత్రకములయిననుగూడ- వీరిపద్యములు స్వతంత్రములవలె సుస్పష్టమగు నన్వయమునుగలిగి మిక్కిలి సొగ సుగానున్నవి. మఱియు నింతతో నాగక, వీరు ప్రౌఢమును, దురవ గాహమును నగు లోచనవ్యాఖ్యనుగూడ యథామాత్రకమగునట్లు సమగ్రముగ తెనిఁగించుచు, దానియందొసఁగబడిన లక్ష్యలక్షణ ములనుగూడ, లలితమధురభణితిలో ఆంధ్రీకరించి, సుస్పష్టమును సులభమును, రమణీయమును నగు శైలితోవెలువరించి యున్నారు. ధ్వనియందును, తదాలోకమునందును, గుప్తలోచనమునందునుగల గూఢాభిప్రాయములను పాఠకులు సులభముగాఁ దెలిసికొనవలయు ననుతలఁపున స్పష్టమగు భాషతో వివరించునదియగు ప్రభామతి యను విపులమగు వ్యాఖ్యనుగూడ స్వతంత్రముగా రచించియు

న్నారు. ఇంతవఱకును ఆంధ్రమున వెలువరింపఁబడిన ధ్వన్యాలోకములలోనేదియుఁగూడ యథామాతృకములగునట్లు లక్ష్యలక్షణములనిట్లు సమగ్రరూపమున సంఘటించి వివరించియుండుటలేదు. ఇది - ఎట్టి గురుతరకార్యమైనదియు, సాహిత్యలోకమున కెంత యుపకారకమగునదియు, పాఠకులే గ్రహింతురుగాక ! *

ఈ యాంధ్రీకృతికర్త నాయొద్దఁ జదివియుండుటచేత కొలఁది పరిచయ వాక్యములతో నీవ్యాసమును ముగింతును. కీ॥ శే॥ దివాన్ బహదూరు శ్రీమత్ కిళాంబిరామానుజాచార్యులవారు-శ్రీ మహారాజ సంస్కృత కళాశాలాధ్యక్షులుగ నుండునపుడు, వీరచట విద్యార్థులుగాఁ బ్రవేశించిరి. అధ్యక్షులును, తదితర పండితులును, వీరిని "బాలకవి" అని పిలుచుచుండుట - ఉపాధ్యాయుఁడుగానున్న నే నెఱుఁగుదును. 1931, 32 సం॥రములలో, వీరు నాయొద్ద సంస్కృత వాఙ్మయ చరిత్రమును, సంస్కృత భాషాశాస్త్రమును జదివిరి. పాశ్చాత్యపండితులు తెలిపిన పురాణకాలములు సరియయినవని యంగీకరింపక తఱచుగనన్నుఁ బ్రశ్నించి, తెలిసికొనుచుండిరి. ఒకవాఙ్మయచరిత్ర గ్రంథమును నేను బోధించునపుడు - అందలి యొకవాక్యమునందలి యలంకారమేమని వీరిని బ్రశ్నింప; వీరు 'రూపక' మనిరి. వీరి సహపాఠులు కొందఱది - 'పరిణామ'మనిరి. దానికి మీరేమందురని నేనితనిని ప్రశ్నింప, ప్రమాణములనుభయములమును రేపుమనవి చేయుదుమనిచెప్పి, మరుచటిదినమున, తనవాదమునకుపష్టంభకములగు ప్రమాణములనుదెలిపి, సహపాఠులచేత నవుననిపించి, నాకు సమ్మోదమును గలిగించిరి.

వీరీగ్రంథమును మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి వరేణ్యులసన్నిధి నభ్యసించి, దీనిని 1938 సం॥మున నాంధ్రీకరించి, 1942 సం॥రమున శ్రీ శాస్త్రిలవారికి వినిపించి, సంస్కరించుకొనిరి. 1946 సం॥రము నుండియు శ్రీ మహారాజ సంస్కృత కళాశాలయందు - తెలుఁగు పండితులుగా నియుక్తులయి, పాఠ్యములగుచున్న తెలుఁగు ధ్వన్యాలోకముల నన్నిఁటిని - నేటి వఱకును విద్యార్థులకు బోధించుచున్నారు. సుప్రసిద్ధులగు 'పంతుల బ్రహ్మదేవ కవిగారు' - వీరి పెదతాతగారు. వారు - "పంతుల బ్రహ్మన్నవంటి పండితుఁ డేడీ!" అను పండితప్రశంసకుఁ బాత్రులయిన విద్వత్ కవివరేణ్యులు. వీరితాత గారు - 'పంతుల పేరన్నశాస్త్రిగారు.' వీరు- అష్టాదశపురాణవిదులు. వీరితండ్రి గారు బ్ర॥ శ్రీ॥ 'పంతుల వేంకటరామమూర్తిగారు'- సంస్కృతాంధ్రములయందు నిశితమగు సాహిత్యముఁగలిగియుండిరి. శ్రీ విజయనగర సంస్థానస్థితమగు నొక

దేవాలయమున పురాణపారాయణ పండితపదవి నేర్పరుపవలసివచ్చిన సందర్భ మున సంస్కృతాంధ్రపురాణములు రెండింటియందును వారు ప్రదర్శించిన యర్థ సమన్వయ విధానము - పండితులకెంతయు సంతృప్తినొసఁగెను.

* ఆశీస్సు :- "శ్రీ శాస్త్రిగారీ గ్రంథమును రచించి; ఆంధ్ర వాఙ్మయమునకును, ఆంధ్రలోకమునకును, మహోపకారముచేసి రనుట - అతిశయోక్తి కాదు. వీరిట్లే యింకను అనేకగ్రంథములను రచించుచు, తెలుఁగుభాషకు నలంకారములను గలుగజేయుచు, చిరం జీవులై యుందురుగాక !" అని నాకోరిక !. *

విశాఖపట్టణము
9—4—1959.
వికారి సంవత్సరాది.

(Sd.) ప॥ వె॥ రా॥

*Professor*
G. J. SOMAYAJI M. A. L. T., Vidwan,
*Head of the Department of Telugu*
ANDHRA UNIVERSITY

Maharanipeta P. O.
VISAKHAPATNAM,
*Date 25-11-1958.*

— • *ప్రమోదాలోకము* • —

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు - అలంకార వేదాంత శాస్త్రములలో ప్రవీణులయి, సంస్కృతమునందలి యాయా గ్రంథ ములను జక్కఁగ పరిశీలించి, బోధించి, సమన్వయించి, తెలుఁగున వెలయించుట-తమజీవితపరమావధిగాఁ బెట్టుకొని ప్రయత్నించు చున్నారు. అట్లు ప్రచురించిన గ్రంథములలో నీఆంధ్రధ్వన్యాలోక మొకటి.

సాహిత్య విమర్శలోఁ గలిగిన చిక్కులనెల్ల విడఁదీసి, భిన్న కర్తృకములయిన సిద్ధాంతములకు సమన్వయముఁగూర్చి (ధ్వని

సిద్ధాంతమును నిరూపించి)న యుత్తమగ్రంథము- ధ్వన్యాలోకము. ఇది - మిక్కిలి ప్రౌఢము. ఇట్టి గ్రంథములోని విశేషములను వివరించినది - శ్రీ మమదాచార్య అభినవగుప్తుల లోచనమను వ్యాఖ్యానరత్నము.

మూలకారికలను, వానివృత్తిని, సంపూర్ణముగా నాంధ్రీకరించుటయేకాక, లోచన వ్యాఖ్యనుగూడ సమగ్రముగా నాంధ్రీకరించి, తదితర వ్యాఖ్యలను జక్కఁగాఁ బరిశీలించి, ప్రభామతియను స్వతంత్రవ్యాఖ్యనుగూడ రచించి, శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి గారు ప్రకృతగ్రంథమును వెలువరించియున్నారు. వీరి ప్రభామతి- అనేక విశేషోపదేశముగానున్నది. ఇందలి వివరణము - సప్రమాణము. సరళము.

ఈః గ్రంథము-విద్యార్థులకును, పండితులకును, తప్పకపఠనీయమని చెప్పఁగలను.

ఆచార్య, విద్వాన్, సోమయాజి.

ఓం నమోభగవతే శ్రీరమణాయ.
శ్రీభారతీ దేవ్యైనమః.

# నివేదనాలోకము

శ్రీకాశ్మీరము - ప్రాచీనకాలమున వివిధశాస్త్రకావ్య సాహిత్యధనాగారముగానుండెనను విషయము - జగత్ప్రసిద్ధము. ఆకాశ్మీరము పేరువినఁబడఁగానే, అచటవెలసిన విద్వత్కవి రత్నములలో - ఆనందవర్ధన, అభినవగుప్తనామములగు మహారత్నములు - రెండు - సహృదయుల స్మృతిపథమున 'తళుక్కు'మని విద్యోతించుననుట - అతిశయోక్తికాదు. శ్రీ సాహిత్యామృతజ్యోతియగు ధ్వన్యాలోకమును, దానినుస్మీలించిన లోచనమును, ఆసహృదయ విద్వత్కవిచక్రవర్తుల- ప్రజ్ఞాప్రద్యోతములు.

రాజానక శ్రీమదానంద వర్ధనాచార్యకృతమగు నీ ధ్వన్యాలోకము, రసగంగాధరము, మున్నగు నలంకారగ్రంథములను, నేను మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శాస్త్రరత్నాకర, బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రిలవారి యొద్దను, “కావ్యప్రకాశము” మున్నగు గ్రంథములను సుప్రసిద్ధపండితోత్తములగు బ్రహ్మశ్రీ నౌడూరి వేంకటశాస్త్రిలవారి యొద్దను, నభ్యసించియున్నాను. కావున మొదట తద్గురుద్వయమునకును, తదుపరి, నస్మద్గురువర్గమున కంతకును బ్రణామముల నర్పింతును.

గంభీరమగు నర్థముఁగలిగి సూత్రరూపముతోనున్న యీగ్రంథమునందలి కారికలు - ‘ధ్వని’. అనియు, వానిని వివరించునదియగు వృత్తి-“ఆలోకము”అనియుఁ,బేర్కొనఁబడుటవలన-దీనిక ధ్వన్యాలోకమను విశిష్టనామమేర్పడెను. “కారికారూపమగు ధ్వనికిని, వృత్తిరూపమగు నాలోకమునకును రచయిత - ఆనందవర్ధనుఁడేయగును” అనువారు - అద్వైత(అభేద) వాదులు. “కారికలను సహృదయుఁడో, ఇంకెవరో రచించియుండును. వృత్తి - శ్రీమదానందవర్ధన కృతమే” అనువారు ద్వైత (భేద) వాదులు. ఈ విషయమును ద్వితీయోద్ద్యోతము చివరను సంఘటింపఁబడిన ‘ కారికాకార,వృత్తికార, ద్వైతాద్వైతములు” అనుద్వితీయాను బంధమున సమాలోకించునది.

భారతీ స్వరూపుఁడగు నీయాచార్యుఁడొనర్చిన కృతిరత్నములలో భరత నాట్యశాస్త్రవ్యాఖ్యయగు, ‘అభినవభారతియు,’ ధ్వన్యాలోకవ్యాఖ్యయగు‘లోచనమును,’ ప్రముఖస్థానము నార్జించియున్నవి.

శ్రీమదభినవగుప్తుఁడు - సాహితీశాస్త్రవేత్తలయభిమతమున-అలంకారశాస్త్ర భాష్యకారుఁడు. ఈతఁడు నిరూపించిన రసధ్వని సిద్ధాంతము- తరువాతి యాలంకారికులందఱికిని శిరోధార్యమయినది. ద్వితీయోద్ద్యోతమునందలి 39వ పేజీని జూచునది. సహృదయ పాఠకులు- ఈ రసాది సిద్ధాంతమును ద్వితీయోద్ద్యోతము చివరను ప్రథమానుబంధముగాఁ గూర్పఁబడిన రసాలోకమున, సమగ్రముగాఁ జూచునది.

అభినవగుప్త లోచనమునకు-ఉత్తుంగోదయుఁడను రాజు- 15వ శతాబ్దమున ‘కౌముది’ అనువ్యాఖ్యను రచించెను, కాని, యిది- ప్రథమోద్ద్యోతమునకుఁగూడఁ బూర్తిగాలేదు ఇటీవల వెలువడిన దీధితి - ధ్వన్యాలోకమునే వ్యాఖ్యానించును. కాని లోచనార్థమును వ్యాఖ్యానించునదికాదు ‘బాలప్రియ’ అనునవీన వ్యాఖ్య-నేను లఘువ్యాఖ్యతో ధ్వన్యాలోకము నాంధ్రీకరించిన పిమ్మట వెలువడినది. ఉత్తుంగోదయుని వ్యాఖ్యయున్నంతవఱకును - నిది - దానిని సంగ్రహముగ ననుసరించినది.

తదుపరి. ప్రథమోద్ద్యోతమున శేషించినదియు, తరువాతి యుద్ద్యోతములకు సంబంధించినదియు, నగు లోచనమునందలి కొన్నిపదముల యర్థమునుమాత్రమే తెలుపునదియగు టిప్పణిగానున్నది. గుప్తలోచనమునందలి గూఢార్థమును దెలుపునదియగు వ్యాఖ్య - సంస్కృతమున నింతవఱకును వెలువడియుండలేదు. ఈ వ్యాఖ్యలయినను నేనీగ్రంథమును దెలిఁగించునాటికి వెలువడియుండుటలేదు. శ్రీ రాయడు శాస్త్రిగురుచరణుల సన్నిధిని 1931వ సంవత్సరమున సహపాఠులతోఁ గూడి నేనీగ్రంథము నధ్యయనము నొనర్చితిని.

“సత్కావ్యోపనిషద్భూత శృంగారాదిరసధ్వనిలక్షణజ్యోతి యగు శ్రీ ధ్వన్యాలోక సాహితీఖని ననువదించి, యర్పించి, యలరించి, యాంధ్రలోకము నెంతవడిగా సేవింతునో” అనినాహృదయమున . రచనోత్సాహావేశ ముజ్జ్రుంభిత లూగించునంతగా, ఆమహాదేశిక సార్వభౌముని, వినిర్మల ప్రవచన సమన్వయ ప్రబోధమాధుర్యము- నన్నప్పుడాకర్షించెను. 1932 మార్చినెలతో నిర్బంధవిద్యాభ్యాసము ముగిసెను. కాని. జీవనభృతిప్రయత్నమునఁ దిరుగవలసివచ్చుటవలన నాంధ్రీకృతికి సముచిత సమయము సమకూరినదికాదు. శ్రీ భారతీ కటాక్షమున 1936వ సంవత్సరముచివర నాంధ్రీకృతి నారంభించి. తే 1—10—1938 దీకి గ్రంథము నామూలాగ్రముగ ననువదించితిని. లోచనమునందలి కొన్ని యభిప్రాయములను గుర్తించి, ప్రభామతియను నాంధ్రవివరణమునొనర్చితిని. లఘువ్యాఖ్యతోఁగూడిన శ్రీమదాంధ్రధ్వన్యాలోకమునందలి యుద్ద్యోతములునాల్గిటినిగూడ- 2—2—1944 తేదీకి శ్రీ గురుదేవులకువినిచి, శ్రీవారి యాశీరామోదములను బడసితిని.

నాసంగీత గురువులు బ్రహ్మశ్రీ పటాప్రియని సీతారామశాస్త్రిగారు మున్నగు కౌముదీసభ్యులయు, శ్రీ భారతీ తీర్థప్రధాని, శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు పంతులుగారియు, ప్రేరణప్రోత్సాహమున 1943వ సంవత్సరమున దీనిప్రథమ ద్వితీయోద్ద్యోతములను-ప్రథమభాగ రూపమున ముద్రింపించి, సదభిమాన ప్రపూర్ణులు, ‘మూలరామప్రియ,’ మ॥ రా॥ శ్రీ కానుకుర్తి కృష్ణారావు పంతులుగారి తోడ్పాటు వలన తే 24—9—1944 దీని జరుపఁబడిన కృతిసమర్పణ మహోత్సవమున, శ్రీ భారతీదేవికి సమర్పించి వెలువరించితిని. దీధిత్యవధానటీకలును, చాలవఱకు నిర్దుష్టమును, సమగ్రమును, నగు లోచనముతోను, బాలప్రియతోను, చౌఖాంబా గ్రంథమాలనుండి వెలుపడిన ధ్వన్యాలోకప్రతియును, వెలువడినపిమ్మట- వెనుక ననువదించిన తృతీయచతుర్థోద్ద్యోతములను - సమగ్రమగు లోచనాభిప్రాయముతోను, తదితర వ్యాఖ్యలయందుపయుక్తములగు నంశములతోను, స్వాభిప్రాయ

ముతోను, గూర్పఁబడిన ప్రభామతిచేత విస్తరింపఁజేసితిని. అయినను, ధనలోపము వలన, ఉద్ద్యోతములు రెండింటినిగలిపి ద్వితీయభాగముగా నొనర్చి ప్రకటింపఁ జాలక, 1954వ సం॥రమున-తృతీయోద్ద్యోతమున మూడుపాళ్లుగల గ్రంథమును మాత్రమే - ద్వితీయభాగముగాఁ బ్రకటింపగలిగితిని. ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు - 1960 సంవత్సరము భాషాప్రవీణ ఫైనలుకు, దీని ప్రథమభాగమును పాఠ్యముగఁజేసి, నాకుఁ బ్రోత్సాహమును గలిగించుటవలనను, ప్రథమముద్రణ మునందలి ప్రథమభాగమునఁగల లోచనాభిప్రాయము సమగ్రముకాకుండుట వలనను, ప్రతులు ఖర్చగుటవలనను, తిరుగఁ బ్రథమభాగమును బ్రకటింపఁబూను కొంటిని. ఈద్వితీయ ముద్రణమున, లోచనమునంతను దెలిఁగించితిని. ధ్వనికారికలను, వృత్తిని, లోచనమును, వివరించుచు, స్వయముగా రచించిన ప్రభామతిని విస్తరించి, ధనవ్యయమునకు వెనుదీయక శ్రీభారతీ, గురు, శుభానుగ్రహబలమువలన నిట్లు వెలువరించితిని. ఈముద్రణమునందలి ప్రథమభాగ విశిష్టత - ఇది :-

(1) ఇందు, ప్రథమోద్ద్యోతమొక సంపుటముగను, ద్వితీయోద్ద్యోతమొక సంపుటముగను, బ్రకటింపఁబడినది. వేరువేరగువిషయసూచికలనుగలిగియున్నను, ఇవిరెండునుగలిసి ప్రథమభాగముగుచున్నవి.

(2) ఇందున్న ధ్వన్యాలోకమే - విద్యార్థులకు ముఖ్యమగు పాఠ్యము. కనుక, 'ధ్వన్యాలోకములు'గల మూలము - ప్రత్యేకించి, పెద్దయక్కరములతో ముద్రింపింపఁబడినది. మఱియు నీమూలము - సంఖ్యాక్రమముగల పేరాలుగా విభజింపఁబడినది.

(3) ఆంధ్రీకృతి రూపములగు కారికలకుముందు ['కా'] అను గుర్తు నిలుపఁబడి, సంస్కృతమూలమునందలి కారికలన్నియుఁగూడ క్రమసంఖ్యలతోఁ గూర్చి వెలువరింపఁబడినవి. ఆంధ్రీకృత కారికలతోఁబాటు - మూలసంస్కృత కారికలనుగూడ - విద్యార్థులు - పఠించుటకిట్లు సౌకర్యమేర్పరుపఁబడెను.

(4) "లోచనము - గంభీరార్థకము. క్లిష్టసమన్వయము. కనుక దాని నాంధ్రీకరించుట దుష్కరము" అని శ్రీ గురుపాదులు సెలవిచ్చిరి. అయినను, తద్గురు ప్రబోధములననుసంధానించి, శ్రీభారతీకటాక్షమును విశ్వసించి, లభించిన సాధనమును గ్రహించి, శ్రీలోచనమునందలి ప్రతిపంక్తియు నాంధ్రీకరింపఁబడి, ప్రత్యేకింపఁబడెను. లోచనోక్తములగు లక్ష్యలక్షణములుకూడ - పద్యరూపమున నాంధ్రీకృతములయినవి.

(5) లభించిన సంస్కృతవ్యాఖ్యలను బరిశీలించి, ధ్వనియందును, ఆలోక మునందును, లోచనమునందును,గల గంభీరమగు గూఢార్థమును, ప్రశ్నోత్తరాది రూపముననుు, అవతారికా రూపమునను, ఫలితార్థవిశదీకరణాది రూపమునను, సహృదయపాఠకులకు స్పష్టమగునట్లు వివరించి రచించిన ప్రభామతి - ఇందుఁ బ్రత్యేకింపఁబడెను. [ద్వితీయభాగమునందో; లోచనార్థము - ప్రభామతియందు మిళితమొనర్పఁబడెను.]

(6) విజ్ఞుల యభిమతముననుసరించి, గ్రంథవిస్తృతివలన సంభవించుచున్న ధనవ్యయాధిక్యమునకు వెనుదీయక, సంస్కృత ధ్వన్యాలోకమున నుదాహృతము లగు శ్లోకములుకూడ-పెక్కులు - పాఠకసౌకర్యము నుద్దేశించి, ఆంధ్రలోచన మునందుఁగాని, ప్రభామతియందుఁగాని, చేర్చి వెలువరింపఁబడెను. ఇట్లే, లోచనో దాహృత సంస్కృతశ్లోకములుకూడ- పెక్కులింను వెలార్పఁబడెను. వీనియర్థము నెఱిఁగిన విద్వాంసులును, విద్యార్థులును, నాయాంధ్రీకృతి పరిశ్రమను గుర్తింప వచ్చును.

(7) ప్రథమముద్రణమునందలి మూలపాఠము - బహుస్థలములందు- మిగుల మార్పునొందింపఁబడెను. క్లిష్టమగు మూలపదార్థము నెఱుఁగుటకు లోచ నోక్తమగు దాని ముఖ్యార్థము - మూలమునందలి బ్రాకెట్లలోఁజేర్పఁబడెను. దీని మూలమున విద్యార్థులు-లోచనార్థమును మూలమునందేగ్రహించుటకువీలుపడును.

(8) ఇందు-క్రొత్తవియగు 'కేస'ర్యాదివృత్తములును,'వెండితెర'మున్నగు క్రొత్తజాతియోపజాతీయపద్యములును, పెక్కులు- ప్రభామతి ప్రసారితములయి నవి. వీనికి, నామ, లక్షణ, గతి (తాళ) నిర్దేశముకూడ - కావింపఁబడెను. నవ్యత నభిమానించు నవ్యకవులు - వీనిని సమీక్షింపవలయును.

తృతీయోద్ద్యోతశేషమును, చతుర్థోద్ద్యోతమును, గల చివరిభాగముకూడ- 1938లోనే ఆంధ్రీకృతమయినను, ధనలోపమువలన ముద్రింపఁబడినదికాదు. ఆభాగమునుగూడ - ఈమార్గముననుసరించి మార్చి, శ్రీ భారతీ శుభానుగ్రహ, గురుశుభాశీర్వాద, ప్రసాదమువలన త్వరలోనే ప్రకటింపఁగోరుచున్నాను. సహృ దయాంధ్ర పాఠకసోదరుల, రమణీయార్ద్రహృదయము - వెలువడిన ప్రథమ, ద్వితీయభాగముల నాస్వాదించి, దీనిచివరి భాగమును వెలువరించుటకుదోహదము నొసఁగునని విశ్వసించుచున్నాను. ప్రథమముద్రణమునందలి ప్రథమభాగమును, 1954లో ప్రకటించిన ద్వితీయభాగమును, సమీక్షించిన విద్వత్కవులకును, పత్రి

కలకును, నా నమోవాకముల నర్పింతును.

ఆసమీక్షలలో ప్రథమభాగమునకు సంబంధించిన సమీక్షలు - ముందుగా నీగ్రంథమునఁ బ్రకటింపఁబడినవి. నా విజ్ఞప్తి నామోదించి, ద్వితీయ ముద్రణము నందలి యీప్రథమభాగమును సమీక్షించి, సదభిప్రాయమును వెలార్చిన శ్రీభారతోపాధ్యక్షులు, సర్వేపల్లి రాధాకృష్ణన్ మహాశయులకును, ప్రథమ, ద్వితీయ; భాగములను రెండింటిని సమీక్షించి, 'సమాలోకము' అను గంభీరార్థకమగు పీఠికను రచించి, స్వాలోకబలమునొసఁగిన, "శ్రీ సహృదయచక్రవర్తి", శతావధాని, బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రి మహాశయులకును, పరిచయాలోకమును బ్రసాదించిన సద్గురువరేణ్యులు, శ్రీమత్పరవస్తు రామానుజస్వామి M. A. వారికిని, ప్రమోదాలోక సదభిప్రాయము నుద్ఘాటించిన, ఆచార్య, విద్వాన్, గంటి జోగి సోమయాజి M.A.L T. వారికిని, నాప్రణామాంజలులనర్పించుచున్నాను.

నిర్మలమగు సత్ప్రవర్తనమును, కవితానందమునుగలిగి, నేనువ్రాసిన చిత్తుప్రతినుగుర్తించి, విసువునొందక, శ్రద్ధాయుతమగు చక్కని దస్తూరితో సాపు వ్రాసి, నాకెంతయుఁదోడుపడిన, లలితహృదయుఁడు, చిరంజీవి, శ్రీకానూరి, 'ఆదినారాయణరావు'నకు, కళాస్వరూపిణియగు వాగ్దేవి - ఆయురారోగ్యవిద్యావిభూతిని సంఘటించుఁ గావుతమని యాశీర్వాణీ సమభ్యర్థనము నొనర్తును. ఈ శాస్త్రగ్రంథమును - సర్వాంగసుందరముగను, నిర్దుష్టముగను, నుండవలయునను సదుద్దేశమునననుసరించి, ముద్రించి, నాహృదయము నానందింపఁజేసిన 'శ్రీ వేదవ్యాస ముద్రణాలయమును' మిగుల నభినందింతును.

— • సహాయధర్మ నివేదనాలోకము •—

నా హృదయమున నుదయించిన, శ్రీధ్వన్యాలోక, లోచన, ప్రభామతి రచనోత్సాహమునాలించి, శ్రీ గజపతినగరస్థిత శ్రీగీతా ప్రచారకమండలి అధ్యక్షులు, శ్రీ కొల్లా, సత్తెయ్యశ్రేష్ఠిగారును, తత్ కార్యదర్శి, శ్రీ హెట్టా వీరభద్రరావుశ్రేష్ఠిగారును, శ్రీవర్తక సంఘాధ్యక్షులును. తదభిమానులును, నగు శ్రీ నాక్కెడమిల్లి, వేంకటగంగరాజుశ్రేష్ఠిగారును, తమలో జనించిన సహాయధర్మతత్పరతను బ్రసంగించినంతమాత్రమున మహానంద పురస్సరముగ దాని నామోదించి, ఏతద్గ్రంథ ముద్రణమున సహకరించుటకు శ్రీభారతీ సమ్మానముగా 516 రూప్యముల నొసఁగుటకుఁ దీర్మానించి, ఔదార్యమును బ్రదర్శించిన "శ్రీ గజపతినగర వర్తక సంఘమునకు," శ్రీభారతీదేవి - ఆయురారోగ్య భక్తిసంపదభ్యుదయము ననుగ్రహించుఁ గావుతమని యభ్యర్థింతును.

మఱియు, అనకాపల్లి నివాసులును, మహోదారశీలురును, శ్రీ శుక్లయజుర్వేద సంస్కృత పాఠశాలాధ్యక్షులును, నగు బ్రహ్మశ్రీ చింతా సుబ్రహ్మణ్యముగారు - ప్రియభక్తులును, ఈశావాస్యోపనిషత్ప్రచురణ కర్తలును,నగు మ॥ రా॥ శ్రీ రాపర్తి కన్నయ్యపంతులుగారిద్వారమున బహువ్యయసాధ్యమగు నీసత్కృతి ప్రకటనోద్దేశమునాకర్ణించి, గ్రంథప్రాశస్త్యమును గుర్తించి, ఏతన్ముద్రణమున సహకరించుటకు 116 రూప్యముల నొసఁగియున్నారు. కనుక, శ్రీశుభాశయులగు 'శ్రీ చింతా సుబ్రహ్మణ్యముగారికి,'' శ్రీభారతీదేవి - ఆయురారోగ్యధర్మవిజ్ఞాన సంపదభ్యుదయమును గటాక్షింప నభ్యర్థింతును.

ఓమ్. తత్. సత్.

ఇట్లు,
సజ్జన విధేయుఁడు
*పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.*
శ్రీకౌముదీ, భారతీతీర్థ, సాహితీసమితి, సభ్యుఁడు.

పత్తిపాటివారివీధి,
విజయనగరము
20-5-1959.

ఓం నమోభగవతే శ్రీరమణాయ.

[ధ్వని - ఆలోక - లోచన - పరిభామతి]

# విషయసూచిక

ఓమ్. తత్. సత్.

## శ్రీ మహామహోపాధ్యాయ - కళాప్రపూర్ణ.

## తా తా సు బ్బా రా య శా స్త్రి

# * గురుప్రశంస

స్వాతంత్ర్య ప్రతిభాప్రయుక్తమగు విజ్ఞానంబు, గూఢార్థ సం
ఘాత స్ఫోరకమైనపాండితి, మహాగ్రంథార్థ బోధోల్ల స
చ్చాతుర్యాన్వితమైన సత్ప్రవచనత్వ,మ్మానివెల్గొందు శ్రీ
తాతావంశజ సుబ్బారాయ గురురత్నంబున్ బ్రశంసించెదన్॥

ఆంధ్రదేశమ్ము శాస్త్రార్థానుగతమయ్యె బుధకల్పవృక్షసంభూతివలన
వ్యాకరణాదివిద్యాలతల్ చివురించె సత్పండిత వసంతసంభవమున
విజయపురాస్థాన విభవంబుజిగిమించె శాస్త్రవిద్రత్న సంసర్గముునను
శిష్యార్థిబృందవాంఛితము లబ్బె మనీషిచింతామణీరత్న సిద్ధివలన

గీ॥ సమధిక కళావిభాసి దేశములలోన
తెలుఁగు నాటికినాటికిఁగలిగెపేరు,
''మధురసాహిత్య సౌందర్య - మహిమఁ''బూని
సుబ్బరాయగురువిభుండు - సొంపుసంప.

అతిగూఢార్థరసప్రకాశమగు ధ్వన్యాలోకమున్ 1''లోచనా''
ర్పితదృష్టిన్ వివరించి, మాకుచిత సంవిద్దీప్తిఁగల్గించి, శా
శ్వతకీర్తింగని మన్మనఃకుసుమ పూజాభాజనంబై కడున్
గృతకృత్యుండగు సుబ్బారాయ గురుమూర్తిన్ భక్తిభావించెదన్.

ఆనాఁడెంతయు వత్సలత్వమున ధ్వన్యాలోక రత్నామృత
జ్ఞానందమొసంగె, దానినపుడాస్వాదించి, యాంధ్రోక్తులన్
నేనీనాఁడు రచించి భక్తినది విన్పింపంబ్రహృష్టాత్ముఁడై
తానేదానిఁబరిష్కరించె నెవఁడాతత్త్వజ్ఞుఁబూజించెదన్.

2 ఒక్కొకతె తప్పువట్టు, మఱియొక్కతె నిత్యమువాదులాడ, నిం
కొక్కతె బుద్ధిసెప్పఁ, దమినొక్కతి కర్మవిధింప, నోర్తుదా

చక్కఁదనంబుదిద్ద, నెఱజాణలనేవుర నేలుకొంచు; వే
ఱొక్కతె వెన్కఁద్రిమ్మరు గురూత్తముచాతురిఁబ్రస్తుతించెదన్.

---

1 లోచనార్పితదృష్టిన్ = లోచనమువంటి లోచనముచేత నర్పింపఁబడిన చూపువంటిజ్ఞానముచేత.

1 ఒక్కతె = వ్యాకరణశాస్త్రము — ఒకకాంత

2 మఱియొక్కతె = తర్కశాస్త్రము ,,

3 ఇంకొక్కతె = వేదాంతము ,,
(ఉత్తరమీమాంసాశాస్త్రము)

4 ఒక్కతి = ధర్మశాస్త్రము ,,
(పూర్వమీమాంస)

5 ఓర్తు = అలంకారశాస్త్రము ,,
వేఱొక్కతె = కీర్తికాంత —

* ఇది - తే 2—2—42 దీని, శ్రీసద్గురువులకు సమర్పితము.

శ్రీరస్తు. ఓం నమోభగవతే శ్రీరమణాయ. అవిఘ్నమస్తు.

శ్రీ భారతీ దేవ్యైనమః,

# ఆంధ్ర ధ్వన్యాలోకము.

## ప్రథమ-ద్వితీయ-ఉద్ద్యోతములు.

శ్రీ సౌందర్య విలాస పి
పాసు సమారాధన ప్రవణ కావ్య కళా
భ్యాస విశిష్ట మహాకవి
భాసుర రచనా విహార! భావ గభీరా!

—: సంస్కృత మూలము :—

స్వేచ్ఛాకేసరిణః స్వచ్ఛ స్వచ్ఛాయాయాసితేన్దవః।
త్రాయన్తాంవో మధురిపోః ప్రపన్నార్తిచ్ఛిదో నఖాః॥

మూ॥ స్వేచ్ఛాకేసరి, మధురిపు (మధ్వరి)
స్వచ్ఛ స్వాకార భిన్న శశులు, ప్రపన్నా
ర్తి చ్ఛేత్తలు, నఖములు-మీ (మన)
కచ్ఛిన్నత్రాణ మొసఁగునవి యగుఁగాతన్!

ప్రభామతి :— 'ధ్వని + ఆలోకము = ధ్వన్యాలోకము' అని యగుచున్నది. ధ్వన్యాలోకమన ధ్వని సందర్శనమని యర్థము. "మూల రూపములగు కారికలతోఁగూడినది-ధ్వని" అనియు, దాని యర్థమును దెలుపునదియగు వృత్తి-ఆలోకమనియు, పేర్కొనఁబడినవి. కారికాకారుఁడును-వృత్తి కారుఁడును-ఆనందవర్ధనుఁడే యని కొందఱిమతము. వారిరువురును భిన్నులని కొందఱి యభిప్రాయము. ఏమైనను కారికా-వృత్తి-రచనములకు కాలభేదమున్నట్లు తోచుచున్నది.

ఈ విషయము కారికాకార-వృత్తికార-ద్వైతాద్వైతములను వ్యాసమునందు విమర్శించి యున్నాను. దానిని పాఠకులు సమీక్షించునది. ఈ ధ్వని సందర్శనము-మహా మాహేశ్వరులగు శ్రీ మదభినవగుప్త పాదుల-అద్భుత లోచనమువలననే సిద్ధించునను నభిప్రాయమున ఆలోచనమును మా ప్రభామతి ప్రసారింపఁజేయుచున్నది.

లోచనము :— విచ్ఛేద రహితుఁడగు పరమేశ్వరునికి నమస్కరించి తత్సంపత్తిచేత వృత్తికారుఁడు-చరితార్థుఁడైనను, వ్యాఖ్యాతలకు వ్యాఖ్యాన రూపమగు అభీష్ట ఫలమును, శ్రోతలకు శ్రవణరూపమగు అభీష్టఫలమును, నిర్విఘ్నముగా నిష్పాదించుట కొఱకు వృత్తి గ్రంథారంభమందు యోగ్యమగు ఆశీర్వాదమును బ్రకటించి-తద్ద్వారమున వ్యాఖ్యాతృ శ్రోతలకు రక్షణేచ్ఛారూపమగు పరమేశ్వర సాముఖ్యమును సంపాదించుచున్నాఁడు. "స్వేచ్ఛాకేసరి". అను నీ పద్యము-కారికారూపములగు సూత్రములందలి ఆద్యపద్యము కాదనియు, ఇది వృత్తియందలి ప్రథమ పద్యమనియు తెలియునది.

"మధురిపునినఖములు"మిమ్ములను (వ్యాఖ్యాతలను, శ్రోతలను,)రక్షించుగాత"! అని ఆశీః ప్రకటనము కావింపఁబడినది. ఇచట సంబోధింపఁదగినవారు వ్యాఖ్యాతృశ్రోతలే గదా! వ్యాఖ్యానరూపమును, శ్రవణరూపమును, అగు అభీష్టలాభమునకు సహాయ కర్మము నొనర్చుటయే— ఇచట అచ్ఛిన్నమగు త్రాణము నొసఁగుట అని తెలియఁదగును, ఆ త్రాణము - వ్యాఖ్యాతలకును శ్రోతలకును అభీష్టలాభములగు వ్యాఖ్యాన - శ్రవణములకు - ప్రతిబంధములగు విఘ్నములను తొలఁగించుట మొదలగు వానిచేత సిద్ధించును. కావున నిచట త్రాణమను పదమున కర్థముగా విఘ్నాపసరణాదికమే వివక్షితమని తెలియునది.

ప్రభామతి :— కావ్యాత్మయగు ధ్వనిని ప్రతిపాదింపనున్న గ్రంథకర్త చేత రచింపఁబడిన ఈ ప్రథమ పద్యముగూడ-కావ్యరూపమగుటవలన ఈ పద్యము నందుఁగూడ ధ్వని యోజింపఁదగినదని లోచనకారుఁడగు అభినవగుప్త పాదుఁడు-తలంచి,రస-అలంకార-వస్తు, భేదమున త్రివిధములగు ధ్వనులయందు ప్రధానభూతమగు రసధ్వని నిందు మొదట యోజించు చున్నాఁడు. మఱియు నిందు వాచ్యార్థము మాత్రమే చెప్పఁబడుటలేదు. ఇంకేమనిన; రసము గూడ ధ్వనింపఁజేయఁబడుచున్నదని నిరూపించుచున్నాఁడు.

ఈ పద్యమునందు 'స్వేచ్ఛాకేసరి' 'మధురిపువు' 'ప్రపన్నార్తిచ్ఛేత్తలు' అను పదములచేత నిత్యోద్యోగియగు భగవంతునికి 'అసమ్మోహము - అధ్యవసాయము' అనఁగా: సమ్మోహము లేకుండుట-వస్తుతత్త్వ నిశ్చయము-అనునవి కలిగియున్నట్లు చెప్పుటవలన ఉత్సాహము - స్ఫురింపఁజేయఁబడుచున్నది. మీఁది పదముచేత హిరణ్యకశిపు ప్రభృతులను జంప వలయునను నుత్సాహము-భగవంతునికిఁగల్గినట్లు సహృదయులకు స్ఫురింపఁజేయఁబడుటవలన నిచట వీర రసము ధ్వనింపఁజేయఁబడినది. [ఇచట ఉత్సాహముతోఁగూడ "మతి, ధృతి" మొదలగు సంచారి భావములుగూడ వ్యంజింపఁజేయబడుచున్నవని గ్రహించునది.] తదుపరి వస్తు ధ్వనిని ప్రదర్శించుచున్నాఁడు.

నఖములు ప్రహరణ కరణములు. ప్రహరణము స్వరక్షణమునుగాని, అన్యరక్షణముగాని, కావించుటకు స్వీకరింపఁబడును. ఖడ్గాదులవలె నఖములు బాహ్యకరణములుగాక, ఆభ్యంతర కరణములై యున్నవి. కావున అవి-అవ్యతిరిక్తములగు (తనకంటె వేరుకాని) కరణములైయున్నను, అవియే-ఇచట కర్తగా కూడ-చెప్పఁబడినవి. మధురిపువు-తన నఖములచేత మిమ్ములను రక్షించుఁగాక: అని చెప్పక "మధురిపుని నఖములు-మిమ్ములను రక్షించుఁగాక" అని చెప్పుటవలన కర్తలగు ఆనఖములకుఁగల సాతిశయమగు శక్తియిచట సూచింపఁబడెను. [వేరొక వ్యంగ్యార్థమును చెప్పుచున్నాడు]. పరమేశ్వరునికి వ్యతిరిక్తమగు, అనఁగా: తనకంటె బాహ్యమగు ఖడ్గాది కరణాపేక్ష లేననునది దీనిచే ధ్వనింపఁజేయఁబడినది.

'మధురిపుని' అనుటచేత భగవానునికి ఎల్లపుడునుగల జగత్త్రాసాపనోద్యమము [దుర్జనులవలన జగత్తునకుఁగల భయమును తొలఁగించు ప్రయత్నము] చెప్పఁబడినది. ఆ మధురిపువు- స్వేచ్ఛచేతనే కేసరి యగుచున్నాఁడు. కాని జీవులవలె కర్మ పరతంత్రుఁడై కేసరి యగుటలేదు. మఱియు పరేచ్ఛచేతఁగూడ కేసరి యగుటలేదు. ఇంతేమనిన విశిష్టుఁడగు ఒకానొక దైత్యుని సంహరించుటకుచితమగు (నరకేసరి విగ్రహావలంబనమునందలి) ఇచ్ఛాపరిగ్రహమునకు ఉచితమగుటవలనె (నర) సింహ రూపమును స్వీకరించెను.

ఆ నఖములు ప్రపన్నులకుఁగలిగిన ఆర్తిని ఛేదించునవిగా చెప్పఁబడినవి. నఖములు - ఛేదకములగుట యుచితమేకదా!

ప్రశ్న :— రూపములేనిదగు ఆర్తి-ఎట్లు ఛేదింపఁబడును? నఖములు-ఆర్తిని ఛేదించుట అసంభవము గదా! ?

ఉత్తరము :— పరమేశ్వరుఁడు స్వీయమగు నిచ్ఛచేత వానిని నిర్మించుట చేత పారమేశ్వరీయములగు ఆనఖములకు ఆర్తిచ్ఛేదకత్వము [ఆర్తినిఛేదించుట] సముచితమే యగునని తెలియునది. [భగవంతుఁడు, స్వేచ్ఛచేత ఆ నఖములను నిర్మించుటచేత-అమూర్తమగు ఆర్తినవి ఛేదింపఁగల్గునని తెలియునది.] ఈయర్థము నింకొక విధమునఁగూడ సమన్వయింపవచ్చును. త్రిజగత్కంటకుఁడగు హిరణ్య కశిపుఁడు-విశ్వమునకు మిక్కిలి క్లేశమును గలిగించెను. ఇట్లు భగవదేకశరణులగు ప్రజలకు గొప్ప యార్తిని కలిగించునాఁడగుటవలన ఆ హిరణ్య కశిపుఁడే మూర్తమగు ఆర్తి యగుచున్నాడు. [ఆర్తియే హిరణ్యకశిపుని మూర్తినిదాల్చినది] కనుక, అతనిని నశింపఁజేయునవియగు నఖములచేత ఆర్తియే ఉచ్ఛేదింపఁబడిన దగుచున్నది. దీనిచేత 'భగవంతుఁడు ఆర్తినేగాని యేమూర్తిని (ప్రాణిని) ఛేదింపడు' అను నర్థము స్ఫురింపఁజేయఁబడుచుండుటవలన నరసింహ రూపమున హిరణ్యకశిపుని వధించుచున్న ఆయవస్థయందుఁగూడ పరమేశ్వరునికి గల పరమ కారుణికత్వమే వ్యంజితమగుచున్నది. మఱియు ఆ నరకేసరి నఖములు [స్వచ్ఛ స్వచ్ఛాయాయాసితేందవః] 'స్వచ్ఛ స్వాకార ఖిన్నశశులు' స్వచ్ఛతాగుణము చేతను (నైర్మల్యముచేతను) వక్రము, హృద్యము, అగు తమ యాకారముచేతను, ఖేదము నొందింపఁబడిన చంద్రుఁడుఁగలవి. ఇచట స్వచ్ఛ శబ్దము-ధర్మివాచకము. అయినను నీ స్వచ్ఛ శబ్దమునకు స్వచ్ఛతచేతను (నైర్మల్యముచేతను) అని ధర్మార్థమును గ్రహింపవలెను. ఇచట వక్రము, హృద్యము అగు ఆకృతిచేత ఆయాస పెట్టఁబడినవాడు-పూర్ణచంద్రుఁడు కాకుండుటవలన అతఁడు బాలచంద్రుఁడే అగునను నంశము-దీనియందలి యర్థ సామర్థ్యమువలన ధ్వనింపఁజేయఁబడుచున్నది. కావున నిది అర్థశక్తి మూలకమగు సంలక్ష్యక్రమ ధ్వనియగుచున్నది. ఆయాసిత శబ్దముచేత నృసింహునిగోళ్లయెదుట నీ బాలచంద్రుఁడుకాంతిహీనుఁడగుటయు, అసుందరుఁడగుటయు, ధ్వనింపఁజేయఁబడుచున్నది. నఖము లాయాసకారులగుట కూడ-సుప్రసిద్ధమేకదా: అవి-ఆయాసకారులను నంశము స్వచ్ఛత్వాది పదముల చేత పూర్వోక్తవిధమున లోకోత్తరమగు రూపమున ప్రతిపాదింపఁబడినది. కాఁగా చీల్చుట మొదలగు వానివలన ఆయాసకారులగు లౌకిక నఖములకంటె నరహరి నఖములకుఁగల వ్యతిరేకము దీనిచేత స్ఫురింపఁజేయఁబడుచున్నది.

ప్రభామతి : అవ :— " 'ప్రపన్నార్తిచ్ఛేత్తలు' అను విశేషణ సహకారముచేత-ఇంకొక వ్యతిరేకాలంకారమును, ఉత్ప్రేక్షాపహ్నుత్యలంకారమును గూడ-ధ్వనింపఁజేయఁబడుచున్నవని చెప్పుచున్నాఁడు"

లోచనము :— మఱియు, ఆ నఖములకు సంబంధించినదియగు స్వచ్ఛ తను, కుటిలమను ఆలోకించి 'నావలెనే నరసింహుని నఖములుగూడ స్వచ్ఛమును కుటిలమును అగు ఆకారముచేత తుల్యములైయున్నను, అవి-ప్రపన్నార్తి నివా రణ కుశలములు నేనట్లుగాను' అని 'బాలచంద్రుఁడు-తన మనస్సునందే (ఇతరు లకుఁదెలియనట్లు) ఖేదమును అనుభవించుచున్నాఁడు' అను నింకొక వ్యతిరేకా లంకారముగూడ ధ్వనింపఁజేయఁబడుచున్నది.

మఱియు "నే నొక్కఁడనే పూర్వకాలమున అసాధారణమును, విశద మును, హృద్యమును, అగు ఆకృతిని గలిగియుండుటవలన (నేనే) సమస్తజనాభి లాషణీయతా భాజనమనై యుంటిని. ఇప్పుడో: ఏవం విధములును, బాలచంద్రా కారములును, సంతాపార్తిచ్ఛేద కుశలములును, నగు నరహరి నఖములు పది యున్నవి. కావున లోకము-వానినే "ఇవియే-బాలచంద్రులు" అను బహు మానముతోఁజూచెదరుగాని, నన్నట్లు చూడరు" అని తలంచియో యనునట్లు బాల చంద్రుడు నిరంతరమగు నాయాసము నొందుచున్నాడు. అను నుత్ప్రేక్షాప హ్నుతి (అలంకార) ధ్వనికూడ నిందున్నదని యెఱుంగునది. కాఁగా నీ గ్రంథ మున ముఖ్యముగా నిరూపింపఁబడిన వస్తు-అలంకార-రసధ్వనులు, మూడును ఈ శ్లోకమునందున్నవని అస్మద్గురువులగు శ్రీ భట్టేందురాజచరణులు వ్యాఖ్యానించిరి.

ప్రభామతి :— "ప్రపన్నార్తిచ్ఛేత్తలు" అనునది సాభిప్రాయ విశేషణ మగుటచేత నిందు పరికరాలంకారముగూడ వాచ్యమని దీధితి చెప్పుచున్నది.

---

ప్రశ్న :— ఈ శ్లోకమునందు గ్రంథకారునకు భగవంతుడగు మధురిపుని యందుఁగలరతి (భక్తి) భావము-వ్యంగ్యమని చెప్పవలసియున్నది. రతి [భక్తి] అనునది ఒకానొక భావమై యున్నది. కావున నిచట భావధ్వని-ప్రధాన మగు చున్నది. రసాలంకార వస్తుధ్వనులు-అప్రధానము లగుచున్నవి. కావున నిచట భావధ్వనిని అంగిగాను, రసాదులను అంగముగాను, చెప్పవలసియున్నది. వ్యంగ్యమునకుఁబ్రాధాన్యమున్నపుడు అది ధ్వనియగును. ఇచట వ్యంగ్యములగు రసాలంకార వస్తువులకుఁబ్రాధాన్యము లేకుండుటవలన అవి ధ్వనులని చెప్పుట యెట్లు సంగతమగును?

ఉత్తరము :— ఈ గ్రంథమునందు రసాలంకార వస్తు ధ్వనులకు లక్ష్య లక్షణములు ప్రదర్శింపఁబడుచున్నవను విషయము-గ్రంథారంభము నందలి యీ పద్యము చేతనే సూచింపఁబడినది. తాను కారికలను రచించినప్పుడు ఈ గ్రంథ

కర్తయగు నానందవర్ధనుడు-మంగళాచరణము నొనర్పక "కావ్యస్యాత్మాధ్వనిః' అని వస్తు నిర్దేశ రూపమును, అపూర్వమును, నగు ప్రస్థానమును నొనర్చి యుం డెను. దాని వలననే యితనికి భగవత్తన్మయీ భావమున్నట్లు ప్రసిద్ధమగుచున్నది. ఒక భక్తుడు(తాను భగవంతునికంటె భిన్నుఁడుగా నున్నప్పుడు భజింపఁదగిన దేవతయందలి రతి (భక్తి) భావము - ప్రధానముగా వ్యంగ్యమగునపుడు అది- 'భావధ్వని' యని చెప్పఁబడును. భగవద్భేదభావము లేక భగవత్తన్మయీభావము గలిగిన యీ గ్రంథకర్త ఏతత్ పద్య సందర్భమున 'వః, త్రాయన్తామ్.' "మీకు అచ్ఛిన్నత్రాణ మొసఁగునవియగుఁగాతన్" అని సహృదయులనుగుఱించి ఆశీర్వాద కర్తయై యున్నాడు. కనుక ఇందు ప్రధానముగా వ్యంగ్యమగునది - భగవద్రతి (భక్తి) భావము కానేరదు. కనుక ఈ పద్యమునందలి వాక్యము - భావధ్వని పరముకాదని తోచుచున్నది. కావున లోచనోక్తములగు రసాలంకార వస్తువులే యిచటి ధ్వనులని తెలియునది.

లోచనము :— ఇప్పుడు ప్రధానముగా అభిధేయమగు ధ్వని స్వరూప మును చెప్పుచు, అప్రధానముగ ధ్వనిరూపమగు అభిధేయ జ్ఞానమును ప్రయో జనము యొక్క ప్రీతి రూపమగు ప్రయోజనమును చెప్పుచు, ఆ ప్రయోజన ప్రయోజనముతో సంబంధించిన అభిధేయ జ్ఞానరూపమగు ప్రయోజనమునుగూడ అర్థ సామర్థ్యమువలన ప్రకటించునదియగు ఆది వాక్యమును చెప్పుచున్నాడు.

[ధ్వనిలక్షణ వాక్యమునకు ధ్వని స్వరూపజ్ఞానమే ప్రయోజన మగుచున్నది. ఆ ధ్వని రూప ప్రయోజన జ్ఞానమునకు ప్రయోజనము-సహృదయ మనోరంజన మగుచున్నది.]

ఇందు ధ్వని స్వరూపజ్ఞానము - హేతువును, దానివలననగు మనఃప్రీతి (సహృదయ స్వాంత రంజనము) హేతుమంతమును, అగుచున్నది. ప్రయోజన ప్రయోజనమగు మనఃప్రీతిని తెలుపుటవలన, దానికి హేతువగు ధ్వని స్వరూప జ్ఞానముయొక్క ప్రకటనము సిద్ధించునని లోచనాశయము.

## —: సంస్కృత మూలము :—

కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యస్సమామ్నాతపూర్వ
స్తస్యాభావం జగదురపరే, భాక్తమాహుస్త మన్యే,

కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచుస్తదీయమ్,
తేన బ్రూమః సహృదయ మనఃప్రీతయే తత్స్వరూపమ్.

టీ :— కావ్యస్య = కావ్యమునకు, ఆత్మా = ఆత్మ, (ధ్వనిః + ఇతి) ధ్వనిరితి = ధ్వనియని, బుధైః = పండితులచేత, యః = ఏది (ఏ యర్థము) సమ్ + ఆ + మ్నాతపూర్వః = పూర్వము లెన్నగను, పరంపరగను, ప్రకటింపఁబడినదో, (పరంపరగాఁజెప్పఁబడుటవలన ఆమ్నాయము (వేదము)వంటిదగుచున్నదో) తస్య = ఆ ధ్వనిరూప మగు నర్థముయొక్క, అభావమ్ = లేమిని, అపరే = కొందఱు, జగదుః = చెప్పిరి. అన్యే = మఱికొందఱు, తమ్ = ఆ ధ్వన్యర్థమును, భాక్తమ్ = భక్తియగు లక్షణచేత సిద్ధించునదిగా, ఆహుః = పలికిరి, కేచిత్ = వేఱొకరు, తదీయమ్ = ఆ ధ్వనికి సంబంధించిన, తత్త్వమ్ = యథార్ధ స్వరూపమును, వాచామ్ = వాక్కులకు, అవిషయే — అందని చోట, స్థితమ్ = ఉన్నదానినిగా, ఊచుః = చెప్పిరి, తేన = ఆకారణముచేత, సహృదయమనః ప్రీతయే = సహృదయుల మనస్సులను రంజింపఁజేయుటకొఱకు, తత్ + స్వరూపమ్ = ఆ ధ్వనియొక్క స్వరూపమును, బ్రూమః = చెప్పచున్నాము.

—: మూలము :—

మ॥ ధ్వనిగా కావ్యము నాత్మమున్నె బుధజాతామ్నాతమైయుండ, నా
ధ్వనియే లేదని కొందఱందు, రది-భాక్తంబంద్రు వేరొక్క, రే
మనియున్ దానివచింపగన్ వలనుగాదంద్రొక్క, రట్లౌట నా
ధ్వనిరూపించెద మీకృతిన్ సహృదయ స్వాంతమ్మురంజింపఁగన్ ౧

ప్రభామతి :— "కావ్యమున కాత్మధ్వని" అని బుధులచేత ఎయ్యది పూర్వము గురుపరంపరచేత లెస్సగా నుపదేశింపఁబడియుండెనో, అది-లేదని కొందఱు చెప్పుదురు. (చెప్పవచ్చును). వేఱొకఱు దానిని భాక్తమని (లక్షణచే సిద్ధించునదని) చెప్పుదురు. (చెప్పవచ్చును). ఇంకొకరు ధ్వని స్వరూపమును తెలుపుటకు వీలు కలుగదని చెప్పుదురు. (చెప్పవచ్చును), కావున సహృదయ మనోరంజనము [మనఃప్రీతి] కొఱకు దాని స్వరూపమును తెల్పుచున్నాము.

మూలము :— బుధులనగా నిచ్చట కావ్య తత్త్వవేత్తలను నర్థము నెఱుంగునది. అట్టి కావ్యతత్త్వవేత్తలచేత ధ్వని సంజ్ఞితమగు నెయ్యది-"కావ్యాత్మ"అని పరంపరగా పూర్వము సమామ్నాతమై యున్నదో అది-సహృదయమనః ప్రకాశమానమై(మనోగోచరమై) ఉన్నను, లేదని కొందఱభావవాదులు పల్కుదురు. ఆయభావవాదుల కిట్టి వికల్పములు (అసత్యములగు నూహలు) సంభవింపవచ్చును.

ప్రభామతి :— కారికయందలి 'ఆత్మ' అను శబ్దమునకు వృత్తికారుఁడు 'తత్త్వ'మను నర్థమును ప్రవచించెను. 'కావ్యాత్మ-ధ్వని' అని ప్రాణికివలె కావ్యమున కాత్మకలదని కారిక తెలిపినది. కావ్యతత్త్వమే కావ్యాత్మ యని వృత్తి తెలిపినది. ఆ యాత్మ-కావ్యతత్త్వమే యగును గనుక ఆత్మ-తత్త్వ మగుచున్నది. [మానవాదులయందలి యాత్మ-దేహాదులకంటె శ్రేష్ఠమును, విశేష హేతువును అగుచుండును. అట్లె కావ్యాత్మకూడ-సారమును, వాచ్యాదులకంటె తనకును, తనకంటె వాచ్యాదులకును, వైలక్షణ్యమును గలిగించునదియు, అగు చుండుటవలన గౌణమగు నాత్మయగుచున్నది. వాచ్యాదులకంటె భిన్నమును సార మును అగు తత్త్వమే ధ్వని రూపమగు కావ్యాత్మయగుట వలన ఆత్మ పదమునకు తత్త్వమను నర్థము నిర్వచింపఁబడినదని తెలియునది.]

లోచనము :— "కావ్యాత్మ" అను శబ్దముయొక్క సన్నిధినుండుట వలన ఇచటనున్న బుధ శబ్దము-'కావ్యాత్మను తెలిసినవారు' అను నభిప్రాయ మును బోధించునను నాశయమున "బుధులచేత" అను పదమునకు కావ్యతత్త్వ వేత్తలచేత అనునర్థము వివరింపఁబడినది. 'కావ్యస్యాత్మా' అనుచోటనున్న ఆత్మ శబ్దమునకు తత్త్వశబ్దముచేత అర్థము వివరింపఁబడినది.

ఆత్మయనగా; తత్త్వమని చెప్పుటచేత యీ కావ్యతత్త్వము లౌకిక వైదిక శబ్దములచేతఁదెలుపఁబడినదియగు నర్థముకంటె విలక్షణమైనదియు, సహృదయ జన శ్లాఘ్యమగు నర్థమును దెలుపుటవలన సారమగునదియు, అగునను నంశము ప్రదర్శింపఁబడినది. 'ధ్వని-ఉన్నది, లేదు' అనునదివివాదాస్పదమగుటవలన నిశ్చయము కుదురకుండుటవలన ధ్వని-అర్థపరమగుటకు వీలు కలుగదు. కావున ("ధ్వనిరితి") "ధ్వనియని" అనుచోనున్న "అని" అను(ఇతి)శబ్ద మిచట ధ్వని శబ్దము (ధ్వని) స్వరూప పరము (సంజ్ఞాపరము) అను నంశమును తెలుపు చున్నది,

'ధ్వని శబ్దము-స్వరూప పరము' అనఁగా, 'సంజ్ఞాపరము' అను నీ యంశ మును విశదీకరించుటకే వృత్తికారుఁడు 'ధ్వనిరితి' అనుచోటనున్న 'ఇతి' పదము నకు 'సంజ్ఞితము' అను నర్థమును దెలిపెను.

ప్రభామతి :— శబ్దములన్నియు-శబ్దస్వరూప పరములును, శబ్దసంకేతి తార్థ పరములును, నగుచుండును. అయినను రచయిత యేదైననొక శబ్దమును ప్రయోగించి, దానివెనుక 'అని'-('ఇతి') అను శబ్దమును ప్రయోగించినయెడల మాత్రము ఆ మొదటి శబ్దము-స్వరూప పరమగును. అనఁగా, నది-సంజ్ఞా పర మగునని యెఱుంగునది.

"కావ్యస్యాత్మా-ధ్వనిరితి" అను ప్రకృతకారికయందు ధ్వనిపదమునకు వెనుక 'ధ్వనియని' (ధ్వనిరితి) అని, 'అని' (ఇతి) పదము ప్రయోగింపఁబడుట వలన-ఇచటి ధ్వనిశబ్దము-సంజ్ఞాపరమగు ధ్వనిశబ్దమును తెలుపునదియే యగును. కావున, 'కావ్యస్యాత్మా ధ్వనిరితి' అను నింతవఱకే గల కారికాఖండము వలన 'కావ్యమున కాత్మ-ధ్వనిశబ్దము' అను నీ యర్థము మాత్రమే లభించును.

ప్రశ్న :— కారికయందలి 'ధ్వని,యని', (ధ్వని,రితి,) అను పదములకు 'ధ్వనిసంజ్ఞితము' అను నర్థమును వివరించిన కారికాకారునిచేత కావ్యమున కాత్మ-ధ్వనిశబ్దము. (కావ్యాత్మ - ధ్వనియనుసంజ్ఞయే) అని చెప్పినట్లైనది. ['తస్య సహృదయ జనమనః ప్రకాశమానస్యాపి'] 'అది సహృదయ (జన) మనః ప్రకాశమానమైయున్నను' ('సహృదయ సాక్షికమైన యర్థమైయున్నను') అని యీ వృత్తి కారునిచేతనే యీ వెంటనే చెప్పఁబడిన తరువాతి గ్రంథ సందర్భము నకు కావ్యాత్మ-'ధ్వనిశబ్ద' మను నీ యంశము విరోధింపదా?

ఉ :— ఈ విరోధమెట్లు పరిహరింపఁబడునదియు చెప్పుచున్నాము. కావ్యాత్మ-ధ్వనిసంజ్ఞితము. అనగా; 'కావ్యాత్మ-ధ్వనిశబ్దము' అని సంజ్ఞాపరమగు నొక యర్థము-తొలుత చెప్పవలసియున్నది. సంజ్ఞాపరముగా తొలుత చెప్పఁబడిన యీ యర్థము-ధ్వనింపఁజేయబడిన యర్థమును విశ్వసింపని మనస్సుగల జనుల బుద్ధి ననుసరించి తొలుత చెప్పఁబడినది. కాని నిజమునకికావ్యాత్మ-ధ్వనిసంజ్ఞా మాత్రముగాఁ జెప్పఁబడినదికాదు. ధ్వనింపఁజేయబడిన యర్థము - సహృదయాను భూతిసిద్ధమై యుండనేయున్నది. కావున సహృదయ జన బుద్ధి ననుసరించి, తరు

వాతి గ్రంథమునకుఁగూడ సమన్వయము కుదురును. ఈ యంశమునే లోచనకర్త వివరించుచున్నాడు. చూడుడు:

లోచ :— కావ్యాత్మ-ధ్వనియను సంజ్ఞయే యని చెప్పఁబడినను, నిజమున కీ ధ్వనిపదము సంజ్ఞామాత్రముగాఁ జెప్పఁబడినదికాదు. ఇంతేమనిన; యథార్థము గనే ధ్వనివాచ్యమగు నర్థమున్నది. ఇంతియేకాక ధ్వనించునదియగు నా యర్థమే సమస్తసారభూతమగుచున్నది. ధ్వనిరూపమగునర్థము లేనియెడల కావ్యార్థ వేత్తలగు బుధులు దానినేల లెస్సగను, పరంపరగను, ఉపదేశింతురు? అను నభి ప్రాయముచేతనే వృత్తికారుడు 'ధ్వన్యమానమగు నా యర్థము-సహృదయ జన మనః ప్రకాశమానమై యున్నను' అని తరువాతి వాక్యముచేతఁ జెప్పియున్నాడు.

ప్రభా :— ధ్వని యనునది సంజ్ఞా ప్రధానముగా 'కావ్యాత్మ'యని మొదట చెప్పఁబడినను, అది (అట్లుచెప్పుట) పరమార్థముకాదు. ధ్వని శబ్దముచేత తెలుపఁ దగినదియు, శబ్దస్వరూపముకంటె వేఱైనదియు నగు, నర్థము (ధ్వనిరూపమగు నర్థము) కూడ సహృదయ హృదయ ప్రసిద్ధ మగుటవలన ఉన్నది. ఉండుటయే కాదు. అదియే కావ్యమునకుఁబ్రధానమయిన అంగియగుచున్నది, కావ్యమునం దున్న తదితర సామగ్రి యంతయుఁగూడ దాని కంగమే యగును. అది (ధ్వని) వాని యన్నింటికంటెను ఉత్కృష్టరూపమే యగుచున్నదని తెలియవలయును.

ప్రశ్న :— ధ్వనియని 'ధ్వనిరితి' అనిచెప్పిన కారికవలన కావ్యాత్మ యనఁగా, 'ధ్వనియను సంజ్ఞయే' అని చెప్పకతీరదు కదా?

ఉ :— వృత్తికారుఁడు-'ధ్వని సంజ్ఞితమగు నేయర్థము సహృదయ జన మనః ప్రకాశమై' అనిచెప్పిన వివరణమువలన ఇచటి ధ్వని శబ్దము-ధ్వనిసంజ్ఞనే కాక ధ్వనియను నర్థమునుగూడ బోధింపనని తెలియవలయును. క్రింది లోచ నముఁజూడుడు.

లోచ :— క్రింది విధమున 'అని' (ఇతి) అను శబ్దమును యోజించుట మిక్కిలి యుక్తము. [''కావ్యస్యాత్మాధ్వనిరితి'' అని మొదట ధ్వని సంజ్ఞను పరామర్శించునదగు ఇతి శబ్దమును, 'ధ్వని లక్షణోయోర్థః కావ్యస్యాత్మేతి' అని భిన్నక్రమ మొనర్చిన యెడల నది కావ్యార్థమును పరామర్శించును.] 'కావ్యాత్మ ధ్వనియని' అనిమొదట ధ్వని సంజ్ఞను చెప్పిన'అని'శబ్దము-'ధ్వనిలక్షణమగునర్థము కావ్యాత్మయని' అని క్రమ భేదమునొంది(రెండుసార్లన్వయించి)వాక్యార్థమును జెప్పును. అప్పుడు ధ్వనిరూపమగు నర్థము కావ్యాత్మయగుట సిద్ధించును.

ప్రభా: అవ:– 'ధ్వనియని' (ధ్వనిరితి) అని యోజించునపుడు కేవలమగు సంజ్ఞయే కావ్యాత్మయగున్నెడల కలుగు దోషమును దెల్పుచున్నాడు.

లోచ :— 'ధ్వనియని' (ధ్వనిరితి) అని ధ్వనిపదమునకు సంజ్ఞా మాత్రమునే యర్థముగాఁజెప్పునెడల-'ధ్వని సంజ్ఞితమగు నర్థము-కావ్యాత్మ'అని చెప్పిన వృత్తికారుని వచనము సంగతము కానేరదు. అర్థములేనిశబ్దమే-కావ్యాత్మయగు నెడల(గోవునుజూచి)ఇది-గోశబ్దమనునట్లు, 'కావ్యాత్మ-ధ్వనిశబ్దము' అని చెప్పినట్లగును. [ధ్వని-కుందేటి కొమ్మువంటిది కాదని భావము].

ప్రభా : ప్ర :— అయ్యా! 'ధ్వనిరూపమగు నర్థము వివాదాస్పదమగుట వలన ధ్వనిపదము-అర్థపరమగుట కుదురదు.' అని వెనుక వ్యాఖ్యానించి యున్నారే! విప్రతిపత్తివిషయమైన (వివాద విషయమైన) ధ్వనిరూపమగు నర్థమున్నదా!

లోచ :— విరుద్ధ ప్రతిపత్తి విషయకమగుధర్మి(ధ్వనిమొదలగునది)లేనిది కాదు. మీదు మిక్కిలి ధర్మియుండునపుడే ధర్మమాత్రకృతములగు విప్రతిపత్తులు సంభవించును.

ప్రభా :— 'శబ్దము మొదలగు నేదోయొక ధర్మియుండునెడలనే'శబ్దము-నిత్యము, శబ్దము అనిత్యము' అను నీ విధమున నిత్యత్వానిత్యత్వాది ధర్మకృతమగు విప్రతి పత్తి కలుగును. అట్లే ప్రకృతమునఁగూడ ధ్వని సంజ్ఞితమగు ధర్మి యుండునప్పుడే,ధ్వని-గుణాలంకారాదులయందంతర్భవించును,లేక అదిభాక్తము', ఇత్యాది ధర్మమాత్ర కృతమగు విప్రతిపత్తి సంభవించును' అనునది లోచనాభిప్రాయము.

ఇందలి పరమార్థమిది :— 'ఒకవస్తువు వివాదాస్పదమైనంత మాత్రమున అదిలేదని చెప్పుటకు వీలుపడదు.' అనునది ఫలితార్థము. కనుక ధ్వనింపఁజేయఁబడిన యర్థము-వివాదాస్పదమైనంత మాత్రమున అదిలేదనిగాని, ఉన్నదనిగాని, చెప్పఁగూడదు. వివాద పర్యవసానమున ఉన్నదనిగాని, లేదనిగాని, నిశ్చయింపవలెను.

లోచ :— సహృదయ జనులకు మిక్కిలి యుద్వేజనము నొంసగునదియు, అప్రస్తుతమును, నగు అతి విస్తర మింతటితో చాలింతును.

ప్రభా :— ప్రస్తుత విషయమున కుపయోగించునదియగు నప్రస్తుత విషయము కూడ కొంత చెప్పఁదగియున్నను, మిక్కిలి విస్తరించుటవలన సహృదయుల కధికోద్వేజనము కలుగును. కావున నింతటితో నీ యప్రస్తుతమును విరమింతునని భావము.

లోచ :— ' 'ధ్వనింపఁజేయఁబడిన యర్థము-కావ్యాత్మ' అనునది ఒకానొక పండితుఁడు మాత్రమే చెప్పిన యెడల అట్లు చెప్పుట-ప్రామాదికముకూడ కావచ్చును. పలువురు పండితులు 'ధ్వని-కావ్యాత్మ' అని చెప్పినపుడు మాత్రము అది ప్రామాదికము కాఁజాలదు.' అను నభిప్రాయమును నిరూపించుటకు 'బుధులచేత' అను బహువచనము ప్రయోగింపఁబడినది.

ప్రశ్న :— మే మిచట బహువచనమునకు తెలిపిన ప్రయోజనమునే వృత్తికారుఁడుకూడ-'పరంపరగా'అను శబ్దముచేత తెలిపియున్నాఁడు. కావున మేము చెప్పిన బహువచన ప్రయోజనము-కారికార్థ బహిర్భూతముకాదు. [కారికార్థమునకు వెలుపలిది కాదు.]

లోచ :— 'పరంపరగా' అనఁగా; అవిచ్ఛిన్నమగు ప్రవాహ రూపముచేత-ఆ బుధులీయంశమును జెప్పియున్నారు. విశిష్ట పుస్తకములందు లేఖనము లేకున్నను, వారు పరంపరగాఁజెప్పిరని భావము. తత్త్వవేత్తలగు బుధులు పెక్కురు-ఆదరింపఁదగని వస్తువును ఆదరముతో నుపదేశింపరు. 'కావ్యాత్మ-ధ్వని' అనునంశమును వారాదరముతో నుపదేశించియున్నారు. అను అంశము. 'సమామ్నాతపూర్వః' అను కారికచేత చెప్పఁబడినది.

ప్రభా :— పుస్తకమునందు లిఖింపఁబడిన అర్థము-వ్యవధానము కలది కావచ్చును. విద్వత్పరంపరామాత్రమును సమాశ్రయించిన అర్థము - వ్యవధానము కలది కానేరదు. 'ఈ యర్థము - కావ్యతత్త్వ విధులచేత అవిచ్ఛిన్న ప్రవాహరూపమున సాక్షాదుపదేశ ప్రసిద్ధమైయున్నది. కావున విశ్వసింపఁదగనిది కాదు' అను నంశము నిరూపించుటకు 'సమామ్నాత పూర్వః' అను కారికార్థమును నిరూపించుచున్నాఁడు.

లోచ :— 'పూర్వము బుధులచేత చక్కఁగను, అవిచ్ఛిన్నముగను, (ధ్వని) ప్రకటింపఁబడినది' అని దీని యర్థము. పూర్వశబ్ద గ్రహణముచేత 'దీనిని మేమే మొదట చెప్పినవారముకాము.' అను నంశము దీనివలన స్పష్టపడు

చున్నది. దేనిని పొందుటకు మీదు మిక్కిలి ప్రయత్నింపఁదగునో, ఆ ధ్వని స్వరూపము లేదను సంభావన-యుక్తమైనది కాదు. అయినను అభావవాదులకుఁ గల మౌర్ఖ్యము అపారమైయున్నది. దానికేమి చేయుదుము!. కారికయందుఁగల 'జగదుః' అను లిట్ ప్రయోగ సామర్థ్యమువలన ఈ అభావవాదము - పరోక్షమును, భూతమును, అనద్యతనమును, అగునను నంశము తెలియఁబడుచున్నది. అయినను 'మేమీ అభావవాదుల వికల్పములను వినియుండిన వారముకాము. అయినను వారిట్లు చెప్పవచ్చును.'అని ఊహించి చెప్పఁబడిన సంభావనలే దూషింపఁబడుచున్నవి. కనుక యీ వికల్పములు-పరోక్షములేయగును. మఱియు భవిష్యద్వస్తువును దూషించుట యుక్తముకాదు. ఏలయనిన అదియింకను బుట్టి యుండలేదు కదా!

ఆయ్యా! ఆ భవిష్యద్వస్తువును గూడ బుద్ధియందారోపించి దూషింప వచ్చును గదా! అనిన అప్పుడా బుద్ధ్యారోపిత వస్తువు-భవిష్యత్తుకాఁజాలదు. కనుక ప్రాతిభాసికమును, భూతకాల విశిష్టమును అగు లిట్ ప్రయోగావలంబనమును గూడ-వాస్తవముగా స్వీకరింపఁదగదు, అని తెలియవలయును.

ప్రభా : అవ :- వృత్తికారుఁడు కూడ-మీవలెనే లిట్ ప్రయోగమును సమర్థించెనా? అని ఆశంకించుచున్నాడు.

లోచ :— వృత్తికారుడు 'కొందఱిట్లనవచ్చును' అని కొన్ని యూహలను సంభావించి-మున్ముందు దూషించును. ఆ సంభావనా ప్రదర్శనము-కారికా కారుఁడొనర్చిన 'లిట్' ప్రయోగమును వ్యాఖ్యానించుటకే వృత్తికారుడొనర్చెనని తెలియునది.

ప్రభా :— కాఁగా వృత్తికారుఁడు గూడ మావలెనే లిట్ యోగమును సంభావనా పరముగనే (ఊహగానే) సమర్థించెనని తెలియునది.

లోచనము :— ఈ సంభావనలుకూడ (ఊహలుకూడ)సంభవింపనివి కానేరవు. అసలే సంభవింపని సంభావనలను ప్రదర్శించినయెడల-ఆ సంభావనలకును, (వికల్పములకును)వాని దూషణములకును,అంతము లేకపోవలసివచ్చును. కనుకనే 'ధ్వన్యభావ వాదులకు ఈవికల్పములు సంభవించుచున్నవి.'అని వృత్తికారుడు సంభవించునవియగు సంభావనలనే (ఊహలనే) సమర్థించియున్నాడు. 'సంభావనలు-సంభావింపబడును.' (ఊహలు-ఊహింపబడును) అని చెప్పినయెడల

చెప్పిన దానినే చెప్పినట్లగును. కనుకనే వృత్తికారుడు సంభవింపదగిన సంభావనలనే సంభవించుచున్నవని చెప్పియుండెను. సంభవించుట కూడ-సంభావన కానేరదు. ఇంతేమనిన వర్తమానమే యగును. కావుననే వికల్పములు సంభవించుచున్నవి.' అని ఆ వికల్పములయొక్క సంభవము-వర్తమాన కాలముచేతనే నిర్దేశింపబడినది.

ప్ర :— సంభవించునదియగు సంభావనచేత (ఊహచేత) సంభావితమగు ఊహింపఁబడిన) వస్తువును దూషించుటకు వీలు కలుగునా?

ఉ :— సంభావితమగునట్టి వస్తువు-పరమార్థ సత్యమే యయి సంభవించునది కాదు. ఇంతేమనిన; ఊహింపబడిన ఈ యభిప్రాయములు-అసత్యములగుచునే సంభవించును. ప్రస్తుతము కావ్యాత్మయగు ధ్వని స్వరూప విషయమున విరుద్ధముగా కల్పింపఁబడిన ఈ వికల్పములు (సంభావనలు) సంభవించినను, ఇవి సత్యమైనవి కావని తెలియునది. ఇవి తత్త్వజ్ఞానము లేకుండుటవలన స్ఫురించునవియే, అనఁగా, ఈ పక్షములు-భ్రాంతికల్పితములేయగును. కనుకనే 'కొందఱిట్లన వచ్చును' అని వృత్తికారునిచేత కావింపబడిన సంభావనావిషయములగు 'లిఙ్' ప్రయోగములు—అతీతమగు ఆ పరమార్థమునందే పర్యవసించుచున్నవి. అనఁగా,-భూతకాలమును బోధించుటయందే పర్యవసానము నొందుచున్నవి అని భావము.

ప్రభా :— 'ఆచక్షీరన్' అనుచోటనున్న 'లిఙ్' ప్రయోగముచేత వృత్తికారుఁడు వ్యాఖ్యానించినది-'జగదుః' అనికారిక యందున్న 'లిట్' ప్రయోగమే అగుచున్నది. లోచనకారుఁడొనర్చిన వ్యాఖ్యానము-వృత్తికారునకు అంగీకారము కానిది కాదు. కనుక వృత్తికారాభిప్రాయమునే లోచనకారుడు వ్యాఖ్యానించెనని తెలియునది. సంభావనా బోధకమగు 'లిఙ్' భూతకాలమును నిర్బాధముగా బోధించునను నంశమును దృష్టాంతీకరించుటకు లోచనకారులు క్రింది శ్లోకమును నుదాహరించుచున్నారు.

లోచనము :— 'యదినామాఽస్యకాయస్య యదన్తస్తద్ బహిర్భవేత్
దణ్డమాదాయ లోకోఽయంశునోకాకాంశ్చవారయేత్'॥

'ఒకప్పుడు ఈ శరీరమునకు లోపలనున్న మాంసాదికము-వెలుపలనుండిన యెడల (ఉండుట సంభవించెనేని) ఈ ప్రాణులు వానిని భక్షించుటకు వచ్చిన

కుక్కలను, కాకులను, తోలుకొనవలసివచ్చును' అను నిచట సంభావనా విషయ మగు (బహిర్భవేత్) 'వెలుపల నుండినయెడల' అను క్రియచేత భూతకాలికమగు నర్థమే ప్రకాశింపఁజేయఁబడినదని తెలియునది. ఇట్లే

శ్లో॥ 'యదినస్యాత్ తతః కింస్యాత్'

శరీరములోనున్న మాంసాదికము వెలుపల లేకుండినయెడల. అప్పుడుకూడ ఫలమే ముండును? (అప్పుడుగూడ అతిజుగుప్సితమగు నీ శరీరము-వ్యర్థములగు విషయములను మాత్రమే అనుభవించుటకు ఉపయోగించుటవలన నిష్ఫలమే అగునని భావము.) కాగా 'యదినామాస్య' అను విధిస్థలమునందువలె 'యది నస్యాత్' అనునిషేధస్థలమునందుఁగూడ 'లిఙ్లకు' సంభావనయే అర్థమగును. కావున అధికమగు నీ యప్రకృతము నింతతో విరమింతుము'

ప్రభామతి :— వివిధములగు కల్పనలుగాని, విపరీతములగు కల్పనలు గాని, వికల్పములని చెప్పఁబడినవని లోచనకారుని అభిప్రాయము.

'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యోవికల్పః'

'శబ్ద జ్ఞానము ననుసరించునదియు, వస్తువులేనిదియు, నగు నభిప్రాయము వికల్పము'అని పతంజలి-యోగసూత్రమున సూత్రీకరించెను. వస్తు శూన్యమై సంభవించునది వికల్పమనునది ఫలితార్థము. అభావవాదులకు స్ఫురించునవియగు వికల్పములు-సంభావనా మాత్రములే-(ఊహామాత్రములే) అగుచున్నవి. 'కొంద ఱు ధ్వని లేదని చెప్పిరి. అని కారికాకారుడు చెప్పిన భూతార్థకములగు 'జగదుః' 'ఆహుః' 'ఊచుః' అను క్రియలు-సంభావనా పరములే-అనఁగా ఊహించి చెప్పి నవే-కాని ఆ సంభావనలు విని చెప్పినవికావు' అనిచెప్పుటకు ఈ వికల్పములను సంభావనా పరములగు'లిఙ్'ప్రయోగములచేత వృత్తికారుఁడు నిరూపించెనని తెలి యునది. ఈ'లిఙ్' ప్రయోగములు-సంభావనా ద్వారమున 'ఈ వికల్పములు-పరో క్షములును, భూతకాలికములును, అనద్యతనములును, నగును' అను నంశమునే తెలుపుచున్నవని తెలియునది. 'సంభావనను బోధించునదియగు లిఙ్చేత భూత కాలము బోధింపఁబడుననుట విరుద్ధముగాదు' అని చెప్పుటకు 'యదినామాస్య' అను శ్లోకమునందలి 'భవేత్' అను సంభావనాపరమగు క్రియకుఁగల భూత కాలార్థ బోధకత్వము తెలుపఁబడినది. అనునది ఈ విచారణయొక్క ఫలితార్థమని పాఠకులు గ్రహింపఁగోరెదను. సులభముగాఁదెలిసికొనుటకుగాను, మొదట వికల్ప ముల తాత్పర్యమును లోచనకారుఁడు ప్రదర్శించుచున్నాఁడు. చూడుఁడు.

లోచనము :— (1) సంకేత సహకారముచేత శబ్దము-అర్థమును ప్రతి పాదించును. కనుక మీరు క్రొత్తగా నిరూపింపఁదలఁచిన ధ్వనినిగూడ సంకేతితార్థమును బోధించునదియగు శబ్దమే ప్రతిపాదించును. ఈ కారణముచేత[శబ్దము సంకేతితమగు నర్థమును బోధించునది యగుటచేత] వాచ్యముకంటె భిన్నమగు [సంకేతితార్థవ్యతిరిక్తమగు] వ్యంగ్యములేదు. (2) ఒకప్పుడు వాచ్యముకంటె భిన్నమగు వ్యంగ్యార్థమున్నను, అది అభిధావృత్తిచేత ఆక్షేపింపబడును. అనఁగా; అభిధాపుచ్ఛభూతమగు లక్షణావృత్తిచేత బోధింపఁబడును. అది ఇట్లు శబ్దముచేత తెలియఁబడిన అర్థముయొక్క బలమువలన ఆకర్షింపబడుటవలన భాక్తమగును. [ముఖ్యార్థభంగము కలుగునపుడు లక్షణా వృత్తిచేత లభించునది అగు నర్థము-భాక్తము అని చెప్పఁబడును.] (3) అభిధావృత్తిచేత ఆక్షేపింపఁబడునది కూడఁగాకయే,అనఁగా;అభిధకు తోకవంటిదగు లక్షణచేత తెలుపఁబడినది కూడఁగాకయే, వ్యంగ్యమగు నర్థముండినయెడల-భర్తృసమాగమ సుఖము నెఱుఁగని కుమారికలకు భర్తృసుఖము చెప్పుటకు శక్యముగానట్లు, దానిని (వ్యంగ్యమును) అట్టిది-ఇట్టిది అని చెప్పుటకు (తెలియుటకు) పండితులకుఁగూడ శక్యము కాకుండును. కనుక ప్రధానములగు విప్రతిపత్తి (వికల్ప) భేదములు మూడే యగును. అయినను అందు మొదటిదగు ధ్వన్యభావవికల్పము [ఒక్కటియే] త్రివిధమగుచున్నది.

ప్రభామతి :— శబ్దము-మిక్కిలి అసత్యమగు నర్థముయొక్క జ్ఞానమును గూడఁగలిగించును, కనుక 'కొందఱిట్లనవచ్చును' (ఆచక్షీరన్) అని యిట్లు చెప్పఁబడిన వికల్పములు (ధ్వనిలేదని చెప్పిన విరుద్ధములగు నభిప్రాయములు) నిజమైనవికాకున్నను, సంభావనామాత్రజీవనములైయుండుట-సంభవింపవచ్చును. కనుక ఆవికల్పముల ముఖ్య తాత్పర్యమును లోచనకారుడు మొదటనే ఇట్లు చెప్పుచున్నాఁడు. ఆ విప్రతిపత్తులు (వికల్పములు - విరుద్ధాభిప్రాయములు) ప్రధానముగా మూడే అగుచున్నవి. అందు మొదటివిప్రతిపత్తి యిది. శబ్దము-సంకేతముచేతనే అర్థమును బోధించును. కనుక సంకేతముచేత లభించునది యగు వాచ్యార్థముకంటె వేరయినదేదియు నుండదు. కనుక, ధ్వనిరూపమగు (ప్రధానవ్యంగ్య రూపమగు) నర్థము-లేదు.

రెండవ విప్రతిపత్తి-యిది :— వాచ్యముకంటె వేరొక యర్థమున్నను-అదికూడ అభిధాపుచ్ఛ భూతమగు లక్షణా వృత్తిచేత శబ్ద బోధ్యమగు నర్థముయొక్క బలముచేతనే లాగుకొని రాఁబడినదియగును. కనుక అదియు భాక్తమే ]లక్ష్యార్థమే] అగును.

మూడవ విప్రతిపత్తి-యిది :— 'ఇట్లు, అభిధా ప్రతిపాద్యమును, [అభిధేయమును, అనఁగా వాచ్యమును,] అభిధచేత ఆక్షిప్తమును, (అనఁగా; లక్ష్యార్థమును) గూడఁగాక-యేదైన నర్థము-ఉండినయెడల అది-అనిర్వాచ్యమే = చెప్పుటకు వీలుకానిదే, కావలసివచ్చును.' మూలకారికయందుఁ జెప్పఁబడుటవలన ప్రధానములగు వికల్పములు-ఈ మూడే యగునని తెలియునది.

ప్రభామతి : అవ :— 'వాచ్యముకంటె భిన్నమగు వ్యంగ్యములేదు' అను ప్రథమవికల్పమునందే-మూడు ప్రకారములను క్రమముగాఁదెలుపుచున్నాఁడు.

లోచనము :— గుణములు, అలంకారములు; అను నీ రెండును-శబ్దములకును, అర్థములకును, గూడ సంబంధించి యుండును. కనుక, గుణాలంకారములే-శబ్దార్థములకు శోభనొసఁగును. కనుకనే, లౌకిక-వైదిక శబ్దార్థములకంటె కావ్య శబ్దార్థములు-సుందరములగుచుండును. కాఁగా; లౌకిక వైదిక శబ్దార్థ వ్యతిరిక్త సుందర శబ్దార్థమయమగు కావ్యమునకు శోభ నొసఁగునది-ఈ గుణాలంకారముల కంటె వేఱగునది, మేె మెఱుఁగనిది, ఇంకేదియు నుండదు.

ప్రభామతి :— 'శబ్దగుణములు, అర్థగుణములు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు, అనునవి మాత్రమే-కావ్యమునకు శోభను సంఘటించును. కనుక-ఈ గుణాదులకంటె వేరైన కావ్య శోభా హేతువు-ఏదియు నుండదు-అది-మే మెఱుఁగకుండుటవలన ప్రమాణసిద్ధము కాకున్నను, మీ కభిమతమగుటవలన నిషేధించితిమి.'అనునిది-ధ్వన్యభావవాది వికల్పములు మూడింటిలోను, మొదటిది.

లోచనము :— 'మాకు తెలియని దేదయినను [మీరు చెప్పుచున్న వ్యంగ్యమను నర్థము] ఉండినను, అది కావ్యమునకు శోభ నొసఁగునది కానేరదు' అనునది-మొదటిదగు ధ్వన్యభావ వికల్పమునందలి ద్వితీయభేదము.

ప్రభామతి :— 'గుణాలంకారాదులకంటె వేఱుగా మే మెఱుగనిదియు, మీ కభిమతమగునదియు, నగు నర్థమున్నను; అది కావ్యమునకు శోభనొసఁగునది యెంతమాత్రము కానేరదు.' కనుక కావ్య శోభాకారికాని యేదో యర్థమున్నను, అది-లేనిదేయగును-అనునది-మొదటిదగు అభావవాదమునందలి రెండవ వికల్పము.

అవ :— 'గుణాలంకారాది భిన్నమగు వ్యంగ్యము-కావ్య శోభాకారిగా నుండుట మాకు స్వానుభవసాక్షికమగుచున్నది. దానిని మీరెట్లు కప్పిపుచ్చగలరు' అని ధ్వనివాది ప్రశ్నింపవచ్చునని యాశంకించి-ధ్వన్యభావవాది-చెప్పుచున్నాఁడు.

లోచనము :— అది శోభాకారియగు నెడల, అప్పుడది-గుణములందుఁ గాని, అలంకారములందుఁగాని, మే మిదివఱకు చెప్పిన వానియందే, అంతర్భ వించును.

ప్రభామతి :— మీరు వ్యంగ్యమనునది-కావ్యశోభాకారి అగునెడల, అది గుణమో, అలంకారమో, అగును కాని వానికంటె వేఱగునదికాదు.

అవ :— ' 'ధ్వని' అనునొక పేరున్నది-కనుక భేదము సిద్ధించు'నని యా శంకించి చెప్పుచున్నాడు.

లోచనము :— గుణమునకో-అలంకారమునకో, 'ధ్వని' అని క్రొత్త పేరు-వేఱొకటి పెట్టినంతమాత్రమున మీకుఁగలిగిన మహా పాండిత్యమేమున్నది? [మీకు దీనివలన నూతన తత్త్వదర్శిషలను పేరు కలుగనేరదని భావము].

ప్రభామతి : ధ్వనివాది :— మేము 'ధ్వని' అను నామాంతరమును క్రొత్తగా సంధించితి మనుకొనుచున్నారు. కాని మేము ఈ పేరు పెట్టుటకు నిమి త్తమున్నది. మేము చెప్పిన ధ్వని-మీరు చెప్పిన ఏ గుణమును, ఏ యలంకార మును, గాకయే యున్నది. కనుక, మీరుచెప్పిన గుణాదులకే-మేము క్రొత్తపేరు పెట్టిన వారముకాము.

అభావవాది :— విచ్ఛిత్తి (సౌందర్య) భేదము లసంఖ్యాకములుగా నుండును. కనుక పూర్వాలంకారికులు చెప్పిన గుణాలంకారములలోచేరని యేదో గుణ విశేష లేశమునో, అలంకార విశేషమునో, స్వీకరించి-ధ్వనివాదులగు మీరు-దానినే 'కావ్య జీవితమగు ధ్వని' యనుచున్నారు. కాని మీరుచెప్పిన ధ్వని-గుణా లంకారములకంటె వ్యతిరిక్తముగా నుండునది కానేరదు. ఏదో-గుణ విశేష లేశ మునో, అలంకార విశేష లేశమునో, మీరు గ్రహించి-దానికి (కావ్య జీవితమగు) 'ధ్వని'యని వేరొక క్రొత్తపేరు పెట్టినంతమాత్రమున మీరు సంపాదింపఁగలిగిన పాండిత్య మేమున్నది? మీరు స్వీకరించిన వైచిత్ర్యమువంటి యింకొక వైచిత్ర్య ము నింకొకఁడూహింపవచ్చును. చిరంతనులగు భరతముని ప్రభృతులు-యమక మును, ఉపమను, మాత్రమే శబ్దార్థాలంకారములుగా నంగీకరించియుండిరి. అయి నను, తరువాతి ఆలంకారికులు వానినే ప్రపంచించి,(విస్తరించి)నిరూపించిరి గదా!

మూడవ అభావవాది :— 'మేము చెప్పిన గుణాలంకారముల లోపలనే చేరఁదగిన ఏదో విశేషలేశమును స్వీకరించి-మీరది కావ్యజీవితమైన ధ్వని అని చెప్పుచున్నారు. భరతముని మొదలగువారు-ఇప్పుడున్నన్ని గుణములనుగాని, అలంకారములనుగాని, చెప్పియుండలేదు. అయినను తరువాతి యాలంకారికులు-అనేకములగు నలంకారములను; అనేకములగు గుణములను, విస్తరించి-నిరూపించిరి గదా! అంతమాత్రమున వారు క్రొత్త విషయమును కనిపెట్టిన వారగుదురా?' అను నభిప్రాయమున-అభావవాది-ధ్వనివాదిని క్రింది తీరున నాక్షేపించుచున్నాఁడు.

లోచనము :— 'కర్మణ్యణ్-అనుచోట 'కుంభకారుఁడు' మొదలగు నుదాహరణములు విని-కొందఱు వానివలెనే-నగరకారుఁడు, మొదలగు శబ్దములను ఊహింపవచ్చును. అంతమాత్రమున వారికిఁగలిగిన బహుమాన మేముండును? ఇట్లే-ప్రకృతమునందుఁగూడ-ఏ యలంకార విశేషమునో, మీరుగూడ స్వీకరించి-దానికి ధ్వని అనుపేరు పెట్టినంత మాత్రమున అది మీకు పాండిత్య సంపాదకము కానేరదు' అను నిది-ధ్వనిలేదను నభావవాదమున మూడవదియగు విప్రతిపత్తి. కాఁగా; మొదటి యభావవాద వికల్పము-మూడు వికల్పములను గలిగియున్నది. మిగిలిన వికల్పములు : (భాక్తతావాదము, అనిర్వచనీయతావాదము) రెండగుచున్నవి. అనునిది-వృత్తి గ్రంథముయొక్క తాత్పర్యము. ఈ వికల్పము లైదింటిని-వృత్తికారుడు క్రమముగాఁ జెప్పుచున్నాడు.

మూలము :— అందు (ఈ విషయమున) కొందఱిట్లన వచ్చును. కావ్యము-శబ్దార్థ శరీరమేగదా! తత్సౌందర్య కారణములగు-అనుప్రాసాదులు శబ్దగతములగుట ప్రసిద్ధమే! ఉపమాదులు-అర్థగతములు. మాధుర్యాదులు-వర్ణ సంఘటనా ధర్మములుగా ప్రతీతము లగుచున్నవి.

లోచనము :— 'కావ్యమునకు శబ్దార్థములు శరీరము' అను విషయమున ధ్వనివాదికిఁగాని, ఇంక నెవ్వరికిఁగాని, భిన్నాభిప్రాయ ముండదనుటకు వృత్తికారుడు, 'కదా' (తావత్) అని చెప్పియుండెను. శబ్దార్థములు-ధ్వనికావుకదా! కనుక, ఆ శబ్దార్థములకే-'ధ్వని' అని పేరు పెట్టినంతమాత్రమున మీకు గుణమేదియు (ఘనతఏదియు) కలుగనేరదు.

ప్రభామతి :— 'శబ్దార్థములు-ధ్వనికావు'-అని ముందుగా నిరాకరింపని యెడల, శబ్దార్థముల నాశ్రయించిన గుణాలంకారాదులు-'ధ్వనికావు' అని నిరాకరించుట-కుదురదు. కావున-'గుణాలంకారములు ధ్వనికావు' అని నిర్ణయించుటకు ముందు-'శబ్దార్థములు ధ్వనికావు' అని నిరాకరించుచున్నాఁడు. ధ్వనివాదులు, 'కావ్యాత్మ-ధ్వని' అని చెప్పుచున్నారు. శబ్దార్థములు-కావ్యమునకు శరీరమే అగుచున్నవి. కనుక-'శబ్దార్థములే-కావ్యాత్మ' అని చెప్పుట-ధ్వనివాదులకు సమ్మతము కానేరదు. కనుక, ఆ శబ్దార్థములకే 'ధ్వని' అను సంజ్ఞనుంచుట-వ్యర్థ ప్రయాసమే అగుననునది లోచనాభిప్రాయము.

లోచనము :— 'అయ్యా! శబ్దార్థములకు సౌందర్యమును గలిగించునది ధ్వని' అని చెప్పుదురా? అది యుక్తము కానేరదు. సౌందర్యము-గుణాలంకార కృతమగును. కావున గుణాలంకారములకంటె వేరైనదేదియు 'ధ్వని' అనునది కాఁజాలదు. సౌందర్యము ద్వివిధమై యున్నది. అందు-మొదటిది - స్వరూప మాత్రమునందుండునది. రెండవది-సంఘటన (రచన) నాశ్రయించునది-శబ్దాలంకారములవలన శబ్దములకు-స్వరూపమాత్రకృతమగు సౌందర్యము కలుగును. శబ్దగుణములవలన శబ్దములకు సంఘటనాశ్రితమగు [సంఘటనను ఆశ్రయించునదియగు] సౌందర్యము కలుగును. ఇట్లే-ఉపమాదులవలన (అర్థాలంకారములవలన) అర్థములకు స్వరూపమాత్రనిష్ఠమగు సౌందర్యము కలుగును. అట్లే-అర్థగుణములవలన అర్థములకు సంఘటనాశ్రితమగు (కూర్పు నాశ్రయించునదియగు) సౌందర్యము కలుగును. కనుక, శబ్దార్థములకు సౌందర్య హేతువులగు గుణాలంకారములకంటె వేరైన ధ్వనియేదియు లేదు.

ప్రభామతి :— శబ్దములకు-తమ స్వరూపమునందుండునదియగు సౌందర్యము-అను ప్రాసాదులగు శబ్దాలంకారములవలనఁగలుగును. సంఘటన యనఁగా; రచన, లేక-కూర్పు.శబ్దములకు తమ సంఘటన (రచన) యందుండునదియగు సౌందర్యము-శబ్దగుణములవలన నేర్పడును. ఇట్లే-అర్థములకు తమ స్వరూపము నందుండునదియగు సౌందర్యము-ఉపమాదులగు అర్థాలంకారములవలన సిద్ధించును. ఇట్లే-అర్థములకు తమ కూర్పునందు (సంఘటనయందు) ఉండునదియగు సౌందర్యము-అర్థగుణములవలన సంభవించును. కనుక-'ధ్వని' అనునది-కావ్య సౌందర్య హేతువగునెడల నది-(ధ్వని) గుణమో, అలంకారమో కావలెను. అది-(ధ్వని) గుణాలంకారములకంటె వేఱైనదగు నెడల దాని ఉనికి (ధ్వన్యస్తిత్వము) అంగీకరింపఁదగినది కానేరదు.

లోచనము :— 'ఏది-గుణలంకారములకంటె వేరైనదో, అది-సౌందర్య కారికాదు. కనుక నిత్యదోషములగు 'అసాధుత్వము' మొదలగు వానివలెను, అనిత్య దోషములగు 'దుఃశ్రవత్వము' (శ్రుతి దుష్టత్వము) మొదలగు వానివలెను, గుణాలంకారములకంటె వ్యతిరిక్తమగునది యేదియుఁగూడ-కావ్య సౌందర్య హేతువు కానేరదు. కనుక, మీరు చెప్పిన ధ్వని-కావ్య సౌందర్య హేతువగునెడల; అది-గుణాలంకారవ్యతిరిక్తము కాదు అను వ్యతిరేక హేతువు నిచట స్వీకరింపవలెను.

ప్రభామతి :— వ్యాకరణ లక్షణ విరుద్ధమగు అసాధుత్వదోషము కావ్యము నందంతటను విడువఁదగినది. కనుక నిత్యదోషమని చెప్పఁబడినది. దుః శ్రవత్వ మనఁగా; శ్రుతి దుష్టత్వమను దోషము. కావ్యమునందు-శృంగారాదిరసము-ప్రధానమగునపుడు, ఈ దోషము విడువఁదగినది. రౌద్రాదిరసము-ప్రధానమగునపుడు మాత్రము-విడువఁదగినది కాదు. కనుక నిది-అనిత్యదోషమని చెప్పఁబడినది. ఈ దోషములు రెండునుగూడ-కావ్యమునకు సౌందర్యమును గలిగించునవి కానేరవు-కనుక గుణాలంకారములకంటె వ్యతిరిక్తములగు అసాధుత్వ శ్రుతి దుష్టత్వదోషములవలె-గుణాలంకార వ్యతిరిక్తమగు నెడల మీరుచెప్పిన ధ్వనికూడ-కావ్యశోభా కారణము కానేరదు. కనుక ధ్వనివాదులు చెప్పునదియగు 'ధ్వని-గుణాలంకార వ్యతిరిక్తము కాదు' అని, వ్యతిరేక హేతువు నిచట గ్రహింపవలయును.

లోచనము : ధ్వనివాది యడిగిన ప్రశ్న :— వృత్తులు, రీతులు, గుణాలంకారములకంటె వేరయియున్నను, కావ్య సౌందర్య హేతువులుగూడ నగుచున్నవి గదా! అట్లే ధ్వనికూడ-గుణాలంకార వ్యతిరిక్తమును, కావ్య సౌందర్య కారణమునుగూడఁగావచ్చును, కనుక నిచ్చట వ్యతిరేక హేతువు సిద్ధించునదికాదు.

అభావవాది చెప్పిన ఉత్తరము :— ఈ వ్యతిరేక హేతువు సిద్ధింపనిది కాదు. (సిద్ధించునదియే యగును) వృత్తులు-రీతులు-గుణాలంకారములకంటె వేరుకావు. కనుకనే అభావవాదమును దెలుపుచున్న వృత్తికారుఁడు-తదనతిరిక్త వృత్తులయినను'' అని చెప్పుచున్నాఁడు చూడుఁడు!

ప్రభామతి :— 'ఏది-గుణలంకారములకంటె వేరయినదో, అది-సౌందర్య కారికాదు' అను వ్యతిరేకవ్యాప్తి, గుణాలంకారములకంటె వేరయి సౌందర్య హేతువులుగా నంగీకరింపఁబడిన వృత్తి-రీతులయందు (వ్యభిచరించుట)

(నియమము తప్పిచరించుట) వలన సిద్ధించునది కానేరదు. అని యాశంకింపనక్కఱ లేదు.'అసలీరీతులు-వృత్తులు, గుణాలంకారములకంటె అతిరిక్తములు(వేఱయినవి) కావు.' అని ధ్వన్యభావవాది ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు, చూడుఁడు.

మూలము :— తదనతిరిక్త వృత్తులయినను (శబ్దాలంకారములగు ననుప్రాసములకంటె వేఱుకాని వ్యాపారములైనను) (అనుప్రాసముల వ్యాపారములకంటె వేఱుకాని వ్యాపారములు గల వయినను) కొందఱు ప్రకాశింపఁజేసిన "ఉపనాగరిక" మొదలగు వృత్తులుకూడ-శ్రవణ గోచరములయినవి. ఇట్లే-తదనతిరిక్త వృత్తులయినను (గుణములకంటె వేఱుకానివైనను) కొందఱు ప్రకాశింపఁజేసిన "వైదర్భి" మొదలగు రీతులుగూడ-శ్రవణగోచరములయినవి.వీని యన్నిఁటికంటెను శబ్ద-అర్థ-గుణాలంకార,తదనతిరిక్త వృత్తిరీతులకంటెను) వేఱయిన ధ్వని నామకమగునిది-యేది? (ఈ ధ్వని పేరుగలది యేది?)

లోచనము :— వృత్తులు-రీతులు-గుణాలంకారములకంటె వ్యతిరిక్తములు (వేఱయినవి) అగుట-సిద్ధించునదియే కాదు.

ప్రభామతి :— 'వృత్తి-రీతులలో మొదటివగు వృత్తులు-శబ్దాలంకారములగు అనుప్రాసములయందే అంతర్భావము నొందును.' [చేరును] అని అభావ వాది పక్షమును వృత్తికారుఁడు-చెప్పుచున్నాఁడు.

లోచనము :— శబ్దాలంకారములగు అనుప్రాసములే - దీప్తముగను' (దీప్తములగు పరుష వర్ణములతోను) మసృణముగను. (మధుర వర్ణములతోను) మధ్యమముగను, (మధ్యమ వర్ణములతోను) వర్ణింపఁదగిన రౌద్రాది రస విభావ విశేష విషయములందు-ఉపయోగించుటచేత త్రివర్గములగుచున్నవి. అప్పుడు-పరుషము; లలితము, మధ్యమము, అగు వీని స్వరూపమును వివేచించుటకును, వీనిని మూడు వర్గములుగా విభజించుటకును, ఈ అనుప్రాసజాతులే-వృత్తులుగా పేర్కొనఁబడినవి, 'వర్తన్తే అనుప్రాసభేదాః ఆసు' అనుప్రాస విశేషములు-పరుష-లలిత-మధ్యమ-వర్ణ వృత్తులగు నీజాతులయందుండునవి-కనుక వీనికి-వృత్తులని పేరు కలిగెనని తెలియునది.

ప్రభామతి :— 'రౌద్రము' మున్నగు రసము-వ్యంజనీయ (ప్రకాశ నీయ) మగునపుడు దాని కుచితమగు విభావాది విషయమును-దీప్త (పరుష) వర్ణ ములతో వర్ణింపవలయును. కనుక నచ్చట-పరుష వృత్తియగు (పరుష వర్ణము లందుండునదియగు) అనుప్రాసమే నిబంధింపఁదగినది. శృంగారాది రసము వ్యంజనీయమగునపుడు తదుచితమగు విభావాదికమును-మసృణముగ (మధుర వర్ణముగ; అనఁగా; లలిత వర్ణముగ) వర్ణింపవలయును. కనుక నచ్చట లలిత వర్ణ వృత్తియందగు-మసృణానుప్రాసమునే (లలితానుప్రాసమునే) నిబంధింప వల యును. హాస్యాది రసము ప్రకాశింపఁజేయఁబడునపుడు పరుష వర్ణ వృత్తియుఁ లలిత వర్ణ వృత్తియుఁగాక-మధ్యమ వర్ణ వృత్తియగు-మధ్యమానుప్రాసమునే- నిబంధింపవలయును. 'ఇది-పరుషవర్ణ వృత్తియగు (పరుష వర్ణములందుండు నది యగు) పరుషానుప్రాసము. ఇది-లలిత వర్ణ వృత్తియగు లలితానుప్రాసముఁ ఇది-మధ్యమ వర్ణ వృత్తియగు మధ్యమానుప్రాసము' అని-వీని స్వరూపమును వేఱు వేఱుగాఁ దెలిసి కొనుటకును, అనంతములగు వీనిని-మూఁడు వర్గములుగా విభజించు టకును, ఈ అనుప్రాసములకు ఆశ్రయములగు (అనుగ్రాహకములగు) జాతులే వృత్తులని చెప్పఁబడినవి. ఇట్లు-ఈ పరుషాది వృత్తులు-శబ్దాలంకారములగు అనుప్రాసములకంటె వేఱగుట సిద్ధింపకుండుటవలన వ్యతిరేకవ్యాప్తి, అనఁగా; ఏది గుణాలంకారములకంటె వేఱైనదో, అది-సౌందర్యకారికాదు' అను వ్యతిరేక వ్యాప్తి-సిద్ధించునదియే యగును. శబ్దాలంకారములగు ననుప్రాసములకంటె- పరుష, లలిత, మధ్యమ, అను నీ వృత్తులు వేఱుకావు. అనుప్రాసము-జాతిమంత మును, వృత్తి-జాతియు,-అగుచున్నవి. కనుక జాతిమంతమగు ననుప్రాసము కంటె-జాతియగు వృత్తి-వేఱుకానేరదు. కాఁగా-శబ్దాలంకారములగు-అనుప్రాస ములే-పరుషాది వర్ణములందుండుటవలన అనుప్రాసములును, వృత్తులును-ఒక్క టియే యగును. ఈ యభిప్రాయమును ఉద్భటాచార్య వచనము నుదాహరించి ప్రమాణీకరించి చున్నాఁడు.

లోచనము :— కనుకనే 'స్వరూప వ్యఞ్జనన్యాసం, త్రిస్వేతాసు వృత్తిషు, పృథక్ పృథగనుప్రాసముశన్తికవ సుస్తథా' 'రసాభివ్యక్త్యను గుణము లైన వర్ణ వృత్తులగు పరుషాదులగు నీ మూఁడు వృత్తులందును, వేఱు వేఱుగా సమానములగు హల్లుల కూర్పు గలిగిన యనుప్రాసము లున్నవని కవులు చెప్పు దురు' అని భట్టోద్భటుఁడు చెప్పెను. పరుషాది వర్ణములచేత నారంభిం పఁబడుట వలన వేఱు వేఱగు ననుప్రాసములలో-పరుషాను ప్రాసమును 'నాగ రిక' అనియు, మసృణానుప్రాసమును 'లలిత' అనియు, 'ఉపనాగరిక' అనియు,

మధ్యమానుప్రాసమును-'గ్రామ్య'అనియు-'కోమల'అనియు, చెప్పుదురు. నిపుణురాలగు నాగరికతో ఉపమింపఁ(బోల్పఁ) బడుటవలన-మసృణానుప్రాసము-'ఉపనాగరిక' అని చెప్పఁబడినది. మసృణ (మధుర-లలిత) వర్ణవృత్తియు, పరుష వర్ణ వృత్తియుఁగూడఁగానిదియు, పూర్వోక్తములగు ననుప్రాసములలో మూడవదియు నగు మధ్యమానుప్రాసము-నైపుణ్యము లేనిదియు, స్వభావసిద్ధమగు కోమలత్వము మాత్రమే కలదియు, ఆగుచు 'పల్లెపడుచు' వలె నుండును గనుక మధ్యమ వర్ణ వృత్తియగు నీ మధ్యమానుప్రాసము-గ్రామ్య యనియు, కోమలయనియు, చెప్పఁబడును. కనుక అనుప్రాసజాతులే-వృత్తులు.

ప్రభామతి :— అను-పశ్చాత్, ప్రాసః = ప్రక్షేపః, అను వ్యుత్పత్తిచేత, రసానుగతములయిన సమానములగు హల్లులకూర్పు-అనుప్రాసమని చెప్పఁబడును-'పరుషాదులగు వృత్తులయందుండునదియగు (వృత్తికర్తృకమగు ననుగ్రహము గలదియగు) సమానములగు హల్లులకూర్పు-అనుప్రాసము'అనునది-అనుప్రాసములకు సామాన్యలక్షణ మగుచున్నది ఇందు వర్ణములుగాని, పదములుగాని, తిరుగఁజెప్పఁబడుచుండుటవలన చెవుల కింపుఁగొలుపునవియగు నీ యనుప్రాసములు శబ్దాలంకారములగుచున్నవి. 'రసాదుల ననుసరించునదియు, ప్రకృష్టమైనదియు, నగు వర్ణములకూర్పు-అనుప్రాసము' అని మఱికొందఱు చెప్పిరి. ఈ యనుప్రాసములు-పెక్కులున్నను, మరలనవి పరుషాది వృత్తి భేదము వలన మూడువర్గములుగానున్నవి. అదెట్లనిన : పరుష వర్ణములచేత నారంభింపఁబడిన పరుషవృత్తియందున్న యనుప్రాసవర్గము-'పరుషానుప్రాసము'అని చెప్పఁబడును. దీప్త వేషముగల నాగరికాంగనతోడి సాదృశ్యమువలన, గుణ సంబంధియగు సంజ్ఞచేత ఇది 'నాగరికానుప్రాసము' అని చెప్పఁబడినది. మసృణము లగుటచేత మధురములగు వర్ణములచేత నారంభింపఁబడుటవలన లలితమై, మసృణవర్ణమగు ననుప్రాసము-ఏ లలిత వృత్తియందుండునో అది-'లలితానుప్రాస'మని చెప్పఁబడును. ఈ లలితానుప్రాసమే లాలిత్య సామ్యమువలన నాగరిక (నిపుణురాలు) అగుకాంతతో ఉపమింపఁబడుటవలన, ఉపనాగరిక అని చెప్పఁబడినది. మసృణవర్ణ భిన్నములును, పరుష వర్ణ భిన్నములున్నగు వర్ణములచేత నారంభింపఁబడినదియగు ననుప్రాసము-'మధ్యమానుప్రాస'మని చెప్పఁబడినది. నాగరికకు వలె పారుష్యము (ప్రాగల్భ్యము)గాని, ఉపనాగరికకువలె మాధుర్యము (లాలిత్యము) గాని, లేక-మధ్యమ వర్ణ వృత్తి యగుటవలన మధ్యమము గాఁజెప్పఁబడిన తృతీయమగు మధ్యమానుప్రాసము-గ్రామ్య వనితవలె (పల్లె

పడుచువలె) నైపుణ్యములేకుండుటవలనను, స్వభావ సిద్ధమగు కోమలత్వమును మాత్రము గల్గియుండుటవలనను, ఈ మధ్యమానుప్రాసమునకాశ్రియమగు వృత్తి-'గ్రామ్య' యనియు, 'కోమల' యనియుఁజెప్పఁబడినది. ఈ గ్రామ్య-కోమల-మధ్యమ-వృత్తి (మసృణ-పరుషవర్ణ - భిన్నమధ్యమవర్ణవృత్తి) యగు ననుప్రాసము-గ్రామ్యానుప్రాసము, కోమలానుప్రాసము, మధ్యమానుప్రాసము అని (త్రినామముగా) చెప్పఁబడునని తెలియునది.

ప్రశ్న :— మధుర-కోమలపదములు-పర్యాయ పదములుగదా! మసృణ వర్ణములచేతనగు 'మాధుర్యము (కోమలత్వము) లేనిది'యగువృత్తియందుండు నదియగు మధ్యమానుప్రాసమునకు - కోమలానుప్రాసమను నామాంతరము సముచితమగునా?

ఉత్తరము :— పల్లెపడుచునందు మాధుర్యము(లాలిత్యము)లేకున్నను, స్వభావసిద్ధమగు కోమలత్వము-అనఁగా; సౌకుమార్యముండునట్లు-మధ్యమ వర్ణ వృత్తియగు మధ్యమానుప్రాసమునందు లాలిత్యములేకున్నను, స్వభావసిద్ధమగు కోమలత్వముండుటవలన దీనికి కోమలానుప్రాసమను నామము-రూఢమగు చున్నది. కావుననే భట్టోద్భటుఁడు—

శ్లో॥ శేషైర్వర్ణైర్యథా యోగం గ్రథితాం కోమలాఖ్యయా
గ్రామ్యాంవృత్తిం ప్రశంసన్తి కావ్యేష్వాదృతబుద్ధయః.

పరుషములును, మసృణములును,కాక మిగిలిన వర్ణములతోఁగూర్పఁబడి-'కోమల' అను నామముతో-పల్లెపడచువంటిదగు గ్రామ్యవృత్తిని గూడ-కవులు-ప్రశంసింతురని చెప్పెను. ఇట్లు-పరుషాది వర్ణవృత్తులే-అనుప్రాసములగుచున్నవి. కనుక అనుప్రాసజాతులే-వృత్తులని తెలియునది. అనుప్రాసములకుఁగల వ్యాపారమే-వృత్తులకును గలదు. కనుక వానికంటె నీవృత్తులు-వేరుకావు.

అవ :— అయ్యా! వృత్తిరూపమగు జాతియందు, తజ్జాతిమంతమగు ననుప్రాసమున్నట్లు మీరు చెప్పుచున్నారు. ఇది-వైశేషికమతవిరుద్ధము-కనుక యుక్తముకాదు. అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— వైశేషికమతమునందు సామాన్యరూపమగు జాతి-విశేషరూపమును, జాతిమంతమును, అగు వ్యక్తియందుండునని చెప్పఁబడినది. దీనికి విరుద్ధముగా మా మతమునందు జాతిమంతమగు వ్యక్తిస్వరూపము-వృత్తి

రూపమగు జాతియందుండునని చెప్పబడుటలేదు. ఇంతేమనిన, మా మతమునందు-జాతిమంతమగు వ్యక్తిరూపము-వృత్తి రూపమగు జాతియందుండుట యనఁగా; ఆధేయత్వరూపముతో నుండుటకాదు. వృత్తిరూపమగు జాతి-జాతిమంతమగు వ్యక్తి ననుగ్రహించుటయే యగును. (ఒకవ్యక్తి-జాతియందుండుటయనఁగా, జాతి కర్తృకమగు ననుగ్రహము నొందుటయే.)

ప్ర భా మ తి :— వృత్తికర్తృకమగునాయనుగ్రహము-జాతిమంతములగు నాగరికాద్యనుప్రాసములకు రసాభివ్యంజన సామర్థ్యము నొసఁగి-ఈ యనుప్రాసములను-'మూడు వర్గములుగా భేదింపఁజేయుటయే' అని తెలియునది. కాఁగా మా మతమునందుఁగూడ-నాగరికాద్యనుప్రాసములు-పరుషాది వర్ణ వృత్తి రూపములగు జాతులయందు-ఆధేయత్వరూపముతోనుండునవికావనునది ఫలితార్థము. వృత్తి రూపమగు జాతియందు, వ్యక్తిరూపమగు జాతిమంతమున కునికిలేకున్నను, వృత్తిరూపమగు జాతియందు వ్యక్తిరూపమగు జాతిమంతమున కునికి ఔపచారికముగాఁజెప్పఁబడవచ్చును. కనుకనే 'అనుప్రాసభేదములు-పరుషాది వర్ణ వృత్తులగు నీజాతులయందుండును' అని వెనుకచెప్పిన స్థలములందంతటను-'అనుప్రాసభేదములు - వృత్తులయందుండునని చెప్పుట' ఔపచారికమే యని గ్రహింపవలయును. జాతియందు - జాతిమంతముండునదికాదు. అయినను జాతియందు-జాతిమంతమగు వ్యక్తియున్నట్లు చెప్పునవియగు ఔపచారిక ప్రయోగములుండవచ్చుననుటకు క్రింది దృష్టాంతము నిచ్చుచున్నాఁడు.

లోచనము : అదెట్లనిన :— ఒకానొకఁడిట్లనెను.

'లోకోత్తరేహి గామ్భీర్యే వర్తన్తే పృధివీభుజః'

పృధివీపతులు-లోకోత్తరమగు గాంభీర్య (గుణ)ము నందుందురు.

ప్రభామతి :— గుణులగు పృధివీపతులయందే గాంభీర్యమను గుణముండును. అయినను నిచ్చట-గుణులగు పృథివీపతులే-గుణమగు గాంభీర్యమునందున్నట్లు చెప్పఁబడిరి. పృథివీపతులు-గాంభీర్యగుణముచేత-అనుగ్రహింపఁబడుటయే-'వారు-గాంభీర్యమునందుండుట' అని దీని యర్థము సిద్ధించును. గాంభీర్య కర్తృకమగు ననుగ్రహము పృధివీపతులకు సకలకార్యనిర్వహణసామర్థ్యము నొదవించుటయే యగును. కనుక నీ ప్రయోగము-వ్యర్థముకాక సార్థకమే యగునని తెలియునది.

లోచనము :— కనుక - వృత్తులు - అనుప్రాసాదులకంటె వేఱుకావు. వేఱయిన వ్యాపారములు కావు. వీనియందనుప్రాసములకంటె నధికమగు వ్యాపారమేదియు లేదు.

ప్రభా :— రసవ్యంజన విషయమున-అనుప్రాసాదులకుఁగల వ్యాపారమే, వృత్తులకును గలదు. అనుప్రాసములు-సమాన వర్ణాది రూపములుగదా! జాతులగు వృత్తులు-వర్ణములయందుండును. వర్ణముల యందుండునవియగు వృత్తులయందు-వర్ణాద్యాత్మకములగు ననుప్రాసము లుండుననుట శాస్త్ర విరుద్ధమేయగును. కనుక పరుషాది వృత్తులయందు అనుప్రాసము లుండుట యనఁగా; ఆ వృత్తులచే నగు విభాగము నొందుటయే, యని తెలియునది.

లోచనము :— కనుకనే-అనఁగా; 'వ్యాపారభేదము లేదు. కనుకనే, యీ వృత్తులు-అనుప్రాసములకంటె వేఱని యూహించుటకుఁదగిన స్వరూపము గలవి కూడ కావు' అని, 'అనతిరిక్తవృత్తులు' అనుచోట వ్యాపార బోధకమగు వృత్తి పద భావము నెఱుఁగునది. 'ఈ వృత్తులు-అనుప్రాసాదులకంటె వేఱు-కావు, గనుకనే భామహాదులు-వృత్తులను వ్యవహరించినవారుకారు. ఉద్భటాదులీ వృత్తులను వ్యవహరించినను ఈ వృత్తి పదమునకు అనుప్రాసరూపమగు నర్థముకంటె నధికమగు నర్థమేదియు మా హృదయ పథమునకు గోచరించుటలేదు.' అను నభిప్రాయమున 'వృత్తులుగూడ మా శ్రవణగోచరములైనవి' (మనోగోచరములు కాలేదు) అని వృత్తికారుఁడు చెప్పెను.

ప్రభామతి :— ఆలోకకర్తయగు వృత్తికారుఁడు-'వృత్తులు-తదనతిరిక్తము లయినను' అని చెప్పినఁజాలును. అయినను 'రసవ్యంజన విషయమున అనుప్రాసములకుఁగల వ్యాపారముకంటె నధికమగు వ్యాపారము-వృత్తులకున్న యెడల-అలంకారాదులకు వలె నీ వృత్తులకుఁగూడ వేఱువేఱగు స్వరూపము చెప్పవలసియే యుండును. అట్టి వ్యాపారమేదియు వీనికి లేకుండుటవలన వీని స్వరూపమును ప్రత్యేకముగా నిశ్చయించుటకు వీలు కానేరదు' అని చెప్పుటకు-తదనతిరిక్తములయినను, అని చెప్పక 'తదనతిరిక్తవృత్తులయినను' అని వృత్తి పదమును చేర్చెనని తెలియునది. ఈ వృత్తులు-చెవులకు వినిపించినవేగాని, మనస్సునకు కనిపించినవి కాలేదు. అని చెప్పుటకే-'శ్రవణ గోచరణములైనవి' అని ఆలోకమునందు చెప్పఁబడినది. కాఁగా: 'జాతిమంతములగు అనుప్రాసముల (శబ్దాలంకారముల) కంటె, వీని వృత్తులే యగు నాగరిక (పరుష) ఉపనాగరిక, గ్రామ్య, అనువృత్తులు-వేఱుకావు' అనునది ఫలితార్థము. [కైశికి. ఆరభటి, సాత్వతి, భారతి, అను అర్థ వృత్తులుకూడ నిట్టివే అని తెలియునది].

భట్టోద్భటుఁడు [కావ్యాలంకార సంగ్రహమునందు] ప్రసారించిన అనుప్రాసోదాహరణములను పాఠక సౌకర్యమునకై క్రింద నిచ్చుచున్నాను. ఇందు-

పరుషాది వర్ణ వృత్తులచేత త్రివిధములుగా విభజింపఁబడిన సరూపములగు హల్లుల కూర్పుగల అనుప్రాసములను గుర్తించునది.

పరుషానుప్రాసమున కుదా :—

తత్ర తోయాశయా శేష వ్యాకోశిత కుశేశయా
చకాశే శాలికింశారు కపిశాశా ముఖా శరత్.

ఇది-పరుషవర్ణ వృత్తి-ఇందు-శకారములు-సరూపములు.

ఉపనాగరికోదా :—

సాన్ద్రార విన్ద బృన్దోత్థ మకరన్దామ్బు బిన్దుభిః
స్యన్దిభిః సున్దర స్పన్దం నన్దితేన్దిన్దిరా క్వచిత్.

ఇది-మసృణ (మధుర) వర్ణవృత్తి-నకారముతోఁగూడిన దకారములు-సరూపములు.

గ్రామ్యోదా : [కోమలోదా :-]

కేలిలోలాలి మాలానాం కలైః కోలాహలైః క్వచిత్
కుర్వతీ కాననారూఢ శ్రీనూపుర రవభ్రమమ్.

ఇది-మధ్యమ వర్ణ (గ్రామ్య) వృత్తి-లకార, కకార, రేఫములు-సరూపములు.

లోచనము :— 'తదనతిరిక్త వృత్తులయినను వైదర్భి మున్నగు రీతులు గూడ శ్రవణ గోచరములయినవి' అని వృత్తియందుఁజెప్పఁబడినది. అందు 'తత్' అను శబ్దముచేత మాధుర్యాది గుణములు-చెప్పఁబడును.

ప్రభామతి :— ఈ మాధుర్యాదులు-రసగుణములు-రసములందుండునవి-అయినను-'ఈశబ్దము మధురముగా నున్నది' అని యిట్లు శబ్దగుణములుగా ఉపచరితము (కల్పితము) లగుచున్నవి. 'పదసంఘటనారూపములగు రీతులు-ఈ గుణములకంటె వేఱుకావా?' అనినఁజెప్పుచున్నాఁడు.

లోచనము :— రసాదులను ప్రకాశింపఁజేయునదియగు వ్యాపారముగల విశిష్టమగు వర్ణ రచన-'వృత్తి' అని చెప్పఁబడును. దీప్త-లలిత-మధ్యమ-వర్ణముల

చేత వర్ణనీయమగు (శృంగారాదిరస) విభావాది విషయమున కుచితమగు ఆ వృత్తి (వర్ణ రచన) యందు-ఆ వర్ణములచేతనే అభివ్యంజింపఁజేయఁబడిన ఈ మాధుర్యాది గుణముల నర్పించునపుడు-దీప్త్యాది రూపమున వర్ణనీయమగు విభావాది విషయత్రైవిధ్యము ననుసరించి (రసాపేక్షమగు) పరస్పరసమ్మేళన యోగ్యతచేత పానకమునందు-బెల్లము మిరియములు (జలము) మొదలగు వానివలె ఈ మాధుర్యాది గుణములు-సంఘాత రూపత్వము నొందుటయే-రీతి, అని [వామనాదుల చేత] చెప్పఁబడినది. [ఇట్లుకూడ చెప్పవచ్చును.] [ద్రుతి-దీప్తి-వికాసములను చిత్తవృత్తులను సమర్పించుటకై ఈ గుణములు రసాపేక్షమగు సంఘాతరూపము నొందుటయే-రీతి అని చెప్పఁబడినది.]

ప్రథా : ప్రశ్న :— అయ్యా-రీతి యననేమి?

ఉ :— విశిష్టమగు పదరచన (పదసంఘటన) యే-రీతి.

ప్రశ్న :— విశేషముతోఁగూడినది-విశిష్టముగదా-ఆ విశేషమేది?

ఉ :— ఆ విశేషము-మాధుర్యాది గుణరూపమే.

ప్రశ్న :— ఈగుణములెట్లేర్పడును? వేనియందుండును?

ఉ :— వర్ణములు-పదములు-సంఘటనలు మున్నగునవి ఈ గుణములను అభివ్యంజింపఁజేయును. ఇవి రసములందుండును.

ప్రశ్న :— అవియెన్ని? ఆ గుణముల నామములేవి?

ఉత్తరము :— భామహాచార్యుడు చెప్పిన గుణములు మూడే. వాని నామములు ‘1. మాధుర్యము, 2. ఓజస్సు, 3. ప్రసాదము’ అనునవి. తదితరులగు నాలంకారికులు చెప్పిన మఱికొన్ని గుణములున్నవి. అవి-యీ గుణత్రయమునఁజేరినవే యగును. వామనుడు-పది శబ్దగుణములను, పదియర్థగుణములను, చెప్పెను.

ప్రశ్న :— రీతులు-గుణములకంటె వేఱుకాకుండుట యెట్లు?

ఉత్తరము :— రసాదుల నభివ్యంజింపఁజేయునదియగు వ్యాపారముగల వర్ణ రచన-(వర్ణములకూర్పు) ‘వృత్తి’ అని చెప్పఁబడును. శృంగారాది రస సం

బంధి విభావాది విషయము వర్ణనీయమగునపుడు, లలితమగు వర్ణ రచన యుండవలెను. రౌద్రాది రసవిభావాది విషయము వర్ణనీయమగునపుడు-దీప్త (పరుష)మగు వర్ణరచన యుండవలయును. హాస్యాది రస విభావాది విషయము-వర్ణనీయమగునపుడు మధ్యమ వర్ణయగు రచన యుండవలయును. గుణములు ఈ వర్ణములచేతను, ఈ వర్ణములతోఁగూడిన పదాదులచేతను ప్రకాశింపఁజేయబడును. రసధర్మములగు (గుణములగు) మాధుర్యాది గుణములు-శబ్దగుణములు కాకున్నను శబ్దగుణములుగా వ్యవహరింపఁబడు (కల్పితములగు)చున్నవి. వర్ణపద సంఘటనాదులు-రసముల నభివ్యంజింపఁజేయునపుడు-ఆయా రసములయందుండు నవియగు ఏయే గుణములు-ఏయే రసములను ప్రకాశింపఁజేయునో, ఆయా గుణములు-పరస్పర సమ్మేళన యోగ్యతచేత-త్రివిధమగు వర్ణనీయ విషయౌచిత్యముగల వృత్తియందు (వర్ణ రచనయందు) తమ్మర్పించుకొనును. అప్పుడు-వీనికి-దీప్తముగను. లలితముగను, మధ్యమముగను, వర్ణింపఁదగిన విషయమును బట్టి త్రివిధమగు సంఘాత రూపత్వము ప్రాప్తించును. కనుక 'ఈగుణములకొదవునదియగు సంఘాతరూపమే-రీతి' అని వామనాదులచేత పేర్కొనఁబడినది. కనుక గుణాభివ్యంజక పదవిన్యాసమే-(సంఘటనయే) రీతి యగును. ఇట్లు గుణసంఘాత రూపమగు రీతి-గుణములకంటె వేఱుకాదు.

ప్రశ్న :— మాధుర్యాది గుణములు - సంఘాతరూపత్వము నొందుట యనఁగా నేమో చెప్పుదురా?

ఉత్తరము :— చెప్పకేమి? గుణములు సముదాయ రూపత్వము నొందుట యనఁగా; వేఱు వేఱుగు నీగుణములు రసాభివ్యంజన విషయమున సమూహీభవించి (సంఘాతరూపత్వమునొంది) రూపాంతరము నొందుటయే, అనగా; వేఱొక రూపము నొందుటయే, అని తెలియునది.

ప్రశ్న :— ప్రత్యేకములగు రూపములు గల యీ గుణములు-రసానుగుణ్యమగు సంఘాత రూపత్వము నొందునపుడు వీనికన్నింటికిని వేఱొకరూపము కలుగుననుటకు దృష్టాంతమున్నదా?

ఉత్తరము :— లేకేమి? నీరు-పంచదార-మిరియములు-ఏలకలు మొదలగు వానిచేరిక వలన 'పానకము' అను పేయ ద్రవ్యము సిద్ధించును గదా! ఈ పానకము నందు-జలము-పంచదార మిరియములు మున్నగునవి సమూహీభవించి వేఱొకరూపమును పొందుటలేదా?

ప్రశ్న :— ఆలాగుననా? పానకమునందు (నీరు) పంచదార-మిరియములు-ఏలకలు మొదలయినవి తమ ప్రత్యేకరూపముకంటె వేఱయిన యింకొక రూపమును బొందియున్నవనియా మీ యభిప్రాయము?

ఉత్తరము :— ఆ ద్రవ్యములందలి రసములు పొందిన క్రొత్తరూపము-పానకమునందున్న దనుకొనుచున్నారేమయ్యా?

ప్రశ్న :— ఈ రసముల కొదవిన రూపాంతరము పానకమునందున్న దనియే మా యభిప్రాయము.

ఉత్తరము :— వెఱ్ఱివాడా! సమూహీభవించిన యీ రసములకుఁగలిగిన వేఱొక రూపమే-పానకమని యింకను తెలిసికొనలేదా?

ప్రశ్న :— చిత్తము-సరిసరి. సంఘీభవించిన గుణముల రూపమే (గుణసముదాయ రూపమే) రీతి యన్నమాట. ఔనా?

ఉత్తరము :— ఔను.

ప్రశ్న :— వామనాచార్యులవారు చెప్పిన రీతులెన్ని?

ఉత్తరము :— మూఁడే-కాని మఱికొన్నిఁటిని మఱికొందఱు చెప్పినారు.

ప్రశ్న :— 'విశ్వనాథుఁడు' 'అవి మూ'డనుటకు నిమిత్తమేదో సెలవిచ్చెదరా?

ఉత్తరము :— దీప్తముగను-లలితముగను-మధ్యమముగను వర్ణింపఁదగిన (శృంగారాది రససంబంధి) విభావాది విషయములు-మూఁడగుటవలన-దీప్తాది రూపములగు వర్ణములచేత ప్రకాశితములగు గుణములుకూడ-మూడు విధములగు సంఘాతరూపముల నొందుచుండును. కావున గుణసముదాయరూపములగు రీతులుకూడ-మూడుగాఁ జెప్పఁబడినవి.

ప్రశ్న :— వాని నామములు వినిపించెదరా?

ఉత్తరము :— **1.** వైదర్భి. **2.** గౌడీయ (గౌడి). **3.** పాంచాలి. అనునవి-వాని నామములు. వీనినే వామనాచార్యులు-పేర్కొనిరి.

ప్రశ్న :— వీనికినామములేవిశేషయమువలనఁగలిగినవో చెప్పి-అవి యేయే గుణములతోఁగూడినవో తెలుపఁగోరెదను.

ఉత్తరము :— విదర్భదేశీయులయిన కవుల రచనాస్వభావమునందు ప్రచురముగాఁజూడఁబడిన రీతి-వైదర్భి అనియు, గౌడ దేశీయ రచనాస్వభావము నందు ప్రచురముగా దృష్టమయిన రీతి-గౌడీయ, లేక గౌడి, అనియు, పాంచాల దేశీయ రచనాదృష్టమయినరీతి-పాంచాలి,అనియు పేర్కొనఁబడినవి. అందు-గుణ ములన్నియుఁగలది-వైదర్భి. ఓజః, కాంతిమతి-గౌడీయ, మాధుర్య సౌకుమార్యో పపన్న-పాంచాలి, అని వామన నిరుక్తి.

లోచనము : -- జాతి-జాతిమంతముకంటె వేఱుకాదు. సముదాయము కూడ-సముదాయికంటె (ప్రత్యేకము) కంటె వేఱుకాదు. కావున వృత్తి-అలంకా రము కంటెను, రీతి-గుణములకంటెను వేఱుకాదు. కావున వ్యతిరేకియగు హేతు వుండనేయున్నది.

ప్రభా :— అనుప్రాసము - జాతిమంతమును, వృత్తి-జాతియు, అగు చున్నవి. కనుక, జాతిమంతమగు ననుప్రాసము (అలంకారము) కంటె, జాతి యగు వృత్తి-వేఱుకాదు. ఇట్లే-మాధుర్యాదిగుణ సంఘాతరూపమే-రీతి యగు చున్నది. కనుక సముదాయమగు (అవయవియగు) రీతి-సముదాయులగు (అవ యవములగు, లేక, ప్రత్యేకములగు) మాధుర్యాది గుణములకంటె వేఱుకాదు. కావున వెనుకఁదెలిపిన 'ఏది-సౌందర్య హేతువులగు గుణాలంకారములకంటె వేరయినదో-అది సౌందర్యకారికాదు' అను వ్యతిరేక హేతువుండనేయున్నది. కనుక-'గుణాలంకారములకంటె వేఱయి, కావ్య సౌందర్య హేతువగు ధ్వనిలేదు' అని యభావవాది యభిప్రాయము.

లోచనము : ['తద్ వ్యతిరిక్తమై ధ్వని నామముగలయిది-యేది'] మీరుచెప్పిన ధ్వని-శబ్దరూపము,అర్థరూపము,కూడకాదు.కనుక సౌందర్యస్థానము కాదు. గుణములకంటెను, అలంకారములకంటెను వేఱగుటవలన చారుత్వ హేతువుకూడఁగానేరదు. కావున 'అఖండమగు బుద్ధిచేత-ఈ ధ్వని-కావ్యము నందు సమాస్వాద్యమైనను ('ఇందెక్కడ ధ్వనియున్నది?' అని) అపోద్ధార బుద్ధిచేత-అనఁగా; విభాగ దృష్టిచేత-కావ్యమును విభజించు నెడల-అందెచ్చటను

ధ్వనియని చెప్పఁదగిన వేఱొక యర్థమేదియు లభించునదికాదు' అని చెప్పుటకు 'నామముగల' అని వృత్తియందు చెప్పఁబడినది.

ప్రభామతి :— శబ్దార్థ-గుణాలంకార వ్యతిరిక్తమును, కావ్యశోభా హేతువును, అగు ధ్వనిలేదనిమాత్రమే యింతవఱకును సిద్ధించినది-కాని స్వరూపతః 'ధ్వనిలేదు' అనునది సిద్ధింపలేదని-వేఱొకపక్షముపక్షేపింపఁబడుచున్నదని చెప్పుచున్నాఁడు.

లోచనము : అవ :— 'ఈ ధ్వని-శబ్దార్థస్వభావము కాకపోనిండు. సౌందర్య హేతువుకూడ కాకపోనిండు. ఇది సౌందర్య హేతువు కాకుండుటచేతనే (గుణాలంకారములలో చేరక) గుణాలంకారములకంటె వేఱుగానుండవచ్చును' అని యాశంకించి-ద్వితీయాభావవాద ప్రకారమును జెప్పుచున్నాఁడు,

(6) మూలము :— ఇంకొకఱిట్లనవచ్చును. ధ్వనిలేనేలేదు. ప్రసిద్ధమగు ప్రస్థానము [సంప్రదాయ పరంపరా సిద్ధ శబ్దార్థ-తద్ గుణాలంకార పరిష్కృత మార్గము] కంటె వ్యతిరేకియగు (వేఱగు) కావ్యప్రకారము-కావ్యత్వమునే కోల్పోవును. కనుక ధ్వని లేనేలేదు. ఏది-సహృదయ హృదయాహ్లాది శబ్దార్థమయమో, అదియే-కావ్యము. మీఁదఁదెలుపఁబడిన ప్రస్థానము (సంప్రదాయ సిద్ధమగు మార్గము)ను వ్యతిరేకించునదియగు మార్గమునకు-కావ్య లక్షణము పట్టదు. (సంభవించునదికాదు.)

లోచనము :— [ద్వితీయాభావవాది యనుచున్నాఁడు] ధ్వని యనున దేదో ఉండినచో నుండుఁగాక. నీవెట్టి దానికి [కావ్యసంబంధిగా] లక్షణమును దెలుపుట కభిలషించితివో అట్టిధ్వని లేనేలేదు. నీవు-ధ్వనికి లక్షణమును జెప్పునెడల అది-(ధ్వని) కావ్యమునకు సంబంధించినదిగాఁ జెప్పవలయునుగదా! నీవు చెప్పిన ధ్వని నృత్తగీత వాద్యాదులవంటిదగు నెడల నది-కావ్యమునకు సంబంధించినది యేదియుఁగా నేరదు గదా! కావ్యమనునది యేది? కావ్యము-కవనీయము. కవనీయమునకు సంబంధించిన ధర్మమేగదా కావ్యత్వము! నృత్తగీతాదులు-కవనీయమని చెప్పఁబడునవి కావుగదా! ప్రతిష్ఠన్తే = పరమ్పరయావ్యవహరన్తియేనమార్గేణ, తత్ = ప్రస్థానమ్' (ప్రస్థానమనఁగా నేమి?) పరంపరగా (అవిచ్ఛిన్న ప్రవాహ

రూపముచేత) పలువురు-ఏమార్గముచేత-వ్యవహారమును ప్రయాణము నొనర్చెదరో, అదియే-ప్రస్థానము.' అనునది-ప్రస్థాన శబ్ద వ్యుత్పత్తి. కావ్యమార్గమునందు ప్రసిద్ధమగు ప్రస్థానము-'శబ్దార్థ-తద్-గుణ-అలంకారములే' అగును. (ధ్వనివాదీ!) నీవు 'కావ్యమున కాత్మ-ధ్వని' అని యంటివిగదా! కనుక-ఆ ధ్వనియే-కావ్య తత్త్వమని (కావ్యమార్గమని) నీ యభిప్రాయము.

'అయ్యా! మేము చెప్పిన ధ్వని-ఏల కావ్యముకాదు?' అని నీ వనవచ్చును. కాని, నృత్తము, గీతము, అక్షినికోచనము (కనుసైగలు మున్నగు అక్షివికారములు) మున్నగువానివంటి నీ ధ్వనితత్త్వమునకు సహృదయ హృదయాహ్లాది శబ్దార్థమయత్వరూపమగు కావ్యలక్షణము పట్టదు.

ప్రభామతి :— నీవుచెప్పిన ధ్వని యుండిన నుండనిమ్ము. కాని, కావ్య సౌందర్య హేతువులగు గుణాలంకారాదులకంటె వేఱయిన నీధ్వని-వివాదాస్పదమై యున్నది. కనుక కావ్యసంబంధిగా చెప్పుటకు వీలుపడునదికాదు. నీవు చెప్పిన ధ్వని-శబ్దముగాని, అర్థముగాని, కాక-వానికంటె వేఱయినదిగా చెప్పఁబడుచున్నది. కనుక నీ ధ్వని-కావ్యము కానేరదు. నీ ధ్వని-శబ్దగుణ-అర్థగుణ, శబ్దాలంకార-అర్థాలంకారములకంటెను [ప్రసిద్ధ ప్రస్థానము కంటె] వేఱయినదిగనుక-కావ్యసంబంధికూడ - కా నే ర దు, గుణాలంకారసౌందర్యమే-సహృదయ హృదయాహ్లాదకమగును. ఒకప్పుడు-నీవు చెప్పినది-నృత్తగీతాదిప్రాయము కావచ్చునేమో. అయినను నృత్త గీతాదులు-కవనీయములు కావు. కావ్యమునకు సంబంధించినవికూడ కావు.

(7) మూలము:— ధ్వనివాద సంకేతములోఁజేరిన కొందఱిని సహృదయులుగా పరికల్పించి (ఏర్పఱచుకొని) తత్ప్రసిద్ధిచేత ["ఆ సహృదయుల కభిమతమగు ధ్వనియే-కావ్యతత్త్వము" అను ప్రసిద్ధిచేత] ధ్వనియెడల కావ్యవ్యపదేశము [వ్యవహారము] ప్రవర్తింపఁజేయఁబడినను, అది-సకల విద్వన్మనో గ్రాహ్యము కానేరదు. [సకల విద్వన్మనో గ్రాహిత్వము నవలంబించునదికాదు.]

లోచ :— [ధ్వనివాదీ!] " 'అటువంటి అపూర్వమును [పూర్వములేని నవీన తత్త్వమగు ధ్వనిని] ఎవరు-కావ్యరూపముగాఁదెలియుదురో, వారే-సహృదయులు. మీరు (పూర్వులు) చెప్పిన శబ్దార్థ-తద్గుణాలంకార రూపమగు ప్రస్థానము

నకు [కావ్యమార్గమునకు] వ్యతిరేకియగు మా ధ్వనియే-కావ్య లక్షణము'' అను నది-ఆ సహృదయుల కభిమతము కాఁగలదు''అనియందువేమో అనియాశంకించి-ధ్వన్యభావవాది-పరిహసించుచున్నాఁడు.

ప్రభా:- '' 'సహృదయాభిమతము-కావ్యలక్షణము' అని ధ్వన్యభావవాదులు కూడ నంగీకరించిరిగదా! అట్టి సహృదయాభిమతమును సాధించుటకు మాత్రమే-మేమీ కావ్యాత్మ ధ్వని లక్షణ కరణ ప్రయాసము నొందుచున్నాము. మీరు నృత్త గీతాది ప్రాయమని సోత్ప్రాసముగాఁజెప్పిన ధ్వని స్వరూపమే-కావ్యతత్త్వము, పూర్వాలంకారికులచేత-అనున్మీలితమైన యీ కావ్యతత్త్వము నెవరెఱుఁగుదురో, వారే-సహృదయులు. ఇది సకల విద్వాంసులకును మనోగోచరము కాకున్నను, కావ్యాత్మ ధ్వని లక్షణవేత్తలకు మనోగోచరమగుటవలన వారికే సమభిమత మగు చుండును. కనుక మేము చరితార్థులము కాఁగలుగుదుము'' అని ధ్వనివాది యన వచ్చునని యాశంకించి-ధ్వన్యభావవాది సోపహాసముగా చెప్పుచున్నాఁడు.

లోచనము :— 'ఖడ్గలక్షణమును చెప్పెదను' అని యొకఁడిట్లు చెప్పెనట. '[ఆతాన వితానాత్మ]ఆయామము-తిర్యగ్ విస్తారము-అనఁగా; పొడవు-వెడల్పు-గలది. [ప్రావ్రియమాణము] మంచును, గాలిని, నివారించునదియగు, ప్రావరణముగాఁజేయఁబడినది. [సకల దేహాచ్ఛాదకము] దేహమునంతనుగూడ బాగుగా కప్పునది, [సుకుమారము] కోమలమైనది, [చిత్రితంతు విరచితము] రంగు దారములతోఁగూర్పఁబడినది, [సంవర్తన వివర్తన సహిష్ణువు] ముడుచుటకు,విప్పుటకు, వీలుపడునది, [అచ్ఛేదకము] చిరుగనిది, [సుచ్ఛేద్యము] చింపుటకు వీలుపడునది, [ఉత్కృష్టము] శ్రేష్ఠమయినది-[అగువస్తువు-] ఖడ్గము' అని చెప్పెనట! అది యుక్తము గాకుండుటవలన తదితరులు (వానినిజూచి) 'ఏవం విధమగునది-(ఇట్టిది) ...టము (బట్టలేక దుప్పటి) గాని ఖడ్గముకాదే' అని సోపహాసముగా ఆక్షేపించి ...ట! వాఁడు [అప్పుడాసిగ్గుమాలినవాఁడు] 'ఇట్టిదియే-ఖడ్గమని నా కభిమతము' ...ని చెప్పెనట!

కొందఱిని సహృదయులని యేర్పఱచుకొని-ధ్వనివాదులు [మీరు] చెప్పిన ...వ్యలక్షన మిట్టిదేయగును. ప్రసిద్ధమే-లక్ష్యమగును, కాని కల్పితము-లక్ష్యము ...దు. [అప్రసిద్ధమగుధ్వని లక్షింపఁదగినది కాదనిభావము.] ఈ యభిప్రాయ ...నే తెలుపుటకు-'సకల విద్వన్మనో గ్రాహ్యము కాదు' అని వృత్తికారుఁడనెను. ...రో కొందఱు స్వసంకేత నిష్ఠులగు విద్యాంసు లంగీకరించినను-మీరు కావ్య ...త్త్వమని చెప్పిన ధ్వని-విద్వాంసులందఱికిని అంగీకార యోగ్యముకాదు. 'ధ్వని

పద సంకేతవేత్తలే-విద్వాంసులు' అని యంగీకరించి, 'కావ్యాత్మ' అనిచెప్పఁబడిన ధ్వనియొక్క లక్షణము-వారి మనస్సులకు మాత్రము గోచరించును.' అని ధ్వని వాది చెప్పవచ్చునని యాశంకించి-వృత్తికారుఁడు-మీది వాక్యమున 'సకల' శబ్దము ను ప్రయోగించి దానిని నిరాకరించెనని తెలియునది. 'ఈ క్రొత్త సహృదయుల హృదయములకు మాత్రమే-ఆహ్లాదకారియగు ధ్వనియే-కావ్యతత్త్వము' అని చెప్పు నెడల-అదియేమి చెప్పినట్లు? [ఇట్లు-మూఢులు కూడ చెప్పవచ్చును.] దానివలన, వారి (ధ్వనివాదుల) ఉన్మత్తతయే బాగుగా ప్రకటితమగును.

ప్రభా : అవ :— 'ప్రసిద్ధ ప్రస్థానముకంటె' అని వృత్తికారుఁడుచెప్పిన ద్వితీయాభావవాద గ్రంథమునకు-ఇంకొకరెవరో (చంద్రికాకర్తయో, ఇంకొకరో). లోచనకర్త చెప్పిన మీది యర్థముకంటె వేఱయిన యర్థమును జెప్పియుండిరి. ఆ యర్థమును నిరాకరింపనియెడల పాఠకులు దానినే-సమీచీనముగానెంచి-స్వీకరింప వచ్చునను నభిప్రాయమున శ్రీ లోచనకర్త-ఆవ్యాఖ్యాత చెప్పిన యభిప్రాయ మును దెలిపి-నిరసించుచున్నాఁడు.

లోచనము :— ఒక వ్యాఖ్యాత-ఈ ద్వితీయాభావవాది యభిప్రాయము నిట్లుచెప్పెను. "[ఓ ధ్వనివాదీ!] 'ధ్వని-కావ్యజీవిత'మనిగదా నీ యభిమతము! అలంకార శాస్త్ర కారులెవ్వరును జీవితభూతమగు ధ్వనిని కావ్యముగాఁ జెప్పియుండ లేదు. మఱియునది-[జీవితమగు ధ్వని] కావ్యమని లోకమునందు ప్రసిద్ధముకూడ కాదు"అని. ఈ వ్యాఖ్యాత చెప్పిన యీయర్థమంతయుఁగూడ స్వవచన విరుద్ధము. [ధ్వన్యభావవాద విరుద్ధము] ధ్వనిని, కావ్యజీవితమని పూర్వపక్షి [ధ్వన్యభావవాది] అంగీకరించునెడల-కావ్య జీవితమగు ధ్వనిని పూర్వులగు నాలంకారికులు చెప్పి యుండలేదు. కనుక-ఆ ధ్వని స్వరూపము [లక్షణము] చెప్పుటకు-అర్హమే యగునుగదా! కనుక మేము-ఈ ద్వితీయాభావగ్రంథమునకేయర్థమును జెప్పి తిమో, అదియే సమీచీనమయినది.

ప్రభా :— వృత్తికారుఁడు చెప్పిన ద్వితీయ ధ్వన్యభావ వాది మతము నకు ఈ వ్యాఖ్యాత (ఎవరో) చెప్పిన యభిప్రాయము విరుద్ధమైనది. 'కావ్య జీవితమగు ధ్వని స్వరూపమును చిరంతనులగు నాలంకారికులు చెప్పకుండుటవలన అది-కావ్యముకాదు,' అని యీ వ్యాఖ్యాత చెప్పినట్లున్నది. కనుక నీ వ్యాఖ్యాత ధ్వనిని కావ్యజీవితముగ నంగీకరించికూడ-'కావ్యజీవితమగు నీ ధ్వనిని-చిరంతనులు చెప్పకుండుటవలన 'ధ్వని-కావ్యముకాదు,' అనుచున్నాఁడా, లేక ధ్వనిని కావ్య జీవితమని యంగీకరింపక-ఇట్లనుచున్నాఁడా? అను సంశమును పరిశీలింప వలసి

యున్నది. ఈ వ్యాఖ్యాత ధ్వనిని కావ్యజీవితముగా నంగీకరించునపుడు చిరంతను లగు నాలంకారికులు దానిని చెప్పకుండుటవలన నవశ్యముగ కావ్యజీవితమగు దాని లక్షణమును చెప్పవలసియే యుండును. 'కావ్యజీవితమగు ధ్వనిని పూర్వులు చెప్పకుండుటవలన నది కావ్యము కాదు' అని యితఁడు చెప్పుట ధ్వన్యభావవాద విరుద్ధ ప్రసంగమే యగును. ధ్వనిని కావ్య జీవితమని యంగీకరింపక, ధ్వని-కావ్యజీవితము కాదు' అని చెప్పినయెడల ఈ వ్యాఖ్యాత చెప్పినదియు, ద్వితీయాభావవాద గ్రంథమునకు లోచనకర్త చెప్పినదియు, నగు నభిప్రాయము-ఒకటే యగును. పాఠకులు-లోచనకర్త చెప్పిన ద్వితీయ ధ్వన్యభావవాదతాత్పర్యము నిట్లు తెలియఁదగును. ''కావ్యసౌందర్య హేతువుకాని'ధ్వని'యనునది ఏదో యుండిన నుండుఁగాక! అది-ప్రస్థాన వ్యతిరిక్తము. కనుక నృత్త గీత వాద్యనయననికోచ నాదులవంటి దగు ఆ ధ్వని-కావ్యమునకుసంబంధించునదికాదు. కనుక దానిని-ఒక కావ్యప్రభేదముగా చెప్పఁదగదు. కాఁగా; కావ్యప్రభేదములలోనే చేరని ధ్వని-కావ్య జీవితమెట్లగును?'' అని.

లోచ : అవ :— (మే మిప్పుడు చెప్పుచున్న) 'ఈ ధ్వని-చారుతా హేతువు కానిండు. [మీరు వెనుక చెప్పిన] శబ్దార్థ-గుణాలంకారములయందు-అంతర్భూతముగూడ కానిండు. అయినను-'ధ్వని' అను ఈ భాషతో, ఇది-జీవితమని [ఇంతవఱకును] ఎవ్వఁడును చెప్పియుండలేదు' అను నభిప్రాయము నాశంకించి-తృతీయాభావవాద ప్రకారము నుపన్యసించుచున్నాఁడు.

ప్రభా : అవతారికార్థము :— 'అయ్యా! ధ్వని-సౌందర్య హేతువుకాదని ధ్వన్యభావవాదులయిన మీరనవద్దు. అది-ప్రస్థానాతిరిక్తమని మేమును (ధ్వని వాదులమును) అనము. మేము చెప్పిన ధ్వనిని గూడ-మీరు సౌందర్య హేతువుగా నంగీకరించి, మీరుచెప్పిన గుణాలంకారాదులలోనే-వేనిలోనో అంతర్భవింపనిండు. అయినను 'ధ్వని' అని యీ క్రొత్తభాష (పేరు)తో, 'ఇదే-కావ్యజీవితము'-అని లక్షణకర్తలలో నొక్కఁడైనను, నేటి వఱకును చెప్పియుండలేదు. కనుక మేమీ విషయమును జెప్పుటకే ధ్వని నిరూపణ ప్రయత్నము నొనర్చుచున్నాము' అని ధ్వనివాది-అనవచ్చునని యాశంకించి, తృతీయాభావవాద ప్రభేద ముపన్యసింపఁబడుచున్నది.' అనునిది లోచనోక్తమగు నవతారిక యందలి యభిప్రాయము.

(8) మూలము :— తిరుగ వేఱొక కొందఱు :— వేఱొక విధమున "ధ్వని-లేదు" అనునంశము నిట్లు చెప్పవచ్చును.

"ధ్వని" అను నామముతో-అపూర్వ [నవీన] మగునధి-వేతొకటి-ఏదియును సంభవింపనే సంభవింపదు. ఏలనిన; అదికూడ [అపూర్వమని ధ్వనివాదులనుచున్న ధ్వనికూడ.] [కావ్య]సౌందర్య హేతువగుట తప్పదు. కనుక, కామనీయకము నతిక్రమింపని [సౌందర్యహేతువుకాకతీరని]ధ్వనికూడ-పూర్వోక్తములగు చారుతా హేతువులయందే [గుణాలంకారములయందే] అంతర్భవించును. ఆ సౌందర్యహేతువులలో నున్నదానికే-ఒకదానికి"ధ్వని"అని అపూర్వ మగునొక సమాఖ్యామాత్రమును [నామమాత్రమును]ఉంచినయెడల-అదియేదో చెప్పినట్లే యగును. [క్రాని దాని యందెట్టి విశేషమును నుండునదికాదు.]

లోచ :— కామనీయకమనఁగా; కమనీయముయొక్క కర్మ [సౌందర్యము యొక్క పని] అనఁగా; సౌందర్యధీ హేతుత్వము.

ప్రభా :— ధ్వన్యభావవాది యనుచున్నాఁడు. 'ఇంతకు ముందెవ్వరిని తెలియనిదని మీరు చెప్పిన ధ్వనికూడ-ఏదో కావ్యమునందు తానుండి-సహృదములకు 'ఇది-సుందరమగు కావ్యము' అను తలంపును గలిగింపక తప్పదు. కనుక-రుచెప్పిన ధ్వనికూడ-అలంకారాదులవలె కావ్య సౌందర్య కారణమే కాకతీరదు. ౦దర్య కారణమగుటను మీరని మీధ్వనికి-అలంకారాదులకంటె ప్రత్యేకిత్వము ద్ధించునది కానేరదు. అప్పుడది-వెనుకటి సౌందర్యహేతువులలోనే చేరకతీరదు. ట్టి దాని కీయపూర్వ నామకరణమును, దానికే-కావ్య జీవితత్వపట్టాభిషేకమును-ముచితము గానేరవని భావము.

లోచనము : అవ :— 'వాగ్వైచిత్ర్యములసంఖ్యేయములు. కనుక, యొక వైచిత్ర్యమును, కావ్యలక్షణ కర్తలగు పూర్వులు కనుఁగొనని దానిని ము కనుఁగొంటిమి. అది-పూర్వోక్తములగు అనుప్రాసాదులయందుఁగాని, ధుర్యాదులయందుఁగాని, అంతర్భవించునది కాదు.' అని ధ్వనివాదు లనవచ్చు యాశంకించి ['అట్టి దానిని మీరు కనిపెట్టి యుండవచ్చు' అని] అంగీకరించి, హరించుచున్నాఁడు.

(9) మూలము :— మఱియు వాగ్వికల్పములు-[వాగ్ వైచిత్ర్యములు]-అనంతములు. కావున ప్రసిదులగు కావ్యలక్షణ విధా

తలు ప్రదర్శింపని-ఏదోయొక (సుందరమగు) కావ్యప్రభేదలేశమును గనుఁగొని, తదలీక సహృదయత్వభావనాముకుళిత నేత్రులయి [ధ్వనిని గుఱించినదియగు మిథ్యా సహృదయత్వమును భావించు కొనుటచేత మూతపడిన కన్నులుగలిగిన] [ధ్వనివాదులు] "ధ్వని, ధ్వని" అని యెందులకో నృత్యము చేయుచున్నారు. దానియందగు హేతువు నెఱుఁగఁజాలకున్నాము.

లోచనము :→ వాగ్ వికల్పము లనఁగా; వాక్కులయందగు విచ్ఛిత్తులు. [వైచిత్ర్యములు] వక్తి-ఇతి-వాక్. [ఉచ్చరించును గనుక] వాక్కు శబ్దము-ఉ. చ్యతే, ఇతి-వాక్ [చెప్పఁబడును గనుక] వాక్కు-అర్థము-ఉచ్యతే-అనయా-ఇతి = వాక్ [సాధనమగు దీనిచేత-అర్థము చెప్పఁబడును గనుక] వాక్కు-అభిధావృత్తి. [వ్యాపారము] [ఇట్లు-శబ్దము-అర్థము-వ్యాపారము అనునవి మూడును గూడ-'వాక్' అను పదముచేతఁజెప్పఁబడును.] అందు-వాక్ పదముచేతఁజెప్పఁబడిన శబ్దార్థముల వైచిత్ర్యప్రకారములు-అనంతములు. [తుదిలేనివి] [వాక్పదము చేతనే చెప్పఁబడిన] అభిధా వ్యాపారముయొక్క వైచిత్ర్యప్రకారములుగూడ-అసంఖ్యేయములు. [లెక్కలేనివి] 'ప్రకారలేశము' అని యభావవాది చెప్పినది-సౌందర్య హేతువే-అది-గుణమో-అలంకారమో యగును. ఆ చారుత్వ హేతువు కూడ-[ఇంతకుముందే వామనాచార్యునిచేత] సామాన్యలక్షణముచేతనే సంగ్రహింపఁబడి యున్నది. చూడుఁడు.

'కావ్యశోభాయాః కర్తారో ధర్మాగుణాః
తదతిశయ హేతవస్త్వలఙ్కారాః'

ఏవి-శబ్దార్థమయమగు కావ్యముయొక్క శోభకు (సౌందర్యమునకు-అనఁగా సౌందర్య స్వరూప నిష్పత్తికి) కారణములో, అవి-[ధర్మియగు కావ్యముండునంత వఱకును ధర్మ భూతములుగా నుండునవియగు] గుణములు. ఆ గుణములచేత నుదయించునదియగు శోభను-అతిశయింపఁజేయునవియగు కారణములు-అలంకారములు' అని. మఱియు [భామహుఁడు] భామహాలంకా ?మ నిట్లు చెప్పెను

'వక్రాభిధేయశబ్దోక్తిరిష్టా వాచామలఙ్క్రియా'

'అర్థములను, శబ్దములను, లోకోత్తర రూపముతో నుండునట్లు చెప్పుటయే వాక్కుల కలంకారము' అని మాయభిమతము'' అని.

ప్రభా :— కనుక-ఏయే వైచిత్ర్యములను, ఎవ్వరెవ్వరు కనుఁగొని చెప్పి నను, ['ఇట్లు పూర్వోక్తమగు సామాన్య లక్షణముచేతనే, ఆ వైచిత్ర్యములన్నియు సంగ్రహింపఁబడుటవలన తత్కర్తలు-వానిని గ్రొత్తగాఁగనిపెట్టిరని తలంపఁ గూడదు' అని లోచనాభిప్రాయము.]

లోచ :— 'వాగ్ వికల్పములు' అను వృత్తియందలి వాక్యమునకు-ఇంకొక యర్థమును గూడ ఇట్లు చెప్పవచ్చును. 'వాక్కులయొక్క ప్రవృత్తులకు హేతువులగు ప్రతిభావ్యాపారములకు సంబంధించునవియగు తుల్య ప్రకారములు-అనంతములు. అని' [వాగ్ వికల్పములు-వాగ్వైచిత్ర్యములని మొదటియర్థము.]

ప్రభా :— 'నృత్యము నొనర్చు చున్నారు' అను వృత్తియందు-కర్తలు చెప్పఁబడకుండుటవలన శ్రీ లోచనకర్త వారి నిట్లు చెప్పుచున్నాఁడు.

లోచ :— నృత్యముచేయుచున్న వారెవ్వరనఁగా; 1) ధ్వని లక్షణ కర్తలు, 2) ధ్వని కావ్యకర్తలు, 3) ధ్వని కావ్య శ్రవణముచేత నుద్భవించిన చమత్కారముగల శ్రోతలు అని.(వీరు ముప్పురును, ధ్వనివాదులే యగుదురు గనుక ఆంధ్రమూలమున (ధ్వనివాదులు) అని ప్రకటితము.)

ప్రభా:—''పఠించిన పదమునే తిరుగ పఠించుట మాత్రమేయగు'ధ్వనిధ్వని' అను-వీప్స'చూడుచూడు'మున్నగు వానివలె అభినివేశాతిశయముచేత నుదయించునదియగు సంభ్రమమును సూచించునదియే యగునను నభిప్రాయమున ధ్వనివాదులు పలుకునదియగు నావీప్సను తాను గూడ ననుకరించి-అభావవాది-'ధ్వని విషయమున తనకుఁగల అనాదరమును బ్రకాశింపఁజేయుచున్నాఁడు'' అని వృత్తికారుని యభిప్రాయమును లోచనకర్త-సంగ్రహించుచున్నాఁడు.

లోచ :— అభావవాదమును జెప్పుచున్న వృత్తికారుఁడు, 'ధ్వనివాదులు-'ధ్వనిధ్వని' అని యెందులకో నృత్యముఁజేయుచున్నారు' అని చెప్పెను. వృత్తికర్త-ఇచ్చట-'ధ్వని ధ్వని' అను వీప్సచేత [రెండుమారులు చెప్పుటచేత] [ధ్వనివాదికిగల] సంభ్రమమును సూచింపఁజేయుచు, [అభావవాదికి ధ్వని విషయమునఁగల] అనాదరమును బ్రదర్శించుచున్నాఁడని తెలియునది.

ప్రభా :— 'కావ్య జీవితమగు నపూర్వ (ధ్వని) వస్తువేదో తెలియని యెడల-వీరిట్లు నర్తింపరు. కనుక వారొనర్చుచున్న నృత్యములవలననే-తదితరులకు తెలియని ధ్వనియేదో వారికి స్ఫురించినదని చెప్పవచ్చును'అని యెవరైన ననుకొనవచ్చునని యాశంకించి-అభావవాది యభిమతమును లోచనకర్త చెప్పుచున్నాఁడు.

లోచ :— [నిపుణమగు తీరున నిరూపించి విచారించునెడల ధ్వనియను నర్థమేదియును లేకున్నను] " 'ధ్వని' అనుశబ్ద (మాత్ర)మునందు వీరికి అత్యా దర మెందుకో తెలియకున్నది? "

ప్రభా :— ఈ ధ్వనివాదులు- [ 1 ధ్వనిలక్షణకర్తలు, 2 ధ్వని కావ్య కర్తలు, 3 ధ్వని కావ్యశ్రోతలు.] 'ధ్వని ధ్వని' అని, అసత్యమగు సహృద యత్వమును భావించుకొని, కన్నులు మూసుకొని నృత్య మొనర్చుచు, ధ్వని యెడల ప్రదర్శించుచున్న అత్యాదరము-అర్థవిషయమునఁగాక ధ్వని శబ్ద మాత్ర విషయమునందే యగుచున్నదని లోచనాభిప్రాయము.

(10) మూలము :— మహాత్ములగు ఇతరులు [లక్షణకర్తలు] వేలకొలఁదియు, అలంకార ప్రకారములను ప్రకాశింపఁజేసియు, ప్రకాశింపఁజేయుచును, నున్నారుగదా! వారి కెవ్వరికిని గూడ ఈ [ఇట్టి] దశ, [ఘనత] వినఁబడుటలేదు. కనుక ధ్వని-[అనునది] ప్రవాదమాత్రము.

లోచ :— ఈ దశయనఁగా; స్వయముగా దర్పించుట, ఇతరులచేత స్తుతింపఁబడుట.

ప్రభా :— మావంటివారులేరని తమకు తామే గర్వించుచుండుట, కావ్య శ్రోతలచేత స్తుతింపఁబడుట-ధ్వనివాదులకుఁగలిగిన ఘనత.

లోచ :— "కనుక ధ్వని-ప్రవాదమాత్రము" అనునది-అభావవాదు లందఱికిని సాధారణ [సామాన్య] మగు ఉపసంహారము.

అదెట్లనిన :— "ధ్వని-శోభా [సౌందర్య] హేతువయినయెడల గుణా లంకారములకంటె వ్యతిరిక్తము [వేఱయినది] కాదు." [అనునది అభావవాదు లలో మొదటి వారి వాదమునందలి ముఖ్యాంశము.] అది-గుణాలంకార వ్యతి రిక్తమగునెడల-శోభా హేతువు [గూడ] కాదు. [అనునది రెండవ వారి వాదము నందలి ముఖ్యాంశము.] [ఆ ధ్వనికూడ-శోభాహేతువయిన నగుఁగాక! అది యు-సౌందర్య హేతువులయందు-అంతర్భవించునదియగు నొక సౌందర్యహేతువే

యగును. కనుక] అది-శోభాహేతువయినను-ఇంత యాదరమునకుఁదగినదికాదు. [అనునది-అభావవాదులలో మూడవ వారి వాదము నందలి సారాంశము.]

ప్రభా :— "ధ్వని-ప్రవాదమాత్రము" అను ముగింపుమాట-అభావ వాదమునందలి మూడవ వారి వాదమునకు మాత్రమే సంబంధించినదికాదు. అభావవాదులందఱికినిగూడ-ముఖ్యముగా సాధింపఁదగినది-[సాధ్యము] ధ్వన్యభావ మొక్కటియే; కనుక, "ప్రవాదమాత్రము" అనునది-అభావవాద సాధారణ మని తెలియఁదగునని లోచనాశయము. 'తిరుగ' అను తృతీయాభావవాద ప్రారంభమునందలి మొదటి పదము-అభావసామాన్యమునే చెప్పునని తెలియునది.

(11) మూలము :— కనుకనే, ఈ ధ్వనికి-[నిజముగా]"క్షోదక్షమమగు [విమర్శకు నిలువఁదగిన శక్తిగల] తత్త్వమున్నది" అని దానిని కొంచెముగనైనను ప్రకాశింపఁజేయుటకు [ఎవ్వరికిని] శక్యము కానేరదు. అదెట్లనిన :— ఈ విషయమునందే శ్లోకము నొక దాని నొకఁడు రచించెను. [చూడుఁడు!]

[మనోరథకవికృత సంస్కృత శ్లోకము]

"యస్మిన్నస్తి నవస్తు కిఞ్చన మనః ప్రహ్లాది సాలఙ్కృతి
వ్యుత్పన్నై రచితంచ నైవ వచనైర్వక్రోక్తి శూన్యంచయత్
కావ్యం తద్ ధ్వనినా సమన్వితమితి ప్రీత్యాప్రశంసన్ జడో
నో విద్మోఽభిదధాతి కింసుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః". (2)

మ॥ హృదయాహ్లాది, యలంకృతార్థ,మగు నేయే వస్తువున్ లేనిదె
య్యేది, వ్యుత్పన్నవచోవిహీనకృతియే,-దెచ్చోటు,వక్రోక్తి యుం
డదొ,దానిన్'ధ్వని యుక్తకావ్య'మని మూఢాత్ముండు-ప్రీతాత్ముఁడై
వదరున్, విజ్ఞుఁడు తెల్పుమన్న; ధ్వనిరూపమ్మేమి భాషించెడిన్?

లోచనము :— "ఈ ధ్వన్యభావ [వాద] మును మేము 'నిర్మూలము గనే' [మూలమేదియు లేకుండనే] సంభావించి-[ఊహించి] దూషించిన వారలము కాము" అని వృత్తికారుఁడు - ఒక కవిచెప్పిన [మీది] శ్లోకము నుదాహరించుచున్నాఁడు. ఈ శ్లోకకర్త - ఈ గ్రంథకర్తయుండిన కాలమునందుండిన వాఁడే. ఇతనిపేరు 'మనోరథుఁడు'.

ప్రభా : ప్రశ్న :— లోచనకర్త-వెనుక, 'మేమీ యభావవాదుల వికల్పము లను విని చెప్పిన వారలముకాము. ఊహించి దూషించుచున్నాము' అనిచెప్పెను. ఇప్పుడు-'నిర్మూలముగ దూషించిన వారలముకాము' అని చెప్పుచున్నాఁడు. ఇది స్వచన విరోధము కాదా? ఉత్త :— కాదు - స్వవచన విరోధమును తొలఁగించుకొనుటకే శ్రీ లోచనకర్త-ఇచట-'నిర్మూలముగనే' [నిర్మూలైవ] అని ఏవ కారార్థమును [ఏవకారమును] ప్రయోగించెనని తెలియునది. గ్రంథకర్తృ సమ కాలికుఁడనియు, మనోరథనాముఁడనియు, శ్రీ లోచనకర్తచేతనే చెప్పఁబడిన, ఒక కవిచేత రచింపఁబడిన యీ శ్లోకము-అభావవాదరూపము - ఉండుటవలన-ఈ వాదము అసలే మూలము లేనిదికాదు. అయినను ప్రఘాతమూలము [విస్తృతమగు మూలముగలది]కాదు. కనుక-ఈ యభావవాదము-మే మూహించినంత విస్తృత మగు రూపముగలది కాకున్నను, అసలే మూలములేనిదికాదు' అను నభిప్రాయ మును-'నిర్మూలముగనే' అనుదానియందున్న ఏవకారముచేత సూచించెనని గ్రహించునది.

ప్రశ్న :— 'నిర్మూలముగానే సంభావించి-దూషించిన వారలముకాము' అని శ్రీ లోచనకర్త-వచించెనుగదా!-అభావవాదములను సంభావించుటయే జరిగి నది కాని యింకను దూషించుట (వానిని ఖండించుట) జరిగినదా?

ఉత్త :— 'అభావవాద దూషణము ముందు చేయవలసియే యున్నను, 'ఆ దూషణము-ధ్వనివాది బుద్ధిస్థమైయున్నది. కనుక-చేసినట్టిదే యగును'-అను నభిప్రాయమున 'దూషించిన వారలము' అని భూతకాలముచేత నిర్దేశింపఁబడినది. [ఇందలి ఫలితార్థము నిట్లెఱుఁగునది.] ప్రశ్న :— అయ్యా! కొందఱు - ధ్వనియొక్క లేమిని ['జగదుః'] 'చెప్పిరి' అను లిట్ప్రయోగము - కారికా కార కృతముగదా! దానిచేత - అభావవాద మానాటికే యున్నదని తోచును. వృత్తికారుఁడు -. అది పరోక్షత్వమాత్ర బోధకమను నభిప్రాయముచేతనో, ఇంతేకారణముచేతనో, అభావవాదములను 'కొందఱిట్లనవచ్చును' ఇత్యాదిగా సంభావనా బోధకములగు లిఙ్లులచేత ప్రకటించెను. [ధ్వని[కారికా] కర్త యు, ఆలోక [వృత్తి] కర్తయు; భిన్నులైనను - కాకున్నను-కారికా-వృత్తి భేదమున నిట్లు ప్రయుక్తమని పాఠకులు గుర్తించునది.] శ్రీలోచనకర్త - కారికాకర్త ప్రయోగించిన లిట్ ప్రయోగమును, వృత్తికర్త ప్రయోగించిన లిఙ్ ప్రయోగమును, సమర్థించి, 'వృత్తికారుఁడొనర్చిన లిఙ్ ప్రయోగము-కారికా కారుఁడొనర్చిన లిట్ ప్రయోగమును సమర్థించునదియే' అని చెప్పి-'మేమీ అభావ

వాదుల వికల్పములను వినియుండినవారము కాము. అయినను వారిట్లు చెప్ప వచ్చును'అని సంభావనాపరములగు లిఙ్ ప్రయోగములచేత మేమూహించి చెప్పిన సంభావనలనే ముందు దూషింపనున్నాము' అని (13పే) చెప్పెనుగదా? వృత్తి కారుఁడు-గ్రంథకర్తృ సమకాలమునందే-మనోరథకవిఅనునభావవాది ధ్వనివాదిని జడుఁడని దూషించుచు రచించిన శ్లోకము నొకదాని నుదాహరించెను. లోచన కర్త-ఆ శ్లోకమును వ్యాఖ్యానించుటకు ముందు 'ఈ యభావవాదమును మేము నిర్మూలముగనే [మూలము లేకుండఁగనే] దూషించిన వారలముకాము' అనునది వృత్తికారుని యభిప్రాయమని ప్రకటించెను. కాఁగా, ఈ లోచనకర్త-లోచనము-పూర్వాపర సందర్భమును సమీక్షించునదిగా కాన్పింపకున్నది. లిఙ్ ప్రయోగము లను సమర్థించునపుడు-అభావవాద వికల్పములను సంభావనలని చెప్పిన యీ వ్యాఖ్యాత-ఇప్పుడు-ఈ'యభావవాదము నిర్మూలము కాదు' అని చెప్పుట యెట్లు సంగతమగును?

ఉ :— లోచనకర్త చెప్పిన 'నిర్మూలముగనే' అనుపదముయొక్క గూఢార్థమును మీరు సమీక్షించినయెడల మీ సంశయములు దూరీకృతములగును. ఆనాఁటికి-అభావవాదమసలే లేనిదికాదు. అట్లని విస్తృతముగా నున్నదికాదు. కనుక 'ధ్వన్యభావవాదము - గ్రంథకర్తృసమకాలమున సామాన్యరూపముతో నున్నను, వృత్తికారుఁడూహించి చెప్పిన విశేష రూపమున విస్తరించి యుండుట లేదు' అను నభిప్రాయము-'నిర్మూలముగనే' అనుచోనున్న ఏవకారమువలన లభించును. వృత్తికారుఁడు-మీఁది శ్లోకము నుదాహరించియు, సంభావనార్థకము లగు లిఙ్లను ప్రయోగించుటకు కారణము-ఇంతమాత్రమేయగు [అల్పమగు] అభావవాదమును తాను వినియున్నను, విశేషించి తానూహించి, ప్రదర్శించిన అభావవాదముల నన్నిఁటిని తానువినకుండుటయే యగునుగదా? లోచన వ్యాఖ్య-సంగతముకానియెడల-వృత్తికారునివృత్తికూడ-సంగతముకానిదియేయగును.అట్టిచో ధ్వనికారుఁడు వేఱు-వృత్తికారుఁడు వేఱు. అనివారిని విభజించి, 'వృత్తికారుఁడు కూడ-ధ్వనికారమతమునకు భిన్నమగు రీతిని సంభావనా బోధకములగు లిఙ్లను ప్రయోగించుట-సముచితముకాదు' అని-మీరని-అభావవాదములను ఊహించినట్లు చెప్పిన వృత్తికారుని వివరణమునుగూడ-దోషయుక్తమని చెప్పవలసివచ్చును.అది మీకు సమ్మతమగునా?

ప్రశ్న :— [మౌనము వహించును.]

లోచనము :— [హృదయాహ్లాది-అను పద్యార్థము] ధ్వని-అలంకృతు లతోఁగూడినదికాదు. కనుక, మనస్సునకు ప్రహ్లాదము నొసఁగునదికాదు. కనుక

'హృదయాహ్లాది...............వస్తువున్ లేనిది' అను దానిచేత-ధ్వని-అర్థాలంకారములులేనిదిగాఁ జెప్పఁబడినది. 'వ్యుత్పన్నవచో విహీనకృతియేది' అను దానిచేత-'ధ్వని - శబ్దాలంకారములు లేనిది' అని చెప్పఁబడినది. 'వక్రోక్తి' అనఁగా; ఉత్కృష్టమగు సంఘటన. కనుక, 'ఎచ్చోట వక్రోక్తి యుండదో' అను దానిచేత శబ్దార్థగుణములు-ధ్వని కృతియందులేవని చెప్పఁబడినది.

" 'వక్రోక్తి యుండదో' [వక్రోక్తి శూన్యంచయత్] అను దానిచేత [అలంకార] సామాన్య లక్షణమగు వక్రోక్తి 'లేదు' అని చెప్పుటచేత-సర్వాలంకారములును గూడలేవు' అని చెప్పినట్లైనది" అని కొందఱు [వ్యాఖ్యాతలు] చెప్పిరి. ఇట్లు చెప్పినప్పుడు 'హృదయాహ్లాది............అను వాక్యముచేతఁ జెబ్బఁబడిన అర్థాలంకారములలేమి-మఱలఁ జెప్పఁబడుటచేతనగు పునరుక్తిదోషము-పరిహృతము కాదు. ప్రీతాత్ముఁడనఁగా; గతానుగతికమగు [స్వయముగా విచారింపక-ఇతరులు చెప్పినదాని ననుసరించునదియగు] రాగము గలవాఁడు. జడుఁడగు ధ్వనివాది-జడుఁడెవ్వఁడైన నడిగినయెడల - భ్రూభంగ - కటాక్షములచేతనే ప్రత్యుత్తరము నిచ్చుచు, యథేచ్ఛముగా ధ్వని స్వరూపమును జెప్పునుగాని సుమతియగు విజ్ఞుఁ డడిగిన యెడల నట్లు చెప్పఁజాలఁడని చతుర్థ పాదాభిప్రాయము నెఱుఁగునది.

ఈః యభావవాద వికల్పములన్నియుఁగూడ శృంఖలాక్రమమున వచ్చినవియే, గాని అన్యోన్య సంబంధము లేనివికావు. [వృత్తికారుఁడు చెప్పిన వాక్కుల వలననే వీని సంబంధము తెలియఁబడుచున్నది.] అదెట్లనిన :- తృతీయాభావవాద ప్రకారము నుపక్రమించునపుడు 'తిరుగ' అనుమాటకిదియే (పరస్పర సంబంధమును దెలుపుటయే) అభిప్రాయము. 'ధ్వని-ప్రవాదమాత్రము' అను (ఒకే మాటతో కావింపఁబడిన) ఉప సంహారమునందలి యేకత్వముకూడ-దీనినే [ఈః యభావవాదప్రకారములన్నియు-పరస్పర సంబంధులు-అను నభిప్రాయమునే] తెలుపును. ఈః యభావవాదమున కంతకును [వెనుకొ చెప్పిన తీరున] సంభావనయే [ఊహాయే] ప్రాణము. [ఆధారము] కనుక, కారికాకారునిచేత 'జగదుః' 'చెప్పిరి' అని భూతకాలమును బోధించునదియగు లిట్టు చెప్పఁబడియెను. [ముందు చెప్పఁబడునదియగు] 'భాక్తవాదము మాత్రము-పుస్తకములందు [లక్షణ గ్రంథములందు] అవిచ్ఛిన్నముగా నున్నది. కనుక నిత్య ప్రకృత్తమయిన వర్తమానము నపేక్షించి-'భాక్తమాహుః' 'చెప్పుచున్నారు' [చెప్పుదురు.] అని, లట్టు [లడ్థము] ప్రయోగింపఁబడినది. [ఆంధ్రమున-తద్ధర్మార్థకము-సర్వకాల బోధకము. కనుక, ఆంధ్రీకృతకారికయందు, [లిట్టునందును, లట్టునందును] 'ధ్వనియే

లేదని కొందఱందురదిభాక్తంబంద్రు వేఱొక్కరు' అని సర్వకాల బోధకమగు తద్ ధర్మార్థకమంతటను ప్రయుక్తము.]

ప్రభా : అవ : — కారికాకర్త-['తస్యాభావం జగదురపరే'] 'అధ్వనియే లేదని కొందఱందురు' అనిచెప్పిన ధ్వన్యభావవాద వికల్పము నొకదానినే ఆలోక [వృత్తి] కారుఁడు. త్రివిధముగాఁబ్రదర్శించెను. వృత్తికారునిచేత-'కొందఱిట్లన వచ్చును' అని ప్రదర్శింపఁబడిన యభావవాదము-అందు మొదటిది. అతనిచేత 'మఱికొందఱిట్లన వచ్చును' అని ప్రదర్శితమయిన యభావవాదము-రెండవది. 'తిరుగ-వేఱొక కొందఱు-వేఱొక విధమున ధ్వన్యభావము నిట్లు చెప్పవచ్చును' అని ప్రదర్శితమయిన అభావవాదము-మూడవది. వృత్తికారుఁడు-ఇట్లు ధ్వన్యభావవాద వికల్పమునందలి, అవాంతరభేదములగు వికల్ప భేదముల మూఁడింటిని ప్రదర్శించి-'ధ్వని గుణవృత్తి' అని చెప్పునదియగు భాక్తతావాదమునుపక్షేపించుటకు, 'ధ్వనిగా కావ్యమునాత్మ' అనుకారికయందు-కారికాకర్త-'ధ్వని-భాక్తము' [గుణవృత్తియగు లక్షణచేత సిద్ధించునది.] అని చెప్పినదియగు కారికాభాగమును ప్రదర్శించి-వివరించుచున్నాఁడు.

(12) మూలము :— "భాక్తంబంద్రు వేఱొక్కరు"[భాక్తమాహుస్తమన్యే] వేఱొకరు-ధ్వని సంజ్ఞితమగు నా కావ్యాత్మను [కావ్య జీవితమును] "గుణవృత్తి" అని చెప్పుదురు. [చెప్పుచున్నారు.]

ప్రభా : ప్రశ్న :— అయ్యా! ధ్వనికారుఁడు, రెండవదియగు భాక్తవాదమును జెప్పుటకు, 'వేఱొకరు-'ధ్వని-భాక్తము' అని చెప్పుచున్నారు' అని చెప్పెను. భాక్తమననేమో తెలియలేదని మే మనుకొనుచుండ, వృత్తికారుఁడు దానిని వివరించుటకుఁగాఁబోలును 'వేఱొకరు-[వృత్తికారుఁడు తెలిపిన అభావవాదులు ముగ్గురికంటెను వేఱగునాలుగవవారు-భాక్తతావాదులు]ధ్వనిని-గుణవృత్తి అని చెప్పుచున్నారు' (చెప్పుదురు.) అని చెప్పెనుగదా! భాక్తము, గుణవృత్తి, అననేమి? భాక్తమనఁగా గుణవృత్తియనియే నర్థమున్నదా?

ఉత్త :— భాక్తమను పదము-'భక్తి' అనుపదమునుండి వచ్చినది. శ్రీలోచనకర్త-భక్తి శబ్దార్థమును భాక్త శబ్దారమును, గుణవృత్తి శబ్దార్థమును, క్రమముగా నిర్వచించి - గౌణశబ్దమును, లాక్షణిక శబ్దమును, గూడ - భాక్త శబ్దముచేత నెట్లు చెప్పఁబడునదియు వివరించును. భాక్తమనఁగా; గుణవృత్తియు

నగును. కనుక వృత్తికారుఁడు [ప్రస్తుతోపయోగము ననుసరించి] 'భాక్త మనఁగా; గుణవృత్తి' అను నర్థమును వివరించెను. క్రింద-శ్రీ లోచన ప్రసారితమగు నర్థమును సమీక్షించునది.

లోచ :— భజ్యతే = సేవ్యతే, = పదార్థేన ప్రసిద్ధతయా ఉత్ప్రేక్ష్యతే, ఇతి భక్తిర్ధర్మః, అభిధేయేన సామీప్యాదిః, తతః ఆగతో లాక్షణికోఽర్థః. 'పదార్థము చేత భజింపఁబడుచున్నది' అనఁగా, సేవింపఁబడుచున్నది అనియర్థము. అనఁగా; 'ప్రసిద్ధతచేత ఉత్ప్రేక్షింపఁబడుచున్నది' అనియర్థము. కనుక 'భక్తి' యనఁగా; అభిధేయము [వాచ్యము] తోడి [సంబంధమగు] సామీప్యాదికమగు ధర్మము. (నిమిత్తము) దానినుండి [భక్తినుండి] వచ్చినది - భాక్తము. భక్తినుండి వచ్చిన [ఏర్పడిన] లాక్షణికమగు నర్థము భాక్తమని చెప్పఁబడును. [లక్షణావృత్తిచేత సామీప్యాది నిమిత్తమువలన ప్రతీతమగు లాక్షణికార్థము భాక్తము.]

ప్రభా :— 'గంగాయాం ఘోషః' 'గంగయందు గొల్లపల్లె' (కలదు.) మొదలగు ప్రయోగములు [మహాకవి కృతులయందు] కలవుగదా! శబ్దమునకు సాక్షాత్సంకేతితమగు నర్థమే-ముఖ్యమని చెప్పఁబడును. ఆ యర్థమే (శరీరమునకు) ముఖమువలె శబ్దమునకు ప్రధానమగుటవలన ముఖ్యమగుచున్నది. సాక్షాత్తుగా సంకేతితమయిన యర్థమునందు-ఈ శబ్దమునకుఁగల ముఖ్యమగు వ్యాపారము-'అభిధ' అని చెప్పఁబడును. అభిధకే(శబ్ద) శక్తియను నింకొకపేరున్నది,

'గంగయందు గొల్లపల్లె'అనుచోట 'గంగయందు-'అనుపదమునకు'జలప్రవాహమునందు' అను నర్థము-అభిధచేతఁదెలుపఁబడుటవలన అభిధేయమగుచున్నది. అభిధేయమే మొదట గోచరించుచు. శబ్దమునకు ముఖ్య వ్యాపారమగు నభిధచేత మొదటఁ గోచరించుటవలన అభిధేయమే [వాచ్యమే] ముఖ్యార్థమని తెలియఁదగినది. (లాక్షణిక శబ్దమును నిరూపించుటకు ముందు లక్షణ అనఁగానేమో చెప్పఁబడుచున్నది.) 'ముఖ్యార్థబాధే, తద్యోగే, రూఢితో, ఽథ ప్రయోజనాత్ అన్యోఽర్థో లక్ష్యతేయత్ సా లక్షణాఽరోపితాక్రియా' [కావ్యప్రకాశము] అని-లక్షణకు లక్షణము చెప్పఁబడినది. దీని యర్థము నిట్లెఱుఁగునది. శబ్దముయొక్క ముఖ్యార్థమునకు (అభిధేయమునకు)బాధ గ్రహింపఁబడునపుడు (అన్వయము కుదురనపుడు లేక తాత్పర్యము కుదురనపుడు) ముఖ్యార్థముతోడి సామీప్యము మొదలగు (సాక్షాత్) సంబంధము తెలియఁబడినపుడు-శబ్దమునకు సంబంధించిన ఏశక్తి-[ఏవృత్తి] రూఢివలనఁగాని, [లక్ష్యార్థమునందు ముఖ్యార్థగతమగు శీతలత్వ పావనత్వాది ప్రతీతిరూప ఫలమగు] ప్రయోజనమువలనఁగాని, ముఖ్యార్థముతోడి

సామీప్యము మున్నగు ధర్మమును నిమిత్తముగాఁగొని-ముఖ్యార్థమునకు సంబంధించినదియు, ముఖ్యార్థముకంటె వేఱయినదియు, నగు నర్థమును ప్రతీత మొనర్చుచో, ఆ వృత్తియే-అనఁగా; వేఱొక యర్థమును దెలుపుటకు హేతువగు గంగాది శబ్ద వ్యాపారమే,-'లక్షణ' [లక్షణావృత్తి] అని చెప్పఁబడును.

ఈ లక్షణావృత్తి - ఆరోపితమగు క్రియ-శబ్దమునందు కల్పితము. ఇది-సాక్షాత్సంబంధముచేత ముఖ్యార్థమునందుండునదియగు వ్యాపారమే యగును. అయినను పరంపరా సంబంధముచేత శబ్దమునందున్నట్లు [కల్పితము] చెప్పఁబడుచున్నది. కనుక గంగాది శబ్దము-తనయందుండునదియగు నే వ్యాపారముచేత-ముఖ్యార్థమునకు సంబంధించిన తీరము మున్నగు వేఱొక యర్థమును, [శైత్య పావనత్వాది ప్రయోజనము నుద్దేశించి] ప్రతీతము నొనర్చునో,ఆ గంగాది శబ్ద వ్యాపారమే-(శక్తియే) లక్షణావృత్తి అని తెలియునది. 1 ముఖ్యార్థబాధ, 2 ముఖ్యార్థసంబంధమగు నిమిత్తము, 3 రూఢి, లేక ప్రయోజనము, లక్షణా బీజమని తెలియునది. ఇది-అభిధా-లక్షణా-వృత్తి నిరూపణ సంగ్రహము.లోచనోక్తమగు-భక్తి-భాక్త-శబ్ద నిర్వచనమును గ్రహించుట కీనిరూపణము-తోడ్పడునను నాశయమున,-ఈ నిరూపణము-లోచనోక్తము కాకున్నను, సంగ్రహముగాఁ దెలిపితినని పాఠకమహాశయులు గుర్తింపఁగోరెదను.'పదార్థముచేత భజింపఁబడుచున్నది'-అనఁగా,సేవింపఁబడుచున్నది.అని లోచనోక్తమగు నర్థము నిష్పన్నమగును.

'గంగాయాం ఘోషః' 'గంగయందు గొల్లపల్లెకలదు.' మొదలగు ప్రయోగములందు, 'గంగయందు' అనుపదముచేత అభిధేయమగు జలప్రవాహమునందు, పల్లె యుండునది కానేరదు. కనుక, గంగాదిశబ్దము-తన వ్యాపారమగు అభిధచేత చెప్పఁదగిన, అభిధేయమగు ముఖ్యార్థమునకు బాధ కలుగునపుడు-అనఁగా; దానికి [ప్రవాహమునకు] అభిమత వాక్యార్థమునఁబ్రవేశము కలుగదను జ్ఞానము కలిగినపుడు-గంగాది పదమునకు లక్ష్యముగా నభిమతమయిన తీరము మొదలగు నర్థము-'పదార్థము' అని చెప్పఁబడును.

ఈ గంగాది పదమునకు ముఖ్యార్థము కుదురదని తెలిసినప్పుడు-దాని ముఖ్యార్థము తోడిసంబంధములగు సామీప్యము [సారూప్యము] మొదలగు ధర్మములు-ఆ పదముయొక్క అర్థమును బోధించుటకు నిమిత్తములుగా ప్రసిద్ధములై యున్నవి. కనుక-ఆ పదార్థముచేత, అనఁగా; గంగాది పదమునకు లక్ష్యముగా నభిమతమయిన 'తీరము' మున్నగు నర్థముచేత-తన్ను బోధించుటకొఱకు-అర్థ బోధ నిమిత్తముగా ప్రసిద్ధమగు సంబంధమగు [ముఖ్యార్థముతో తీరమునకుఁగల]

సామీప్యము మొదలగు ధర్మము - భజింపఁబడుచున్నది. అనగా; సేవింపబడు చున్నది. అనియర్థము, "పదార్థముచేత - ప్రసిద్ధతచేత ఉత్ప్రేక్షింపఁబడుచున్నది" అనఁగా; "లక్ష్యముగా నభిమతమగు తీరాద్యర్థముచేత - ప్రసిద్ధమగు సామీప్యాధి ధర్మము - ఆశ్రియింపఁబడుచున్నది". అని యర్థము. ఇట్లు పదార్థముచేత - అనఁగా; గంగాది పదమునకు లక్ష్యముగా నభిమతమగు తీరము మొదలగునర్థము చేత - స్వబోధముకొఱకు [తీరరూపమగు నర్థబోధముకొఱకు] కావింపఁబడిన, [అర్థబోధకముగా ప్రసిద్ధమగు] సారూప్యాది ధర్మముయొక్క సేవయే - పదార్థ కర్తృకమగు భజనమని తెలియునది.

ప్రథా : ప్రశ్న :- "అచేతనమగు గంగాది పదార్థము-తన్ను బోధించుటకు సామీప్యాది ధర్మమును - భజించుచున్నది - సేవించుచున్నది - ఆశ్రియించు చున్నది." అని మీరు చెప్పినారుగదా ? చేతనైకనియతమగు భజనము - అచేతన పదార్థమునకు సంభవించునా ?

ఉ :— గంగాది పదార్థము-"స్వబోధముకొఱకు ', తనతోసంబంధమగు,- నిమిత్తమునుభజించునని మేముచెప్పినదినిజమేకాని-అచేతనమగు గంగాదిపదార్థము తనతోడి సంబంధమగు సామీప్యాది నిమిత్తమును (ధర్మమును) భజించుటగాని, సేవించుటగాని, ఆశ్రియించుటగాని, వాస్తము కానేరదు. ఆరోపితమే యగును. ఈ భజించుట-చైతన్యముగల జ్ఞాతయందే-వాస్తవమగునని తెలియునది.

ప్రశ్న :— "పదార్థముచేత - భజింపఁబడుచున్నది - సేవింపఁబడు చున్నది-లేక ఆశ్రయింపఁబడుచున్నది - అగు సామీప్యాది-ధర్మము-భక్తి." అను, లోచనోక్త నిర్వచనమునకు [ఆభజనము - చేతనకర్తృకమగునట్లు] ఇంకొక అర్థ మును చెప్పుదురా ?

ఉ :— "ఒక వక్త - 'గంగయందు' మొదలగు పదముచేత - తీరము' మున్నగువానిని, ప్రతిపాదించునపుడు - ముఖ్యార్థమగు జలప్రవాహమునకును, లక్ష్యార్థమగు తీరమునకునుగల 'సామీప్యము' మున్నగు సంబంధమును - నిమిత్త ముగా పర్యాలోచించుటయే-సేవించుట"అని, చెప్పుదుము. 'ప్రసిద్ధతచేత-ఉత్ప్రే క్షింపబడుచున్నది " అను వాక్యమునకు-అప్పుడు-ఇట్లర్థము నెఱుఁగవలసియుం డును. వక్తచేతఁగాని, జ్ఞాతచేతఁగాని, అభిధేయముతోడి, సంబంధమగు ఏ సామీ ప్యాది ధర్మము-అర్థబోధన నిమిత్తముగా పర్యాలోచింపఁబడునో, ఆసామీప్యాది ధర్మమే-భక్తి' అని.

లోచ :- ఇట్లు [శ్రీలోచనకర్త-భక్తిశబ్దార్థము నుగ్గడించి తదుపరి భాక్తశబ్దార్థమునుగ్గడించు చున్నాఁడు,] ''దానినుండి-అనఁగా; సామీప్యాది ధర్మమగు భక్తినుండి- ఏర్పడిన లాక్షణికమగు [లక్షణావృత్తిచేత సిద్ధించిన] 'తీరము' మొదలగు లక్ష్యార్థము - భాక్తశబ్దముచేత చెప్పఁబడును'' అని అర్థము.

ప్రభా :— గంగాది పదమునకు ముఖ్యార్థమగు జలప్రవాహమునకును, లక్ష్యార్థమగు తీరాద్యర్థమునకును, గల సంబంధములగు సామీప్యాది ధర్మములు - నిమిత్తములుగాఁగలదియగు లక్షణావృత్తి - ఈనిమిత్తభేదమువలన పంచవిధమగును. లక్షణ - సామీప్యాది నిమిత్తములు గలదనుటకు - అభియుక్తోక్తి నుదాహరించుచున్నాఁడు.

లోచనము :— అదెట్లనిన :—

''అభిధేయేన సామీప్యాత్, సారూప్యాత్, సమవాయతః,
వైపరీత్యాత్, క్రియాయోగా 'ల్లక్షణా'పఞ్చధామతా॥''

ప్రభా :— శ్రీలోచనకర్త-ముందీశ్లోకమునుదాహరణపురస్సరముగా విశదీకరించును. కనుక నిచటదీనియర్థము-తెలుపఁబడుటలేదని పాఠకులుగ్రహింతురుగాక !

ప్రశ్న :— భాక్తశబ్దము - లాక్షణికమగు నర్థమునుదెలుపునని చెప్పినది-బాగుగానున్నది. ఈ శబ్దము - గౌణార్థమును గూడ తెలుపునా ? అప్పుడు - భక్తిశబ్దార్థమేమగును ?

ఉ :— శ్రీలోచనకర్తకావించిన లోచనప్రసారమును, ప్రభామతి సమున్మీలితమొనర్చి-సమీక్షింపుఁడు.

లోచనము :— గుణసముదాయమునందు వృత్తిగల శబ్దముయొక్క అర్థమగు గుణసముదాయమునందలి భాగమగు తైక్ష్ణ్యాదికము -'భక్తి' అని చెప్పఁబడును.దానినుండి [సారూప్యనిమిత్తమగు తీక్ష్ణత్వాదిరూపమగు భక్తినుండి]ఏర్పడిన గౌణమగు నర్థముకూడ - ''భాక్తము'' అని చెప్పఁబడును. మఱియు 'భక్తి' అనఁగా; ప్రతిపాదింపఁదగిన సామీప్య, తైక్ష్ణ్యాదుల యందలి శ్రద్ధాతిశయము. దానిని ప్రయోజనముగా నుద్దేశించి-ఆభక్తినుండి వచ్చినది- (శబ్దము) భాక్తము. అది-గౌణము, లాక్షణికము, కూడనగును. మఱియు ముఖ్యార్థముయొక్క భంగము-

భక్తి. ఇట్లనుటచేత - '1 ముఖ్యార్థబాధ - 2 నిమిత్తము 3 ప్రయోజనము' అను మూడును ఉండుటయే - ఉపచారమునకు బీజమని చెప్పినట్లయినది.

ప్రభా : — భక్తియనఁగా; గంగాది పదమునకు లక్ష్యముగా నభిమతమగు తీరాది పదార్థము - స్వబోధముకొఱకు లక్ష్యమగు తీరమునకును - ముఖ్యార్థమునకును, గల సంబంధమగు సామీప్యాది నిమిత్తమును [ధర్మమును] భజించుట. దానివలన వచ్చిన లాక్షణికార్థము - "భాక్తము" అని వెనుక చెప్పఁబడెను గదా ; ఈ లాక్షణికార్థమువలెనే, గౌణార్థము గూడ - ఇట్లే - సారూప్యాది [తైక్ష్ణ్యాది] నిమిత్తధర్మభజనరూపమగు 'భక్తి', నుండి- వచ్చుటవలన - "భాక్త"మగును - అయినను భాక్తశబ్దమునకు - గౌణార్థ పరత్వము - వేరొకవిధమునఁగూడ చెప్పదగినదను, నభిప్రాయమున - దాని, నిర్వచనము నొనర్చుచున్నాఁడు. "శౌర్యాది గుణసముదాయమునందు వర్తించునది యగు - [గుణవృత్తియగు]. 'సింహము' మొదలగు శబ్దము, గుణసముదాయవృత్తి". అని చెప్పఁబడును సంకేతము ననుసరించి సింహాది శబ్దములు - జాతినిగాని, తద్విశిష్టమగు వ్యక్తినిగాని, చెప్పుచున్నను, స్వార్థమును విడిచియుండని శౌర్యాది గుణములనుగూడ - తెలుపుచు, తద్గుణసముదాయమునందేవర్తించును. గాని గుణసముదాయమునందలి భాగమున [ఏకదేశమున] వర్తించునవికావు. ఇట్లు-శౌర్యాది గుణసముదాయ వృత్తియగు - అనఁగా; - గుణసముదాయమును తెలుపునదియగు 'సింహము' మొదలగు శబ్దముయొక్క - అర్థమగు - గుణసముదాయమునందలి భాగమగు [ఏకదేశమగు] తైక్ష్ణ్యాదికము = శౌర్యాదికము "భక్తి" అని చెప్పఁబడును. [భాగము గనుక భక్తిఅని చెప్పఁబడును] - "మాణవకుడు, [పదునారేండ్లు - ఈడుగలవటుఁడు] సింహము" అను ప్రయోగమునందు - సింహము యొక్క గుణసముదాయమునందలి ఒకభాగమగు శౌర్యాదికమునకే (గౌణిచేత) మాణవకునియందు ప్రతీతి కలుగును. కనుక దానినుండి-అనఁగా;గుణసముదాయ భాగమగు భక్తినుండి [సారూప్య నిమిత్తమువలన] వచ్చిన గౌణమగు నర్థము "భాక్తము" అని చెప్పఁబడును.

"సారూప్యాదులు [తైక్ష్ణ్యాదులు] నిమిత్తములగు గుణములు. కనుక, నిమిత్త గుణద్వారమున- సముదాయమగు గుణియగుమాణవకాదులయందు, ఏ సింహాది శబ్దమునకు వృత్తియుండునో, ఆసింహాదిశబ్దార్థమగు గుణసముదాయమునందలి భాగమగు తైక్ష్ణ్యాదికము - భక్తి. ఆతైక్ష్ణ్యాది [సారూప్య] నిమిత్తమువలన వచ్చిన గౌణార్థము - భాక్తము. అని కొందఱు చెప్పుదురు. అని బాలప్రియ.

అవ : — "మఱియు" ఇత్యాదిగా చెప్పినదానిచేత - "ప్రతిపాద్యమగు

ప్రయోజనమునందలి శ్రద్ధాతిశయ రూపమగు భక్తియే - 'భక్తి'. అను భావవ్యుత్పత్తిని ప్రదర్శించుచు, దానినుండి వచ్చిన భాక్తశబ్దము - గౌణమగుశబ్దమును, లాక్షణికమగు శబ్దమును, గూడ బోధించునని చెప్పుచున్నాఁడు.

"గంగయందు గొల్లపల్లె" మున్నగు ప్రయోగములందును, "మాణవకుఁడు సింహము," మున్నగు ప్రయోగములయందును, ప్రయోజనముగా ప్రతిపాదింపఁదగిన, పావనత్వాదులయందును, సింహాదితాద్రూప్యాదులయందును, [వక్తకుఁగల శ్రద్ధాతిశయము - (భక్తియే) భక్తి. అని చెప్పఁబడును. వక్తగాని, జ్ఞాతగాని, తన మనస్సుచేత-దేనినైన ననుసంధించుట శ్రద్ధ. దానియతిశయము- శ్రద్ధాతిశయము: "దానిని ప్రయోజనముగా నుద్దేశించి" అనుదాని యర్థము నిట్లెఱుఁగునది· "పావనత్వాదులనుఁగాని, తాద్రూప్యాదులనుగాని, ప్రయోజనముగా నుద్దేశించి- [పావనత్వాదులయందుఁగాని, తాద్రూప్యాదులయందుఁగాని, కల శ్రద్ధాతిశయమునకు విషయమగు పావనత్వాది ప్రతీతినిగాని, తాద్రూప్యాది ప్రతీతినిగాని, ప్రయోజనముగా నుద్దేశించి] ఆ పావనత్వాదులయందుఁగాని, తాద్రూప్యాదుల యందుఁగాని, కల శ్రద్ధాతిశయ రూపమేయగు భక్తినుండి వచ్చిన శబ్దము - భాక్తము" అని. కనుక లాక్షణికమగు శబ్దమును, గౌణమగు శబ్దమును, గూడ - ఇట్లు - భాక్తమని చెప్పఁబడును.

మీఁది లోచనమునందు "ప్రతిపాదింపదగిన[ప్రయోజనములుగా స్ఫురింపఁజేయఁదగిన] సామీప్య తైక్ష్ణ్యాదులయందలి శ్రద్ధాతిశయము - భక్తి" అని చెప్పఁబడినది. సామీప్యాదులు ప్రతిపాద్యములు కావు. ఇదిముందు చెప్పఁబడు లోచన మతమునకు విరుద్ధమగును. కనుక - ఇచటి. సామీప్యపదముచేత- పావనత్వాదికమును, తైక్ష్ణ్యాదిపదముచేత - సింహతాద్రూప్య పరాక్రమాతిశయాదికమును, లక్షణచేత వివక్షితమని తెలియఁదగును. లేక "సామీప్య తైక్ష్ణ్యాదౌ శ్రద్ధాతిశయః" అను నీపాఠము - లేఖక ప్రమాదజనితమైనను కావచ్చునని భావింపఁదగును. మఱియు గంగాప్రవాహాది ముఖ్యార్థముయొక్క భంగముగూడ - 'భక్తి' అని చెప్పబడును. దానినుండి [ముఖ్యార్థబాధనుండి] ఏర్పడినది-భాక్తము.

'భజ సేవాయాం' అని చెప్పఁబడిన "భజ' ధాతువునుండియు, 'భఞ్జ ఆమర్దే" అని చెప్పఁబడిన భఞ్జ ధాతువునుండియు, భక్తిపదము నేర్పఱచి మీది యర్థములు నిర్వచింపఁబడియెనని తెలియునది.

ఆనిర్వచనముల సంగ్రహము నిట్లెఱుఁగునది.

(1) భంగము -భక్తి. భంగము-ముఖ్యార్థభంగము (2) భజనము-భక్తి. భజనము-ముఖ్యార్థసామీప్యాది భజనము (3) భాగము - భక్తి. భాగము - గుణసముదాయ వృత్తిశౌర్యాది భాగము, (4) [ప్రతిపాద్య] ప్రయోజనభక్తి - భక్తి. ప్రయోజన భక్తి - సామీప్యాది తాదూప్ర్యాది- శ్రద్ధాతిశయము. ఇట్లు చెప్పుటవలన 1 ముఖ్యార్థబాధ. 2 నిమిత్తము. 3 ప్రయోజనము. అను ఉపచార బీజములు, మూడును, భక్తినిర్వచనమునందున్నవి. ఉపచారమనఁగా; లక్షణయు, గౌణియు, గూడనగును. ఉపచారమనఁగా: ఒకదానియందుండు ధర్మమును -మఱియొకదాని యందారోపించుట - అని తెలియనగును. ఈః బీజములు - మూడును - ఉండు టయే-ఉపచారమునకు, బీజము. అని చెప్పినట్లయినది.

అవ : ప్రశ్న :— అయ్యా! 'గుణవృత్తి' కంటె వేరుగా 'ధ్వని' అనునది - లేదు. అని, భాక్తతావాది- చెప్పవలసియుండఁగా, ధ్వన్యాలోకకర్త (వృత్తి కారుడు) "ధ్వనిని-గుణవృత్తి అని చెప్పుదురు". అని - ఏల-సామానాధికరణ్యము చేత-నిర్దేశించెనో తెలుపుదురా ?

ఉత్త :— క్రిందనుద్ఘాటింపఁబడిన లోచనోక్తిని పరిశీలించునది.

[లోచనము] సామానాధికరణ్యముచేత - నిర్దేశించుటకిదియభిప్రాయము. అవివక్షితవాచ్యమనుధ్వనిభేదమునందు - "నిశ్వాసయుక్తిధర్మమున గ్రుడ్డిదైన యాదర్శమట్లు," మున్నగు ప్రయోగములందు - ఉపచారము - (గుణవృత్తి) ఉన్నను-ఆయుపచారమే - (గుణవృత్తియే) ధ్వనికాదు. వివక్షితాన్యపరవాచ్యము, మొదలగు, ధ్వనిప్రభేదమునందు ఉపచారము- లేకున్నను, 'ధ్వని' సంభవించు చున్నదిగదా ! అవివక్షిత వాచ్యమగు 'ధ్వని' యందుఁగూడ-ఉపచారమే - ధ్వని కాదు - ఈయంశము ముందు చెప్పఁబడును. అదెట్లనిన; కారికాకారుఁడే-ముందిట్లు చెప్పనున్నాఁడు-చూడుఁడు. "ధ్వనికి, భక్తికి, రూపభేదమ్ము కలిమి!భక్తితో ధ్వని యైక్యమ్ముఁబడయకుండు" అటునతివ్యాప్తి - అవ్యాప్తి - అగుటవలన। భక్తిచే ధ్వని లక్షింపఁబడనిదెయగు" "లక్షణావృత్తి తానుపలక్షణమ్ము - కాఁదగునొ కానొక ధ్వని ప్రకారమునకు" అని.

[ప్రభామతి] "ధ్వనివాది - 'ధ్వనియు, గుణవృత్తియు, ఒకటే' అను నభిప్రాయమును నిరాకరించును. కాని ధ్వనికి ఉపచారముతోడి సంబంధము అసలేలేదని అనడు" అను నభిప్రాయమున సిద్ధాంత విరుద్ధమగు, తాదాత్మ్యపక్ష మును - ఉపక్షేపించుటకు' ఇట్లు సామానాధికరణ్యముచేత - 'ధ్వనిని గుణవృత్తి' యని చెప్పుదురు" అని వృత్తికర్త-నిర్దేశించెనని తెలియునది."

ప్రశ్న :— ధ్వనికిని, గుణవృత్తికిని, తాదాత్మ్యములేదా ?

ఉత్త :— ఉపచారమనఁగా; గుణవృత్తి. అది - అవివక్షిత వాచ్యధ్వని భేదమునందున్నను, ఈ యుపచార రూపమే - ధ్వనికాదు. వివక్షితాన్యపరవాచ్య ప్రభేదమునందు - అసలీయుపచార స్పర్శయేలేకున్నను, ధ్వనియున్నదిగదా ! అవివక్షిత వాచ్యధ్వనియందుఁగూడ ఉపచారమగు గుణవృత్తియు - ధ్వనియు - ఒక్కటియేకావు. ధ్వనికారికాకారుఁడే. "రూపభేదముండుటవలన-ఈధ్వనియు - భక్తియు నొకటికావు" మన్నగు నభిప్రాయముచేత - వానికి తాదాత్మ్యము గూడలేదను నంశమును ముందు నిరూపించును.

ప్రభా : ప్రశ్న :— వృత్తికారుడు - భాక్తశబ్దమునకు - 'గుణవృత్తి' అను నర్థమును జెప్పెనుగదా ! 'గుణవృత్తి' అననేమి ?

ఉత్త :— క్రిందిలోచనమును, దానినిసమున్మీలితమొనర్చిన ప్రభామతిని, సమీక్షింపుఁడు.

[లోచనము] సామీప్యాదులగు ధర్మములును తైక్ష్ణ్యాదులును,[గుణములును గూడ] గుణములని చెప్పఁబడును. ఆయుపాయములచేత, వేఱొకయర్థమునందు - దేనికి[ఏశబ్దమునకు] వృత్తి [వ్యాపారము] ఉండునో, ఆయుపాయముచేత-శబ్దము నకు, దేనియందు[వేరొక యర్థమునందు] వృత్తియుండునో, ఆశబ్దమును, ఆయర్థ మును, గూడ - 'గుణవృత్తి' అని చెప్పఁబడును.

ప్రభా : ప్రశ్న :— అయ్యా ! ఈలోచనము - చూచినదానినే మరల చూచుచున్నట్లున్నది. ఇట్లు - ఒకేయభిప్రాయమును త్రిప్పిచెప్పుటచేత - ఆవాక్య ములయందేమైన నర్థభేదము - సిద్ధించునా ?

ఉత్త :— ప్రభామతినిగూడ - సమీక్షింపుడని చెప్పినది-విస్మృతమయి నదా ? క్రింది ప్రభామతినిగూడ - సమీక్షించినయెడల త్రిప్పిచెప్పుట కర్థము తెలియఁగలదు.

[ప్రభామతి] "సామీప్యాదులగు ధర్మములును, తైక్ష్ణ్యాదులగు గుణము లును, గూడ - గుణములే" అని ఇచట స్వీకరింపఁబడినవి. సామీప్యాదులగు నిమిత్తములచేత - గంగాదిశబ్దము - వేరొక అర్థమగు, తీరాదులయందు - వర్తిం చును. కనుక, లక్ష్యమగు తీరాదికమునందు వృత్తిగల గంగాదిశబ్దము - 'గుణ

వృత్తి' - అని చెప్పఁబడును. సామీప్యాది నిమిత్తములచేత - గంగాదిశబ్దము - తీరాది రూపమగు ఏయర్థమును లక్షితమొనర్చునో, తీరాదిరూపమగునాయర్థము గూడ - 'గుణవృత్తి' అని చెప్పఁబడును. ఇట్లే - తైక్ష్ణ్యాదులగు - (శౌర్యాదులగు) నిమిత్తములచేత - సింహాది రూపమగు - ఏశబ్దము - శౌర్యాది విశిష్టమగు మాణవకాద్యర్థమును - లక్షితమొనర్చునో [లక్షకమగు] ఆసింహాది, శబ్దము - 'గుణవృత్తి' అని చెప్పఁబడును. ఇట్లే - మీఁది [తైక్ష్ణ్యములగు] ఉపాయములచేత - సింహాదిశబ్దము- శౌర్యాదివిశిష్టమగు ఏమాణవకాద్యర్థమందు, వర్తించునో, లక్ష్యమగు - ఆమాణవకాద్యర్థముగూడ - 'గుణవృత్తి' - అని చెప్పఁబడును. కనుక - లక్షకమగుశబ్దము, లక్ష్యమగునర్థము, కూడ - 'గుణవృత్తి' అని చెప్పఁదగినవని చెప్పుటకే - ఇట్లు తిప్పిచెప్పుట. అని యీసరికి మీకుఁదెలిసియే యుండును.

[లోచనము] గుణద్వారమున వర్తించుట [వ్యాపారము] కూడ - గుణవృత్తియేయగును. ఈగుణవృత్తి - అముఖ్యమగు - అభిధావ్యాపారము.

[ప్రభామతి] గుణద్వారమున ననఁగా; "నిమిత్తమగు సామీప్యాదిగుణము చేత - గంగాదిశబ్దము -తీరాద్యర్థమునందు వర్తించుట" అను వ్యాపారముగూడ- గుణవృత్తియే యగునట్లు, శౌర్యాది గుణద్వారమున - సింహాదిశబ్దము -శౌర్యాది విశిష్టమగు, మాణవకాద్యర్థమునందు వర్తించుటకూడ- 'గుణవృత్తియే' యగును. ఈ గుణవృత్తి - శబ్దమునకు సంబంధించిన ముఖ్యవ్యాపారముకాదు. కనుక నిది- అముఖ్యమగు అభిధా వ్యాపారమని చెప్పఁబడును.

అవ : ప్రశ్న :— అయ్యా ! గుణవృత్తిశబ్దనిర్వచనము - ఇట్లుండినను నుండుఁగాక! - గుణవృత్తికంటె వేరగు- ధ్వని-లేదని - యెట్లు చెప్పనగును ?

ఉత్త :— క్రింది లోచనమును, దానిని - వ్రిసారించునదియగు ప్రభామతిని, చూడుఁడు.

లోచ : — "ధ్వనితీతి" - "ధ్వనించునది." అని-గాని -' ధ్వన్యతఇతి" 'ధ్వనింపఁజేయఁబడుచున్నది'. అనిగాని "ధ్వననమ్" 'ధ్వనించుట' - అనిగాని ధ్వనిశబ్దము నెట్లు నిర్వచించినను - ఈధ్వని-ఉపచరితములగు- శబ్దము - అర్థము వ్యాపారము - అనువానికంటెవేరగునది - ఏదియు - కాదు. ముఖ్యమగు అర్థమునందు - అభిధయేవర్తించును. కనుక - పారిశేష్యమున ఈధ్వని - అముఖ్యమేయగును. దీనికంటె వేరగు తృతీయరాశి లేకుండుటవలన - 'అముఖ్య వ్యాపారమే - ధ్వని' అని. చెప్పనగును.

[ప్రభామతి] (1) "ముఖ్యమగు నర్థముకంటె, వేరగునింకొక యర్థమును ధ్వనించునదియగు [ప్రధానమగు] వ్యంజకశబ్దముగాని, 2 ధ్వనింపఁజేయబడునదియగు వ్యంగ్యార్థముగాని, (3) వ్యంజకమగుశబ్దమునకు. వ్యంగ్యము విషయముగాగల వ్యాపారమగు, ధ్వనించుట - అను, వ్యంజనావ్యాపారముగాని, "ధ్వని". అని - ధ్వనివాదులగు మీరు చెప్పుదురుగదా, ; 1 "వ్యంజకమగు శబ్దము ధ్వని" అను చెప్పునపుడు, ఆధ్వనిశబ్దము 'గుణవృత్తి' అని చెప్పఁబడిన, గంగాదిశబ్దముకంటె వేరైనది కాఁదగదు." ఇట్లే - "ధ్వనింపఁజేయఁబడునదియగు వ్యంగార్థము - ధ్వన్యర్థము"- అని చెప్పునప్పుడు - అధ్వన్యర్థము (ప్రధానమగు వ్యంగ్యార్థము)ఉపచరితమగు తీరాద్యర్థముకంటె-[గుణవృత్తికంటె] వేరైనది కాఁదగదు. ఇట్లే - "ధ్వనించుట" అనువ్యాపారము-ధ్వని"-అనుచెప్పునపుడు- ఆధ్వనివ్యాపారము - అముఖ్యమగు - అభిదావ్యాపారమగు గుణవృత్తికంటె వేఱుకాఁదగదు. ఇట్లు - శబ్దము, అర్థము, వ్యాపారము, అగుధ్వని-శబ్దము, అర్థము, వ్యాపారము, అగు గుణవృత్తికంటె వేరుకాఁదగదని - సిద్ధించుచున్నది. కాగా; గుణవృత్తికంటె వేఱగు ధ్వని - అనునది - ఏదియులేదని (భాక్తవాది మతమున) సిద్ధించుచున్నది.

ధ్వనివాది : ప్రశ్న :— అయ్యా, అముఖ్యమగు అభిధావ్యాపారమగు గుణవృత్తికంటె, వేరైన వ్యంజనా వ్యాపారమే - ధ్వని. అభిధాదివ్యాపారము - సమాయాపేక్షము. మా వ్యంజనావ్యాపారము - సమయామేక్షముకాదు. కనుక - వ్యంజనావ్యాపారము - వీనికంటె భిన్నమేయగును.

భాక్తతావాది : ఉత్త :— శబ్దమునకు సంబంధించిన ముఖ్యమగు వ్యాపారము-అభిధ. అముఖ్యవ్యాపారము - గుణవృత్తి. లోకమునందు - శబ్దము-అర్థము- ద్వివిధమేయగును. ముఖ్యము - అముఖ్యము. అని. గంగాదిశబ్దమునకు ముఖ్యమగునర్థము- ప్రవాహమేయగును. అముఖ్యము - తీరాదికము - కనుకనే శబ్దమునకును - తద్గోచరమగు వ్యాపారమునకునుగూడ - ముఖ్యా - ముఖ్య భేదమున - ద్వైవిధ్యమే సిద్ధించును. కనుక - ముఖ్యాముఖ్యములకంటె వేరైన మూడవ ప్రకారము ఉండదు. అది- (ధ్వని) సమయాపేక్షము కాకుండుటవలన శబ్దమునకు ముఖ్యార్థముకాదు" అనినయెడల, అది పరిశేషన్యాయమున - అముఖ్య వ్యాపారమగు గుణవృత్తియే - యగును. తృతీయమగు వ్యాపారమింకేదియులేదు.

ప్రశ్న :— "తృతీయరాశి లేకుండుటలవన" అని లోచనమునందు చెప్పబఁడిన రాశులేవి ? ఆరాశులను విశదీకరించెదరా ? అందు భాక్తవాది - లేదనినదేది?

ఉ : ప్రథమరాశి :— వాచకము [శబ్దము] వాచ్యము [అర్థము] అభిధ-[వ్యాపారము].

ద్వితీయరాశి :— లక్షకము - లక్ష్యము - లక్షణ. [గుణవృత్తి]

తృతీయరాశి :— వ్యంజకము - వ్యంగ్యము - వ్యంజన - "ఈ తృతీయ రాశినేలేదు" అని భాక్తవాది యనుచున్నాఁడు.

[లోచనము] అవ :— " 'ధ్వని - గుణవృత్తి' అని - ఎవ్వరుచెప్పిరి ? అని [పాఠకులు] ఆశంకింపవచ్చును." అను నభిప్రాయమున వృత్తికారుఁడు - చెప్పుచున్నాఁడు.

(13) మూలము :— వాస్తవమును సమీక్షించునెడల కావ్య లక్షణవిధాతలెవ్వరును ధ్వనిశబ్ద సంకీర్తనముచేత [గుణవృత్తియే - ధ్వని-అని, ధ్వనిశబ్దముతోఁజేర్చి] గుణవృత్తినిగాని, ఇంకే ప్రకార మునుగాని, ప్రకాశింపఁజేసినవారుకారు. అయినను, అముఖ్యావృత్తి [గుణవృత్తి] చేత - కావ్యములయందు వ్యవహారమును ప్రదర్శించిన వారిచేత-[భట్టోద్భటాదులచేత] ఈ ధ్వనిమార్గ మించుక స్పృశింపఁ బడినది. అట్లు స్పృశింపఁబడినను, వారిచేత-[ఆభట్టోద్భటాదులచేత] అది [ధ్వని] లక్షితము కావింపఁబడియుండలేదు"- అని పరికల్పించి [ఆశంకించి] "అది భాక్తంబండ్రు వేఱొక్కరు"అని [కారికయందు] చెప్పఁబడినది.

లోచనము :— [ఇంకేప్రకారమును] "అనఁగా; గుణాలంకార ప్రకార మును," అనియర్థము. గుణవృత్తినిగొని - కావ్యములయందగు వ్యవహారమును బ్రదర్శించినవారు— భట్టోద్భట - వామనాదులు. "శబ్దా, శ్ఛన్దో,ఽభిధా,నార్థాః," అని భామహుఁడు చెప్పిన, అభిధానపదమునకు-శబ్దమునుండి భేదమును వ్యాఖ్యా నించుటకు, భట్టోద్భటుఁ డిట్లు ప్రభాషించెను. శబ్దముల అభిధానము - అనఁగా; అభిధావ్యాపారము. అది - 1 ముఖ్యము, 2 గుణవృత్తి, అని ద్వివిధము. అని. వామనుఁడుకూడ-సాదృశ్యముచేతనగు లక్షణ - [వృత్తి] వక్రోక్తి, అని చెప్పెను.

ప్రభా :— మొదటివారగు అభావవాదులు-''గుణాలంకార ప్రభేదము - ధ్వని.''అని తమకంఠధ్వనితో నెట్లుచెప్పలేదో, అట్లేభాక్తతావాదులుసైతము-'గుణ వృత్తియే - ధ్వని' అని ముక్తకంఠధ్వనితో చెప్పియుండినవారుకారు, భామహా చార్యుఁడు - ఒక శ్లోకమునందు శబ్దము, ఛందము, అభిధానము, అర్థము ఇతి హాసాశ్రియములు, కథలు, లోకము, యుక్తి, కళలు, అను తొమ్మిదింటిని - కావ్యహేతువులని చెప్పియుండెను. భట్టోద్భటుఁడను, సాహితీలక్షణవిధాత - ఈ శ్లోకమును వ్యాఖ్యానించునపుడు-అభిధానపదమునకు, 'శబ్దము' అనునర్థమును తెలిపినయెడల, శబ్దమును రెండుసార్లుఁపఠించుటచేతఁ గలుగునదియగు పునరుక్తి దోషమును పరిహరించుటకుగాను, భామహ శ్లోకమునందున్న, అభిధానశబ్దము - అభిధాయకశబ్దమును తెలుపునదికాదనియు, ఆయభిధానశబ్దము - అభిదాయక మగుశబ్దమునందున్నది యగు వృత్తిని [చెప్పుట - అనువ్యాపారమును] తెలుపు ననియుఁదెలిపి - అది - 1 ముఖ్యము-2 గుణవృత్తి. అని ద్వివిధముగానున్నట్లు చెప్పెను. [తరువాత] వామనుడు, ''సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః'' ''అవృత్తి - [వ్యాపారము] 'తఱచుగానగు అవయవసామాన్య యోగము - నిమిత్తముగా- గల - లక్షణ' - అని, దానినే - లక్షణావృత్తిగాఁదెల్పి - ''ఆలక్షణయే-వక్రోక్తిఁ అను నలంకారము'' అని సూత్రీకరించి - దానినిట్లుదాహరించెను.

''ఉన్మిమీలకుముదం సరసీనాం
పఙ్కజంచనిమిమీల ముహూర్తాత్''

ఇచట - ఉన్మీలన నిమీలన శబ్దములు - బాధిత ముఖ్యార్థములు. అవి సాదృశ్య - నిమిత్తకమగు లక్షణచేత - సంకోచ - వికాసరూపమగు లక్ష్యార్థము నొందుచున్నవి.

[లోచనము] ''ఈ ధ్వనిమార్గమించుక స్పృశింపఁబడనను, వారిచేత లక్షి తము కావింపఁబడియుండలేదు'' అనుదాని యభిప్రాయమిది :— వారేదో కొంచె ముగా ధ్వని మార్గమును సూచింపకపోలేదు. అయినను, యథాలిఖిత పాఠకులు మాత్రము - తాము - ధ్వని స్వరూపవివేచన మొనర్పరు సరిగదా ; అభగ్ననారి కేళమువలె - యథాశ్రుతమగు తద్గ్రంథమును - బాగుగా వల్లెవేయుటమాత్రము చేత - [గూఢార్థము నూహింపక] ధ్వని స్వరూపమును [వివేచనమొనర్చువారిని] గూడ నిరసింతురు. కనుకనే-''పరికల్పించి'' [ఆశంకించి] ''అది- భాక్తంబందురు వేఱొక్కరు'' అని [వృత్తికర్త] ప్రవచించెను. మేమిట్లీగ్రంథమును [ధ్వనిమా

ర్గము, స్పృశింపఁబడినది,కాని లక్షింపఁబడినదికాదు అను వాక్యమును]యోజింపని యెడల, అప్పుడు ధ్వనిమార్గము [భట్టోద్భటాదులచేతనే] స్పృశింపఁబడియుండుట వలన, భాక్తతావాదమును పూర్వపక్షముగా-దెలుపుట విరుద్ధమేయగును.

ప్రథామతి :— "గంగయందు గొల్లపల్లె" ఇత్యాది ప్రయోగములు - తీరాదులకు పావనత్వము, మున్నగు ప్రయోజనములను స్ఫురింపఁజేయుటకే తద్కర్తలచేత - ప్రయోగింపఁబడినవి. ఆప్రయోజనముల నుద్దేశింపక, గుణవృత్తి-ప్రవర్తించునదికాదు. గంగాదిపదమునకు, ప్రవాహాద్యర్థమును దెలిపి - అభిధా వ్యాపారము తనసామర్థ్యమును గోల్పోయిన పిమ్మట, ఆగంగాది పదమునకు తీరాద్యర్థ ప్రతిపత్తికొఱకు, వేఱొక వ్యాపారమగు గుణవృత్తి నంగీకరించిన భట్టోద్భటాదులు - ఆపదమునకే - శైత్యపావనత్వాది ప్రయోజనార్థ ప్రతిపత్తికొఱకు, తృతీయవ్యాపారమగు వ్యంజననుగూడ-అవశ్యముగా నంగీకరింపవలసియుండును. కనుక, "వారిచేతఁగూడ-ధ్వనిమార్గమించుక స్పృశింపఁబడినది," అని చెప్పఁబడినది. అయినను - వారిట్లు ధ్వనిమార్గమును - అవివక్షిత వాచ్యధ్వని ప్రభేద స్థలమునందు సూచించినను, గుణవృత్తికంటె వేఱుగా, వ్యంజనను నిరూపింప కుండుటవలన "గుణవృత్తియే - ధ్వని, దానికంటె ధ్వని-అతిరిక్తముకాదు". అని వారు చెప్పినట్లయినది, కనుక, వారు-ముక్తకంఠధ్వనితో,"గుణవృత్తియే-ధ్వని" అని చెప్పకున్నను, కావ్యములయందు గుణవృత్తిచేత - వ్యవహారమును జూపుట వలన వారిధ్వనిని - భాక్తమని చెప్పినట్లు పరికల్పించి-"భాక్తమాహుస్తమన్యే" అని చెప్పఁబడినదని భావము, భట్టోద్భటగ్రంథాది టీకాకారాదులు - పగులని కొబ్బరికాయలవలెనున్న - భట్టోద్భటాదుల గ్రంథములను బాగుగావల్లెవేసినారే కాని - వానియందలి నిగూఢార్థమును పరిశీలింపరయిరి. కనుకనే - ధ్వని స్వరూపమును వివేచింపఁజాలని - వీరు-దానిరూపమును వివేచింపకుండుటయేకాక - మీదు మిక్కిలి ఆధ్వని నుపాలంభించుచున్నారు. కనుకనే "భట్టోద్భటాదులచేత -ధ్వని మార్గము స్పృశింపఁబడినను, లక్షితము కాకుండుటవలన" అనునీయర్థము - మాచేతనిట్లు యోజింపఁబడినది. మేమిట్లు యోజింపనియెడల-"భాక్తమాహుస్తమన్యే" అని ధ్వనివాదులమగు మేము భాక్తతావాదమును ప్రసారించుటయే-విరుద్ధమగును గదా!

(14) మూలము :— ఒకరు - [ఇంకనుగొందఱు] లక్షణ కరణశాలీనబుద్ధులు - [ధ్వనిలక్షణనిర్మాణప్రగల్భత లేనివారు] 'ధ్వనితత్త్వము - వాక్కులకగోచరము' అనియు, 'అది - సహృదయహృదయములకేసంవేద్యము' అనియుఁ, జెప్పుదురు.

[లోచనము] శాలీనమతులు = అప్రగల్భమతులు. ఈ ముగ్గురును [1 ధ్వన్యభావవాదులు - 2 భాక్తతావాదులు - 3 అలక్షణీయతావాదులు.] ఒకరి కంటెనొకరు - భవ్యబుద్ధులు. మొదటివారు [ముగ్గురును] సర్వథా, విపరీత మతులే. మధ్యములు [భాక్తతావాదులు] మాత్రము - ధ్వనిరూపమునెఱిఁగినను, సందేహముచేత - ఆధ్వనిని నిహ్నవించుచున్నారు. చివరివారు - [అలక్షణీయతా వాదులు] దానిని నిహ్నవింపరు, కాని దానినెట్లు లక్షించునదియు తెలియనివారు. కనుక, విపరీతమతులకంటె - సంశయగ్రస్తులును, సంశయగ్రస్తులకంటె - అజ్ఞులును, ఒకరికంటె - ఇంకొకరు ముఖ్యులనునంశము-[వృత్తియందు] క్రమముగాఁ జెప్పఁబడినది.

ప్రభా :— అసలు ''ధ్వనియేలేదు'' అనునభావవాదులుముగ్గురును ''ఆత్మయేలేదు'' (దేహమే-ఆత్మ) అని చెప్పువారగు చార్వాకులవలె, 'ధ్వనిలేదు, శబ్దార్థములే కావ్యము - ఇత్యాదిగా భ్రాంతిదర్శను లగుటచేత - విపరీత జ్ఞానయుక్తులగుదురు. భాక్తతావాదులు - ''ముఖ్యవృత్తియగు అభిధకంటెను, అముఖ్యవృత్తియగు గుణవృత్తికంటెను, వేఱుగా - 'వ్యంజన' కలదా, లేదా ?'' అను సందేహముగలవారు, కనుక - ''వాచ్య - లక్ష్యవ్యతిరిక్తమగు ధ్వనిలేదు'' అని దానిని కప్పిపుచ్చుచున్నారు. అలక్షణీయతా (అనాఖ్యేయతా) వాదులు-వాచ్యలక్ష్యవ్యతిరిక్తమగు ధ్వనినంగీకరింతురు. కాని''అది-లక్షణ నిర్వచన పురస్సరముగా తెలియరానిది'' అని చెప్పుదురు. కావున వీరు - అజ్ఞులని చెప్పఁబడిరి. వీరిలో ఒకరికంటె - ఇంకొకరు - ఉత్తరోత్తరముగా, ప్రధానులగుటవలన మొదట - త్రివిధమగు, ధ్వన్యభావవాదము, తదుపరి, భాక్తతావాదము, తఱువాత, అలక్షణీయతావాదము, అనునవి - వృత్తియందు క్రమనిబద్ధము లొనర్పఁబడినవని తెలియునది.

(15) మూలము :— [విమతులు [విరుద్ధాభిప్రాయములు] ఏవంవిధములుగా స్థితములు.] ఏవంవిధములుగా స్థితములగు విమతులయందు [విమతులలో] ప్రతివిమతియుఁ గూడ - మేమింతవఱకును నిరూపింపని ధ్వని స్వరూప నిరూపణమున హేతువుగానున్నది. అట్లౌట - ఆహేతువుచేత - సహృదయమనః ప్రీతికొఱకు దాని స్వరూపమును [విమతిపదపతితమగు ఆధ్వని స్వరూపమును] చెప్పుచున్నాము.

లోచ :— 'అట్లొటన్ = ఆ హేతువుచేత,' అను నేకవచనమునకిదియభి ప్రాయము! విప్రతిపత్తిరూపమగు[విరుద్ధాభిప్రాయరూపమగు]వాక్యార్థము'విమతి' అని చెప్పఁబడినది [అవి పెక్కులు వెనుకఁ జెప్పబడినవిగదా] ధ్వని నిరూపణ విషయమున విప్రతిపత్తి రూపమగు ప్రతివాక్యార్థమును గూడ [ప్రత్యేక] హేతు వగుచున్నది, కనుకనే [ఈకారణములచేత - అని - బహువచనము-ప్రయోగింపఁ బడవలసియున్నను]'ఆ హేతువుచేత' అని - ఏకవచనము ప్రయోగింపఁబడినది. మూలమునందు - ఏవంవిధములుగానున్న 'విమతులయందు' - అను చోట నున్నది - నిర్ధారణయందలి సప్తమి.

ఈ-విప్రతిపత్తులలోపలనున్న విమతి ప్రకారము - ఒక్కొక్కటియుఁ గూడ - ధ్వని నిరూపణమునందు-ఏ హేతువుచేత-హేతువగుచున్నదో, ఆ హేతువు చేత - ధ్వనిస్వరూపమును - చెప్పుదుమని భావము.

[ప్రభామతి] ఏ హేతువు - ఈవిరుద్ధాభిప్రాయములలోనున్నది - ప్రత్యేక ముగఁగూడ - ధ్వని నిరూపణమునకు - హేతువగుచున్నదో, ఆ హేతువుచేత - అభిధేయమగు - ధ్వనిస్వరూపమును చెప్పుదుమని భావము. ఈ హేతువులలో - ఒక్కొక్కటియుఁగూడ ధ్వని నిరూపణ హేతువగుననునపుడు - మూడు హేతువు లుండగా - ధ్వనిలక్షణము తప్పక నిరూపింపవలసియే యుండుననని - వేరుగా చెప్పవలయునా ? అని - సిద్ధించును. ఇది - ''ధ్వనిగాకావ్యమునాత్మ'' అను **కారిక యొక్కయు**, వృత్తి - లోచనములయు, వివరణము.

లోచనము :— ధ్వని -శాస్త్రములకు - అభిధానాభిధేయమను సంబంధ మును, వక్తృశ్రోతలకు - వ్యుత్పాద్యవ్యుత్పాదక భావమను సంబంధమును, విమతిని వృత్తిచేత - ధ్వనిస్వరూపజ్ఞానమను ప్రయోజనమును, శాస్త్ర- ప్రయోజ నములకు సాధ్యసాధన భావసంబంధమును, - దీనిచేత-[''సహృదయమనః ప్రీతి కొఱకు దానిస్వరూపమును, జెప్పుచున్నాము'' అను నీవాక్యముచేత] చెప్పఁ బడియెనని తెలియునది.

ప్రభామతి :— ధ్వని స్వరూపము - అభిధేయము. [చెప్పఁదగినది] శాస్త్రము - అభిధానము.[చెప్పునది] వక్త - వ్యుత్పాదకుడు. - శ్రోత - వ్యుత్పా ద్యుఁడు. విరుద్ధాభిప్రాయములు - తొలఁగుటచేతనగు - ధ్వని స్వరూపజ్ఞానము - ప్రయోజనము. శాస్త్రము - సాధనము. - ప్రయోజనము - సాధ్యము. అను నంశము [అనుబంధచతుష్టయము] ''సహృదయమనః ప్రీతికొఱకు - ధ్వని

స్వరూపమును చెప్పుదుము'' అనువృత్తి వాక్యముచేత - చెప్పఁబడినదని తెలియునది.

లోచనము :— [తరువాత - శ్రోతృగత ప్రయోజన ప్రయోజనమును దెలుపునదియగు [శ్రోతకు సంబంధించిన ప్రయోజనమగు ధ్వనిస్వరూప జ్ఞానమునకు - ప్రయోజనమగు ప్రీతిని ప్రతిపాదించునదియగు] ''ధ్వని రూపించెదమీ కృతిన్ సహృయ స్వాంతమ్ము రంజింపఁగన్'' అను కారికాభాగమును [వృత్తి కారుఁడు] వ్యాఖ్యానించుటకు చెప్పుచున్నాఁడు.

ప్రభా : — వృత్తిగ్రంథము - కేవలవ్యాఖ్యాన రూపముకాదు. అయిన నిచట-వ్యాఖ్యానముగా నుపయోగించుటచేత, ''వ్యాఖ్యానించుటకు'' అనివ్యాఖ్యానింపఁబడినది. ఇందు - ధ్వనిస్వరూపమెట్టిదో తెలుపఁబడును.

**(16) మూలము** :— ఆ 'ధ్వని స్వరూపము' - [ఆధ్వని యొక్క స్వరూపము] సకలసత్కవి కావ్యోపనిషద్భూతము, అతి రమణీయము, చిరంతనకావ్యలక్షణవిధాయుల బుద్ధులణీయసుల యినను, వానిచేతఁగూడ-[ఆసూక్ష్మతర బుద్ధులచేతఁగూడ-అనున్మీలిత పూర్వము . [చిరంతన కావ్యలక్షణవిధాతల అణీయసులగు బుద్ధులచేత-పూర్వమున్మీలితము కానిది] మఱియు రామాయణము, మహాభారతము, మున్నగు లక్ష్యమునందటను ప్రసిద్ధ వ్యవహారము గలది. దానిని లక్షణద్వారమున నిరూపించు [లక్షించు] వారగు సహృదయుల మనస్సునందు - ఆనంద ప్రతిష్ఠ [ఆనంద స్థిరత - మఱియు, ఆనందుని ప్రతిష్ఠ] కలుగుఁగాక ! అని దాని స్వరూపమును జెప్పుచున్నాము.

లోచనము :— '' 'ఆధ్వనియొక్క' - అనగా; - విమతిపదపతితమైన - ఆధ్వనియొక్క - స్వరూపమును - లక్షణనిరూపణ పురస్సరముగా - లక్షించు వారికి సంబంధించిన మనస్సునందు - అనఁగా, హృదయమునందు -'ఆనందము'- అనఁగా; చమత్కారము - అను మారుపేరుగల నిర్వృతిరూపము. ఆయానందముయొక్క ప్రతిష్ఠ - అనఁగా; పరులచేత [అభావవాదులచేత] విపరీత సంశయాజ్ఞానాదులగు ప్రతిఘాతములచేత - పెల్లగింపఁబడని, ఆనంద - స్థిరస్థితి - కలుగ

పలయును. అని - [ఆనందస్థైర్యము అను] ప్రయోజనమును సంపాదించుటకు-ధ్వని స్వరూపము - ప్రకాశింపఁజేయఁబడుచున్నది.'' అనునిది 'వృత్తికారుడు' ''అట్లొటనాధ్వని రూపించెదమీకృతిన్ సహృదయస్వాంతంబు రంజింపఁగన్'' అని కారికాకారుడు - తెలిపిన ఏకవాక్యమునకు తానును ఏకవాక్యముతో నొనర్చిన - సమన్వయము. అదెట్లనిన :– ''ప్రయోజనంచనామ - తత్సమ్పాదక వస్తు ప్రయోక్తృతా ప్రాణతయైవ భవతి'' - ''ప్రయోజనమనునది - ఆప్రయోజన స్వరూపమును సంపాదించు- వస్తువునందు [పురుషుని] ప్రయోజింపఁ జేయుట'' అను, ప్రాణతచేతనే - తాను ప్రయోజనమగుచున్నది.'' అనునది వృత్తికారుని-యాశయము - కనుక - ''అట్లొటనాధ్వని............ రంజింపగన్'' అనునిది యంతయు-ఏకవాక్యతచేతనే వ్యాఖ్యానింపఁదగినది. లేక ఇది - ఏకవాక్యతచేత వృత్తికారుడొనర్చిన వ్యాఖ్య. ['వ్యాఖ్యేయమ్' 'వ్యాఖ్యానింపఁదగినది.' అనిగాని. 'వ్యా ఖ్యా + ఇయమ్ = వ్యాఖ్యేయమ్', ''ఇది-వ్యాఖ్య'' అనిగాని, యర్థము నెఱుఁగునది.]

1 [ప్రభామతి] ఆధ్వనియొక్క- అనఁగా; విమతిపదపతితమగు - ధ్వనియొక్క-. విమతిపదపతితమనఁగా; విప్రతిపత్తులలో [విరుద్ధాభిప్రాయముల నడుమ] ఉన్నది. అట్లు వివాదగ్రస్తమగు ధ్వనిరూపమును లక్షణ నిరూపణ సహితముగఁ దెలిసికొనినవారికి సంబంధించిన మనస్సునందు - అనగా; - సంకల్పవికల్పవృత్తిరూపమగు మనస్సునందుకాదు - ఇంకేమనిన: నిశ్చయవృత్తిగల అన్తఃకరణమగు హృదయమునందు - 'ఆనంద ప్రతిష్ఠ' అనఁగా; విరుద్ధాభిప్రాయ [యుక్తి] ప్రతిఘాతములచేత - పెల్లగింపఁబడని ఆనందముయొక్క- స్థిరత్వము, కలుగుఁగాక! 2 అను ప్రయోజనము-సంపాదింపఁగోరఁబడుచున్నది. కనుక విపర్యాసాదులగు - [భ్రాంతి సంశయాజ్ఞాన రూపములగు] విరుద్ధాభిప్రాయములచేత ఆనందమను మందారవృక్షము- పెకలింపఁబడక - స్థిరముగా నుండవలయుననిన యెడల ఆవిమతిప్రతిఘాత వినిర్ముక్తమగు ధ్వని స్వరూపము- ప్రకాశింపఁజేయఁబడవలసియే యుండును- కనుక ప్రయోజన ప్రయోజనమగు నానందమునుసంపాదించుటకు - ఈ-ధ్వని శాస్త్రమునకు ప్రయోజనమగు ధ్వనిస్వరూపము - ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

3 ఆ హేతువుచేత [ప్రతివిప్రతిపత్తియుఁగూడ - ధ్వనిస్వరూప నిరూపణమునకు - హేతువగుటచేత] సహృదయమనః ప్రీతికొఱకు - ధ్వనిస్వరూపమును నిరూపించుచున్నాము-అని [కారికయందును, వృత్తియందును, గూడ] చెప్పుట

వలన ధ్వనిస్వరూపకథనమునకు విరుద్ధయుక్తినివృత్తిగూడ - ప్రయోజనము కావచ్చును - అయిననది ప్రధానప్రయోజనముకాదు - ధ్వనిస్వరూపమును జెప్పుటకు ముఖ్య ప్రయోజనము - ప్రీతియే - ఆనందమే - అగును.

4 - ఆకారణముచేత - సహృదయమనః ప్రీతికొఱకు 'ధ్వని స్వరూపమును జెప్పుచున్నాము-అను కారికాచతుర్థపాదమునఁ దెలుపఁబడిన సహృదయ హృదయానంద ప్రతిష్ఠకు - విరుద్ధయుక్తిని వృత్తి -అంగమేయగును. విరుద్ధాభిప్రాయని వృత్తి పురస్సరమగు ధ్వని స్వరూపజ్ఞానమువలననే - సహృదయుల హృదయములయందు ఆనందప్రతిష్ఠ-కలుగును. కాని కేవల ధ్వనిస్వరూప జ్ఞానమువలననే అనంద స్థైర్యముకలుగదు. ఈ యభిప్రాయమంతయు గూడ - ఏకవాక్యతచేతనే సిద్ధించును.

అవ :— శ్రీలోచనకర్త -వృత్తికారునభిప్రాయము ననుసరించి-ముందు "ప్రయోజనము" అనుపదమున కర్థమును నిర్వచించి - [ఏదయిన ప్రయోజనమునకు ఎట్లు - ప్రయోజనధర్మము - సిద్ధించునదియుఁ దెలిపి] ఆనంద స్వరూపమునకీప్రయోజనత్వ మెట్లుసిద్ధించునదియు - తెలుపుచున్నాఁడు -"ప్రయోజనంచనామతత్సంపాదకవస్తుప్రయోక్తృతా ప్రాణతయైవతదాభవతి" అనునిది - ప్రయోజనపదనిర్వచన పురస్సముగ, ప్రయోజనమునకు ప్రయోజనత్వమును దెలుపునదియగు లోచనవాక్యము. "ప్రయుఙ్క్తే - ప్రేరయతి - ఇతి ప్రయోజనమ్" ప్రయోజించునది - ప్రేరణము నొనర్చునది - ప్రయోజనము. అనునది సంగ్రహవ్యుత్పత్తి. తన్నుపుట్టించునదియగు సాధనమునందు సహృదయాది పురుషుని ప్రయోజింపఁ జేయునది - అనగా; ప్రవర్తింపజేయునది - ప్రయోజనము. అనునిది ప్రయోజన పదార్థనిర్వచనము. ఆ ఆనందమును ప్రయోజనమునకు తన్నుపుట్టించునదియగు వస్తువు -అనగా; సాధనము - 'ధ్వనిస్వరూప ప్రతీతియే' అగును. 'ఆధ్వనిస్వరూప ప్రతీతి' అను సాధనముచేతనే - సహృదయహృదయమునకు -ఆనందస్వరూపమగు ప్రయోజనము కలుగుచున్నదిగదా! ముఖ్యప్రయోజనమగునీయానందము-సాధనవస్తువగుధ్వనిస్వరూపమునందు సహృదయ పురుషుని ప్రయోజించును. కనుక - ఆనందమే- ప్రయోక్త -అగుచున్నది. ఈ కావ్యానందమునందే - సహృదయపురుషుని - 'ధ్వనిస్వరూపమునందు ప్రేరేచుట' అను ప్రయోక్తృత-కలదు. ఆప్రయోక్తృతయే [కావ్యధ్వని స్వరూపమగు సాధనమునందు సహృదయ పురుషుని ప్రేరించుటయే] - కావ్యానందమునకు

ప్రాణము. ఏలయనిన; సహృదయుఁడు - ధ్వనిస్వరూపమను సాధనము నందుప్రవర్తింపనియెడల - ఆసహృదయహృదయమునందీయానందము ప్రతిష్ఠితము కానేరదు గదా!

కనుక - ధ్వనిస్వరూప సాధనమునందు సహృదయుని ప్రవర్తింపఁజేయుట- అను ప్రాణముయొక్క ధర్మమగు ప్రాణత- కావ్యానందమునందున్నది. కనుక, '(అ)ప్రయోక్తృత' అను ప్రాణతచేతనే, ఆనందము - ప్రయోజనమగుచున్నది. అనితెలియునది - ఇందలి - సమగ్రాభిప్రాయము నిగ్గెఱుఁగునది. ధ్వనిశాస్త్రమునకు ప్రయోజనము-ధ్వనిస్వరూపజ్ఞానమేయగును. కాని యిది-పరమపురుషార్థము కాదు. ధ్వనిశాస్త్రమునకు ప్రయోజనమగు ధ్వనిస్వరూప జ్ఞానమునకుఁగూడ - వేరొక ప్రయోజనమున్నది. అదియే - ఆనందము. 'సహృదయుఁడు-కోరఁదగినది' - అదియేగదా! - కనుక ఆయానందమే - పురుషార్థము. "ఈయానందము - ఈశాస్త్రమునకు ప్రయోజనమగు ధ్వనిస్వరూపజ్ఞానమునకుఁగూడ - ప్రయోజనమగుటచేత - ఇది - ప్రయోజనప్రయోజనమగుచున్నది." అని లోచనకర్తచేత - వివక్షింపఁబడినది.

ఇట్లు ప్రయోజన ప్రయోజనమగు ఆనందమునకు సాధనము - 'ధ్వనిస్వరూప ప్రతీతియే' అగుచుండును. ధ్వనిస్వరూపజ్ఞానములేని సహృదయేతరులకు కావ్యానందము కలుగదుగదా! ఆనందస్ఫురణమే - ఆనందాభిలాషియగు సహృదయపురుషుని ధ్వని స్వరూపము నెఱుఁగునట్లు ప్రేరణచేయును. కనుక - ఆనందస్వరూపమునందుఁగల ప్రేరకత్వము - సహృదయుఁడభిలషించునదియగు నానందమునకు - ప్రాణధర్మమగు చున్నది-ఏలనిన; ధ్వనిస్వరూపజ్ఞానమునందు, పురుషుఁడు ప్రవర్తింపనియెడల - ఈ కావ్యానందమునకు ప్రాణమే లేదుగదా! కనుక, సాధ్యమగు ఆనందస్వరూపమునందుఁగల ప్రేరకత్వమను ధర్మమే - ఆనందమునకు ప్రాణధర్మమైయున్నది. [ఎంతకాలమీ కావ్యానందము - సహృదయపురుషుని, ధ్వనిస్వరూపము నెఱుఁగుమని ప్రేరించుచుండునో, అంతకాలము వఱకే - ఈ-కావ్యానందమునకు ప్రాణముండునని భావము]

ఇట్లు - ధ్వనిస్వరూపజ్ఞానమువలన - ఆనందముదయించినను, అది-ధ్వనిస్వరూపమునెడల సంభవించునవియగు విరుద్ధాభిప్రాయములచేత-ఉన్మూలితమైనయెడల-స్థిరతను గోల్పోవును. కనుక విరుద్ధప్రతిపత్తి నిరసనముగల ధ్వనిస్వరూపజ్ఞానమే - ఈ-యానందమునకు సాధనమగుచున్నది. కనుక "(1) విమతినిహతి పురస్సముగా - ధ్వనిస్వరూపమును దెలుపుదుము." "(2) సహృ

దయమనఃప్రీతికొఱకు ఆధ్వనిస్వరూపమును దెలుపుదుము'' - అను భిన్న వాక్యప్రయోగము నొనర్చియెడల- సమగ్రమగునర్థమంతయు లభింపదని, కారికా కర్త - కారికయందును, వృత్తికర్త-ఆలోకమునందును, లోచనకర్త - లోచనము నందును, ఈ యర్థమునంతను ఏకవాక్యతగా ప్రతిపాదించిరని తెలియునది. ఫలితమగు దీనియర్థమును ఇట్లెఱుఁగునది.

''విరుద్ధాభిప్రాయనిహతముకాని - ధ్వనిస్వరూప ప్రతీతి యను సాధనము చేత - సాధ్యమగు నానందమను, ప్రయోజనప్రయోజనము- సహృదయులహృద యమునందు - అప్రతిహతమగు స్థైర్యమునొందుఁగాక.'' అను తలంపున ధ్వని స్వరూపమును జెప్పుచున్నాము.''

[లోచనము] ధ్వనిస్వరూప శబ్దమును వ్యాఖ్యానించుచు, ఇంతకుముందు తెలుపఁబడిన వికల్పములైదింటియు (అయిదు వికల్పములయొక్కయు) ఉద్ధరణ మును [తీసివేతను] సంక్షేపముగా సూచించుచున్నాఁడు, సకలశబ్దముచేతను, సత్కవిశబ్దముచేతను, [అభావవాదమునందు] ''ఏదోప్రకారలేశమును'' అను దానిని నిరాకరించుచున్నాఁడు. ''అతిరమణీయమును'' అనుదానిచేత - అది - భాక్తముకంటె వ్యతిరేకమని చెప్పుచున్నాఁడు. ''వటుఁడు [మాణవకుఁడు] సింహము'', ''గంగయందు గొల్లపల్లె'' అను [గౌణ - లాక్షణిక] ప్రయోగముల యందు - రమ్యత యేదియులేదుగదా! 'ఉపనిషద్భూతము' అను పదముచేతనో- 'అపూర్వసమాఖ్యామాత్రమునుంచుట' మున్నగు నభిప్రాయము - నిరాకరింపఁ బడుచున్నది. ''అణీయసులు'' మున్నగు నభిప్రాయముచేత - ధ్వని - గుణాలం కారములయందంతర్భవింపకుండుటను సూచించుచున్నాఁడు. 'మణియు'' ఇత్యాదిశబ్దముచేత - ''ధ్వనివాదసంకేతమునఁజేరిన కొందఱిని సహృదయులుగా నేర్పఱచి'' అనుదానిచేత - అది - 'ప్రత్యేకసంప్రదాయమేమో,' అని కలుగఁ జేయఁబడిన శంకను-నిరవకాశముగాఁ జేయుచున్నాఁడు. 'రామాయణము, మహా భారతము,' అను పదములచేత- ఆదికవి [వాల్మీకి] ప్రభృతులగు పండితులందఱి చేతను - [ధ్వని స్వరూపమునందు] అత్యాదరము చూపఁబడినదని ప్రదర్శించు చున్నాఁడు. ' లక్షణ ద్వారమున నిరూపించు - [లక్షించు] వారల'' అను సహృ దయవిశేషణముచేత, అది - వాక్కులకు గోచరింపనిది'' అను నభిప్రాయమును దొలఁగించుచున్నాఁడు.

ప్రభామతి : -- ముందు విస్తరింపఁబడునదియగు, ధ్వనిస్వరూపమిచట సంగ్రహముగాఁ దెలుపఁబడినది. మొదట సంక్షేపముగాను, తరువాత- విస్తృతము

గాను, తెలుపఁబడినయర్థమే - పాఠకులకు - అనాయాసముగాఁ దెలియునుగదా! అఖిలకావ్యవిషయమునందును వ్యాపించి-ప్రామాణికమగుప్రాధాన్యముగల ధ్వని-అభావవాదిచెప్పిన 'ప్రకారలేశముకా'దనుటకు 'సకలసత్కవి కావ్యోపనిషద్భూతము' అని చెప్పబడినది, 'వటుఁడు-సింహము.' అనుచోట-గుణవృత్తిచేతను, "గంగయందు గొల్లపల్లె" అనుచోట - లక్షణావృత్తిచేతను, లభించునదియగు నర్థము - భాక్తమని చెప్పఁబడును. [వెనుక 'గుణవృత్తియు, లక్షణావృత్తియుఁ, గూడ - భక్తిఅని చెప్పఁబడినవిగదా!] 'భాక్తవాదులు-చెప్పునదియగు భాక్తము - [భక్తిచేత లభించునదియగు, నర్థము] రమణీయముకాదు'. అని చెప్పి-దానికంటె-ధ్వని- వేఱనుటకు, 'అతిరమణీయము' అని చెప్పఁబడినది.

" 'ధ్వని' అర్థరహితమగు సమాఖ్యామాత్రము (నామమాత్రము)కా"దనుటకు - "ఉపనిషద్భూతము" అని ప్రదర్శింపఁబడినది. కావ్యతత్త్వవిదులు కాని వారికి దుర్విజ్ఞేయమగుటచేత - అతిరహస్యమును, సారమును, నగునర్థముగనుక 'ధ్వని-ఉపనిషద్భూత'మని చెప్పఁబడినది. సూక్ష్మతరములయినను,[అతినిశితములయినను] చిరంతన కావ్యలక్షణవిధాయులబుద్ధులుకూడ - ప్రకాశింపఁజేయని ధ్వనితత్త్వము - స్థూలబుద్ధి సంవేద్యములగు గుణాలంకారముల యందెట్లంతర్భవించును ? అని చెప్పుటకు "అణీయసుభిరపి" ఇత్యాదివాక్యము-ప్రదర్శితము. దీనిచేత-ప్రథమాభావవాదము - నిరాకృతము.

ఆదికవియగు వాల్మీకినుండిమొదలయిన పండితులందఱిచేతను - (మహాకవులందఱిచేతను) ధ్వనియందు సమాదరము చూపఁబడినదని తెలుపుటకు "రామాయణము, మహాభారతము,మున్నగు లక్ష్యమునందంతటను ప్రసిద్ధవ్యవహారముగలది" అనితెలుపబడినది. అది-అలక్షణీయమనువాదమును నిరసించుటకు - "లక్ష్యతే అనేన ఇతి" లక్షః. 'లక్షేణ నిరూపయన్తి' ఇతి = లక్షయన్తి'. అనువ్యుత్పత్తిచేత-ఏతచ్ఛాస్త్రప్రదర్శిత లక్షణ ద్వారమున-ధ్వనిస్వరూపనిరూపణ రూపమగు నర్థమును లక్షించువారు [గుర్తించువారు] - లక్షణద్వారమున నిరూపించు [లక్షింపఁజేయు] వారుగాఁ దెలియఁదగినవారు. ఇట్లు చెప్పుటచేత - "లక్షణద్వారమున నిరూపింపనివారికే అది - అలక్షణీయమగును, గాని, నిరూపించు సహృదయులకది - సులక్షణీయమేయగును" అని తెలిపినట్లయినది.

ప్రశ్న :— అయ్యా! 'సహృదయులు' అనుదానిలక్షణమును, వ్యుత్పత్తిని, దెలుపుదురా ? మీరుచెప్పినదానిని గుర్తించి-ఆమహాత్ములను సందర్శింపవలయునని యున్నది.

ఉ :— వృత్తికారుఁడు - "లక్షణద్వారమున నిరూపించువారగు" అని చెప్పినపిమ్మట - "సహృదయుల" (యొక్క) అనుపదమును ప్రయోగించి యున్నాఁడుగదా ! - శ్రీలోచనకర్త - వృత్తికారుఁడు ప్రవచించిన, ప్రతిపదము నందునుగల గూఢార్థములను క్రమముగావిశదీకరించుచు, "నిరూపించువారగు" అనుదాని యర్థమును వ్యుత్పత్తిపురస్సరముగాఁదెలిపి - తరువాతనున్న "సహృదయుల" అను పదముయొక్క - గంభీరార్థమును దెలుపుట కుపక్రమించుచుండఁగానే, సరిగా మీరు నీప్రశ్నము నొనర్చిరి. మీప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము - క్రింద ప్రసారితమగు లోచనమునందును, దానిని సమున్మీలించిన ప్రభామతి యందును, సమీక్షింపుఁడు.

[లోచనము] 'సహృదయులు' అను పదార్థము నిట్లెఱుఁగునది. ఎవరు - కావ్యానుశీలనాభ్యాసవశమువలన విశదీభూతమగు మనోముకురమునందు వర్ణనీయతన్మయీభవనయోగ్యత గలవారో, ఆస్వహృదయసంవాదభాక్కులు - 'సహృదయులు'.

ప్రభా :— కావ్యమునందలి శబ్దములను పఠించుచు, వానియర్థమును పర్యాలోచించుట - కావ్యానుశీలనము. మాటిమాటికిని - ఇట్లు- కావ్యానుశీలనము నొనర్చుట - కావ్యానుశీలనాభ్యాసము. దానికి వశపడి [అలవడి]యుండుటవలన-మనస్సను ముకురము - [అద్దము] విశదీభూతమగును. స్వచ్ఛతనొందును. అప్పుడది - లౌకికములును, శాస్త్రీయములును, నగు విషయకాలుష్యములనుండి-విడివడును. కావ్యశబ్దార్థపర్యాలోచనమును పౌనఃపున్యముగా నొనర్పకుండునపుడు విశదముగాక యుండిన, ఆమనస్సే - ఈకావ్యానుశీలనాభ్యాసవశమున విశదీభూతమగును. రసావేశమునకున్ముఖమగును. సంస్కరింపఁబడిన యద్దమువలె, సంస్కరింపబడినమనస్సుగూడ - శుద్ధమగును. ఇట్లు విశదీభూతమగు మనోముకురమునందే - [అద్దమువంటి మనస్సునందే] - వర్ణనీయమగు విభావాది విషయముతోడి తన్మయీభావము కలుగును. అట్టితాదాత్మ్యమును నొందుటకుఁదగిన సామర్థ్యముగలవారే-సహృదయులు" అను నిది 'సహృదయ'-లక్షణనిర్వచనము. తరువాత - "స్వహృదయ సంవాదభాక్కులు" అనుచో, నున్న స్వహృదయశబ్దమునకు [యోగ] నిర్వచనమును క్రిందనుగ్గడించినతీరుననెఱుఁగునది. వర్ణనీయమనగా; విభావాది విషయము. నిర్మలమగు హృదయము - వర్ణనీయమగు విభావాది విషయమువంటి రూపమునొంది - అనఁగా; వర్ణనీయవిషయతాద్రూప్యము నొంది - వేరొక సంవాదకప్రమాణము నపేక్షింపకుండును. విమలతరమగునట్టి హృదయమునందే - వర్ణనీయవిషయముతోడి సంవాదము - అనగా; పౌలిక

ప్రతిబింబమునందువలెసిద్ధించును. అట్టిహృదయముతోనుండినవారే-'స్వహృదయ సంవాదభాక్కులు'. మఱియు - కవిహృదయమునుబోలిన హృదయమును, తమ యందు - పొందినవారు - కూడ - 'స్వహృదయసంవాదభాక్కులే'.

[విభావాదివిషయ సాక్షాత్కారముగలవారు-సహృదయులనిగుర్తింపనగును] శ్రీసీతారామాది విభావమును, వారియందుదయించిన పరస్పరావలోకనాద్యను భావమును- వారిహృదయములయందుస్ఫురించు, స్మృతి, నిర్వేదాదిసంచారి భావ మును, కవి - వర్ణించునపుడు - ఆవర్ణనీయవిషయము - ''కవిహృదయము'' అని చెప్పఁదగును. ''తమయందే - ఆకవిహృదయమునకు సమానమగు హృద యము నెవ్వరుభజించెదరో - ఆస్వహృదయ సంవాదభాక్కులే- 'సహృదయులు' అనునది ఫలితార్థము. 'సహృదయులు' అని యీగ్రంథకర్త - ఎచ్చటఁజెప్పినను పాఠకులీ యర్థమునే గ్రహింపఁదగును.

అవ : శ్రీలోచనకర్త :— సహృదయశబ్దమునకు - తానేయర్థమును దెలిపెనో, ఆయర్థమునే తెలిపిన పూర్వాలంకారికోక్తిని క్రింద ప్రమాణీకరించు చున్నాఁడు - సమీక్షింపుఁడు ;

లోచనము :— అదెట్లనిన :-

''యోఽర్థో హృదయ సంవాదీ తస్యభావో రసోద్భవః
శరీరం వ్యాప్యతేతేన శుష్కంకాష్ఠమివాగ్నినా''

''ఏయర్థము - హృదయసంవాదముగలదో, [కవిహృదయముతోడి-పోలిక గలదో] దాని భావన-రసాభివ్యక్తికి హేతువగుచుండును. అయర్థము - అగ్ని యెండుకట్టెయందంతట వ్యాపించునట్లు, సహృదయుని శరీరమునందంతటను వ్యాపించును.

[ప్రభామతి] సత్కవి వర్ణితమును, విభావాది రూపమును, అగుఏయర్థము- తనహృదయముతో తన్మయీభావరూపమగు సంవాదము కలిగించు స్వభా వము కలదియో, దానిభావన - అనఁగా; - నిరంతరమగునాస్వాదము - చర్వణా ప్రాణమగు- రసముయొక్క అభివ్యక్తికి-[అదియే]-హేతువగుచుండును. కనుక- హృదయమునందు వ్యాపించిన ఆయర్థము - సహృదయశరీరమునఁగూడ వ్యాపిం చును. కనుకనే - స్థూలమగు శరీరమునందుఁగూడ - పులకలు మున్నగునవి కలుగును. దీనికి దృష్టాంతము చెప్పఁబడుచున్నది. ''శుష్కమగు కాష్ఠము-అగ్ని

చేత - వ్యాపింపఁబడు''నను, నీ దృష్టాంతముచేత - రత్యాదివాసనలులేని శ్రోత్రియుఁడు - సహృదయుడుకాఁడని సూచితము.

శుష్క-మను పదముచేత - కావ్యానుశీలనమున లభించునదియగు - హృదయవైశద్యము - సూచితము.

[లోచనము] ''ఆనందప్రతిష్ఠ'' అనుచోనున్న ఆనందశబ్దము - వ్యాఖ్యానింపఁబడుచున్నది. ''దేనికి - రసచర్వణయే - [రసాస్వాదమే] స్వరూపముగా నుండునో, అదియే-[ఆరసచర్వణయే]'ఆనందము'. ఆయానందమునకే-అనఁగా; చర్వణాత్మకమగు రసమునకే - ప్రాధాన్యమునుజూపుచు - అంతటనుగూడ - ముఖ్యభూతమగు ఆత్మత్వము - [కావ్యజీవితత్వము] - ఆరసధ్వనికేకలదు'' అని వృత్తికారుఁడు - చెప్పుచున్నాఁడు. వృత్తికారుఁడిట్లు చెప్పుటవలన - [భట్టనాయకుఁడు - తనహృదయదర్పణమను గ్రంథమునందు]

''ధ్వనిర్నామాపరో యోఽసౌ [యోఽపి] వ్యాపారో వ్యఞ్జనాత్మకః
తస్యసిద్ధేఽపిభేదే స్యాత్ కావ్యేంశత్వం, నరూపతా''

''అభిధా, భావనలకంటె - వేరైనది, వ్యంజనారూపమైనది - 'ధ్వని' అను పేరుగలది - వేరొక వ్యాపారముకూడ - ఏదికలదో, దానికి - వానికంటెభేదము సిద్ధించినను, ఆధ్వనిఅనునది - కావ్యమునందు - 'ఒకయంశమే' - యగునుగాని, స్వరూపము-అనఁగా, 'కావ్యాత్మయగు అంశి' కాదు''. అనిచెప్పినది-నిరాకరింపఁబడినట్లగుచున్నది.

[ప్రభావతి] వస్తుధ్వని, అలంకారధ్వని. రసాదిధ్వని, అనుధ్వనులయందు-రసాదిధ్వనియే - చర్వణా [ఆస్వాద] రూపమగుచుండును. కావున చర్వణాత్మయగు రసాదిధ్వనియే ప్రధానమగుచుండును. 'ఆనందప్రతిష్ఠ' అనుచోనున్న ఆనందశబ్దముచేత - రసచర్వణయే - స్వరూపముగాఁ గలయానందమే - రసముగాఁజెప్పఁబడినది. కనుక - వస్త్వలంకారధ్వనులకంటెవేరగు, రసాదిధ్వనికే - ప్రాధాన్యము - చెప్పఁబడినది. వస్తుధ్వనికిని, అలంకారధ్వనికిని, రసాధిధ్వనియందే - పర్యవసానము కలుగుచున్నది. కనుక కావ్యములందంతటను, ముఖ్యమగునాత్మ - 'రసాదిధ్వనియే' అగును. - వస్త్వలంకారధ్వనులు - గౌణములేయగును. - ఇట్లు ఆనందశబ్దముచేత - 'రసధ్వనియే - ఆత్మ' అని చెప్పుటవలన-

ఆనందవర్ధనుకి తరువాతివాఁడును, ధ్వని తత్త్వమునందు అభిమతముఁజూపని వాడును, అగు భట్టనాయకుఁడను ఆలంకారికుఁడు తెలిపిన క్రిందియంశము నిరాకరింపఁబడినట్లగుచున్నది.

"ధ్వనియను పేరుగలది, మాకభిమతముకానిది, వ్యంజనాత్మకమైన [ధ్వని] [ధ్వననము] వ్యాపారముఏదో, ఒకటి, ప్రసిద్ధములైన, వ్యాపారములకంటె వేరైనది, ఒకప్పుడున్నదని సిద్ధించినను, అదికావ్యాంగమే, కాని కావ్యాత్మ - కానేరదు". అని భట్టనాయకుఁడు చెప్పియున్నాడు.

అవ :— భట్టనాయకుని సిద్ధాంతము - ఇట్లునిరాకరింబఁబడినను, తదభిప్రాయమును-విశదీకరించి దానిని నిరాకరించి - అతఁడుకూడ- ధ్వనిని కావ్యాత్మగా నంగీకరించునట్లొనర్చుటకు చెప్పుచున్నాఁడు.

[లోచనము] అదెట్లనిన :- "కావ్యేరసయితా సర్వోనబోద్ధానని యోగభాక్' "కావ్యమునందు రసచర్వణాశీలమగు జనమంతయు అధికారియగును, [ఇతిహాసాదికమునుమాత్రము గ్రహించువాఁడగు] బోద్ధ - అధికారికాఁడు. [వేదాదులయందలివినియోగమాత్రమును గ్రహించువాఁడగు] నియోగభాక్కు - [నియోజ్యుఁడు] అధికారి కాఁడు." అని నీవేఅంటివిగదా! కనుక కావ్యమునందున్న అభిధ, భావన, రసచర్వణఅను మూడంశములయందును గూడ - మూడవదియగు రసచర్వణకే - నీవుప్రాధాన్యమును జెప్పుటవలన - 'అదియే కావ్యజీవిత' మని నీవును చెప్పినట్లయినది. 'ఇట్లు నీవుచెప్పిన రసచర్వణయే-మేముచెప్పిన కావ్యజీవితముగుధ్వని' అగుచున్నది. కనుక, "రసచర్వణయే కావ్యజీవితభూత"మనుటలో నీకును, మాకును, వివాదములేదు.

ప్రథా : అవ :— అయినను నీవుధ్వనిలేదనుచున్నావు. ఒకవేళ-అది-అభిధా, భావనలకంటె వేరనిసిద్ధించినను, ఈమాధ్వనిని-కావ్యమునందు-అంశమే [అంగమే] అనుచున్నావు- 'అంశియగు అంగి' యని యంగీకరింపకున్నావు. కావున నిన్నీవిషయమునిట్లు ప్రశ్నింపవలసియున్నది.

లోచ :— 'వస్త్వలంకార ధ్వనులుమాత్రమే - కావ్యాంగములు' అను నభిప్రాయమున నీవు ధ్వనిని-కావ్యాంగమని చెప్పినయెడల సిద్ధసాధనమే యగును. రసధ్వనిగూడ - కావ్యాంగమేయను నభిప్రాయమున నీవిట్లుచెప్పిన యెడలమాత్రము - అది - స్వాభ్యుపగమ, ప్రసిద్ధి, స్వసంవేదన-విరుద్ధమగును.

[నీయభిమతమునకును, రసవిత్త్వసిద్ధికిని, స్వానుభవమునకును, విరుద్ధమైనదియే యగును.]

[ప్రభామతి] భట్టనాయకుఁడు 'హృదయదర్పణ' గ్రంథకర్త-కావ్యమునం దలి వ్యాపారము - త్రివిధమని ఇట్లు చెప్పెను.

> ''వ్యాపారస్త్రివిధో బుధైరభిమతః కావ్యేఽభిధా, భావనా,
> భోగోత్పాదకతాత్మనా తదధికో నాఽస్తిధ్వనిర్నామ నః
> సిద్ధాద్యా వ్యవహారభూమిషు, విభావాద్యర్థసాధారణీ
> కారాత్మాత్వపరా, నిరర్గలరసాస్వాదాత్మికైవాన్తిమా''.

''అభిధ - భావన - భోగోత్పాదకత - [రసచర్వణ] అని త్రివిధమగు వ్యాపారము - కావ్యమునందుండు''నను నది - బుధసమ్మతము,

వానికంటె అధికమైన ధ్వనియనుపేరుగల వేరొక వ్యాపారము మాకు లేదు. అభిధ - వ్యవహారరంగములందు సిద్ధించియేయున్నది. అది - మొదటిది. కావ్యమునందున్న విభావాద్యర్థమును శ్రోతలకు సాధారణీకరించునది - భావనావ్యాపారము. ఇది - రెండవది. నిరర్గళమగు, రసాస్వాదమే - [రసచర్వణమే] స్వరూపముగాగలది- మూడవదియగు, భోగోత్పాదకత అను వ్యాపారము.''అని. కనుక, అభిధ, భావన, రసచర్వణ, అను వానియందు రసచర్వణయే -ప్రధానమని భట్టనాయకుఁడు - అంగీకరించియున్నాఁడు. కనుకనే ఆతఁడు - ఇతిహాసార్థమునెఱుగువాఁడుగాని, వేదశాస్త్రనియోజ్యుఁడుగాని, కావ్యరసాస్వాదసమర్థులు కాకుండుటవలన-కావ్యమునందు - అధికారులుకారనిచెప్పి - కావ్యరసచర్వణాశీలుఁడే - కావ్యపఠనయోగ్యుఁడని చెప్పెను.

అతనిమతమునందుఁగూడ - అంతిమవ్యాపారమగురసచర్వణయే - కావ్యమునకు ప్రధానమగుచున్నది. కనుక, అదియే - కావ్యజీవితమని, యతఁడంగీకరించినట్లయినది. ''మేము ధ్వనిఅని చెప్పిన కావ్యజీవితమునే - తాను - కావ్యమునకు ప్రధానమగు రసచర్వణ'' అని చెప్పుటవలన ''మాకిరువురకును- ఎట్టి వివాదమునులే''దని సిద్ధించుచున్నది అనునది లోచనాభిప్రాయము.

భట్టనాయకుఁడు - స్వమతమునందు - ధ్వని [ధ్వనన] వ్యాపారములేదను నంశమును ''వ్యాపారస్త్రివిధః', అనుశ్లోకమునఁజెప్పెను. ఒకవేళ అభిధా

దులకంటె - ధ్వనికి భేదము సిద్ధించినను, అది - కావ్యమునందొక యంశమే, [అంగమే,] అగునుగాని, స్వరూపమగు ఆత్మకాదు.'' అని ''ధ్వనిర్నామ'' అను శ్లోకమునఁజెప్పెను, 'వస్తుధ్వని, అలంకారధ్వని, రస [రసాది] ధ్వని,' అని మేముచెప్పిన ధ్వనిత్రియమునందు - భట్టనాయకుఁడు- ''వస్తుధ్వనిని, అలంకార ధ్వనిని, మాత్రమే - కావ్యాంశము''లని చెప్పినయెడల - అతఁడు మేము చెప్పిన దానినే చెప్పుటవలన - అది - సిద్ధసాధనమేయగును. మేమును, 'రసధ్వనియే-ముఖ్యమగు కావ్యాత్మ' అని యంగీకరించియున్నాము. తదితరములగు, వస్తు, అలంకార, ధ్వనులు - రసపర్యవసాయులనియు, ముఖ్యమగు నాత్మకావనియు, అవి - వాచ్యములగు నలంకారాదులకంటె మాత్రము శ్రేష్ఠములనియు, [కావ్య స్యాత్మా] ''ఆరసధ్వని - ఒకటె'' ఇత్యాదులచేత - చెప్పనున్నాము. కనుక - అతఁడు సాధించిన క్రొత్తవిషయమేదియులేదు. ''రసధ్వనికూడ-కావ్యాంగమే'' అని యతని యభిప్రాయమగునెడల - అది - రసచర్వణను, కావ్యమునకు ఆధారముగా నంగీకరించిన అతని యభిమతమునకును, కావ్యతత్త్వజ్ఞ (లక్ష్య) ప్రసిద్ధికిని, సహృదయ స్వానుభవమునకును, గూడ - విరుద్ధమేయగును.

అవ :— ''భామహాదులు - కీర్తిమున్నగు వానినిగూడ ప్రయోజనములుగాఁ జెప్పియున్నారుగదా ! ఈ యానందవర్ధనుఁడు - ఆనందము నొక్క-దానినే - కావ్యమునకు ప్రధానప్రయోజనముగాఁ జెప్పుట సమంజసమగునా ?'' అని యాశంకించి చెప్పుచున్నాఁడు,

[లోచనము] కవికి కావ్యరచనచేత లభించునదియగు కీర్తిచేతఁగూడ - ప్రీతియే సంపాదింపఁదగినది. [కనుక - ఆనందమే - ప్రధానముగాఁ జెప్పఁబడినది.]

అదెట్లనిన :— ''కీర్తింస్వర్గఫలామాహుః'' ''కీర్తినిస్వర్గ[నిరతిశయానంద] ఫలముగాఁ జెప్పుదురు.'' అని పెద్దలు చెప్పిరిగదా ! [వామనుఁడు చెప్పెను.] కావ్యమున - శ్రోతలకు వ్యుత్పత్తియు, ప్రీతియుఁ, గూడఁ గలుగుట-వాస్తవమే యగును.

అదెట్లనిన :— ''ధర్మార్థ కామమోక్షేషువైచక్షణ్యంకలాసుచ
కరోతి కీర్తింప్రీతించ సాధుకావ్యనిషేవణమ్''

సత్కావ్యసేవ - ధర్మము, అర్థము, కామము, మోక్షము, అను పురుషార్థముల వ్యుత్పత్తిని, కళలయందలి వ్యుత్పత్తిని, కీర్తిని, ప్రీతిని, గూడ - కలిగించును.'' అని [భామహుఁడు] చెప్పెనుగదా!

అయినను,- అందు [వ్యుత్పత్తి, ప్రీతుల, నడుమ] ప్రీతియే [ఆనందమే] ప్రధానము. [ప్రధానఫలము] అట్లు కానియెడల ప్రభుసమ్మితములగు వ్యుత్పత్తి హేతువులు - వేదాదులకంటెను, మిత్రసమ్మితములగు వ్యుత్పత్తి హేతువులు - ఇతిహాసాదులకంటెను, కావ్యరూపమునందు - జాయాసమ్మితత్వ లక్షణమగు విశేషము - ఏమున్నది ? కనుకనే - [కారికయందు] ఆనందమే ప్రధానముగా [ముఖ్యఫలముగా] చెప్పఁబడినది. చతుర్వర్గ జ్ఞానమునకుఁగూడ - పార్యంతికమగు ముఖ్యఫలము - 'ఆనందమే'యగును.

ప్రభామతి :— 'కీర్తి - సుఖప్రాప్తిరూపముకా'దను శంక - 'కీర్తి - స్వర్గఫలము' అను వామనోక్తిచేత పరిహృతము. స్వర్గమనగా; 'ఏదిదుఃఖముతోఁ గూడనిదో, అట్టినిరతిశయప్రీతిరూపము'' అని ప్రసిద్ధమైయున్నదిగదా! వ్యుత్పత్తి యనఁగా, విశిష్టమగు జ్ఞానము. వేదాదులవలనను, ఇతిహాసాదులవలనను, గూడ- వ్యుత్పత్తి కలుగుచున్నది,

జాయా [కాంతా] సమ్మితమని చెప్పబడిన కావ్యమునకుఁగూడ - 'అవ్యుత్పత్తియే ఫల'మని చెప్పినయెడల - అందెట్టి విశేషముండదు. కనుకనే-కారికయందు - ఆనందమే ప్రధానఫలముగాఁ చెప్పఁబడినది. [భామహుఁడు చెప్పిన] ''ధర్మాదివ్యుత్పత్తియు, కీర్తియుఁ, గూడ, - ప్రధానమగుటచేత - అంగియగు ఆనందమునకు - అంగములగు ఫలములే, అగును'' అనునది - భామహవచనాభిప్రాయముగానెఱుఁగునది. ''కావ్యమునకు ప్రధానప్రయోజనము-ఆనందము. ధర్మార్థకామమోక్ష - వ్యుత్పత్తియు, కళా వ్యుత్పత్తియు, కీర్తియుఁగూడ-కావ్యమునకానుషంగికములగు ఫలములే'' అగునని భావము.

అవ :— ''ఆనందప్రతిష్ఠ'' అనుమూలమునకు, 'ఆనందముయొక్క- ప్రతిష్ఠ అనుసర్థము - తొలుత ప్రతిపాదింపఁబడినది. మరలనిపుడు - దానికే ''ఆనందునియొక్క- ప్రతిష్ఠ'' అను వేఱొకయర్థమును దెలుపుటకువ్యాఖ్యానించుచున్నాఁడు.

లోచనము :— ''ఆనందుఁడు'' అనునది - గ్రంథకర్తయొక్క-నామము గూడనగుచున్నది. కనుక- ''ఆయానందవర్ధనాచార్యుఁడు- ఈధ్వన్యాలోక శాస్త్ర

ద్వారమున, దేవుఁడు- దేవతాయతనాదులయందువలె, సహృదయహృదయముల యందు అనశ్వరియగు [నశింపని] స్థిరస్థితి నొందుగాక ! '' అనునది - దీని భావము.

ప్రభామతి :— ''దేవాలయము, భక్త, యోగి, జనహృదయము, మొదలగువానియందు - దేవతామూర్తివలె, సహృదయ హృదయమందిరములయందు- ఆనందుఁడు - అనగా; ఆనందవర్ధనుఁడు - ధ్వనిశాస్త్రరూపముతో శాశ్వతముగా నుండుఁగాక!'' అనియర్థము.

శాస్త్రము - శాసనకరణము. ఇది - అజ్ఞాతమగువానిని జ్ఞప్తికిఁ గొనితెచ్చునది. వేరొక ప్రమాణముచేత - తెలియఁబడని కావ్యజీవితమగు ధ్వనిస్వరూపము - దీనిచేత - తెలియఁజేయఁబడుటవలన - ఇది - శాస్త్రముగా సుప్రతిష్ఠితము. 'హితమును - శాసించునది' కూడ - శాస్త్రమని చెప్పఁబడును.

అవ :— భామహాచార్యవచనమును - దీనికి సంవాదకముగా నుదాహరించుచున్నాఁడు.

[లోచనము] ఇష్టే - వెనుక, చెప్పఁబడినది.

''ఉపేయుషామపిదివం సన్నిబన్ధవిధాయినామ్
ఆస్త ఏవనిరాతంకంకాన్తం కావ్యమయం వపుః''

''సద్గ్రంథ రచయితలు - స్వర్గమునొందినను, కాంతమును, కావ్యమయమును, అగువారి- శరీరము-నిరాతంకముగానుండునదియే యగును''అని. సహృదయహృదయమునందు - ఎటువంటిది - ప్రతిష్ఠనొందునో, ఈ యానందుని మనస్సు - అటువంటిదైయున్నది. ఈ గ్రంథకర్తనిశ్చయముగా సహృదయ చక్రవర్తిగదా !

''యుద్ధే ప్రతిష్ఠా పరమార్జునస్య'', ''అర్జునునికి యుద్ధమునందు - తాత్పర్యరూపిణియగు గొప్పప్రతిష్ఠకలదు''. అను ప్రయోగమునందువలె, ఇచ్చటఁగూడ ప్రతిష్ఠాపదార్థము నెఱుఁగునది.

ప్రభామతి :— ఆనందుని మనస్సు - అనఁగా; ''వైమష్యము- లేక ఈ శాస్త్రము.'' అనియర్థము. దీనిచేత - గ్రంథకర్తకుఁగూడ - కీర్తిద్వారమున ప్రీతి

రూపమగు ఫలము కలుగునని ప్రదర్శితము, ప్రతిష్ఠయనఁగా; బహుమానరూప మగునునికి.

అవ :— "గ్రంథకర్త - ఇట్లు తనపేరు ప్రకటించుకొనినట్లు వ్యాఖ్యానించుట యెందులకు" అని యాశంకించి - చెప్పుచున్నాఁడు.

లోచనము :— స్వనామప్రకటీకరణము- ఇతఁడాప్తుఁడను బుద్ధిని, బహుమానమును, గలిగించి - శ్రోతల నీశాస్త్రమునందు ప్రవర్తింపఁజేయుటకుఁ దోడ్పడునదియేయగును, ఈ యంశమును గ్రంథాంతమున ["ఆనందవర్ధనఇతిప్రథితాభిధానః" అనునర్థమును వ్యాఖ్యానించు నవసరమున] చెప్పుదుము.

ఇట్లు - గ్రంథకర్తయగుకవికిని, శ్రోతకును, ముఖ్యమగు ప్రయోజనము - తెలుపఁబడినది.

ప్రభా :— "ముఖ్య ప్రయోజనము - ప్రీతిరూపమని చెప్పుటవలన - అముఖ్యములగు అవాంతరప్రయోజనములుగూడ - ఉన్నవి." అనునది - నిస్సంశయమని తెలియునది.

లోచనము : అవ : ప్రశ్న :— అయ్యా ! "ధ్వనిస్వరూపమును జెప్పుచున్నాము" అని ప్రతిజ్ఞనొనర్చి - "వాచ్యము, ప్రతీయమానము, [వ్యంగ్యము] అని, అర్థమునకు - రెండుభేదములున్నవి" అని క్రిందికారిక - వాచ్యమును దెలుపుట సంగతమా ?

ఉ :— సంగతినొనర్చుటకే - కృతికర్త - క్రిందియవతరణిక నొనర్చుచున్నాఁడు. [చూడుఁడు !]

(17) మూలము : అవ :— అందు లక్షణము [స్వరూపనిరూపణము] నారంభించుటకు ప్రారంభింపఁబడిన ధ్వనికే ముందుభూమికను రచించుటకిది చెప్పఁబడుచున్నది.

[యోఽర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతివ్యవస్థితః
'వాచ్య-ప్రతీయమానాఖ్యౌ'-తస్యభేదావుభౌ స్మృతౌ. 2]

గీ॥ అర్థమెయ్యది - కావ్యాత్మయనువ్యవస్థ
నంది, సహృదయశ్లాఘ్యమై, యలరునదియొ;
దానికి - ప్రభేదములు సంస్మృతములు - రెండు -
మహిని 'వాచ్య'మ్మన, 'ప్రతీయమాన'మనఁగ. 2

లోచనము :— "అందు" అనఁగా: ధ్వనిస్వరూపము - అభిధేయమును, ప్రీతిరూపము-ప్రయోజనమును, అయియుండ; భూమివంటిదగుటవలన వాచ్యము-భూమికగాఁ జెప్పఁబడుచున్నది.

అదెట్లనిన :— అపూర్వమగు నిర్మాణము [మేడమున్నగునది] నిర్మింపఁ దలఁచునపుడు ముందుగా నేలయే యెట్లు సదునుచేయబడునో, అట్లే - ప్రతీయమానమను పేరుగల ధ్వనిస్వరూపము - నిరూపింపఁ దగియుండునపుడు - నిర్వివాదముగా సిద్ధించునదియగు వాచ్యమును [మొదటఁ] దెలుపుట - [భూమిని సదునుచేయుటవంటిదే యగుటవలన] 'భూమిక'అగుచున్నది.

ఏలయనిన :— దానివెనుకనే - [దానికంటె] అధికమగు [వేఱయిన] ప్రతీయమానమను నంశముల్లేఖింపఁబడుచున్నదిగదా !

ప్రభామతి :— "మూలమునందు - 'ధ్వనికే' అనుచోనున్న ఏవకారము వలన - వాచ్యమును జెప్పుట - సంగతమేయగును." అనునది - సిద్ధించుచున్నది. ధ్వనివాదికిని, ధ్వన్యభావాదికిని,గూడ- నిర్వివాదముగా సిద్ధించునదియగు'వాచ్యార్థము' అను పరిష్కృత భూమిమీఁదనే - అధికాంశమగు "వ్యంగ్యార్థము" అను సౌధము - నిర్మింపఁబడుచున్నది. కనుక, వాచ్యమగునర్థము - భూమివంటిదగుట యుక్తమేయగును.

ప్రశ్న :— "అర్థము-'వాచ్యము, ప్రతీయమానము'. అని ద్వివిధము" అని రెండింటినిగూడ - సమప్రధానములుగాఁజెప్పుట - ఏల ?

ఉ :— లోచనోక్తిని సమీక్షింపుఁడు.

లోచనము :— వ్యంగ్యమును - వాచ్యముతో సమశీర్షికగా గణించుట - [వాచ్యమువలె] వ్యంగముగూడ - అపహ్నవింపఁదగనిదని [కప్పిపుచ్చరానిదని] చెప్పుటకేయగును. "దానికి ప్రభేదములు సంస్మృతములు" అనుచోనున్న

స్మృతశబ్దముచేత - "మున్నె బుధజాతామ్నాతమైయుండన్" అని ప్రథమకారిక యందుఁజెప్పఁబడిన యభిప్రాయమే - దృఢీకృతము.

ప్రభా :— "ధ్వని-స్వకపోలకల్పితముకాదు" అనిచెప్పుటకే-"మున్నె బుధజాతామ్నాతమై" అని, కారికయందుగ్గడింపఁబడినది. ఆయంశమే - తిరుగ, "సంస్మృతములు" 'పూర్వపండితులచేత స్మరింపఁబడినవి" అని చెప్పఁబడినది.

ప్రశ్న :— భూతలమునందలి కమలముతో, ఆకాశమునందున్న కమలమును జేర్చి - చెప్పినంతమాత్రమున, ఆకాశకమలమునకు- ఉనికిసిద్ధింపదు. అట్లే - ప్రసిద్ధమగు వాచ్యముతోఁజేర్చి - వ్యంగ్యమును జెప్పినంతమాత్రమున, వ్యంగ్యమునకు - ఉనికి సిద్ధించునదికాదు.

ఉ :— "వ్యంగ్యము - ఆకాశకమలముకాదు" అనుటకే - మీదికారిక యందు - "సహృదయశ్లాఘ్యమై" అని చెప్పఁబడినది. క్రిందిలోచనమును సమీక్షించినయెడల - 'వ్యంగ్యమునకు - ఉనికి' ఎట్లు సిద్ధించునదియుఁ దెలియును.

లోచనము :— "కావ్యము - శబ్దార్థశరీరము" అని యభావవాదులచేత- వెనుక - చెప్పఁబడినదిగదా ! ఇట్లు [కావ్యమునకు - శబ్దార్థములను] శరీరముగా గ్రహించుటవలననే ఆశరీరము - ఆశరీరమును జీవింపఁజేయునదియగు [ఆశరీరముకంటె, వేఱయి, దానినుప్రాణింపఁయునదియగు] 'ఏదోయొకయాత్మతోఁ గూడియుండునది - కాఁదగినదియే' అగుచుండును. అందు [ఈవిషయమున] శరీరము- సర్వజనసంవేద్యములగు బలియుట, చిక్కియుండుట, మొదలగు ధర్మములుగలదియగునట్లు,శబ్దము-సర్వజనసంవేద్యములగుమాధుర్యము, పారుష్యము, మొదలగు ధర్మములుగలదియగుటవలన- శరీరభాగమునందే - సంనివేశింపఁబడుచున్నది. అర్థముమాత్రము [ఇట్లు] 'సకలజనసంవేద్యముకాదు'. లౌకికములును, వైదికములును, నగువాక్యములయందుఁగూడ - అర్థమున్నది. అయినది - కావ్యమనివ్యవహరింపఁబడదు. కనుక అర్థమాత్రము[సామాన్యమగునర్థమంతయుఁ] గూడ - కావ్యమని వ్యవహరింపఁబడునది కానేరదు. కావుననే - "సహృదయ శ్లాఘ్యమై యలరునదియొ" అని చెప్పఁబడినది.

[ఒకటిగానున్నట్లు భాసించుటవలన] ఒకటియేయగు నాయర్థమే - ద్విశాఖలుగలది; [అంశద్వయముగలది;] కనుక - విభాగబుద్ధిచేత - వివేకులు దానిని విభజించుచున్నారు. అదెట్లనిన :- కావ్యార్థమును, లౌకికాద్యర్థమునుగూడ - అర్థరూపములేయగుటవలన - తుల్యములైయున్నను, అందొకదానినే [కావ్యార్థమునే]

సహృదయులు శ్లాఘించుచుందురు. కనుక అచట - [కావ్యార్థమునందు] ఏదో విశేషముండితీరవలయును. ఆవిశేషమేదో, అదియే - ప్రతీయమానభాగము. అదియే విశేషహేతువగుటవలన దానినే - వివేచనశీలురు [సహృదయులు] 'ఆత్మ' అని వ్యవస్థాపించుచున్నారు.

ప్రభా :— పూర్వపక్షులగు ధ్వన్యభావవాదులుకూడ - "శబ్దార్థములు శరీరముగాఁగలది - కావ్యము" అనిచెప్పిరి. కనుక - "జడమగు మానవశరీరమునందువలె కావ్యశరీరమునందుఁగూడ - దానికంటె వేఱయి, దానినుజ్జీవింపఁ జేయఁదగినదగు నాత్మ - యేదోయొకటి - ఉండితీరవలసినదియే" అగును.

అట్లుండదనినయెడల- వారికి స్వవచనవిరోధము కలుగకతప్పదు. కనుక- వారు కూడ - శబ్దార్థములయందొకదాని నాత్మగానంగీకరింప వలసియున్నది. లోకులకందఱికిని, మానవుని స్థూలశరీరమునందున్న స్థూలత్వ, కృశత్వాది. ధర్మములవలె, పాఠకులకందఱికిని, శబ్దమునందున్న మాధుర్య, పారుష్యాది ధర్మములు - స్పష్టముగాఁ దెలియఁబడుచుండును. కనుక స్థూలశరీరమువలె, శబ్దము కూడ - కావ్యశరీరమునకు - ఆత్మకానేరదు. కనుక - ఆత్మగాఁ జెప్పఁదగదు. ఇంతేమనిన; శబ్దము - కావ్యమునకు శరీరముగాఁ జెప్పఁదగినదియే యగును. అర్థమో, ఇట్లందఱికిని తెలియఁబడునదికాదు, కనుకనదికావ్యమునకు శరీరముగాఁ జెప్పఁదగినదికాదు. కనుక ఆత్మగానే చెప్పఁదగినదగుచుండును. అట్లని - అర్థమును దేనినైనను [అర్థసామాన్యమును] కావ్యాత్మగాఁ జెప్పఁదగదు.

"కాకరకాయ చేదుగానుండును" అను లౌకికవాక్యముగాని, "ధర్మము నాచరింపుము" అనువైదికవాక్యముగాని, కావ్యమని వ్యవహరింపఁదగినదికాదు. కనుక, అర్థమాత్రమును కావ్యమనుటకు వీలుపడదు.

ఇంతేమనిన; విభావాదివర్ణ్యముతోడి - తన్మయీభవనమునొందువారగు సహృదయులు - ఏయర్థమును శ్లాఘింతురో, అదియే - కావ్యార్థమగుననియు, తదితరలౌకికవైదికాద్యర్థము - కావ్యార్థముకాదనియు, నెఱుఁగఁదగును. లౌకికమగు నర్థము - కావ్యార్థముకాదని, దానిని నిరసించుటకే-పూర్వోక్తమగు కారికయందు- "సహృదయశ్లాఘ్యమై" అను విశేషణము ప్రయోగింపఁబడినది.

గుణ్ణమునకును - గోవునకును-వలె, వాచ్యమునకును- వ్యంగ్యమునకును- ఆత్యంతికమగు భేదములేదనియు, వీనికి ధర్మధర్మిభావన్యాయముగలదనియు

ముందుచెప్పఁబడును. కనుక నీకారికయందు మొదట - కావ్యార్థమంతయుఁగూడ- ఒకటిగాఁ జెప్పఁబడినది. తదుపరినది - వాచ్యము-ప్రతీయమానము, అని ద్వివిధ ముగా విభజింపఁబడినది.

ప్రశ్న :— అట్లయినయెడల - కావ్యమునందున్న వాచ్యార్థమును, వ్యంగ్యార్థమునుగూడ - సహృదయశ్లాఘ్యములే'యగు'ననియు, 'వాచ్యవ్యంగ్య రూపమగు నర్థమంతయుఁగూడ - కావ్యాత్మయేయగుననియు, చెప్పవచ్చునా ?

ఉ :— కావ్యార్థమును, లౌకికాద్యర్థమునుగూడ- ''అర్థింపఁబడునవియే- అనఁగా; తెలియఁబడునవియే,'' అగును, కనుక నిట్లు - అర్థరూపములేయగుట వలన - ఈరెండును సమానములేయగుచున్నను, సహృదయులు - కావ్యార్థమునే శ్లాఘింతురు. గాని, లౌకికాద్యర్థమును శ్లాఘింపరు. ఏల ? [వాచ్యవ్యంగ్యోభయ రూపమగు] కావ్యార్థమునందు సహృదయశ్లాఘాపాత్రమగు ఈ విశేషమేమి - అని విచారించునెడల - ''ఆవిశేషము - ప్రతీయమానాంశమే-కాని, వాచ్యాంశ ముకా''దని వివేకులు గ్రహింపవచ్చును. కావ్యార్థమునందు వ్యంగ్యరూపమగు నంశముండుటవలననే - సహృదయులు కావ్యార్థమును శ్లాఘించుచున్నారు. కేవల మగు వాచ్యార్థము - సహృదయశ్లాఘ్యముకాకున్నను, వ్యంగ్యార్థముతోడి-సంవల నము [మిశ్రణ] వలననే - శ్లాఘ్యమగుచున్నది. అట్లుకానిచో; కేవలమగువాచ్యా ర్థమునకు - లౌకికాద్యర్థముకంటె - ఎట్టివిశేషమును లేకుండుటవలన - కేవల వాచ్యార్థము శ్లాఘ్యముగాఁ జాలకయేయుండెడిది గదా ! ఇనుపగుండు - స్వయ ముగా, దాహకము - [కాల్చునది] గాకున్నను, దహనశక్తిగల అగ్నితోఁగూడి యుండునపుడు, దాహకముగా, వ్యవహరింపఁబడుచున్నది. అట్లే, శ్లాఘాపాత్ర మగు వ్యంగ్యాంశముతోఁగూడిన వాచ్యాంశముగూడ - విభాగదృష్టిననుసరింప నప్పుడు - సహృదయశ్లాఘ్యమగుచున్నది. కనుక - అవిభాగదృష్టిచేత వాచ్య రూపమును, వ్యంగ్యరూపమును, నగు కావ్యార్థమంతయుఁగూడ - సహృదయ శ్లాఘ్య''మని కారికయందు మొదటఁజెప్పబడినది. దేనిసంబంధమువలన కావ్యా ర్థమునందున్న వాచ్యాంశముగూడ - 'సహృదయ శ్లాఘ్య'మనియు, 'కావ్యాత్మ' యనియుఁజెప్పఁబడినదో, ఆవ్యంగ్యాంశమే- లౌకికాద్యర్థముకంటె-కావ్యార్థమును విశేషింపఁజేయునదై, యున్నవి. కనుక- ఆవ్యంగ్యాంశమే - [ప్రతీయమానమే] వస్తుతః, 'సహృదయశ్లాఘ్యమును, కావ్యాత్మయు', అగుచున్నదని తెలియునది. దీనికంటె వేఱగు వాచ్యార్థము - కావ్యశరీరమేయగును. ''శిరస్సు'' మొదలగు దేహపిండములు - 'కుండ' మున్నగువానివలెనే, జడములై[చైతన్యరహితములై] ఉన్నవి. వీనికంటెవేఱగు నాత్మ - తనసాన్నిధ్యవిశేషమువలన - వీనియందు తన

చైతన్యమునారోపించి- ఈదేహపిండమునే-'ఆత్మ'గాఁదోచునట్లుచేసి- "ఇతఁడెంత సుందరుఁడు" అని యనిపించుచున్నదిగదా! ఇట్లే - "కావ్యార్థమునందలి వాచ్యార్థముగూడ - లౌకిక వైదికాద్యర్థమువలె, స్వయముగాశ్లాఘ్యముకానిదియే"అగును, దీనికంటె - వేఱగుప్రతీయమానాంశము -[వ్యంగ్యార్థము] దీనికి తనసౌందర్యము నారోపించి - ఈవాచ్యార్థమునుగూడ - 'ఆత్మ' అని తోచునట్లొనర్చి-దీనినిగూడ-[వాచ్యమునుగూడ] సహృదయ శ్లాఘ్యమగునట్లు చేయుచున్నది, ఇట్లు ప్రతీయ మానాంశముగూడ - ఆత్మయొక్క గుణమువంటి గుణముగలదగుచున్నది. ఇట్లు ఆత్మగుణ సామ్యముగలదగుటవలన ఈ ప్రతీయమానాంశమునే - [కావ్యార్థము నందున్న వాచ్య - వ్యంగ్యములలో - వ్యంగ్యార్థభాగమునే] విభాగకుశలురగు సహృదయులు విభజించి - "కావ్యాత్మ" అని వ్యవహరించుచున్నారు" అని తెలియునది. ఆత్మగుణయోగము ననుసరించుటవలన - ప్రతీయమానాంశమునకుఁ గలిగిన 'కావ్యాత్మవ్యవహారము' - గౌణమగుచున్నది. ఈయంశము - "విశేష హేతువగుటవలన" అను లోచనోక్తిచేత- సంగ్రహింపఁబడినదని తెలియునది.

అవ :— ప్రతీయమానాంశము - వాచ్యాంశముకంటె వేఱుగానున్నట్లు పాఠకులకందఱికి నేలతెలియదో ! మఱియు, ఈవ్యంగ్యార్థ విషయమున [మీదు మిక్కిలి] విమతులుకూడనున్నవే ! సంశయాదిగ్రస్తమగు, ఇట్టిది - కావ్యాత్మ యగునా ?" అని యాశంకించి - చెప్పుచున్నాఁడు.

లోచనము :— చార్వాకులు - [నాస్తికులు] "ఆత్మ - శరీరముకంటె వేఱు" అనుతాత్త్విక విషయమున - విరుద్ధాభిప్రాయరూపమగు భ్రాంతినిగలిగి యున్నట్లు, వాచ్యసంవలనచేత విమోహితమగు హృదయముగలవారు మాత్రము-[వాచ్యమునుండి వ్యంగ్యమును విభజింపఁజాలని అవివేకులు మాత్రము] దాని పృథగ్భావమునందు[వ్యంగ్యము వేఱనువిషయమున] విప్రతిపత్తిగలిగియున్నారు

కనుకనే - "అర్థమెయ్యది కావ్యాత్మయను వ్యవస్థనంది" అని కావ్యార్థ మును [అంతను] ఒక్కటిగా నుపక్రమించి, "సహృదయశ్లాఘ్యమై" అని విశే షణ ద్వారమున-అందు - "రెండంశములుండుట"అను హేతువును [సహృదయ శ్లాఘ్యత్వ హేతువును] దెలిపి - పిమ్మట విభాగబుద్ధిచేత - ఆయర్థమునకు రెండు భేదములు - అనగా, అంశములు- [భాగములు] స్మృతములు" అనువిషయము-చెప్పఁబడినది. కాని, "ఈయంశములు రెండును - [వాచ్యము - ప్రతీయమానము

అను భాగములు రెండును] గూడ - కావ్యమునకాత్మలే" అను నభిప్రాయమున- ఇట్లు చెప్పఁబడుటలేదు.

ప్రభామతి :— "కాంతలయందు, ప్రసిద్ధములగు అవయవములకంటె- వేఱగు లావణ్యముండునట్లు, మహాకవివాణులయందు వాచ్యార్థముకంటె- వేఱగు ప్రతీయమానముండును" అని ముందుచెప్పఁబడును. కనుక - వాచ్యార్థము - కావ్యమునకు శరీరమేయగును. గాని, ఆత్మకానేరదు. ప్రతీయమానమే-ఆత్మగాఁ జెప్పఁదగినదియగును. అయినను, ఈప్రతీయమానమునకు వాచ్యముతోడిసంవలన అనఁగా; మిశ్రణ-ఉన్నది. [అదియు, నిదియు, నొక్కసారిగా స్ఫురించుటవలన] నిరూఢనిబిడతరతాదూప్య భావనావాసనాధిరూఢమగు, ఆమిశ్రణచేత - విమోహితహృదయులగువారుమాత్రము - చార్వాకులు - శరీరముకంటె- వేఱగునాత్మ నెఱుఁగనట్లు, కావ్యశరీరమగు వాచ్యార్థముకంటె - వేఱయిన కావ్యాత్మ" అగు- ప్రతీయమానము నెఱుఁగఁజాలకున్నారు, కనుక - "కావ్యార్థమంతయుఁగూడఁ ఒక్కటియే" అని యనుకొనుచున్నారు. కనుక - ఆయవివేకిజనబుద్ధిననుసరించి ఈకారికయందు - మొదట వాచ్యము వ్యంగ్యము, అనియర్థములు రెండింటిని - వేరుగాఁజెప్పక - "అర్థమెయ్యది - కావ్యాత్మయనువ్యవస్థనంది"అని, మొదట- ఏకవచముచేత - కావ్యార్థమంతయు - ఒక్కటిగా, అనువాద భాగమున - నిర్దేశింపఁబడినది. పిమ్మట - "సహృదయశ్లాఘ్యమై యలరునదియొ"అని. కావ్యాత్మగా తొలుతఁదెలుపఁబడిన యర్థమే - విశేషింపఁ [భేదింప] జేయఁబడినది. "లౌకికార్థమువలెను; వైదికార్థమువలెను - ఈకావ్యార్థముగూడ - అర్థరూపమే. అయినను 'లౌకికాద్యర్థము - సహృదయశ్లాఘ్యముకాదు' ఈకావ్యార్థము - సహృదయశ్లాఘ్యము". అని కావ్యార్థమునందు మాత్రమేగల విశేషరూపము దీనిచేత - తెలుపఁబడినది. ఇట్లు చెప్పుటచేత - "సహృదయశ్లాఘ్యమై" అనునీవిశేషణము చేత - "లౌకికాద్యర్థములకంటె కావ్యార్థమున కాధిక్యమును సంపాదించునది యగు - రెండంశముల యునికి" - [లౌకికాద్యర్థములందులేని సహృదయశ్లాఘ్యతకు హేతువగు ప్రతీయమానాంశము యొక్కయు, వాచ్యాంశముయొక్కయు, నునికి] అను హేతువు సూచింపఁబడినది. ఇందలి యర్థమును గ్రింది ప్రశ్నోత్తరములచేత స్పష్టముగా నెఱుఁగునది.

ప్రశ్న :— కావ్యార్థమును శ్రోతలెందుకు శ్లాఘించుచున్నారు? లౌకికాద్యర్థము - శ్లాఘాపాత్రముకాదా?

ఉత్త :— శ్రోతృప్రశంసార్హమగు ప్రతీయమానాంశము - వాచ్యాంశ

ముతోఁగూడి - కావ్యార్థమునందున్నది. కనుక- శ్రోతలు- కావ్యార్థమును ప్రశంసింతురు. లౌకికాద్యర్థమునందు, ప్రతీయమానాంశము - సాధారణముగానుండదు. కనుక - అది ప్రశంసాపాత్రము - కాదు.

ప్రశ్న :— [రసజ్ఞ] లౌకిక వ్యవహారమునందుఁగూడ - కొన్నియెడల ప్రశంసాయోగ్యత కాన్పించునెడల - మీరేమందురు ?

ఉ :— అప్పుడా వ్యవహారమునందుఁగూడ - ప్రతీయమానాంశమున్నదని చెప్పుదుము. ఎచ్చటనైననుసరియే, వాచ్యాంశముతోఁగూడిన వ్యంగ్యాంశముండునప్పుడే - 'ఈసహృదయశ్లాఘ్యత' - సిద్ధించునని తెలియునది.

ప్రశ్న :— "కావ్యార్థమునకు - వాచ్యము, ప్రతీయమానము, అను భేదములు - రెండు - స్మృతములు" అని కారికయందుఁదెలుపఁబడిన భేదశబ్దమునకు లోచనకర్త - 'అంశములు' - అనునర్థము నేలచెప్పెను ?

ఉత్త :— "వాచ్యవ్యంగ్యములు - అత్యంతభిన్నములుకావు" అని చెప్పుటకు - "ఇవి-అంశములు" - అనఁగా; కావ్యార్థమునందుండునవియగు "రెండు భాగములు" అని తెలిపెను.

ప్రశ్న :— 'ఏయర్థము - కావ్యాత్మఅని వ్యవస్థాపింపబడినదియై, సహృదయశ్లాఘ్యమగుచుండునో, ఆకావ్యార్థమునకు వాచ్యము - ప్రతీయమానము - అను భేదములు - రెండు - పూర్వులచేతనే - స్మరింపఁబడినవి'. అనునది కారికార్థమైయున్నది. దీనివలన, వాచ్యాంశము - ప్రతీయమానాంశము, అను భేదద్వయముగల కావ్యార్థమంతయుఁగూడ - సహృదయశ్లాఘ్యమును, కావ్యాత్మయు, అగుననునభిప్రాయము సిద్ధించుచున్నది. లోచనకర్త - దీనిఫలితార్థము నెట్లుతెలిపినదియుఁదెలుఁపగోరెదను.

ఉ :— "ప్రతీయమానాంశమే - కావ్యాత్మ. వాచ్యాంశము - కావ్యాత్మకాదు. సహృదయ శ్లాఘ్యమగు ప్రతీయమానము-వాచ్యముతోఁగూడియుండుటవలన - వాచ్యముగూడ - సహృదయశ్లాఘ్యమగుచున్నది. వాచ్యాంశము - కావ్యశరీరమే" అని లోచనకర్త - దీనియర్థమును దెలిపెను.

ప్రశ్న :— కారికాకారుఁడు - క్లిష్టమగు విధమున నీశ్లోకమును నిర్వచించుటకు హేతువేమి ? దానినిలోచనకర్త యెట్లు సమర్థించి సమన్వయించెను ?

ఉ :— అవివేకులకు [వాచ్యమును వ్యంగమును విభజింపఁజాలక - ఏక ముగా గ్రహించువారికి] ప్రతీయమానాంశముతోడి సంవలన [మిశ్రణ] వలన వాచ్యాంశముగూడ సహృదయశ్లాఘ్యమై, కావ్యాత్మగాఁ దోచుచుండును.

కనుక - కారికాపూర్వార్ధమునః ఆయవివేకిజనబుద్ధి ననుసరించి - వాచ్య వ్యంగ్యములను విభజించి చెప్పక - కావ్యార్థమునంతను గ్రహించి - ''అర్థము - సహృదయశ్లాఘ్యము, కావ్యాత్మగా వ్యవస్థితము'' అని మొదటఁ దెలుపఁబడినది. తదుపరి ఉత్తరార్ధమున విభాగదృష్టిననుసరించి సహృదయశ్లాఘ్యతకు హేతువుగా- సూచింపఁబడిన కావ్యార్థాంశములు - రెండును, 'వాచ్యము - ప్రతీయమానము.' అని తెలుపఁబడినవి. ఇట్లు-కావ్యార్థము - ద్వివిధముగా విభజింపఁబడినది. కనుక ; ''వాచ్యాంశము - ప్రతీయమానాంశముతోడి మిశ్రణవలన ఆత్మతోఁగూడిన శరీరమువలె, 'సహృదయశ్లాఘావిషయము మాత్రమే' యగుటవలన - 'శరీరము గానే' చెప్పఁదగినదనియు, సారముగా నుండుటవలన ప్రతీయమానాంశము మాత్రమే- 'ఆత్మగా'ఁ దెలుపఁదగినదనియు చెప్పినట్లయినది. ఈయర్థమంతయు 'సహృదయశ్లాఘ్యమై' అను విశేషణముచేతనే - సూచింపఁబడినది'', అని శ్రీలో చనకర్త - సమర్థించి - సమన్వయించెను.

లోచ : అవ :— కారికయందు''కావ్యాత్మ'' అనుదానియందలి 'కావ్యశబ్ద స్వరూపమును' దెలుపుచున్నాఁడు.

(18) మూలము :— కావ్యము - లలితోచిత సంనివేశ సుందరము. [లలితమును, ఉచితమును, అగు సంనివేశమున - సుందరమగు] ఆకావ్యమునకు - 'శరీరమున కాత్మవలె' సారరూప ముగా స్థితమును. [కనుకనే] సహృదయశ్లాఘ్యమును, నగు నేయ ర్థముకలదో, ఆయర్థమునకు - వాచ్యము, ప్రతీయమానము అను భేదములు - రెండున్నవి.

లోచన :— లలితశబ్దముచేత - కావ్యము ననుగ్రహించునవియగు గుణా లంకారములు చెప్పఁబడినవి.

ఉచితశబ్దముచేత - ''ఔచిత్యము - రసవిషయమే''యగునని చూపుచు రస ధ్వనియే - కావ్యజీవితమని సూచింపబడినది. కావ్యజీవితమగు రసధ్వనియేలేని యెడల - ఔచిత్యమనునది - [అభావవాదులచేతఁగూడ] అంతటను[లక్షణగ్రంథ

ములందు] దేనినపేక్షించి ఉద్ఘోషింపఁబడుచున్నది ? అని దీనిభావము. సహృదయ శ్లాఘ్యమగు, 'ఏ' యర్థమున్నదో'' అని యచ్ఛబ్దము [ఏశబ్దము] చేత [పరాభిమత మగు కావ్యార్థమునంతను] అనువదించి - ''కావ్యార్థము - సహృదయశ్లాఘ్యము'' అనునది పరునిచేతఁగూడ - అభ్యుపగతమని ప్రదర్శించుచున్నాఁడు. ఆయర్థమునకు ............' అనువాక్యముచేత - ''వాచ్యము, ప్రతీయమానము'' అని - కావ్యార్థమునకు - అంశద్వయమున్నపుడే - అది - సహృదయ శ్లాఘ్యమనునభ్యుపగమము - కుదురును'' అని ప్రదర్శించుచున్నాఁడు.

ప్రభా :— ''కావ్యాత్మ'' అనుచోనున్న కావ్యశబ్దమును వృత్తికారుఁడెట్లు వ్యాఖ్యానించినదియు, లోచనకర్త - తెలుపుచున్నాఁడు. లలితశబ్దముచేత - 'సౌందర్యకారణములగు గుణాలంకారాదులును' - ఉచితశబ్దముచేత - 'రసాది వ్యంజనసామర్థ్యమును', తద్ద్వారమున 'రసాది - ధ్వనికిమాత్రమే - ముఖ్యమగు కావ్యజీవితత్వమును, ప్రదర్శింపఁబడినది. ''వస్తుధ్వనియు, అలంకారధ్వనియు, రసాదిధ్వని పర్యవసానముగలవి. కనుక - కావ్యమునకు ''ముఖ్యమగు నాత్మ కావు'' అని ముందుచెప్పఁబడును. కావ్యార్థమునంతను - ''ఏయర్థముకలదో'' అనియనువదించుటవలన, పరాభిమతముగూడ-సంపాదితమని సూచింపఁబడినది. ఆయర్థము - సహృదయశ్లాఘ్యమని యంగీకరించిన పరుఁడు ఇట్లంగీకరించిన తరువాత-కావ్యమునందు - శ్లాఘాహేతువగు అంశద్వయమును గూడ- అంగీకరింప వలసియేయుండును. కనుక - ''అర్థమునకు- వాచ్యము, ప్రతీయమానము, అను భేదములు [అంశములు]'' అనుదానిచేత - పూర్వపక్షియగుపరుఁడుకూడ - ప్రతీయమానము నంగీకరింపకతీరదని ప్రదర్శింపఁబడినది.

లోచన :— ''ఇట్లు ప్రదర్శించుటచేత - [కావ్యార్థమును - అంశద్వయముగా విభజించి - అందు వాచ్యాలంకారవ్యతిరిక్తమగు ప్రతీయమానమును - 'కావ్యాత్మగా' సూచించుట చేత-] ''ధ్వని - సౌందర్యహేతువు. కనుక గుణాలంకారవ్యతిరిక్తముకాదు''. అని యేది [ఏయనుమానము] వెనుకచెప్పఁబడినదో, ఆయనుమానమునకు హేతువు సిద్ధింపదు'' అని ప్రదర్శితము.

ప్రభా : అవ :— ''ధ్వని - కావ్యాత్మయగుగాక ; సౌందర్యహేతువు కూడ - కావచ్చునే'' అని యాశంకించి - లోచనకర్త చెప్పుచున్నాఁడు.

లోచ :— [అలంకారములు -[భూషణములు] శరీరశోభకు హేతువులని

ప్రసిద్ధములైయున్నట్లు]"ఆత్మ - దేహసౌందర్యమునకు - హేతు"వనునది - ప్రసిద్ధము కాదుగదా !

ప్రభా : అప —— అయ్యా ! ప్రతీయమానార్థము - వాచ్యార్థశ్లాఘాతిశయమునకు హేతువుగనుక-ఆత్మయగుచున్నది"అనియిప్పుడేవ్యవస్థాపించినమీరు- ఆత్మకుఁగూడ - సౌందర్యహేతుత్వము నంగీకరించియే యున్నారు. ఇప్పుడు మరల - "ఆత్మ - శరీరసౌందర్యహేతువుకాదు" అనిచెప్పి - "అభావవాదులు చెప్పినహేతువు సిద్ధింప"దనుట న్యాయమా" ? అనియాశంకించి - అంగీకరించి- చెప్పుచున్నాఁడు.

లోచనము :— "ప్రతీయమానము - కావ్యాత్మయయినను, కావ్యశరీర సౌందర్యహేతువుగూడ - నగును." అని యంగీకరించినను, - ప్రతీయమాన ముతోడి నిత్యసంబంధమువలన వాచ్యముగూడ - సౌందర్యహేతువు కాకతీరదు. గనుక - గుణాలంకారములకంటె వేరయినను, కావ్యసౌందర్యహేతువగు వాచ్యమునందు - ఈ హేతువు - అనైకాంతికము [వ్యభిచారి] కావలసివచ్చును.

ప్రభా :— "వాచ్యము - గుణాలంకారములకంటె వ్యతిరిక్తము" అని ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— అలంకార్యము - [అలంకరింపఁదగినవాచ్యము] అలంకారముగాని, గుణి - [గుణియగువాచ్యము] - గుణముగాని, కాదుగదా !

దీనికొఱకుఁగూడ [ధ్వనికి - భూమికకొఱకు మాత్రమేకాక, - అనుమాన హేతువునకు అనైకాంతికత్వమును ప్రదర్శించుటకుఁగూడ] వాచ్యాంశము- [కారికయందు] ఉపేక్షింపఁబడినది. కనుకనే - ["వాచ్యఃప్రసిద్ధః"] "అందుఁబ్రఖ్యాతమైన వాచ్యము"అని దీనితరువాతికారికయందు చెప్పుచున్నాఁడు,

ప్రభా :— ఇందలియర్థము నిల్లెయుఁగునది-' ప్రతీయమానము-కావ్యాత్మ" అని చెప్పుటవలన - "సౌందర్యహేతువగునది - [ధ్వని] - సౌందర్యహేతువులగు గుణాలంకారములకంటె వేఱుకాదు", అని, అభావవాది చెప్పిన అనుమానహేతువు - నిరస్తమయినది. ఆత్మ - అలంకారాదులవలె దేహశోభకు హేతువు కాదు గదా !

ప్రశ్న :— ఈ ప్రతీయమానము-వాచ్యార్థశ్లాఘాతిశయహేతువు కనుక

నిది సౌందర్యహేతువుగూడనగును. కనుక హేతువు సిద్ధింపనిదికాదు, సర్వాభరణ భూషితమయినను, శవశరీరమునందు సౌందర్యము లేకుండుటవలన, ఆత్మయే సౌందర్యహేతువుగానంగీకరింపఁదగినదిగదా! కావ్యాత్మయగు ప్రతీయమానము గూడ - ఇట్లే-సౌందర్యహేతువు. కనుకనది- గుణాలంకారములకంటె వేఱుకాదు.

ఉ :— ప్రతీయమానము - సౌందర్యహేతువని యంగీకరించినను-ఇచట దోషమున్నది.

ప్రతీయమానముతోడి సంబంధమువలన - వాచ్యార్థముగూడ శోభాహేతు వగుటతప్పదు. ఈవాచ్యము - అలంకార్యమును, గుణియు, అగుటవలన - గుణాలంకారములకంటె వేఱగుటయు, తప్పదు. కనుక - "సౌందర్యహేతువగునదేద యినను, గుణాలంకారములకంటె - వేఱుకా"దనిన యెడల- సౌందర్యహేతువగు వాచ్యముగూడ - గుణాలంకారాంతర్గతము కావలసివచ్చును. సౌందర్యహేతువై నను, గుణియు, అలంకార్యము, నగువాచ్యార్థము గుణాలంకారాంతర్గతముకాదు. కనుక- ఈ హేతువు-[సౌందర్యహేతువగునది గుణాలంకారవ్యతిరిక్తము-కాదు." అని, అభావవాది చెప్పిన హేతువు] - కావ్యార్థమగు వాచ్యమునందు - అనైకాంతికము అనఁగా; వ్యభిచారి [నియమము తప్పిచరించునది.] అగుచున్నది. కాగా; "సౌందర్యహేతువైనను, వాచ్యార్థము - గుణాలంకారాంతర్గతము కానట్లు, సౌందర్యహేతువయినను, ధ్వని - గుణాలంకారాంతర్గతముకాదు." అనునిది - సిద్ధాంతము ధ్వనినిరూపకమగు శాస్త్రమునందు వాచ్యమునుపక్షేపించిన సూత్ర[కారికా] కారుఁడుగూడ - ధ్వనికి - భూమికగానుండునని సూత్రిమే - వాచ్యాంశమును దెలిపినవాఁడుకాఁడు. "ఏది - సౌందర్యహేతువో, అది - గుణాలంకారవ్యతిరిక్తముకాదు" అని ధ్వన్యభావవాది తెలిపిన అనుమానహేతువు -"సౌందర్యహేతువయినను, గుణాలంకార వ్యతిరిక్తమగు వాచ్యమునందు - అనైకాంతికమగు"నని ప్రదర్శించుటకుఁగూడ - వాచ్యాంశమునుపక్షేపించెను. కనుక లోచనకర్త తెలిపిన దోషోద్ఘాటనముత్ సూత్రిము కాదు.

(19) మూలము :—

తత్రివాచ్యః ప్రసిద్ధోయః ప్రకారైరుపమాదిభిః
బహుధావ్యాకృతః సోఽన్యైః [కావ్యలక్ష్మవిధాయిభిః]

గీ॥ అందు-వాచ్యార్థము - ప్రసిద్ధ, మది-గ్రహించి-
'ఉపమ'మున్నగు భేదమ్ము లుగ్గడించి -

వ్యాకరించినారన్యులు - బహువిధములఁ;
[అన్యులు]కావ్యలక్ష్మవిధాయులు[భట్టోద్భటప్రభృతులు]
తతో నేహ పరితన్యతే (3)
కాన [పరితనింపఁ] వివరింపఁ బూనము దానినిచట. (3)

ఇంకేమనిన; యథోపయోగముగా కేవలమగునను వాదము నొనర్చెదము.

లోచనము :— [ఇట్లు - అర్థమునకు] రెండంశములుండినను, వనితా వదనము, ఉద్యానము, చంద్రోదయము, మున్నగువానివలె, ప్రసిద్ధమే- అనఁగా; లౌకికమే - [లోకవిదితమగు వాచ్యమే] ఉపమానులగు ప్రకారములచేత - బహు విధములుగా వ్యాకరింపఁబడినది. "అన్యులు". అను ["అన్యైః" అను] కారికా భాగము - "కావ్యలక్ష్మవిధాయులు" [కావ్యలక్ష్మవిధాయిభిః] అని వ్యాఖ్యానిం పఁబడినది. "వివరింపఁబూనము" [నేహపరితన్యతే] అనునది - విశేషించి చెప్పు టను నిషేధించి - శేషమునకు [అనువాదమాత్రమునకు] అభ్యనుజ్ఞగానున్నది. కనుకనది "కేవలము" అనుదానిచేత - వృత్తియందుఁ దెలుపఁబడినది.

ప్రభా :— 'రెండంశములున్నను', అను, అపిశబ్దార్థకముచేత - అర్థ మునకు - 'వాచ్యము పరితీయమానము', అని రెండుభాగములుండఁగా; ఒకదా నినే - [వాచ్యమునే] వ్యాకరించుటవలన - "అన్యులు - సముచితమగు సూక్ష్మ పరిశీలనము నొనర్పరయిరి" అని సూచింపఁబడినది. 'లౌకికమే' అనుటచేత - ప్రతీయమానము - [రసాదిధ్వని] - 'అలౌకిక'మనిసూచింపఁబడి, దాని 'ప్రాధా న్యము' స్ఫురింపఁజేయఁబడినది. ['సంస్కృత కారికయందు "కావ్యలక్ష్మవిధా యిభిః"అనునది - వృత్తపాదమువలెఁ దోచుటచేత - అది - యీకారికయొక్క చతుర్థపాదమేమో' అను శంకను దొలఁగించుటకు, "అన్యైః" అనునది - "కావ్యలక్ష్మ విధాయిభిః" అనుదానిచేత - వ్యాఖ్యానింపఁబడినది". అనితెలుపఁ బడినది, అయినను, ఈలోచనవాఖ్యను సమీక్షింపక- నిర్ణయసాగరప్రతియందును, దీధితివాఖ్యతోఁగూడిన చౌఖాంబావారి ప్రతియందును, "కావ్యలక్ష్మవిధాయిభిః" అనునది - ఈకారికయొక్క చతుర్థపాదముగా ముద్రింపబడి - 'తతో నేహ ప్రత న్యతే" అనుచతుర్థపాదము వృత్తియందుఁ జేర్పబడినది. ఇది చతుర్థపాదముగా ముద్రింపఁబడివలసియున్నది. "[పరితనింపఁబూనము]- వివరింపఁబూనము -అను

దానికి - వాచ్యవిషయమున, అన్యులు [పూర్వాలంకారికులు] తెలుపని విశేషాంశమును దెలుపము'' అనునర్థము నెఱుఁగునది. అనువాదమనఁగా; అన్యులగు పూర్వకావ్యలక్షణ విధాతలు తెలిపినదానినే [ఉపయోగముననుసరించి] తెలుపుట.

(20) మూలము :—

ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్
యత్ తత్ ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాఙ్గనాసు॥ 4

గీ॥ ఇఁక ప్రతీయమానమొ, అన్యమె యగువస్తు
వున్నది మహాకవీంద్రుల సూక్తులందు;
అలరుచున్న, దెయ్యది ప్రసిద్ధాంగములకు
నన్యమై కాంతలందు లావణ్యమట్లు. 4

ఇఁక వాచ్యముకంటె భిన్నమేయగుచు ప్రతీయమానమగు వస్తువుకూడ-మహాకవుల వాణులయందున్నది. [ఉండును.] ఏయది-[ఇట్లువాచ్యముకంటెభిన్నముగా]సహృదయహృదయ సుప్రసిద్ధమో [ఆప్రతీయమానము] ప్రసిద్ధములగు - [అనగా;] ప్రతీతములును, అలంకృతములును, నగు, అవయవములకంటె వ్యతిరిక్తమగుచు, అంగనలయందు [కాంతలయందు] లావణ్యమువలె, విభాసించుచున్నది.

అదెట్లనిన :- రమణీమణులయందలి లావణ్యము- వేఱుఁగా నిర్వర్ణ్యమానమై, [మిక్కిలిధ్యానింపఁబడి] నిఖిలావయవ వ్యతిరేకియు, సహృదయ లోచనామృతమును, అగుచు - 'ఏదియో [తెలుపరాని] వేఱొక తత్త్వాంతరమే' యగుచుండునుగదా! అట్లే, ప్రతీయమానముగూడ - [ప్రసిద్ధములును, గుణాలంకారాద్యుపస్కృతములును, అగువాచ్య వాచకములకంటె వ్యతిరిక్తమును, సహృదయ హృదయామృతమును, అనిర్వచనీయమనిపించునదియు, నగు] వేఱొక తత్త్వాంతరమే యగుచున్నది.

ప్రభా : అవ :— ''మీఁదికారికను వ్యాఖ్యానించినయెడల- దానివృత్తిఁ గూడ - వ్యాఖ్యానించినట్లగును'' అను నభిప్రాయమున మీఁదికారికను వ్యాఖ్యానించుచున్నాఁడు.

లోచనము :— ''ఇఁకఁబ్రతీయమానమే'' అనుచోటనున్న ['ఇఁకన్' అను] పునరర్థకము - ప్రకృతమగు ప్రతీయమానమునునకు - వాచ్యముకంటె నగు విశేషమును స్ఫురింపఁజేయుచున్నది.

అన్యము + ఏ + అగు + వస్తువు = ''అన్యమెయగు వస్తువు'' అనునది - ''[ఆప్రతీయమానము] వాచ్యవ్యతిరిక్తమును, సారభూతమును, గూడ-అగును'' అని తెలుపుచున్నది.

''మహాకవీంద్రుల సూక్తులందు'' అనుచోటనున్న బహువచనములవలన - 'ఆప్రతీయమానాంశము - అశేషవిషయవ్యాపకము'' అని తెలుపఁబడుచున్నది. [మహాకవీంద్రుల అనుచోనున్న] 'మహాకవి' అను ప్రకృత్యంశముచేత - ''ఈ గ్రంథమునఁ దెలుపఁబడనున్న ప్రతీయమానము [వ్యంగార్థము] చేత - ఏకావ్యములు - అనుప్రాణితములగునో, [జీవింపఁజేయఁబడునో] అట్టికావ్యములను నిర్మించుటయందు నిపుణమగుప్రతిభ నెవరు పొందుదురో, 'వారే - మహాకవులు' అనువ్యపదేశమున కర్హులు.'' అనుభావము నిబంధింపఁబడినది.

ప్రభా :— ''ఈకారిక - ప్రతీయమానమునునికిని సాధించునదియగునను మానమును దెలుపునది'' అని చూపుటకుపక్రమించుచున్నాఁడు.

లోచనము :— ఏహేతువువలన - ఈప్రతీయమానము ఏవంవిధముగా; [వాచ్యముకంటె వేరయినదియు. సారమయినదియు, నయి] ఉన్నదో, ఆ హేతువువలన [ఇట్లుండుటవలన] భాసించుచున్నది. అసలేమియులేనిది - భాసించుట - యుక్తి సిద్ధముకాదుగదా ! రజితము మొదలగునదికూడ - అసలేమియులేని యెడల భాసించునదికాదు. ''ఉన్నది, అలరుచున్నది.'' అనుకారికా భానముచేత [అత్యంతమును లేనిది - ప్రకాశింపదు. కనుక] భాసించుట - సత్త్వప్రయుక్తమని, చెప్పఁబడినదగుచున్నది. కనుక - భానమువలన - సత్త్వము - స్ఫురింపఁజేయఁబడుచున్నది. ఇట్లు భాసించుటవలన- ఉనికి స్ఫురింపఁజేయఁబడుట [అను హేతువు] చేత - ''ఏది ఎట్లు భాసించునో, అదియట్లుండును'' అని చెప్పఁబడినదగుచున్నది.

ప్రభామతి : అవ :— ఇట్లుండుట, భాసించుట, అనువానికి - కారిక యందును, వృత్తియందును, వ్యాప్తి ప్రదర్శింపఁబడినది. క్రిందివాక్యముచేత - ఈ''అస్తి, భాతులకు''- అనఁగా; ఉనికికిని, ప్రకాశించుటకును, అభిప్రేతమగు, అనుమానమును - ప్రకటించుచున్నాఁడు.

లోచనము :— [భాసించుట, ఉండుట, అనువానికి - అవినాభావసంబంధము]కనుక దీనిచేత - అనుమాన ప్రయోగము - ఇచటనిట్లుండును. ''ప్రసిద్ధమగుటవలన ధర్మియగు వాచ్యము - వానికంటె వేరైన ప్రతీయమానముచేత ప్రతీయమానవంతమగుచున్నది. అదికలదై భాసించుటవలన, లావణ్యముతోఁ గూడిన అంగనాంగమువలె'' అని ఇచట ప్రసిద్ధశబ్దమునకు సర్వజనులకును, దెలియుటయు, గుణాలంకారములచేత, నలంకరింపఁబడుటయుఁగూడ అర్థమని- తెలియునది.

ప్రభామతి :— ప్రతీయమానముండుటవలన-భాసించుచున్నది. ''వాచ్యముకంటె వ్యతిరిక్తమును, సారభూతమును, గూడ - అగు ప్రతీయమానాంశమున్నది. కనుకనే, భాసించుచున్నది'' అనుదీనిచేత - ఉనికి - హేతువుగాను, భాసించుట - హేతుమంతముగాను, చెప్పఁబడినది. పిమ్మట న్యాయమతము ననుసరించి - చెప్పుచున్నాఁడు. ''అసలేమియులేనిది - భాసించుటయుక్తిసిద్ధము కాదు'' అని చెప్పుచున్నాఁడు. శుక్త్యాదులందు భ్రాంతిచేత, తోచునదియగు రజతాదికముకూడ - శుక్తియందులేకున్నను, ఆపణాదులయందు ఉన్నదగుచునే. శుక్తికాదులయందు-భాసించును. అసలేలేనిది భాసింపదు. కనుక ['అస్తి,విభాతి'] 'ఉన్నది' 'అలరుచున్నది'. అను కారికాభాగముచేత' ''ఉండుటవలన భాసించుచున్నది. భాసించుటవలన - ఉన్నదిగాతెలియఁబడుచున్నది'' అని తెలుపఁపడినది. ఇట్లు - ఉనికిని స్ఫురింపఁజేయుటకు హేతువగు భానమువలన [ప్రకాశించుటవలన] ''ఏదియెట్లుభాసించునో. ''అది-అట్లుండును'' అనువ్యాప్తి- ప్రదర్శితము.

భాసించుట, ఉండుట, అనువానికి అవినాభావసంబంధమున్నది. కనుక - కారికయందును, వృత్తియందును, గూడ - దీనిచేత- తెలుపఁదగిన పరార్థానుమాన ప్రయోగము - ''ప్రసిద్ధమును. ధర్మియు, నగువాచ్యము - దానికంటె వేరైన ప్రతీయమానముచేత ప్రతీయమానవంతమగుచున్నది. అది [ప్రతీయమానము] కలదిగా భాసించుటవలన, లావణ్యముతోఁగూడిన అంగనాంగమువలె'' అని లోచనమునందు తెలుపఁబడినది. దానియభిప్రాయము నిట్లుండుఁగునది. - ''సర్వజనప్రతీతి గోచరమును, మంజీరాదిభూషణ శోభాలంకృతమును, కనుకనే ప్రసిద్ధ

మగు ధర్మియు, నగు అంగనాంగము - దానికంటె వ్యతిరిక్తమగు, లావణ్యము గలదిగా భాసించుటవలన - లావణ్యవంతమగునట్లు; సర్వజనప్రతీతి గోచరముగను, గుణాలంకారాదులచేత - అలంకృతముగను, ప్రసిద్ధమును, కనుకనే - ధర్మియు, నగు వాచ్యము - దానికంటె వ్యతిరిక్తమగు ప్రతీయమానముకలదిగ, భాసించుట వలన - ప్రతీయమానవంతమగుచున్నది.''

అవ :— ''ఏది - ప్రసిద్ధావయవాతిరిక్తమో, అది - కాంతలయందలి లావణ్యమువలె, అలరుచున్నది'' అనిచెప్పవలసియుండ; ''ఏయది'' [యత్ తత్] అనున ర్వనామసముదాయ ప్రయోగమునకిచటఁగల ఉపయోగము- తెలుపఁబడు చున్నది.

లోచనము :— ఏ + అది = 'ఏయది' అను - సర్వనామసముదాయము - 'లావణ్యమునువలె ప్రతీయమానమును- చమత్కారసారము' [చమత్కారమే ప్రాణముగాఁగలది] అని ప్రకటీకరించుటకుగాను, దృష్టాంత- దార్ష్టాంతికముల యందు వానికగు - అవ్యపదేశ్యత్వమును, అన్యోన్యసంవలనా [మిశ్రణా] కృత మగు ఐక్యభ్రమను, ప్రదర్శించుచున్నది.

ప్రభా :— ''ఏయది'' అను సర్వనామసముదాయమునందు- 'ఏ'యను శబ్దము - [కాంతలందు] అంగములకంటె వేఱయి, చమత్కారప్రాణమగు లావణ్యమువలె, వాచ్యాలంకారాద్యవయవములకంటె వేఱయి, చమత్కారప్రాణమగు ప్రతీయమానమును దెలుపును.

'అది' అనుశబ్దము - ''లావణ్యమువలె అది - సహృదయ సుప్రసిద్ధము'' అనితెలుపును. కనుకనే వృత్తియందుఁగూడ- [యత్ తత్ పదములకు] 'వాచ్యము కంటె వేఱయినది'', ''సహృదయ సుప్రసిద్ధము'' అనునర్థము - చెప్పఁబడినది.

ప్రశ్న :— ''ఏయది'' అను సర్వనామద్వయముచేత - ప్రదర్శితమగు నర్థమేది ?

ఉ :— ''లావణ్యమువలె, ప్రతీయమానముగూడ -''ఇట్టిది'' అని తెలుపుటకు వీలుపడనిదనియు, కాంతలప్రసిద్ధాంగములకంటె, వారిలావణ్యము-వేఱగు నట్లు, వాచ్యావయవములకంటె - ప్రతీయమానార్థము - వేరయినను, అంగ - లావణ్యములకువలె, వాచ్య - వ్యంగ్యములకుఁగల, మిశ్రణవలన - [అవ్యతిరేక భ్రమ] 'అవి - ఒకటే' అను భ్రమ - కలుగుననియు, ప్రదర్శితమగుచున్నది.

ప్రిశ్న :— ఇట్లు - ప్రిదరించుటదేనికొఱకు ?

ఉ : – లావణ్యమునకువలె, ప్రితీయమానమునకు - చమత్కారసార తను, అనఁగా; [కావ్య] చమత్కారమేయగు ప్రాణతను ప్రికటీకరించుటకే.

ప్రిశ్న :— కారికయందును, వృత్తియందును, దెలుపఁబడిన "లావణ్యము" అనుదృష్టాంతము - సాధ్యవికలముకాదా ?

ఉ :— కాదు, లోచనమున సమీక్షింపుఁడు !

[లోచనము] లావణ్యమనునది-అవయవసంస్థానముచేత నభివ్యంగ్యమును, అవయవవ్యతిరిక్తమును, అగు వేఱొక ధర్మమేగదా ?

[ప్రిభామతి] 'కదా!' అనునది - లావణ్యమునకుగల ప్రసిద్ధ్యతిశయమును సూచించును.

ప్రిశ్న :— విశిష్టసన్నివేశముగల అవయవసముదాయమే-లావణ్యము. కనుక, అది - అవయవములకంటె వేరగు, ధర్మమని ఏలచెప్పవలయును ?

ఉత్త :— అవయవ సంస్థానమనఁగా; విశిష్టమగు అవయసన్నివేశము. దానిచేత - స్ఫురింపఁజేయఁబడునదియు, అవయవములకంటె వేరైనదియు, అగు లావణ్యము - విశేషధర్మమైయున్నది. కనుక - అది - ఆకృతివంటి సముదాయ రూపముకాదు.

ప్రశ్న :— అయ్యా! అవయవములకు - సంబంధించిన లోపరాహిత్యమునుగాని, అనులేపనద్రివ్య - భూషణాది - సంబంధమునుగాని, చూచి-దానినే మీరు "అవయవవ్యతిరిక్తమగు లావణ్య"మని చెప్పుచున్నారా ?

ఉత్త :— మేమట్లు చెప్పుటలేదు.- క్రింది లోచనమును-సమీక్షింపుఁడు.

[లోచనము] అవయవములకు సంబంధించినదియగు, నిర్దోషతగాని, భూషణయోగముకాని, కూడ - లావణ్యముకాదు.

ప్రత్యేక - ప్రత్యేకముగా - పరిశీలించునపుడు - కుంటి, గుడ్డి, మొదలగు దోషములులేని, అవయవములతోఁ గూడినదైనను, అనులేపనభూషణాది భూషిత

యైనను, ఒక్కొకతె - లావణ్యశూన్యంగా పేర్కొనఁబడుచున్నది. అవయదోషములు కలదైనను - భూషణభూషితకాకున్నను వేఱొకతె - ''ఈమె - లావణ్యామృతచంద్రిక'' అని సజ్జనులచేత పేర్కొనఁబడుచున్నది.

[పరిభావమతి] అవయసంబంధియగు నిర్దోషతకాని, భూషణయోగముకాని, లావణ్యముకాదనుటకు - పైది వాక్యములచేత 'అన్వయ - వ్యతిరేకములు' - పరిదర్శింపఁబడినవి. అందు - 'కుంటి గ్రుడ్డి' అనువాక్యముచేత - ప్రదర్శింపఁబడినది - అన్వయము. 'అవయవదోషము కలదైనను', అను వాక్యముచేత - ప్రదర్శింపఁబడినది - వ్యతిరేకము.

అవ :— ప్రసిద్ధమగు లావణ్యము - కాంతలఅంగములకంటె వేరైనను‚ ''అప్రసిద్ధమగు ప్రతీయమానము - వాచ్యాదులకంటె వేరుకాదు'' అని ఆశంకించుచున్నాడు.

[లోచనము] అవ : — ''అయ్యా ! కాంతలయంగములకంటె వారిలావణ్యము వ్యతిరిక్తమనునది ప్రసిద్ధము, ప్రతీయమానమనునది . ఏమో - దానిస్వరూపమే మాకు తెలియదు - అట్లుండునపుడు అది వాచ్యముకంటె వేరను ప్రశ - చాలదూరమునందున్నది. కనుక ''అదిఅట్లుభాసించుటవలన'' అనిప్రతీయమానవాది చెప్పినది - అసిద్ధమగు హేతువు.'' అని ఆశంకించి - ఆయర్థమే-అనునది మొదలుగాగల వాక్యముచేత - ప్రతీయమాన స్వరూపమును దెలుపుచున్నాడు.

(21) మూలము :- ఆయర్థమే-వాచ్యసామర్థ్యముచేత అక్షేపింపఁబడి [స్ఫురింపఁజేయఁబడి] 'వస్తుమాత్రము' 'అలంకారములు' 'రసాదులు' - అని అనేకములగు ప్రభేదములచేత- భేదింపఁజేయఁబడి ముందుప్రదర్శింపఁబడును. ఆప్రకారములన్నిటియందునుగూడ అది - [ధ్వని] వాచ్యముకంటె వేరైయున్నది.

[పరిభావమతి] ''ప్రతీయమానమగు వస్తువు - ఉన్నది'' అనిమీరుద్ఘోషించుచున్నారు. దానిస్వరూపమెట్టిదో మాకింతవరకును దెలియవచ్చుటలేదు. అదియేదో తెలియనప్పుడు ఆప్రతీయమానము - వాచ్యముకంటె వేఱనుటకవకాశముండదు. వాచ్యముకంటె, అది-వేరని తెలిసికొనుటకుముందు, దానిస్వరూపము- మాకు స్పష్టముగాఁదెలియవలెను. ధర్మస్వరూపము - ధర్మిస్వరూపసిద్ధ్యధీనము గదా ! ''మీరుచెప్పిన ప్రతీయమానమునకు ధర్మిత్వమే సిద్ధింపనపుడు, వాచ్య

వ్యతిరిక్తత్వమను ధర్మముకూడ - సిద్ధించునదికాదు, కనుక "అదియట్లుభాసించుటవలన" అని మీచేతమీదఁదెలుపఁబడిన, హేతువు - సిద్ధింపదు." అని పూర్వపక్షి మతము నాశంకించి, స్వరూపమును దెలుపుచున్నాఁడు.

[లోచనము] "అప్రభేదము లన్నింటియందునుగూడ" అనుభానిచేత - "ప్రతీయమానము - వాచ్యముకంటె వ్యతిరిక్తము" అను ప్రసిద్ధినే సాధించుచున్నాఁడు. అందు ప్రతీయమానమునకు మొదట లౌకికము - కావ్యవ్యాపార గోచరము, అను భేదములు - రెండున్నవి. అందు మొదటిదగు లౌకికము - ఒకప్పుడు [ప్రతీయమానముగాక] స్వశబ్దవాచ్యతనుగూడ నొందుచుండును. లౌకికమగు నీప్రతీయమానభేదము - విధినిషేధాది ప్రకారములుగల వస్తువు [అభిప్రాయము] రూపముగాగలది, గనుక వస్తుశబ్దముచేత [వస్తుధ్వనియని] చెప్పఁబడుచుండును.

ప్రభామతి : ప్రతీయమానము - వాచ్యవ్యతిరిక్తముగా నున్నదని దృష్టాంతీకరింపఁబడినదిగదా! అప్రతీయమానమునకు - లోకవిదిత [ప్రసిద్ధ] మగు భేదమొకటియు, కావ్యవ్యాపార [మాత్ర] గోచరమగు భేదమొకటియు, నున్నవి లోకప్రసిద్ధముగనుక మొదటిదగు ప్రతీయమానభేదము - 'లౌకిక'మని చెప్పఁబడినది. కావ్యము - శబ్దార్థమయము. శబ్దార్థమయమగు కావ్యమునకు సంబంధించిన వ్యంజనయను వ్యాపారమునకు మాత్రమే - గోచరించునది, కనుక ప్రతీయమానమునకుఁగల ద్వితీయభేదము - "కావ్యవ్యాపారగోచరము" అని చెప్పఁబడినది. కావ్యవ్యాపారగోచరమగు రసాద్యర్థము - సహృదయకావ్యజ్ఞలోకమాత్రవిదితమేకాని, సామాన్యలోకవిదితముకాదు. కనుక, 'అలౌకికము' ఆగుచున్నది. అందు మొదటిదగు లౌకికము - ఒకప్పుడు - [వాచ్యత్వావస్థయందు] తన్నుఁదెలుపునదియగు శబ్దముచేత-వాచ్యమగుటకూడ - సంభవించును. అనఁగా; ఈలౌకికము - రసాదికమువలె నెప్పుడును వ్యంగ్యమగునదికాక - కాలభేదమున నొకప్పుడువాచ్యమును, ఇంకొకప్పుడు వ్యంగ్యమునుగూడనగుచుండును. రసాదికమో, అది- స్వశబ్దవాచ్యముకాక-ఎల్లప్పుడునుగూడ వ్యంగ్యమేయగుచుండును. లోకవిదితమగు వాచ్యార్థమువంటిదేకనుక ప్రతీయమానమునకుఁగల మొదటి భేదము - లౌకికమనియు, అలౌకికమగు వ్యంజనావ్యాపారమాత్రమునకే గోచరమగుటవలన దానికిఁగల రెండవభేదము-కావ్యవ్యాపార,(మాత్ర) గోచరమనియుఁ, దెలుపఁబడినవి. లౌకికమగునర్థము - విధినిషేధాదులచేత - అనేకప్రకారములు గలిగి - వాచ్యమును, ప్రతీయమానమును, గూడనగుచుండును. విధిరూపమునఁగాని, నిషేధరూపమునఁగాని, తదితర రూపమునఁగాని-ఏలౌకికము-ప్రతీయమాన

మగునో, అది - వస్తురూపమే - అనఁగా; ఒకానొకయభిప్రాయరూపమే - కాని రసాదిరూపముకాదు. కనుక విధినిషేధాదిరూపమును, అలంకారము కానిదియు, నగు ప్రతీయమానార్థమంతయుఁగూడ- "వస్తుధ్వని" అనిపేర్కొనఁబడుచున్నది. విధి, నిషేధము, మున్నగు నభిప్రాయములన్నియుఁగూడ వస్తురూపములుకాక తప్పవు. కనుక విధిధ్వని, నిషేధధ్వని, అని, వేర్వేరుగాఁగాక, అన్నియుఁగూడ- వస్తుధ్వనిగానే పేర్కొనఁబడునని తెలియునది.

ఇందలి గూఢార్థము నిట్లెఱుఁగునది. వ్యంజనా వ్యాపారమాత్రగోచరము లగు రసాదులకంటె నితరమును, విధి - నిషేధాదిరూపమును నగునర్థము [అభిప్రాయము] ఏదయినను,అది- వస్తుత్వమునతిక్రమింపదు కనుక అదియంతయుఁ గూడ - వస్తువని లాక్షణికులచేత పేర్కొనఁబడుచున్నది. వస్తువని చెప్పఁబడిన యీ యర్థము - లోకులకందఱికిని విదితమగునట్లు స్వవాచకశబ్దము [తన్ను బోధించునదియగు శబ్దము] చేతఁదెలియఁజేయఁ బడుటవలన వాచ్యముగా ప్రసిద్ధమగుచున్నది. ఈవస్తువు- ఒకప్పుడు వ్యంగ్యముగూడనగుచుండినను, ఇది- వ్యంగ్యమగుట- లోకవిదితముకాదు. ఈవస్తువు - వాచ్యముగానే లోకవిదితము. కనుక రసాదులకంటె నితరమగు వస్తువు - వ్యంగ్యమైనప్పుడుగూడ - వాచ్యత్వ దశయందు దీనికిఁగల లోకప్రసిద్ధి తొలఁగునదికాదు. కనుక ప్రతీయమానమగు వస్తువుగూడ - "లౌకికము" అగుట సముచితమగుచున్నది. రెండవది - లోక ప్రసిద్ధముకాదు. కనుకనే - "ప్రతీయమానమునకు లౌకికము, కావ్యవ్యాపార గోచరము, "అనిభేదములు రెండున్నవి" అని లోచనమునఁ దెలుపఁబడినది.

లోచనము —— లౌకికమగు వస్తుధ్వనికూడ - [వస్తువు - అలంకారము, అని] ద్వివిధమగుచున్నది. ఏది - తాను వాచ్యమగునపుడు [రసాదిరూపమగు వేఱొక వాక్యార్థము ప్రధానమై, అలంకార్యమైయున్నపుడు] ఉపమాదిరూపముతో, అలంకారముగా [సహృదయులచేత] అనుభవింపఁబడియున్నదో, అది- [ఆయలంకారము] ఇప్పుడు [వ్యంగ్యమైయున్నప్పుడు] వేఱొకదానికి-[అలంకారరూపమగు] అంగముకాదు. కనుక- అలంకారముగాకున్నను, పూర్వప్రత్యభిజ్ఞాన బలమువలన [వెనుకటి గుర్తింపువలన] బ్రాహ్మణశ్రమణన్యాయమున, "అలంకారధ్వని" అని వ్యపదేశింపఁబడుచున్నది. అలంకారతారూపము [ఎప్పుడును] లేకుండుటవలన, ఉపలక్షిత మాత్రమేయగు - వస్తువు - "వస్తుమాత్రము" అని చెప్పఁబడుచున్నది. వృత్తియందు "వస్తుమాత్రము" అనుచోనున్న మాత్రగ్రహణముచేతనే [వస్తుమాత్రమగు నర్థముగ్రహింపఁబడి] రూపాంతరత్వము [అలంకారాదిరూపమును గలిగియుండుట] నిరాకృతమగునుగదా :

ప్రశ్న :— ప్రతీయమాన ప్రథమ భేదమగు లౌకికమునకుఁగూడ - ద్వైవిధ్యమున్నది. అందు మొదటిది - వస్తుమాత్రధ్వని. రెండవది-అలంకారధ్వని.

ప్రశ్న :— రసాదిరూపమగు నర్థము - ప్రధానమగు కావ్యాత్మ. ఆరసాది రూపమగు నర్థము- ప్రధానమగుటవలన-అలంకరింపఁదగినదియై యుండునపుడు, వాచ్యమగు నలంకారము - అలంకార్యమగుదాని నలంకరించునది కావచ్చును. కనుక, ఉపమాది రూపమగు నలంకారము - వాచ్యత్వదశయందు - అలంకార మైనను, [అలంకరించునదియైనను] వ్యంగ్యత్వదశయందు- తానే - ప్రధానమై యుండుటవలన (అలంకార్యమే) అలంకరింపఁదగినదియే-యగుచుండును. అలం కార్యమగు నుపమాద్యలంకారము- [అప్పుడు] అలంకారము కానేరదు. అప్పుడు వ్యంగ్యమగు నలంకారమును గూడ - 'వస్తుధ్వని' అనియే - వ్యవహరింపఁదగును "అలంకారధ్వని" అనివ్యవహరింపఁదగదు.అలంకారముకాని, ఉపమాద్యర్థమును- "అలంకారధ్వని" అని వ్యవహరించుటయందు - విశేషమేమయిన నున్నదా?

ఉ :— ఉన్నది. పూర్వమీయుపమాద్యర్థము - వాచ్యమై, ప్రధానమగు రసాదికము నలంకరించునపుడు - "ఇది - అలంకారము" అను సంస్కారము- సహృదయుల బుద్ధియందు రూఢమై - ధృఢమై [గట్టిపడి] ఉన్నది. ఉపమాదిరూ పమగు, ఆయలంకారము- వ్యంగ్యమగునపుడు- తానే ప్రధానమగుటవలన-తనకు వెనుక స్థిరపడియున్న అలంకారత్వమును గోల్పోయి, తానే - అలంకార్యమైయు న్నను, పూర్వముసుదృఢనిరూఢమైయున్న సంస్కారము [వాసన] వలన- [తాని పుడు వ్యంగ్యరూపముతోనున్నను] "ఇది- అలంకారమే" అను నభిప్రాయము- సహృదయహృదయములనుండి నిష్క్రమించునదికాదు. కనుక,వ్యంగ్యమగునపుడు ఉపమాద్యర్థముకూడ - వస్తువేయగుచు, అలంకారము - [అలంకరించునది] కాకు న్నను, కేవలమగు, వస్తుధ్వనికంటె విశేషించి - చమత్కార కారియగుటవలన - బ్రాహ్మణశ్రమణన్యాయమున[సన్యాసికి బ్రాహ్మణత్వములేకున్నను భూతపూర్వ మగు బ్రాహ్మణత్వమునుగొని, బ్రాహ్మణ సన్యాసి అనివ్యవహరింపఁబడునట్లు] "అలంకారధ్వని" అని వ్యవహరింపఁబడును.

ప్రశ్న :— వృత్తియందు - 'వస్తుమాత్రము' అని ఏల చెప్పఁబడెనో తెలుపుదురా ?

ఉత్త :— వ్యంగ్యమగు నలంకారము గూడ- తనకుగల అలంకారత్వమును

గోల్పోవుటవలన వస్తుధ్వనికి సంబంధించిన అవాంతరభేదమే యగుచున్నది. కనుక - ఆయలంకారముగూడ- వ్యంగ్యత్వదశయందు తాను వస్తువనియే, చెప్పఁబడుట - కర్హమైయున్నది. అయినను వాచ్యత్వదశయందు - సహృదయ - హృదయమునందు - ధృఢపడియున్న, దానికిగల యలంకారత్వమును పురస్కరించుకొని - 'అలంకారధ్వని' అని - విభజింపఁబడినది. దీనికివలె వాచ్యత్వదశయందు అలంకారత్వరూపములేని కేవలమగు వస్తువును - అవాంతరవస్తువగు నలంకారధ్వనినుండి - విభజించుటకే - 'వస్తుమాత్రము' అని - వృత్తియందు మాత్రగ్రహణము - కావింపఁబడినది.

ప్రభా :— ఇట్లు శ్రీలోచనకర్త :- వస్తుధ్వని భేదస్వరూపమును, తదవాంతరభేదమగు అలంకారధ్వని స్వరూపమును, దెలిపి-'రసాదులును' అని వృత్తియందుఁదెలిపిన రసాదిధ్వనియొక్క - స్వరూపమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— ఏది - [ఏరసాదిధ్వని] స్వప్నమునందుఁగూడ - స్వశబ్దవాచ్యముకాదో, లౌకికవ్యవహారపతితముకాదో, ఇంకేమనిన;

శబ్దసమర్ప్యమాణ హృదయసంవాద సుందర
విభావానుభావ సముచిత
ప్రాగ్వినివిష్ట రత్యాదివాసనానురాగ
సుకుమార స్వసంవిదానందచర్వణా వ్యాపార రసనీయరూపమో

అది - రసము.
[ఈ సమాసమును ప్రభామతి వివరించును]
అదియే- కావ్యవ్యాపారైక గోచరము.

ప్రభామతి :— ఆలోకమగు వృత్తియందు- "రసాదులును"అని తెలుపఁబడిన ధ్వని ప్రభేదమే - లోచనమునందు - "కావ్యవ్యాపారగోచరము" అని వెనుకఁదెలుపఁబడిన ప్రతీయమాన భేదమగుచున్నది. ఇప్పుడు, కావ్యవ్యాపారమగు వ్యంజనకు మాత్రమే గోచరించునవియగు రసాదులయందు మొదటిదగు రసము యొక్క స్వరూపమును శ్రీలోచనకర్త - మీఁది సమాసముచేత [సంగ్రహముగా] తెలుపుచున్నాఁడు. ఆసమాసమునందలి గంభీరమగు నర్థమునిట్లెఱుఁగనగును.

స్వప్నము - అఘటనఘటనాపటీయసి.
"ఖమపి ఖాదతి, ఖణ్ణితమీక్షతే

నిజశిరోనయనేన కరార్పితమ్,
కిమపి దుర్ఘట మస్యనవిద్యతే''

''[స్వప్నము] ఆకాశము భుజింపఁబడుచున్నట్లు చూపును. తనశిరము ఖండితమై,తనచేతియందుంచఁబడినట్లు తనకంటికిఁజూపును, స్వప్నమునకు ఘటింపరానిదేదియులేదు.''

రసాది ధ్వని - ఇట్టి స్వప్నమునందుఁగూడ - స్వశబ్దముచేతఁ దెలుపఁబడునదికాదు, ''స్వశబ్దవాచ్యముకాకున్నను రసాదిధ్వని - లౌకికము కాఁగూడదా?'' అని యాశంకించి - అది - ''లోకవ్యవహారమునకు సంబంధించినది [పుత్త్ర జన్మాదులచేత నొదవునదియగు హర్షాదికమువంటిది] కూడ-కాదు.'' అని చెప్పఁబడినది. స్వశబ్దవాచ్యమును, లౌకికమును, గూడ - కాని రసాదిధ్వని - ఇంకెట్టిదనిన; దాని స్వరూపము లోచనమునందు సుదీర్ఘసమానమునఁ దెలుపఁబడినది. అందలి యభిప్రాయమిది :—

''రత్యాదులగు చిత్తవృత్తులులేని వ్యక్తి-ప్రాణికాఁజాలఁడు.'' అను శాస్త్రోక్తిననుసరించి చూచునెడల - ప్రాచీనములగు పెక్కు-జన్మములనుండియు, రత్యాదులగు వాసనలు - (సంస్కారములు) ప్రాణముగల ప్రతిజంతువుయొక్క-యునాత్మయందు-సూక్ష్మరూపమున విశేషముగా నివేశింపఁబడి యుండునవియేయగునని తెలియుచున్నది మాధుర్యాధిగుణములచేతను, శబ్దార్థాలంకారములచేతను, సుందరములగు కావ్యశబ్దములుగాని, నాటకాదులయందు నిపుణులగు నటులచేతఁ గావింపఁబడిన - సాత్త్విక - ఆంగిక - వాచిక ఆహార్య - రూపములగు, అభినయములుగాని, సహృదయహృదయదర్పణోదరమునందు - ఈరత్యాదులకు కారణ-కార్యములగు విభావ - అనుభావములను- సమర్పించి - సహృదయహృదయములందు గుప్తములైయున్న ఈరత్యాదులను మేలుకొలుపును.

విభావము, అనుభావము, అనునివి - కేవలములగు కావ్యశబ్దములచేతఁగాని, కేవలములగు నటాభినయములచేతఁగాని, సమర్పింపఁబడునవికావు. ఈవిభావాది వర్ణ్యముతోడి తన్మయీభావముగల హృదయసంవాదముకూడ - శ్రోతలయందుఁగాని, ప్రేక్షకులయందుఁగాని, ఉండునప్పుడే - ఈవిభావానుభావములు-కావ్యశబ్దములచేతఁగాని, అభినయములచేతగాని, - సహృదయ [శ్రోతృ - ప్రేక్షక'] హృదయములను నద్దములయందు సమర్పింపఁబడును. అనగా;-రసాభివ్యంజనమునకుచితములగునట్లు సంక్రమింపఁజేయబడును. రతి - అనగా; ఇచ్ఛావిశేషము - [అనురాగము] [నవీనుల భాషలో ప్రేమ] ఈరతి-అనఁగా; ప్రేమ-

ప్రేయసీప్రియులకు సంబంధించునది మాత్రమే కానక్కరలేదు - తండ్రికి - పుత్రునియందును, పుత్రునికి-తండ్రియందునుగలవాత్సల్యరూపము, భక్తిరూపము తదితరరూపము, అగు ప్రేమకూడ - "రతి" అని చెప్పఁబడవచ్చును. రతి పదమునకు గ్రామ్యసంభోగమాత్రము నర్థముగా భావించుట- పొరపాటు. లాక్షణికులుప్రయోగించిన 'రతి'శబ్దార్థము నాధునికులలో పలువురు గ్రహింపఁజాలకుండుట శోచనీయము. రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము, అనుచిత్తవృత్తులు - స్థాయులు- అనఁగా; ఆత్మయందు పెక్కు జన్మములనుండియు నభ్యస్తములై స్థిరపడియుండునవి. కనుక - ఇవి శృంగారాదిరసములందు స్థాయిభావములని పేర్కొనఁబడినవి. ఈ రత్యాది వాసనలను ఉద్బోధించునవిగా - అనఁగా; సహృదయ హృదయమునందడఁగియున్నవానిని మేల్కొలుపునవిగా కావ్యశబ్దసమర్పితములగు ఆలంబనకారణములగు శకుంతలాదులు - ఆలంబనవిభావములుగాను, ఆలంబనకారణ శకుంతలాది విభావములకు సంబంధించిన గుణాలంకార చేష్టలును, మలయానిలకోకిలాలాపాది తటస్థములును, రత్యాదుల కుద్దీపనకారణములు, కనుకనవి- ఉద్దీపన విభావములుగాను- వాని కార్యములగు నాయికానాయికాదుల ముఖవికాస, పరస్పరావలోకనాదులు రత్యాది భావము నెఱిఁగించునవి కనుక - అనుభావములుగాను, లాక్షణికులచేత పేర్కొనఁబడినవి. కావ్యశబ్దములచేతఁగాని, నటాభినయములచేతఁగాని, ఈవిభావానుభావములు-హృదయసంవాదముగల సహృదయుల వినిర్మల హృదయములయందుసంక్రమింపఁజేయఁబడి-వారి హృదయములందు స్థాయులగు భావములై విశేషించి నివేశింపఁజేయఁబడిన ప్రాచీనములగు రత్యాది సంస్కారములను మేల్కొల్పును. ఈవిభావానుభావములు-వాస్తవములుగానుండుటావశ్యకముకాదు, శకుంతలాదివిభావములువాస్తవములైనను,మాలత్యాదులు-వాస్తవములుకావుగదా! "వాస్తవములు కానివైననుగూడ - ఈ విభావానుభావములు - రసాభివ్యంజనమునకు సముచితములగునట్లు సహృదయహృదయమునందు - కావ్యశబ్దములచేతఁగాని, నటాభినయములచేతఁగాని, సంక్రమింపఁజేయబడును" అని చెప్పుటకే లోచనమునందు ఈవిభావాదులు- శబ్దసమర్ప్యమాణములనియు, అభినయసమర్ప్యమాణములనియు, చెప్పఁబడినది. లోచనోక్తమగు సమాసమునందలి 'శబ్ద'శబ్దము-అభినయములకుఁగూడ నుపలక్షకమగును. రసాభివ్యంజకములగు విభావాదులచేత ఇట్లు మేలుకొలుపఁబడిన (ఉద్బోధింపఁబడిన) ప్రాచీన సంస్కారములగు రత్యాదులచేత - అనురంజింపఁబడుటవలన - చర్వయిత [అనుభవిత] యొక్క సంవిద్రూపమగు మనస్సు - 'సుకుమారమగును. అనఁగా; రసాస్వాదన యోగ్యతనందును.' అని తెలియునది. చర్వయిత [అనుభవిత] యొక్కమనస్సు-లోచనము

నందు సంవిత్తని చెప్పబడినది. ఆనందరూపమగు చిదాత్మను ప్రతిబింబింపఁజేసి కొను సామర్థ్యముగలదగుటవలన రత్యాది విషయములతోఁగూడిన బ్రహ్మానంద మును, చక్కగా నెఱుఁగునదియగు మనస్సే - ఇచట సంవిత్తని చెప్పఁబడెను. [విభావాద్యభివ్యంజిత రత్యాదివిషయసంవలిత బ్రహ్మానంద సమ్యగ్ వేదనశాలి, యగు మనస్సు-సంవిత్తు.] సంవిద్రూపమగు నామనస్సునకు సంబంధించినఆనంద ఘనమును, [ఆనంద ప్రచురమును] చర్వణారూపమును, అగు వ్యాపారము [ఆస్వాదించుట అనువ్యాపారము] చేత - రసనీయమగు [ఆస్వాదింపఁదగిన] రూపముగలది యేదో, అది : [రత్యాదివిషయసంవలిత బ్రహ్మానందరూపము] రసము. (1) శృంగారాదిరసములును, అందనౌచిత్యమువలన నేర్పడునవియగు (2) ఏతద్ రసాభాసములును. 3 భావములును, [సంచారిభావములు33.శృంగారాదులందు ప్రధానముగా వ్యంజితములగునపుడు స్థాయిభావములయినను, భిన్న రసములయందు అప్రధానముగా వ్యంజితములగు రత్యాదులు9. మొత్తము 42.] (4) వాని యాభాసములును, (5) భావోదయము (6) భావసంధి (7) భావశాంతి (8) భావశబలతలును - "రసాదులు" అని వ్యుత్పత్తియందుఁ జెప్పఁబడినవని తెలియునది. విభావానుభావములు - శబ్దవాచ్యములగును. మీఁదఁజేర్కొనఁబడిన రసాదులు - స్వప్నమందైనను స్వశబ్దవాచ్యములుకాక, కావ్యవ్యాపారమగు వ్యంజనా వ్యాపారముచేతనే - ధ్వనింపఁజేయఁబడునని తెలియునది.

అవ :— "ఆరసాదిధ్వనియే - కావ్యాత్మ" అని ప్రదర్శించుటకు వస్తుధ్వనికంటెను, అలంకారధ్వనికంటెను, గూడ - దానికిఁగలదియగు విశేషమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— ఆ రసాదిధ్వని మాత్రము - ధ్వనియేయగును. కనుకనే, "అదియే-[ఆరసాదిధ్వనియే] ముఖ్యముగా ఆత్మ" అని చెప్పఁబడును.

ప్రభా :— ప్రతీయమాన భేదములగు, వస్త్వలంకారధ్వనులు - ఒకప్పుడు, వాచ్యములుగూడ నగును. [ప్రతీయమానభేదమగు] రసాదిధ్వని-యెప్పుడును వాచ్యముకాదు. అదియెప్పుడునుధ్వననవ్యాపారముచేతనే ధ్వనింపఁజేయఁబడునదియేయగుచుండును. కనుక నదియే - ప్రధానమగు కావ్యాత్మగాఁజెప్పఁబడును. వస్త్వలంకారధ్వనులు - ముఖ్యముగా కావ్యాత్మకావు. అయినను రసధ్వనియందు పర్యవసించి - ఔపచారికముగానే కావ్యాత్మ అని చెప్పబఁడును. ఈ యభిప్రాయమును దెలుపుటకే మీఁది లోచనమున, "రసాదికమే - ముఖ్యతచేత - కావ్యాత్మ" అని చెప్పఁబడినది.

అవ :— ఇట్లు - "రసాదిధ్వనియే - ప్రధానముగా కావ్యాత్మ. వస్త్వలంకారధ్వనులు - వాచ్యముకంటె సుత్కృష్టములై రసాదిధ్వనియందే పర్యవసించునవి; గనుక - అముఖ్యతచేత కావ్యాత్మగాఁజెప్పఁబడును". అనిచెప్పుట వలన భట్టనాయకుఁడు - "ధ్వని - కావ్యాంగమేకాని - ప్రధానము [కావ్యాత్మ] కాదు" అని చెప్పినది నిరాకృతమని చెప్పుచున్నాఁడు.

లోచనము :— భట్టనాయకుఁడు - "ధ్వని - కావ్యాంగమేకాని కావ్యరూపము - [అనగా; కావ్యాత్మ] -కాదు" అని యొనర్చిన ఉపాలంభము [ప్రతిక్షేపము] వస్తుధ్వనిని, అలంకారధ్వనిని. గుఱింపునదియే యగునెపలఁగావచ్చును. [మేము రసాదిధ్వని అని చెప్పినదానినే తాను] "రసపక్షః" అను ప్రతీయాంశమునుగాఁదెలిపి - 'అభిధ, భావన' అను అంశద్వయముకంటె దానిని వేఱని నిర్ణయించియున్నాఁడు. కనుక నతఁడును రసధ్వనిమాత్రమును కావ్యాత్మగానంగీకరించినవాఁడే యగుచున్నాఁడు.

ప్రభా : ప్ర :— "అయ్యా! 'ధ్వని కావ్యమ్మునకాత్మగా' అనుకారికచేత-మీరు, వస్తు - అలంకార - రసాదిరూపమగు ధ్వనినంతనుగూడ - కావ్యాత్మగాఁ జెప్పియున్నారు గదా! ఇప్పుడిట్లనుచున్నారేల ?" చివరివఱకు నొకమాటమీఁద నిలుపుఁడు!

లోచనము : ఉ :— [ధ్వన్యాత్మ సద్భావవాదులమగు] మేమే-"వస్త్వలంకారధ్వనులు - రసధ్వని పర్యంతములే" అనునంశమును "కావ్యస్యాత్మా" ఇత్యాదులచేత నక్కడ నక్కడ ముందు చెప్పుదుము.

ప్రభా :— ఏది - విశ్రాంతి ధామమో [స్థానమో] అది - ముఖ్యాత్మ యగును. వస్త్వలంకారములు - ధ్వనింపఁజేయఁబడినవయినను, విశ్రాంతిధామములు [స్థానములు] కావు. రసమే - విశ్రాంతిధామము. ఈధ్వనులు రెండును గూడ - వాచ్యములగు వస్త్వలంకారములవలె విభావములయి-రసధ్వనినిగుఱించి పరుగిడునవియే - యగుచున్నవి కాని విశ్రాంతిస్థానములుకాలేవు. కనుకనే - రసధ్వనిపర్యవసానముగల యీవస్తు - అలంకారధ్వనులకు - అముఖ్యమగు నాత్మత్వమే - "ధ్వనికావ్యమ్మునకాత్మగా" అనుచోట సామాన్యరూపమునఁ జెప్పఁబడినది. కాని రసాదికమే - ముఖ్యాత్మ. [తదితరములనుగూడ - ముఖ్యాత్మలుగాఁ జెప్పుమనుచున్న నీమతము - గొడ్డుగేదె అనునింటివానిని, పాలగేదె అని చెప్పుమన్నట్లున్నది.]

లోచనము :— వృత్తియందు - "వాచ్యసామర్థ్యముచేత - ఆక్షేపింపఁబడి" అనుదానిచేత - వస్తువు, అలంకారము, రసాదులు, అను ధ్వనిభేదములు మూడింటియందును వ్యాపించునదియగు సామాన్యలక్షణము - చెప్పఁబడినది.

ప్రభామతి :— ఈధ్వనులు, మూడును-భిన్నములగు విశేషలక్షణములు గలిగియున్నను, వాచ్య [అర్థ] సామర్థ్యముచేతనే - స్ఫురింపఁజేయఁబడును. కనుక వాచ్యసామర్థ్యముచేత - ఆక్షేపింపఁబడుట - వీనికి సామాన్యలక్షణము.

అవ :— "అభిధాది వ్యాపారములవలె ధ్వననవ్యాపారముకూడ - శబ్దమునాశ్రయించునదియే - కావలెనుగదా ! ధ్వననవ్యాపారము- వాచ్య [అర్థ] సామర్థ్యాక్షిప్తమని యేల చెప్పుచున్నారు ?" అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

[లోచనము] అవునయ్యా!, ధ్వననముకూడ - శబ్దవ్యాపారమే అయినను- సహకారియగు నర్థసామర్థ్యము కూడ - ధ్వనులన్నింటను అపాయములేనిదై యున్నది. కనుక - వాచ్యసామర్థ్యముచేత - అవియన్నియుఁగూడ - ఆక్షేపింపఁబడునవియే - అగును. "శబ్దశక్తిమూల - అను రణన - వ్యంగ్యధ్వనికూడ- అర్థ సామర్థ్యమువలననే - స్ఫురింపఁజేయఁబడును. అచ్చట శబ్దశక్తి - అవాంతరసహకారియే" అని - ముందు చెప్పఁబడును.

(22) మూలము : అదెట్లనిన :— ఈధ్వనిత్రయమునందు ఆద్యప్రభేదము - [విధి, నిషేధాది రూపమును, వస్తుమాత్రమును, నగు ధ్వని ప్రభేదము.] మిక్కిలి విభేదము కలిగియున్నది. ఒకప్పుడు వాచ్యము - విధిరూపమైయుండ; ఈవస్తుధ్వని - తానుప్రతి [ని]షేధరూపమై యుండును.

అదెట్లనిన :— దీనికుదాహరణము. [శాతవాహన సంకలితమగు గాథాసప్తశతియందలి ప్రాకృతశ్లోకమునకిది యాంధ్రీకృతి.]

తే॥ "సంచరింపుము - ధార్మిక! శంకవిడిచి
[భ్రమినొనర్పుము - ధార్మిక - భయమునుడిగి]
అల్లశునకమ్ము నిప్పుడే - అంతమొందఁ

జేసె గోదావరీతట స్థితలతాకు
డుంగముననున్న దృప్తమౌసింగ మదియె." (౨)

[లోచనము] 'విధి - నిషేధములు - విరుద్ధములు' అను నంశమున, ఎవ్వ నికినివిరుద్ధాభిప్రాయముండునదికాదు. ఏతదర్థము [దీనికొఱకు] వానినే మొదట నుదాహరించుచున్నాఁడు. [ఉదాహృతప్రాకృతశ్లోకమునకిది-సంస్కృతచ్ఛాయ]

భ్రమధార్మిక విస్రబ్ధః సశునకోఽద్య మారితస్తేన
గోదావరీ నదీకూలలతా గహనవాసినాదృప్తసింహేన.

ఇది - ఒకానొక స్వైరిణి - తనకు జీవిత సర్వస్వాయమానమగు సంకేత స్థానమును - ధార్మిక సంచరణముచేతనగు, అంతరాయదోషమునుండియు, ఆధా ర్మికునిచేతఁ గోయఁబడుచున్న, పల్లవకుసుమాదులచేతనగు విచ్ఛాయీకరణము నుండియు, రక్షించుటకు - పలికినమాట.

[ప్రభామతి] సంలక్ష్యక్రమ వ్యంగ్యమును, అర్థశక్తిమూలమును, మొదటి దియు, నగు - వస్తుధ్వని ప్రభేదము-మీఁద నుదాహరింపఁబడినది. 'వస్తువనఁగా; 'విధినిషేధాది రూపమగు, నర్థమే' [అభిప్రాయమే] అని తెలియునది. వృత్తికా రుఁడుదాహరించిన ప్రాకృత శ్లోకమిట్లున్నది.

'భమధమ్మిఅ వీసత్థో సోసుణఓ అజ్జ మారిఓ దేణ
గోలాణఇ కచ్ఛకుడుఙ్గ వాసిణా దరిఅసీహేణ'.

'విధి, నిషేధములు- పరస్పరవిరోధముగల'వను వంశము-సర్వసమ్మతము. విధియున్నిచోట - నిషేధమును నిషేధమున్నచోట - విధియు, ఉండవుగదా!

ఈ విరోధము - భావాభావరూపములగు విధి, నిషేధములయందు- సుప్రసిద్ధమగుటవలన - ఆత్యంతిక భేదప్రదర్శనము కొఱకు, అవియే మొదటనుదా హరింపఁబడినవి.

ప్రశ్న :— ఈ వాచ్యవ్యంగ్యములలో- ఒకటి - విధిరూపమును, వేరొ కటి - వ్యంగ్యరూపమును, కావలెనా ?

ఉత్త :— వాచ్యవ్యంగ్యములు - విధినిషేధరూపములే, కానక్కరలేదు.

విధి రూపములగు వాచ్యవ్యంగ్యములకుఁగూడ - భేదముండును.

ప్రశ్న :— అట్లైనయెడల; వృత్తికారుఁడు - విధిరూపములగు వాచ్య వ్యంగ్యములుగల, ఉదాహరణమును ప్రదర్శింపక విధి, నిషేధ, రూపములగు వాచ్యవ్యంగములుగల. ఉదాహరణమునేల ప్రదర్శించెను ?

ఉత్త :— వాచ్యవ్యంగ్యములకు - భేదమున్నదని - ప్రదర్శించుటకే,- మీఁది యుదాహరణ మొసగఁబడినది గదా ! "జ్ఞాతలకు, విధిరూపమగు - వాచ్యవ్యంగ్య ప్రదర్శనమునందుకంటె - విధి, నిషేధ, రూపమగు - వాచ్య వ్యంగ్య - ప్రదర్శనమునందు వానికిఁగల ఆత్యంతికమగు - భేదము - స్పష్టము గాఁదెలియు" ననునభిప్రాయమున విధి - నిషేధరూప వాచ్యవ్యంగ్య ప్రదర్శక మగు నుదాహరణ మొసఁగఁబడినది.

ఈ - ప్రాకృత శ్లోకము-శాతవాహన మహారాజసంకలితమగు గాథాసప్త శతియందలిది. ఇది-ముక్తకరూప [ఏకశ్లోకరూప] మైనను- ప్రబంధాయమానమై యున్నది.

దీనికి సంబంధించిన ప్రకరణము [సందర్భము] నిట్లుండఁగునది. ఒక నైష్ఠి కుఁడు - ప్రతిదినమునందును గోదావరీ నదీతీరమునకరిగి స్నానాదికముగొనర్చు కొని - ఆతీరమునందున్న మనోహర లతానికుంజమునందున్న, పూవులను, చివుళ్లను, దేవతార్చనముకొఱకు కోసికొనుటకు దానినట్టును సంచరించు చుండెను. స్వైరిణియగునొకతెకు-ఆలతానికుంజము-ఆత్మప్రియునితో స్వేచ్ఛగా విహరించుటకుఁదగిన సంకేతస్థానమై యుండెను. కనుక నాలతానికుంజము - ప్రాణములకంటెను ప్రియమైనది. కనుక నామెకది జీవితసర్వస్వముగానుండెను ఈ ధార్మికుని సంచారము [భ్రమణము] వలన ఆప్రేయసీ ప్రేయసుల చౌర్య సురతమునకు స్వల్పకాల విచ్ఛేదరూపమగు విఘ్నదోషము కలుగుచుండెను. ఇంత మాత్రమేకాను. మఱియునతఁడు - ఆలతామందిరము నలంకరించుచున్న ప్రసూన పల్లవములను త్రెంపుచుండుటవలన - అది - విచ్ఛాయమగుచుండెను. ఇది-పెద్ద దోషము. దోషములు రెంటినుండియు, ఆలతాగృహమును బాగుగా రక్షించుటకై ఆచతురశీలయగు మిటారి - ఆధార్మికునితో, ఈ పలుకు - పలికెను.

దానియర్థమిది :— "ఓధార్మికా ! నీవింతకుమునుపు గోదావరీనదీతీర

లతానికుంజమున కిసలయసుమపత్రాదులను గోసికొనుటకచట స్వేచ్ఛగా సంచరించెడివాఁడవు. పాపమాకుక్క నిన్నుబాధించెడిది. వెనుక నీసంచారమున కంతరాయమునుగల్పించిన శునకమిప్పుడులేదులే. గోదావరీనదీతీరస్థితలతానికుంజమున దృప్తమైయుండిన, ఆసింహము - ఇప్పుడే దానినంతమొందించినది. నీవిఁక నచట నిస్సంశయముగాఁదిరుగవచ్చును.''

ప్రశ్న :— అయ్యా! ''సంచరింపుము ధార్మిక'' అను నీవాక్యార్థమునందలి విధి-సంచరింపుము, అని భ్రమణమును నియోగించునదియా, ''సంచారము నాపకుము'' అని భ్రమణ నిషేధమును వారించునదియా ?

ఉత్త :— ''సంచరింపుము'' అనునీవిధి - భ్రమణము నాపకుము, అని తెలుపునదియేకాని (నిషేధాభావరూపమే) కాని ప్రైషాదిరూపమగు నియోగము కాదు. లోచనమును, ప్రభామతిని, గూడ సమీక్షించునది.

లోచనము :— దీని యర్థమును పర్యాలోచించునెడల - ఇందలి వాచ్యార్థమగు భ్రమణము - [సంచారము] ధార్మికునకు స్వతస్సిద్ధమయినను, శునకభయముచేత అపోదితము [ప్రతిషిద్ధము] కనుక - ప్రతిప్రసవాత్మకమగు నిషేధాభావరూపమేగాని, ప్రైషాదిరూపమగు విధి - కాదు. ఇచ్చటనున్న యీలోట్ ప్రయోగము- అతిసర్గప్రాప్తకాలములయందు వర్తించునుగదా! [ఇచటకామచారాభ్యనుజ్ఞారూపమగు అతిసర్గమునందును, ప్రాప్తకాలమునందునుగూడ, లోట్ ప్రయోగము కావింపఁబడినదని తెలియునది.]

ప్రభామతి :— ''సంచరింపుము ధార్మిక'' అను నీవాక్యమునఁదెలుపఁబడిన భ్రమణము [సంచారము] ధార్మికునికి స్వతస్సిద్ధమైయున్నది. శునకభీతి - [కుక్క తన్ను మైలపరచు - ననుభయము] ఈ - భ్రమణమును నిషేధించినది. ఇట్లు, భ్రమణమునకు - ప్రతిబంధమునొనర్చునదియగు, శునకమిప్పుడు - మారితమైనది. వెనుక, నిషేధింపఁబడిన భ్రమణమునకు ప్రతిషేధకముయొక్క యభావమిప్పుడు-చెప్పఁబడినది. ''సంచారమునాపకుము''అని కనుకనిది - ప్రతిప్రసవమగుచున్నది. ప్రతిప్రసవమనఁగా; ప్రతిషేధమును నివర్తింపఁజేయుటయేకదా! ''ఇప్పుడు - అచట తిరుగుటకు ప్రతిబంధమేదియు-లేదు'' అను నిషేధాభావమే-ఇచటవిధియగుచున్నది. కాని, నియోగముకాదు. ఈ - స్వైరిణి - రాజాదులవలె, ఈ - ధార్మికుని దిరుగుమని విధించునదిగాని, శునకభీతివలె, భ్రమణనిషేధము నొనర్చునదిగాని, కాఁజాలదు. ఇంకేమనిన, భ్రమణమునాపవలదని, భ్రమణ

నిషేధకాభావమునే తెలుపును. కనుక, ఈ - భ్రమణము - విధీయమానతా కోటినధిరోహించుచున్నది. కనుకనే, ["భ్రమ] - సంచరింపుము" అనునీవిధి - స్వేచ్ఛగాఁదిరుగుమను కామచారమగు అభ్యనుజ్ఞయే- రూపముగాగల అతిసర్గము నందు "లోట్" ప్రయోగముచేతఁ దెలుపఁబడినదని దెలియునది. ఇచట "తిరుగఁ దగిన సమయమువచ్చినది" అని ప్రాప్తకాలార్థముగూడ - లోట్ ప్రయోగముచేత బోధింపఁబడును.

లోచ :— ఇచ్చట [వాచ్యవ్యంగ్య విచారమొనర్చునపుడు] 'భావాభావ ములు - విరుద్ధములు' గనుక 'సంచరింపుము, సంచరింపకుము' అను విధినిషేధ రూపములగు నర్థములు రెండును - [అభిధచేత] ఒక్కసారియే వాచ్యములగునవి కావు. "విశేష్యంనాభిధాగచ్ఛేత్" ఇత్యాది ప్రమాణవాక్యముచేత - విశేషణమగు జాతినిదెలిపి. క్షీణశక్తియై, విరమించిన అభిధావ్యాపారమునకు - విశేష్యమగు వ్యక్తిని దెలుపుటకు మరల వ్యాపారము సంభవింపదు." అని చెప్పఁబడుటవలన- అభిధావ్యాపారము - ఒకయర్థమునుదెలిపి - విరమించి, తానేమరల సంభవించు నదికాదు. కనుక ఈయర్థములు రెండును-ఒకదానివెనుక నింకొకటి క్రమముగా వాచ్యములగునవికూడకావు.

[ప్రభామతి] ఇట్లు - ప్రతిప్రసవాత్మకమగు నర్థము, అనగా-"ఓధార్మికా నీవిఁక గోదావరీతీర సంచారమునాపకుము. స్వేచ్ఛగాఁదిరుగుము." అనునర్థము, అభిధచేత - వాచ్యము. తదుపరి వక్తృబోద్ధవ్యాది వైశిష్ట్యమువలన వేరొకవ్యాపా రమగు వ్యంజనచేత - "సంచరింపకుము" అనునర్థము ధ్వనింపఁజేయఁబడును. "ఈయర్థములు రెండునుగూడ - అభిధచేత-వాచ్యములే. కాఁగూడదా?" అని యాశంకించి - శ్రీలోచనకర్త - దానిని నిరాకరించుచున్నాఁడు. ఆయర్థమిచటి ప్రశ్నోత్తరములచేత నెఱుఁగునది.

ప్రశ్న :— అయ్యా! "సంచరింపుము, సంచరింపకుము" అనునర్థములు రెండునుగూడ - ఒక్కమారే, వాచ్యములగునని ఏలచెప్పఁదగదు?

ఉత్త :— ఘటమును, దానియభావమును, పరస్పర విరుద్ధములగునట్లు; "తిరుగుము - తిరుగకుము" అనువిధి-నిషేధములుగూడ - విరుద్ధములగుటవలన- ఒకేసారి వాచ్యములుకావు.

ప్రశ్న :— పోనిండు! 'తిరుగుము, - తిరుగకుము" అను నీయర్థములు క్రమముగా వాచ్యములు కాఁగూడదా?

ఉత్త :— ఏవ్యాపారము - ఒకయర్థమును [సామాన్యమును] తెలిపి - క్షీణశక్తియై, విరమించునో, అదేవ్యాపారము - మరల సంభవించి, వేరొకయర్థ మును [విశేష్యమును] దెలుపఁజాలునదికాదు. కనుక - అభిధ యను వ్యాపారము గూడ- శబ్దముచేత - ఒకయర్థమునుదెలిపి- మరలతానే సంభవించి - వేరొకయర్థ మును బోధింపఁజాలునదికాదు, "విశేష్యంనాభిధాగచ్ఛేత్ క్షీణశక్తిర్విశేషణే" అనుదానియర్థమిది :- "గవాది పదములందుఁగల సామాన్యమగు అభిధ - 'గోత్వము'మున్నగు నర్థమునుదెలిపి, తనకుఁగల బోధజననసామర్థ్యరూపమగు శక్తినుడిగినదగును. అది తిరుగ విశేష్యరూపమగుగవాదివ్యక్తిని బోధించునదికానే రదు" అని. కనుక - ఒకదానివెనుక, వేరొకటిగాఁ [క్రమముగాఁ] గూడ-ఈ యర్థములు ['సంచరింపుము, సంచరింపకుము' - అనునవి] - రెండును, వాచ్య ములు కాఁజాలవు.

అవ : అభిహితాన్వయవాది యొనర్చునదియగు పూర్వపక్షము అవ :— "అయ్యా ! వాచ్యవ్యంగ్యములు రెండును - ఒక్కమారుగాఁగాని, క్రమముగాఁ గాని, వాచ్యములు కానియెడల-కేవలభ్రమణ నిషేధమే - వాచ్యముకాఁగూడదా?" అని, అభిహితాన్వయవాది యొనర్చిన పూర్వపక్షమును చెప్పుచున్నాఁడు.

[లోచన] అభి-పూర్వ :- ఇచట ["తిరుగకుము" అని చెప్పుటచే వక్తవి వక్షించెను. కనుక] భ్రమణనిషేధవివక్షచేత - భ్రమణ విధియందు పర్యవసానము [విశ్రాంతి] నొందని తాత్పర్యశక్తియే - 'దృప్తపా', 'ధార్మిక', 'ఇదియే', అను పదముల అర్థములకు సంబంధించినఅన్వయరూపమగు ముఖ్యార్థమునకగుబాధను, విరోధరూపసంబంధమును, నిమిత్తముగాఁగొనిన విపరీత లక్షణచేత- [వ్యాపారము చేత]వాక్యార్థీభూతమగు[ఫలితార్థమగు] నిషేధప్రతీతిని గదిగించును, కనుక నాయ ర్థము - [భ్రమణనిషేధము] శబ్దశక్తి [అభిధా] మూలమే,యగును 'దీనిచేతనిట్లు చెప్పఁబడియెను' అనియేగదా వ్యవహారము! ["దీనిచేతనిట్లు వ్యంజితము" అను వ్యవహారము లేదుగదా!] కనుక - మీరు ప్రతీయమానమనుచున్న అన్యార్థము - వాచ్యాతిరిక్తమగునర్థముకాదు.

[ప్రభామతి] ఇది- అభిహితాన్వయవాది యొనర్చినపూర్వపక్షము, నైయా యికులును, మీమాంసకులలో భాట్టులును, అభిహితాన్వయవాదులని చెప్పఁ బడుదురు.

ఆయాపదములు - తమతమ వృత్తులచేతఁ [అభిధచేత;] దెలుపునవియగు,

అర్థములు - [పదార్థములు] - "అభిహితములు" అని చెప్పఁబడును. అభిహితములగు పదార్థములకు [తాత్పర్యశక్తిచేత] అన్వయమును, దెలుపువారు - అభిహితాన్వయవాదులు. "ఆయాపదములు తమతమవృత్తులచేతఁ దెలుపునవియగు అర్థములకు - ఆకాంక్షాయోగ్యతా సన్నిధివశమున వాక్యార్థరూపమగు సమన్వయము - తాత్పర్యవృత్తిచేత కలుగును" అని అభిహితాన్వయవాదులు చెప్పుదురు. మొదటపదములు - జాత్యాదులనుగాని, జాతినిగాని, [సామాన్యమును] అభిధచేత - బోధించును. తదుపరి వాని పరస్పర సంబంధము - తెలియఁదగియుండునపుడు, ఆకాంక్షాదివశమున ఈ తాత్పర్యవృత్తిచేత - ప్రతిపాద్యమగు తాత్పర్యార్థము - వాచ్యాదులకంటె వేఱైనదియు, ప్రత్యేకపదవృత్తికి విషయముకానిదియు, అయినను - పదసమూహగమ్యమైనదియు, అగు వాక్యార్థమై - సముల్లసించును. 'తత్పరమగు వచనమునందుఁగల శక్తియే-తాత్పర్యశక్తి" అని చెప్పఁబడును. వాక్యమునకు- ఏయర్థమునందు తాత్పర్యముండునో; అదియే-వాక్యార్థమగుచుండును. వాక్యార్థపర్యవసానము[ముగింపు] లేనివచనము-తత్పరము-అనఁగా; వాక్యార్థమే - ప్రధానమగు ప్రతిపాద్యముగాఁగలది - కాదుగదా. కనుక-తత్పరమగు [వాక్యార్థపరమగు] వచనమునకు - వాక్యార్థమునందే పర్యవసానము యుక్తము. ప్రస్తుతగాథావిషయమున తాత్పర్యమునకు విషయము 'తిరుగకుము' - అనునదియే; కనుక - 'తిరుగకుము' అనునదియే వాక్యార్థము.

మీఁదిగాథయందు వివక్షితమగు నర్థము . భ్రమణ నిషేధమైయున్నది. కనుక - తాత్పర్యశక్తి- భ్రమణవిధియందు పర్యవసానము (ముగింపు) నొందక- భ్రమణనిషేధమునందే- పర్యవసానమునొందును. విధిరూపమగునర్థము - నిషేధరూపమగు నర్థమునకు ద్వారమాత్రమే.యగును.

పదనిష్ఠయు, వివక్షితార్థప్రతీతిని జనింపఁజేయు సామర్థ్యము రూపముగాఁగలదియు, నగు తాత్పర్యశక్తియే - వాక్యార్థీభూతమగు భ్రమణ నిషేధమును గావించును.

ప్రశ్న :— ఈ తాత్పర్యశక్తి - దేనిచేత [వ్యాపారముచేత] భ్రమణ నిషేధము నొనర్చును ?

ఉత్త :— లక్షణా వ్యాపారముచేత.

ప్రశ్న :— లక్షణ ప్రసరించుట కిచ్చట నిమిత్తమేది?

ఉత్త :— భావాభావాత్మకత్వప్రయుక్త ["తిరుగుము - తిరుగకుము' అను]విరోధరూపమగు సంబంధము-ప్రస్తుతమగు గాధయందు నిమిత్తమైయున్నది

ప్రశ్న :— "వాచ్యార్థమునకు వాక్యార్థమునందు సంబంధానుపపత్తి [ప్రవేశము కుదురకుండుట]" అనుముఖ్యార్థబాధ - ఇచ్చటనున్నదా ?

ఉత్త :— ఉన్నది. "తిరుగుము" అనునదియే - ముఖ్యార్థమగునెడల - "దృప్తమౌ, అదియె, ధార్మిక" అనుపదములయర్థములచేతఁ గూర్పఁబడిన వాక్యార్థమునందు [తిరుగరాదనునర్థమునందు] 'తిరుగుము' అను నీముఖ్యార్థమునకు - అన్వయముకుదురదు. కనుక - 'అన్వయము కుదురకుండుట' అను ముఖ్యార్థబాధయున్నది.

ఇట్లు ముఖ్యార్థబాధయు, భావాభావరూపత్వప్రయుక్తమగు విరోధ సంబంధమను నిమిత్తమును, గలవు. కనుక తన్నిమిత్తకమగులక్షణ-ఉన్నది. భ్రమణనిషేధ విషయమగు వక్తృవివక్షయుండుటవలన,తాత్పర్యశక్తి-పర్యవసానము నొందకయే యున్నది. కాఁగా; వక్తృవివక్ష - 'సంచరింపకుము'నంమన్నది, కనుక -విశ్రాంతి స్థానమగు నిషేధరూపవాక్యార్థమునందు పర్యవసానమునొందని తాత్పర్యశక్తియే-ముఖ్యార్థబాధయు, విరోధరూప సంబంధనిమిత్తమును, గల విపరీతలక్షణను, "సంచరింపకుము" అను భ్రమణనిషేధరూపమగు వక్తృవివక్షనుఁగైకొని- వాక్యార్థీభూతమగు భ్రమణనిషేధ ప్రతీతినిగావించును. ఈతాత్పర్యశక్తి - శబ్దశక్తియగు-అభిధావ్యాపారమే - మూలముగాఁగలదగుటవలన - శబ్దశక్తిమూలమగుచున్నది. ఈతాత్పర్యశక్తియు, లక్షణావృత్తియుఁ,గూడ - అభిధనాశ్రయించియే వ్యవస్థితములుగదా! "లక్షణకూడ - అభిధాపుచ్ఛభూతమే" అని ముందు చెప్పఁబడును. కనుక - వాక్యార్థమగు [ఫలితార్థమగు] భ్రమణనిషేధము - శబ్దశక్తిమూలమే యగును. కనుక - ధ్వనివాదులు - వాచ్యముకంటె వేఱగు నేదోవ్యంగ్యమని చెప్పుచున్న యర్థము - వాచ్యముకంటె వేఱుకాదు. అనునిది - అభిహితాన్వయ వాది మతము ననుసరించినట్లున్న పూర్వపక్షాశయము.

అవ :— ఇచ్చట-విపరీతలక్షణా ప్రసారమున కవకాశములేదు. కనుక తాత్పర్యశక్తియే - భ్రమణనిషేధరూపమగు నర్థమును విపరీతలక్షణచేతఁ బ్రతిపాదించును" అను మీదిమతమును నిరసించుచున్నాఁడు.

లోచనము :— ఇది - యుక్తముకాదు. ఏలనిన; ఇచట [లోకవ్యవహారము

నందు - శబ్దమునకు] వ్యాపారములు - మూడున్నవని తెలియుచున్నది. సామాన్యరూపములగు [గోత్వాదిరూపములగు] పదార్థములయందు [గవాదిపదములకు] అభిధయను వ్యాపారమున్నది. సమయాపేక్షచేత - [సంకేతగ్రహణ సహకారముచేత] అర్థావగమనశక్తి-[అర్థబోధన సామర్థ్యము] అభిధగదా. ! విశేషములగు వ్యక్తులు - అనంతములు. కనుక విశేషములగు సర్వవ్యక్తులయందును సంకేతము గ్రహింపఁబడునెడల - ఆనంత్యము కలుగును. విశేషమగు నొక్కొ-కవ్యక్తియందే సంకేతము గ్రహింపఁబడునెడల - వ్యభిచారము కలుగును. కనుక - [ఆనంత్యమువలనను, వ్యభిచారమువలనను] సమయము [సంకేతము, లేక సంకేతగ్రహణము,] సామాన్యాత్మకమగు పదార్థాంశమాత్రమునందేగాని, విశేషాంశమగు వ్యక్తియందు - ఉండునదికాదు.

ప్రభామతి :— అభిహితాన్వయవాది పక్షమునను సరించినట్లు చెప్పఁబడిన మీఁది పూర్వపక్షము - యుక్తముకానేరదు. లోకవ్యవహారమునందున్న వ్యాపారములు - 'అభిధ, తాత్పర్యము, లక్షణ,' అనునవి - మూడేయగుచున్నవి. ఈ విషయమున నెవ్వనికిని విమతిలేదు.

అవ :— ఈ వ్యాపారములకు విషయమేది ? వీనిస్వరూపమెట్టిది ? అని యాశంకించి - చెప్పుచున్నాఁడు. శబ్దములు - సంకేతమును దెలుపును. సంకేతస్మరణమునుసహకరించుకొనిన శబ్దమునకుఁగలఅర్థబోధనసామర్థ్యము,'అభిధ'అని చెప్పఁబడును. గోత్వాదిసామాన్యాత్మకమగు పదార్థాంశమాత్రమునందే-శబ్దమునకు సంకేతముండును. కాని, విశేషాంశమగువ్యక్తియందుండదు. ఏలయనిన:- విశేషాంశములగుగవాదివ్యక్తులులెక్క-లేనన్నియున్నవి. ఆవిశేషాంశములన్నిటియందును, సంకేతమునొనర్చుటకు వీలుపడునదికాదు.అప్పుడు వ్యక్తులెన్నియుండునో- శక్తులుగూడ నన్నియుండునని చెప్పవలసి వచ్చుటవలన, శక్త్యానంత్య [గౌరవ] దోషము కలుగును.

ఒకేగోవునందు సంకేతగ్రహణము - లోకవ్యవహార నిర్వాహకమగునను తలంపున గోశబ్దమునకు - గోవ్యక్తి యొకదానియందే సంకేతము-స్వీకరింపఁబడిన యెడల - ఏ గోవ్యక్తియందు - సంకేతముస్వీకరింపఁబడినవో, దానికంటె వేరయిన గోవ్యక్తికి-ఆగోశబ్దముచేత భానము[బోధ] కలుగకుండవలసివచ్చుటవలననగువ్యభిచారముగూడ సంభవించును. ఇట్లు సంకేతముగ్రహింపఁబడకున్నను, గవాది వ్యక్తి విశేషము-గవాదిపదముచేత-బోధింపఁబడుచునేయున్నది. కనుకఒకేవ్యక్తియందు సంకేతగ్రహణముకూడ -లోకవ్యవహార నిర్వాహకముకాదు, కనుక విశేషరూప

మగు గవాదివ్యక్తియందు సంకేతమునొనర్చుట - శక్యము కానిది.

ప్రశ్న :— అయ్యా! మీరు సర్వవ్యక్తులందును సంకేతమునొనర్చునెడల - ఆనంత్యగౌరవమను దోషమును జూపుచున్నారు. ఏదైన నొకవ్యక్తియందు సంకేతమునొనర్చునెడల - వ్యభిచారమను దోషమును జూపుచున్నారు. కాఁగా; "గవాదిపదమునకు విశేషాంశమగు వ్యక్తియందు సంకేతమును స్వీకరించుట యుక్తము కాదు. సామాన్యమగు జాతియందే - సంకేతగ్రహణము యుక్తము" అనునది మీ యభిమతముగాఁ గాన్పించుచున్నది. అట్లయిన వ్యక్తిరూపమగు విశేషాంశమును - ఏది - బోధించునో తెలుపుదురా ?

ఉత్త :— ఆవిశేషాంశము - సంసర్గాపరనామక తాత్పర్యశక్తి చేతనే - బోధింపఁబడును. లోచనమున సమీక్షింపుఁడు.

[లోచనము] కనుకనే, "సామాన్యాన్యన్యథాఽసిద్ధేర్విశేషం గమయన్తిహి" "పదములచేతఁ దెలుపఁబడిన సామాన్యరూపములగు నర్థములు - విశేషములు తెలియనపుఁడు [తమకు] క్రియాదులతోడి యన్వయము సిద్ధింపకుండుటవలన సామర్థ్యవ్యక్తిరూపమగు విశేషమును [విశిష్టరూపమగు వాక్యార్థమును] బోధించును" అను న్యాయమువలన - పరస్పరాన్వితమును, విశేషరూపమును, అగువాక్యార్థమునందు - పదములకు తాత్పర్యశక్తి - అంగీకరింపఁబడినది. [పదనిష్ఠమగు తాత్పర్యశక్తియే - విశిష్టమగు వాక్యార్థమును తెలుపును' అని యంగీకృతము.]

ప్రభావతి .— పదార్థప్రతీతివలననే పరినిష్పత్తి కలుగదు. ఏలయనిన; ఏపదమునుగూడ - పదార్థమాత్రమును దెలుపుటకే - వక్తలచేత ప్రయోగింపఁబడునదికాదు. "పదములు సామాన్యరూపములగు పదార్థములను దెలిపి, నివర్తించును. తదుపరి - సామాన్యరూపములగు నాపదార్థములే - తత్పదనిష్ఠమగు తాత్పర్యశక్తిచేత - విశేషమును, అనఁగా; విశిష్టరూపమగు వాక్యార్థమును ప్రకాశింపఁజేయును" అనునది ఫలితార్థము.

["సః = వాక్యార్థః - పరః = ప్రధానతయా ప్రతిపాద్యః. యేషామ్, తాని = తత్పరాణి. తేషాంభావః, తాత్పర్యమ్. తాత్పర్యరూపా, శక్తిః = తాత్పర్యశక్తిః" అనునది - 'తాత్పర్యశక్తి' వ్యుత్పత్తి.]

అవ :— అభిధా, తాత్పర్యశక్తిరూపమగు వ్యాపారద్వయమునిట్లు ప్రద

ర్శించి - రః తాత్పర్యశక్తియందు-తృతీయవ్యాపారమగు లక్షణకూడ - అనుప్రవేశించి - సహకరించి - వివక్షితార్థమును దెలుపునని చెప్పిన మీఁది పూర్వపక్షమును నిరాకరించుచున్నాఁడు.

లోచనము :— అభిధకుతరువాతిదియు, తాత్పర్యశక్తివిషయభూతయు, నగు ద్వితీయ కక్ష్యయందుఁగూడ - భ్రమింపుము [సంచరింపుము] అను భ్రమణవిధియే - ప్రతీతమగును. కాని, అభ్రమణవిధికంటె వేరగునదేదియు ప్రతీతము కాదు. ఏలయనిన; [ఇచట- పదార్థముల కొకదానితోనింకొకదానికిగల] అన్వయ మాత్రమే [వాక్యార్థముమాత్రమే] తెలియును.

''గంగయందు గొల్లపల్లె'' ''మాణవకుఁడు - సింహము'' మున్నగుప్రయోగములయందు - సంభవించుట కారంభించిన యన్వయమే - యోగ్యతలేకుండుట వలన బాధితమగుచున్నది. ''నీసంచారమును నిషేధించినకుక్క [ఇప్పుడే] సింహముచేత - చంపఁబడినది. కనుక - ఇప్పుడు, భ్రమణనిషేధకారణము-వికలమైనది. కనుకనీవు సంచరింపవచ్చును'' అను నిచటియన్వయమున కేదియు క్షతి లేదు. కనుక-[''గంగయందు'' ఇత్యాదిప్రయోగమునందువలె, ''సంచరింపుము'' ఇత్యాదిప్రయోగమునందు] ముఖ్యార్థబాధ - శంకింపవలసినదికాదు. కనుక - విపరీతలక్షణకవసరములేదు.

ప్రభా :— ''గంగయందు గొల్లపల్లె'' ఇత్యాదిస్థలములయందు 'గంగ' మున్నగు పదములచేత వాచ్యమగు ప్రవాహవిశేషాదికమునకు-'గొల్లపల్లె' మున్నగువానితో-ఆధారాధేయ భావసంబంధము మున్నగునది లేకుండుటవలన-అచట - అన్వయయోగ్యతలేమిచేత నగు ముఖ్యార్థబాధయున్నది. ప్రకృతగాథార్థమునందు - ముఖ్యార్థమునకేదియబాధకములేదు. కనుక నిచటలక్షణావసరము లేదు.

అవ :— ''అయ్యా! ఇచ్చటఁగూడ- వక్త్రౌచిత్యము మున్నగువానినిబట్టి అన్వయమునకు క్షతి కనిపించుటవలన నగు ముఖ్యార్థబాధయొక్క బలమువలన-విరోధనిబంధనయగు లక్షణకవసరమేలలేదు'' అని యాశంకించి, లక్షణనంగీకరించి - ''అయినను తాత్పర్యశక్తికి విషయమగు ద్వితీయకక్ష్యయందు - దీనికి నివేశములేదు'' అని చెప్పుచున్నాఁడు.

లోచనము :— [ఇచట] లక్షణయుండునని యంగీకరించినను, అది - ద్వితీయస్థానమునందు - [తాత్పర్యశక్తికి విషయమగు ద్వితీయకక్ష్యయందు] సంక్రమించునది కానేరదు.

అదెట్లనిన; ముఖ్యార్థబాధ కలుగునపుడు లక్షణకు ప్రసక్తికలుగును. [ముఖ్యార్థమునకు] బాధ - అనఁగా; ముఖ్యార్థమునకుఁగలుగు విరోధప్రతీతియే. ప్రకృతమున పదార్థములకు స్వరూపమునందుమాత్రము విరోధములేదు. [పదార్థములకు] పరస్పర విరోధమున్నదందురా? అట్లయిన [లక్షణామూలతచేత ప్రసిద్ధమగు] ఆయీవిరోధము - పదార్థములకు పరస్పరమగుఅన్వయమునందే-అంగీకరింపఁదగినదగును. అన్వయము తెలియఁబడనపుడు - విరోధముకూడ - తెలియఁబడునదికాదు. [''అన్వయము తెలియఁబడినపిమ్మటనే విరోధప్రతీతికలుగుఁగాక'' అనియందువేని] అన్వయజ్ఞానముగూడ - అభిధా వ్యాపారముచేతనగునదికాదు. ఏలయనిన; పదార్థప్రతీతిని గలిగించి క్షీణశక్తియయి, విరమించిన యభిధకు - మరల వ్యాపారముకలుగదు. కనుక - తాత్పర్యశక్తిచేతనే - అన్వయబోధకలుగవలయును.

ప్రభామతి :— ఒకప్పుడిచ్చట లక్షణనంగీకరించినను, అది - రెండవ కక్ష్యయందనుప్రవేశించి - తాత్పర్యశక్తికి సహాయము నొనర్చునదికాఁజాలదు. ముఖ్యార్థమునకు బాధయొదవునపుడుగదా లక్షణకు ప్రసక్తికలుగును; ముఖ్యార్థ బాధయనఁగా; ఇచట ['తిరుగకుము' అను నీయర్థమునకుఁగలుగునదియగు] విరోధప్రతీతియే - విశేషణభూతమగు నన్వయము - ముందు తెలిసిన తరువాత - విశిష్టమగు నర్థమునకు [విరోధమునకు] ప్రతీతిగలుగును. విశేషణభూతమగు నన్వయముముందు తెలియనపుడు దానివిరోధమును తెలియునదికాదు. ''పోనిండు-ఆయన్వయము తెలిసిన పిమ్మటనే విరోధప్రతీతి కలుగనిండు'' అని [లక్షణావాదులు] అనినను, లక్షణావ్యాపార ప్రసారబీజమగు నీవిరోధప్రతీతి - తాత్పర్యశక్తినుండి జనించును గనుక తాత్పర్యార్థ ప్రతీతికలిగినపిమ్మట కలుగవలసియుండును. కనుక ఉత్తరకాలీనమగు ముఖ్యార్థబాధకు - ద్వితీయకక్ష్యయగు తాత్పర్యశక్తియందు - అను ప్రవేశము కుదురనేరదు. అభిధ - అన్వయమును బోధింపఁజాలదు. కనుక తాత్పర్యశక్తిచేతనే, అన్వయబోధ కలుగఁదగును. బాధ నిశ్చయమున్నను, వాక్యజన్యమగు బోధ-కలుగునని తాత్పర్యము.

లోచనము : ప్రశ్న :— అయ్యా! అట్లయినయెడల-[బాధితమగు నన్వయముకూడ-వాక్యమువలన ప్రతీతమగును'' అని యంగీకరించునెడల] ''అంగు

శ్య్రగేకరివరశతమ్'' ''కం॥ వ్రేలిచివర నూఱేన్గులు'' అను నీప్రయోగమునందుఁ గూడ - అన్వయము - ప్రతీతము కావలసివచ్చునేః

ఉత్త :— 'దశదాడిమాదివాక్యమునందువలె' [ఇచ్చటఁగూడ] అన్వయ ప్రతీతి కలుగదాయేమి ?

ప్రభామతి :— అన్వయమునకు విరోధనిశ్చయమున్నను, వాక్యజన్య మగు బోధము కలుగవచ్చును.

దశదాడిమాని, షడపూపాః, కుణ్డమ్, అజాజినమ్, పలలపిణ్డమ్........
పదిదానిమ్మలు, ఆరప్పములు, వంటకుండ, మేకతోలు, మాంసపిండము....

అని మహాభాష్యమునందు అసంబద్ధార్థకమగు వాక్యసముదాయముదాహ రింపఁబడినది. ''ఆకాంక్షాదులు లేకుండుటవలన - ఈవాక్యసముదాయమువలన విశిష్టమగు నొకయర్థమేదియు ప్రతీతముకాదు.'' అని తెలుపుటకే శ్రీపతంజలి-వీని నుదాహరించెను. ఈదశదాడిమాది వాక్యమునందు - అన్వయ ప్రతీతికలుగనట్లు- ''వ్రేలిచివర నూఱేన్గులు'' అను నీవాక్యమునందుఁగూడ - అన్వయప్రతీతి కలు గనిదికాదు. 'వేలుచివర నూఱేన్గులు ండ'వను నిశ్చయమున్నను- ఇచట-ఆకాంక్షా దులుండుటవలన అన్వయము - ప్రతీతమే యగుననిభావము.

అవ :— అయిన నొకవిశేషమున్నదనుచున్నాఁడు.

లోచనము :— [''వ్రేలిచివర నూఱేన్గులు'' అను వాక్యమునందన్వ యము-ప్రతీతమగుచున్నది] కాని, ఆయన్వయము-తెలియఁబడినను, [తదుపరి] శుక్తియందు [తోచిన] రజితమువలె, ప్రత్యక్షాదికమగు ప్రమాణాంతరముచేత - బాధింపఁబడును, కనుక, ఇట్లు బాధితాన్వయమును బోధించునదియగు ''వ్రేలి చివర నూరేన్గులు'' అనువాక్యము - ప్రమాణము - (మాత్రము) కాదు.

ప్రభా :— ''వ్రేలిచివర నూఱేన్గులున్నవి'' అను వాక్యమునందు - అన్వయ ప్రతీతికలిగినను, వ్రేలిచివరయను నాధారమునందు, నూఱేన్గులను నాధేయమునకునికి - సంభవింపదు. కనుక భ్రాంతిచేత ముత్తెపుఁజిప్పయందుఁ దోచిన వెండివలె- తదుపరి ప్రత్యక్షాది ప్రమాణభేదముచేత - ఈయన్వయము - బాధితమగును. కనుక నీవాక్యము - ప్రామాణ్యముగలది - కాదు.

అవ :— ''అట్లయినయెడల దీనివలెనే ''మాణవకుఁడు సింహము''

అను వాక్యముగూడ - ప్రమాణముకానిది కావలసివచ్చునే'' అని యాశంకించి - 'అవాక్యము ప్రమాణముకానిదికాదు' అని విశేషమును దెలుపుచు, లక్షణావ్యాపారము - తృతీయకక్ష్యయందు నివేశింపఁబడుననుచున్నాఁడు.

లోచనము :— ''మాణవకుఁడు సింహము'' అనుస్థలమునందు-ద్వితీయ కక్ష్యయందు నివేశింపఁబడిన తాత్పర్యశక్తిచేత - సమర్పిత [బోధిత] మగు అన్వయమును బాధించు [విరోధించు] నది సముల్లసించిన తరువాత - ఆయన్వయమును బాధించుదానిని [బాధకశక్తిని] విధురీకరించు [బాధించు] సామర్థ్యము గలదియు, అభిధా తాత్పర్యశక్తులకంటె నతిరిక్తముగునదియు' ''లక్షణ'' అను నభిధానముగలదియు, అగు తృతీయశక్తియే - సముల్లసించును.

ప్రభా :— ''ఇచట వ్యాపారములు - మూడున్నవి'' అని మీఁదఁజెప్పఁబడిన విషయము - నిర్వహింపఁబడినది.

అవ :— ''లక్షణను తృతీయ కక్ష్యానివిష్టనుగా నంగీకరించునెడల - అదియే-కావ్యవ్యవహార ప్రయోజకమగునని యాశంకించి-నిరాకరించుచున్నాఁడు.

లోచనము : పూర్వపక్షి :— అయ్యా! [''లక్షణ -తృతీయకక్ష్యయందుండును'' అని] అంగీకరించునెడల- [ఆలక్షణా ప్రయోజనమును ప్రకాశింపజేయుటకై] ఇచటఁగూడ - ధ్వననము [ధ్వని] అను నాత్మయుండునని ''నాలుగవ కక్ష్యయందు'' అను దానిచేత మీరీవెనువెంటనే చెప్పనున్నారు. కనుక [లాక్షణికమగు] ''ఈవటుఁడు సింహము'' అనునదికూడ - కావ్యము కావలసివచ్చును.

సిద్ధాంతి :— అట్లయినయెడల [లోకులు] కుండనుగూడ - జీవుఁడని వ్యవహరింపవలసివచ్చును. [ఏలనిన;] ఆత్మ - విభువు. [వ్యాపకము] కనుక - కుండయందుఁగూడ - ఉండునుగదా!

పూర్వపక్షి :— [కరచరణాద్యవయవములతోడను, చక్షురాదీంద్రియములతోడను,] విశిష్టమగు, అధిష్ఠానముతోఁగూడిన శరీరమునందే - ఆత్మయుండునప్పుడే, ''జీవుఁడు'' అను వ్యవహారము కలుగును గాని, [తదితరమునందు] ఏదోయొకదానియందు జీవుఁడనువ్యవహారము కలుగునదికాదు.

సిద్ధాంతి :— ఇట్లే, [రసానుగుణ] గుణాలంకారౌచిత్య సుందరములగు శబ్దార్థములను కావ్యశరీరమునందే - ధ్వననమను కావ్యాత్మ యుండునప్పుడే-

కావ్యమను వ్యవహారము ప్రవర్తించును, ఎచ్చటనున్ననుగూడ- "ఆత్మకు-అసారతయేదియుఁగూడ - లేదు" అనునదికూడ - [జీవాత్మకువలె కావ్యాత్మయగు ధ్వననాత్మకుఁగూడ] సమానమే.

ప్రభా :— "ఆత్మ- నిస్సారమగు ఘటాదికమునందున్నను, అసారము కానిచందమున. కావ్యాత్మయగుధ్వనికూడ - లౌకికమగు లాక్షణిక ప్రయోగము నందున్నను, అసారముకాదు" అనిభావము.

పూర్వ :— అయ్యా; మీరుచెప్పుచున్న ధ్వని-అభిధకంటెను, తాత్పర్యశక్తికంటెను, వేరయినను, లక్షణాశక్తికంటె వేరుగా నిరూపింపఁబడుటలేదు. లక్షణావిషయమగు "వటుఁడు - సింహము" అనుచోట, మీరుకూడ - ప్రయోజనరూపమగు నర్థము [వ్యంగ్యము] నంగీకరించుచున్నారు. లక్షణ [భక్తి]కంటె వేరుగా ధ్వననమను వ్యాపారమును నిరూపించుట-ఎవ్వరికైనను శక్యముకానిది. కనుక "భక్తియే - ధ్వని" అని ధ్వనివాదులుగూడ నంగీకరింపుఁడు!

సిద్ధాంతి :— సాలోచనమగు లోచనమున, తత్త్వము సమీక్షించిన సహృదయులకు మాధ్వనన వ్యాపార - నిరూపణము-నేత్రనిమీలనముకంటెను, పుష్పావచయనముకంటెను, గూడ - సుకరమని తెలియును. చూడుఁడు! మీశంకయు, పరిహారమును, లోచనమునందున్నవి :

లోచనము : పూర్వ :— అట్లయినచో [లక్షణాస్థలమునందే ధ్వనన ముండినయెడల] భక్తియే - [లక్షణయే] ధ్వని, కాఁగూడదా ?

సిద్ధా :— కాఁగూడదు. "భక్తి" అనునది - లక్షణావ్యాపారముగదా, అది - తృతీయ కక్ష్యయందు- ప్రవర్తించునది. [మేముచెప్పిన] ధ్వననవ్యాపారమన్ననో, నాలుగవ కక్ష్యయందు ప్రవర్తించును.

అదెట్లనిన :— ["ముఖ్యార్థబాధ, సామీప్యాదినిమిత్తము, ప్రయోజనము" అను] "త్రితయసన్నిధియందు [అవి - సహకారులగునపుడు] లక్షణ - ప్రవర్తించును" అని [లక్షణా, ధ్వనన, వ్యాపారములు వేరుకావనువారగు] మీరే - చెప్పుదురుగదా! అందు - ముఖ్యార్థబాధ-[గంగయందు గొల్లపల్లె ఇత్యాదులందు] ప్రత్యక్షాదులగు ప్రమాణాంతరములచేతఁ దెలియఁబడునదియే. సామీప్యాది నిమిత్తముగూడ - ప్రమాణాంతరావగమ్యమే. [ప్రత్యక్షాది ప్రమాణాంతరములచేతఁ దెలియనగునదియే.]

ప్రభా : అవ : లక్షణాబీజములు- మూడున్నవిగదా! అందుమొదటి దగు ముఖ్యార్థబాధయు, రెండవదగు సామీప్యాదికమును, ''గంగయందు గొల్ల పల్లె'' ఇత్యాది లక్షణాస్థలములందు, ప్రత్యక్షముగనే తెలియఁబడునుగాని శబ్ద బోధ్యములుకావు. మూడవదగు ప్రయోజనముమాత్రము- శబ్దవ్యాపారముచేతనే గమ్యమగును. కనుక దానిని స్వరూపకథనముతోఁగూడ చెప్పుచున్నాఁడు.

లోచనము :— ఇఁక, గొల్లపల్లె [మున్నగువాని] యందుఁగలదియగు, అతిపవిత్రత్వము, శీతలత్వము, సేవ్యత్వము, మున్నగునదియగు ప్రయోజనము మాత్రము - [శబ్దాతిరిక్త - ప్రత్యక్షాది] ప్రమాణాంతరముచేత - వేద్యముకాదు. [వాచక, లాక్షణిక] శబ్దాంతరవాచ్యము [గూడ] కాదు.

ప్రభామతి :— అతిపవిత్రత్వము మున్నగు ప్రయోజనము - తీరము నందేకాక,తీరద్వారమున-గొల్లపల్లెయందునునుండును. కనుక''గొల్లపల్లెయందుఁ గలదియగు'' అని చెప్పఁబడియెను,

ఈప్రయోజనముమాత్రము-ప్రత్యక్షాదులచేతఁ దెలియఁజేయఁబడునదికాదు. శబ్దవ్యాపారమాత్రముననే తెలియఁజేయఁబడును. ఆశబ్దవ్యాపారములలోఁగూడ- వాచకశబ్దవ్యాపారమగు నభిధయు, లాక్షణికశబ్దవ్యాపారమగు లక్షణయుఁగూడ- ప్రయోజనమును దెలుపఁజాలునవి-కానేరవు. కాఁగా! వ్యంజకశబ్దమునందుండునది యగు, వ్యంజనావ్యాపారమే - ప్రయోజనమును - స్ఫురింపఁజేయును.

లోచనము : — ఇట్లే; [ఈవటుఁడు - సింహము'' అనుచోట] వటు వునందున్న 'పరాక్రమాతిశయ శాలిత్వము' అను ప్రయోజనముగూడ- ప్రమా ణాంతర వేద్యముకాదు. శబ్దాంతర వాచ్యమునుగాదు, [వ్యంజనావ్యాపారముచే తనే స్ఫురింపఁజేయఁబడును.]

ప్రభా : పూర్వపక్షి :— అయ్యా! ప్రయోజన విషయమున ప్రత్యక్షాది ప్రమాణముపయోగింపదు, అట్లే శబ్దమేదియు, నుపయోగించునదికాదు. కనుక, ధ్వనివాదులు శబ్దమునకింకొక వ్యాపారమును (వ్యంజనను) గవేషించుట- అనా వశ్యకము.

ఈ ప్రయోజనము - అనుమానగమ్యము కావచ్చునేమో పరిశీలింపుడు

లోచనము :— పూర్వోక్తమగు ప్రయోజన విషయమున శబ్దమునకు

వ్యాపారము - లేకపోలేదు. [కనుక ప్రయోజనప్రతీతి - అనుమానగమ్యము కాదు.] అదెట్లనిన :— "గంగకు సమీపమునందుండుటవలన, తీరము, దాని ధర్మమును [పవిత్రత్వాదికమును] గలిగియుండును." అను ననుమానము - అనైకాంతికము. [వ్యభిచారముగలది.] వటువునకు సింహశబ్దవాచ్యత్వముగూడ- అసిద్ధము - [స్వరూపాసిద్ధము.]

ప్రభా : పూర్వ :— ప్రయోజనప్రతీతి - అనుమానగమ్యము కారాదా ?

సిద్ధా :— కారాదు. అదెట్లనిన :—

"తీరము-గంగాగత, అతిపవిత్రత్వాది, ధర్మవంతము.
గంగకుసమీపమునందుండుటవలన.
తీరగత తరులతాదికమువలె."

అను నీయనుమానము గంగాతటాదిగతమగు శిరఃకపాలమునందు వ్యభిచారముగలదియగుచుండునుగదా. ఇట్లే,

"వటువు - సింహధర్మవంతుఁడు.
సింహశబ్దవాచ్యుఁడుగనుక.
లోకప్రసిద్ధసింహమువలె."
అనుచోట-సింహశబ్దవాచ్యత్వరూపమగు హేతువు స్వరూపాసిద్ధముగదా !

అవ : — వేఱొక యనుమానము నాశంకించి - నిరాకరించుచున్నాఁడు.

లోచనము : పూర్వ :— "ఎచ్చటనెచ్చట - ఇట్లు [భాక్త] శబ్దప్రయోగ ముండునో, అచ్చటనచ్చట - తద్ధర్మయోగము [వాచ్యవృత్తి పవిత్రత్వాది ధర్మ సంబంధము] ఉండును" అని, ఇంకొక యనుమానము నొనర్పరాదా ?

సిద్ధా :— ఈ యనుమానమునకుఁ గూడ - [వ్యాప్తిగ్రహణ కాలము దయించునప్పటికి] మౌలికమగు [మూలమగు - అనఁగా, వ్యాప్తిగ్రహప్రయోజకమగు] ప్రమాణాంతరము [ప్రత్యక్షాదికము. అనఁగా; ప్రత్యక్షము, ఉదాహరణము] చెప్పవలసియుండును. ఆప్రమాణాంతరము [ప్రత్యక్షాదికము - ఇచట ] లేదు. కనుక వ్యాప్తితెలియదు. వ్యాప్తితెలియనియెడల - అనుమానము కుదురునదికాదు.

ప్రభా :— "ఏది - లక్షణచేత - యత్ పద ప్రయోగవిషయమో,
అదితత్ పదవాచ్యవృత్తి ధర్మవంతము"

అనునది యుచటివ్యాప్తిప్రయోగము.
కాఁగా "గంగయందు గొల్లపల్లె" - అనుచోట,

తీరము - గంగాదిశబ్దవాచ్య [ముఖ్యార్థ] వృత్తి ధర్మవంతము.
లక్షణచేత - గంగాశబ్దప్రయోగ విషయము గనుక,

అనియు,

"మాణవకుఁడు - సింహము" అనుచోట,
మాణవకుఁడు - సింహశబ్దవాచ్యవృత్తి ధర్మవంతుఁడు.
లక్షణచేత - సింహశబ్దప్రయోగ విషయుఁడు గనుక.

అనియు,

అనుమాన ప్రయోగముల నెఱుఁగునది.

దీనికివ్యాప్తిని [హేతుసాధ్యములకు విడువరాని కలయికను] గ్రహించుకాలము దయించుసరికి, దానికిమూలమగుచు దానిని స్థిరీకరించునది యగు [ప్రత్యక్షము, ఉదాహరణము అను] ప్రమాణాంతరము లేదు. కనుక వ్యాప్తి తెలియఁబడునదికాదు. వ్యాప్తితెలియనియెడల ననుమానము కుదురదు. గాఁగా; ప్రత్యక్షము, అనుమానము. అను ప్రమాణములు- ప్రయోజనమును ప్రతీతమొనర్పఁ జాలునవికావు" అనునది ఫలితార్థము.

అవ :— "పవిత్రిత" మున్నగునదియగు, ఈ ప్రయోజనజ్ఞానము - పర్యాలోచనాత్మకము. ఈపర్యాలోచన-స్మృతియేయగును. పూర్వవిజ్ఞానసంస్కారమాత్రజమగు జ్ఞానము - 'స్మృతి' యని చెప్పఁబడునుగదా! కనుక స్మృతియే - ప్రయోజనమును గోచరింపఁజేయును. అని యాశంకించి, నిరాకరించుచున్నాఁడు.

లోచనము : పూర్వ :— [పవిత్రితమున్నగునదియగు] ఈ ప్రయోజన జ్ఞానము - స్మృతి [గోచరము] కాఁగూడదా?

సిద్ధా :— ఇది-స్మృతి [గోచరము] కూడ - కాదు. వెనుక ననుభవింపఁ బడని యీప్రయోజనము - స్మృతికెట్లు గోచరించును. [అనుభవింపఁబడకున్నను స్మృతి గోచరముకావచ్చును. అని] స్మృతికి - పూర్వానుభవమును నియామకము గా నంగీకరింపనియెడల; వక్త-'దీనినే వివక్షించె'నన్నినిశ్చయించుటకు వీలుకలుగు నదికాదు. [కనుక ప్రయోజనము - స్మృతి గోచరముకాదు.]

ప్రభా : అవ :— ప్రయోజనము - ప్రత్యక్షానుమాన స్మృతులకు గోచ రింపదని మీఁద చెప్పఁబడినది. "ఇప్పుడుపారిశేష్యమున సిద్ధమగు శబ్దవ్యాపారమే

ప్రయోజనమును స్ఫురింపఁజేయును'' అని నిగమించుచున్నాఁడు.

లోచనము :— [ప్రయోజనము-ప్రత్యక్షానుమానస్మృతి గమ్యముకాదు.] కావున [పవిత్రత్వాది రూపమగు] ఈ ప్రయోజన విషయమునందుఁ బ్రవర్తించునది - [ఇఁక మిగిలిన] శబ్దవ్యాపారమేయగును. అభిధకు - ప్రయోజనమునందు సంకేతములేదు. కనుక,శబ్దసంబంధియగు నావ్యాపారముకూడ- అభిధారూపము, కాదు. తాత్పర్యశక్తి - అభిధావ్యాపారముచేత బోధింపఁబడిన పదార్థములకు వాక్యార్థరూపమగు నన్వయమును బోధించి, పరిక్షయము నొందును. కనుక ప్రయోజనమును స్ఫురింపఁజేయునదియగు శబ్దవ్యాపారము - తాత్పర్యరూపము- కాదు. గంగాదిపదము - పూర్వోక్తమగు ముఖ్యార్థబాధాది హేతువులవలన [తన వ్యాపారమగు లక్షణచేత-తీరాద్యర్థము - లక్షింపఁజేయఁ దగియుండునపుడు] స్ఖలద్గతియగును. [స్వార్థమగు ప్రవాహాదిరూపమునుండి భ్రంశమునొందును.]

ఈ గంగాదిపదమే - ప్రయోజనము స్ఫురింపఁజేయఁ దగియుండునపుడు - స్ఖలద్గతి - కాదు. కనుక నీప్రయోజనము నవగమింపఁజేయునపుడు - శబ్దమునకు సంబంధించిన వ్యాపారము-లక్షణారూపముకాదు. ''ప్రయోజన విషయమునందుఁ గూడ - [గంగాది] శబ్దము. స్ఖలద్గతియేయగును.'' అని యంగీకరించునెడల తిరుగ ముఖ్యార్థబాధను, నిమిత్తమును, ప్రయోజనమును, స్వీకరింపవలసివచ్చుట వలన - అనవస్థకలుగును.

ప్రభా :— మొదట - తీరాద్యర్థమును లక్షింపఁజేయుటకు, ముఖ్యార్థ బాధాదిత్రయము ననుసరింపవలసియున్నదిగదా! తదుపరి, పావనత్వాది రూపమగు ప్రయోజనమును బ్రకాశింపఁజేయుటకుఁగూడ- తిరుగ, వీనిననుసరింపవలసి వచ్చును. ఇట్లు మరలమరల, వీనిననుసరింపవలసి వచ్చుటవలన - మూలక్షయకారిణి, యగు 'అనవస్థ' యన్నగు దోషము కలుగును. కనుక, ప్రయోజన విషయమున శబ్దము - స్ఖలద్గతియగునని యంగీకరింపఁదగదు.

లోచనము : [అట్లు - అనవస్థాదులు కలుగును] ''కనుకనే [ప్రయోజనవిషయ వ్యాపారమునకు] ''లక్షిత లక్షణ'' అని ఒకానొకనిచేత - పెట్టఁబడిన పేరు - వ్యసనమాత్రమే'' అగును.

ప్రభా : పూర్వ :— ప్రయోజనప్రకాశకమగు శబ్దవ్యాపారము-లక్షణ కాదు. ఇంతేమనిన; అది - ''లక్షితలక్షణ''. లక్షణచేత - లక్ష్యార్థమగు తీరాదికము

లక్షితమగును. లక్షిత లక్షణచేత - ప్రయోజనము - ప్రకాశితమగును.'' అని యింకొక లాక్షణికు నభిమతము నేలస్వీకరింపఁదగదో చెప్పఁగోరెదను.

సిద్ధా :— ఇది 'వ్యసనమాత్రమే.' అనఁగా; 'ధ్వనిధ్వంసన, నిరవగ్రహ, దురాగ్రహ, విలసితమే' అనియర్థము. ''లక్షితలక్షణ'' అనునది నామమాత్రమే. వస్తుతః, ఇది వ్యంజనావ్యాపారమేయగును. వేరొకపేరు పెట్టినంతమాత్రమున పరునికిఁ గలుగు ప్రయోజనమేదియులేదు. ప్రయోజనము - లక్షిత లక్షణకు విషయముకాదు.'' అని కూడ - ముందు - చెప్పఁబడును.

ధ్వ న న వ్యా పా ర ము

లోచనము :— కావున, అభిధ, తాత్పర్యము, లక్షణ, అను వ్యాపారములు మూడింటికంటెను వేరయినదియు, నాలుగవదియు; నగు ఈ [ప్రయోజనావగమక] శబ్దవ్యాపారము-ధ్వననము, ద్యోతనము, వ్యంజనము ప్రత్యాయనము, అవగమనము, మున్నగు సోదరములగు [పర్యాయములగు] వ్యపదేశములచేత - [శబ్దములచేత]నిరూపింపఁబడినది- [అంగీకారములేనివారిచేతఁగూడ]అంగీకరింపఁదగియున్నది.

ప్రభా :— ''ప్రయోజన విషయమున లక్షణావ్యాపారములేదు'' అను నంశమున కారికాకారోక్తినుగ్గడించి, దృఢీకరించుచున్నాఁడు.

లోచనము :— కావుననే [కారికాకర్త] ముందిట్లు చెప్పను.

''ముఖ్యమగుచున్న వ్యాపారమును త్యజించి
గౌణమగువృత్తి నర్థమ్ముఁగనుట 'ఫలము
దేనికొఱకేర్పడెనొ,' దానిఁదెలుపునపుడు;
శబ్దగతికెట్లు స్ఖలనమ్ము సంభవించు ?''

ప్రభామతి - ఇట్లు ''ధ్వననవ్యాపారము - ప్రయోజనవిషయకము'' అని ప్రతిపాదించి - 'అది - తదితర వ్యాపారములకంటె వేరయినది,' అని స్ఫుటీకరించుటకు, వ్యాపారముల స్వరూపమును సంగ్రహముగాను- సులభముగాను, దెలుపుచున్నాఁడు.

లోచనము :— సంకేతగ్రహణమును సహకరించుకొని, వాచ్యమగు నర్థమునుబోధించు [పదనిష్ఠమగు] సామర్థ్యము-అభిధాశక్తి. [తానులేనిదే అభిధ

కుపయోగము సంభవింపదు కనుక] తదన్యథానుపపత్తిని [గోవును దీసికొని రమ్ము'' ఇత్యాదులగు క్రియలయందు గోత్వము మున్నగునదియగుసామాన్యము-వ్యక్తిరూపమగు విశేషములేనిదే యుపయోగింపకుండుటను] తోడుచేసికొని, అర్థములను సమన్వయించునదియగు శక్తి - తాత్పర్యశక్తి.

ముఖ్యార్థబాధాది సహకారుల నపేక్షించి - అర్థమును ప్రతిభాసింపఁజేయునదియగుశక్తి - లక్షణాశక్తి. ఈశక్తులు మూడిఁటిచేతను - పదార్థ, వాక్యార్థ, లక్ష్యార్థముల, జ్ఞానము - ఉపజనితమగునప్పుడు; అజ్ఞానము మూలమున జనించినదియు, తత్ప్రతిభాసముచేత - [కావ్యాదులయందు ధ్వన్యమానమగు ఆయర్థమును నిరంతరముగా ననుసంధించుటచేత] పవిత్రితుఁడయిన [సంస్కారాతిశయవిశిష్టుఁడయిన] సహృదయ జ్ఞాతయందుండునదియు, నగు ప్రతిభను - సహాయముగాఁజేసికొని, [ప్రయోజనాదిరూపమగు] అర్థమును ధ్వనింపఁజేయునదియగు శక్తి - ధ్వననవ్యాపారము.

ప్రభా :— అభిధచేత - పదార్థమును, తాత్పర్యశక్తిచేత-వాక్యార్థమును, లక్షణచేత - లక్ష్యార్థమును, ఏర్పడును. కాని ఈయర్థముల నెఱిఁగినంతమాత్రముననే, జ్ఞాతయందు ప్రతిభ - సమున్మేషించునదికాదు. ఈయర్థములు - పౌనఃపున్యమగు కావ్యాభ్యాస సంస్కారముగల సహృదయుఁడగు జ్ఞాతయందుఁగల ప్రతిభనుదయింపఁజేయును. సహృదయునికి సంబంధించిన పరామర్శాత్మకమగు ప్రతిభను సహకరించుకొనిన వ్యంజకశబ్దము - ప్రమాణాంతర వేద్యముకాని దగు ప్రయోజన రూపమగు నర్థమునవగమింపఁజేయును. "వ్యంజకమగు నీశబ్దమునందలి శక్తియే - వ్యంజనాది నామములుగలదియగు ధ్వనన వ్యాపారము." అని తెలియనగును.

అవ :— "ప్రయోజన రూపమగు ధ్వన్యర్థమే - కావ్యాత్మ" అని చెప్పుచున్నాఁడు.

లోచనము - ఇదియే - తనకంటె పూర్వము ప్రవర్తించిన వ్యాపారత్రయమును ధిక్కరించుటవలన [అప్రధానముగాఁ జేయుటవలన] ప్రధానమగుచున్నది. [ఇట్లు] ప్రధానమగుటవలన - కావ్యాత్మయగుచున్నది.

ప్రభా : ప్రశ్న :— వ్యంగ్యము- కావ్యాత్మ. కనుక వ్యంజనముకూడ-కావ్యాత్మగాఁదెలుపఁబడినది.

అవ :— ఇట్లుమీరు "సంచరింపుము ధార్మిక" అనుచోటఁగూడ-అభిధాతాత్పర్యములు ప్రవర్తించినపిమ్మట, లక్షణనంగీకరించుటవలన, "భ్రమింపకుము"

అనునది-లక్షణకే విషయమగును. భ్రమణనిషేధముకంటె వేఱగు ప్రయోజనము-[సంకేతస్థాన పరిత్రాణము, స్వచ్ఛందవిహరణము, మున్నగునది.] వ్యంజనకు విషయమగును. అని, చెప్పవలసివచ్చును. అట్టిచో వృత్తికారుఁడు - వ్యంజనను నిషేధవిషయకముగాఁ జెప్పుట సముచితమా ?

లోచనము : ఉత్త :— ఈ యాశయముచేతనే [ఇచ్చటనున్న ధ్వననము] ప్రయోజన విషయమైనను, ఆ ప్రయోజనము-నిషేధప్రతీతి ద్వారకమగుట వలన - నిషేధ [విషయ] ముగాఁ జెప్పఁబడినది.

ప్రభా :— మీఁదిగాథార్థమున, స్వైరిణి - "తన సంకేతస్థానమును రక్షించుకొనుట, స్వచ్ఛందముగా విహరించుట" అను ప్రయోజనము నుద్దేశించి-భ్రమణనిషేధము నొనర్చినది. ఈ ప్రయోజనప్రతీతి - భ్రమణనిషేధప్రతీతిని, ద్వారముగాఁ గలిగియుండుటవలన - లక్ష్యమగు భ్రమణనిషేధమే-ఇచట వ్యంగ్యమని, చెప్పఁబడినదిగాఁ దెలియునది. పూర్వోక్తమగు ప్రయోజనము - నిషేధ ప్రతీతి కలిగిన తర్వాతనే స్ఫురింపజేయఁబడును. కనుక నిషేధరూపముగాఁ జెప్పఁబడినది. ఇచట నిట్లు ప్రయోజన రూపమగు నీవ్యంగ్యము - నిషేధరూపము కాకున్నను, నిషేధరూపముగాఁ జెప్పఁబడుటవలన - 'ధ్వననము' - తదితరములను పరాభవించుచు కావ్యాత్మయగును." అనిసిద్ధించును. అను నభిప్రాయమున వృత్తికారుఁడిట్లు చెప్పెనని తెలియునది.

అవ :— "సంచరింపుము" అనుచోట - పరాభిమతము ననుసరించి, లక్షణనంగీకరించి, ఇట్లు విపరీత లక్షణచేత - భ్రమణనిషేధము - లక్ష్యముగాఁ జెప్పఁబడినది కాని, ఇచ్చట లక్షణ కావశ్యకతయేలేదు" వృత్తిగ్రంథమునఁ జెప్పఁబడినట్లు - భ్రమణ నిషేధము - ధ్వనిరూపమేగాని, లక్ష్యముగాదు" అనిచెప్పుచున్నాఁడు.

లోచనము :— అభ్యుపగమ మాత్రముచేత - [ప్రౌఢివాదము కొఱకు, మాత్రమే] ఇచట విపరీత లక్షణచేత - భ్రమణనిషేధరూపమగు నర్థము-లక్షితమనునిది-చెప్పఁబడినది. కాని, యిచ్చట ["సంచరింపుము" అనుగాథాస్థలమునందు] లక్షణావ్యాపారములేదు. ఏలయనిన; ఇచట వాచ్యమునకు - అత్యంతతిరస్కారము, అర్థాంతర సంక్రమణము, లేవుగదా!

ప్రభా :— వాచ్యము - పూర్ణముగాఁ దిరస్కరింపఁబడునపుడు గాని, అర్థాంతరమునందు సంక్రమించునపుడుగాని, లక్షణ - ప్రవర్తించును. ఇచ్చట

''సంచరింపుము'' అను విధిరూపమగు వాచ్యార్థము- అత్యంతతిరస్కృతముగాని, అర్థాంతర సంక్రమితముగాని, కాదు.

అవ : ప్రశ్న :— పోనిండు! ఇచట ధ్వని - అర్థశక్తిమూలమేకానిండు! అచ్చట లక్షణప్రవర్తింపదాయేమి ? అనినఁజెప్పుచున్నాఁడు.

లోచనము : ఉత్త :— అర్థశక్తిమూలమగు ధ్వనియందు - ఈ లక్షణకు వ్యాపారము [పని] లేదుగదా! సహకారి భేదమువలనఁగూడ - శక్తిభేదము - స్పష్టమే.

ప్రభా :— అర్థశక్తిమూలమగు ధ్వనన వ్యాపారమునకు - వక్తృబోద్ధవ్య, వైశిష్ట్యాదికము - సహకారి. లక్షణకు ముఖ్యార్థబాధాదికము - సహకారి. ఈకారణమువలనఁగూడ - ఇవి-భిన్నములేయగును. సహకారి భేదమువలన-పదమునకుగల శక్తులు - వేర్వేరుగా నేర్పడును. కనుక, ఒకశబ్దమే - సహకారి భేదమున, భిన్నములగు అభిధా, తాత్పర్య, లక్షణా, వ్యంజనాశక్తులుగలిగి - వాచకము, తత్పరము, లక్షకము, వ్యంజకము, అని వ్యవహరింపఁబడును.

లోచనము :— ఏశబ్దమునకు, వాచ్యార్థమునందు- అభిధాదివ్యాపారము లుండునో, ['గోవును దీసికొనిరమ్ము' ఇత్యాదికమగు] ఆశబ్దమే - వ్యాప్తి, స్మృత్యాదులను - సహాయముగాఁజేసికొని, వక్తృవివక్షనూహింపఁ జేయునపుడు - 'అనుమాపకము' అని వ్యవహరింపఁబడును. అనుమాపకశబ్దమునందుండునది యగు వ్యాపారము - [శక్తి] - అనుమాపకత్వము.

ప్రభా :— ఈయంశము - తృతీయోద్ద్యోతమునఁ జెప్పఁబడును.

లోచనము :— చక్షురాదీంద్రియ సన్నికర్షాదులను సహకరించుకొనిన శబ్దము -'వికల్పకము' అని చెప్పఁబడును. ఈవికల్పకశబ్దము నందుండునదియగు వ్యాపారము - వికల్పకత్వము - [సవికల్పకజ్ఞానజనకశక్తి] - అనిచెప్పఁబడును,

ప్రభా :— ఇప్పుడు - ''అభిధాదివ్యాపారత్రయమున, వానినుత్తరించిన ధ్వనన వ్యాపారమును - అభిహితాన్వయవాదులంగీకరింపకతీరదు'' అని ఫలితార్థమును ముగించుచున్నాఁడు.

లోచనము :— ఇట్లు - ''అభిధాది విలక్షణమగు ధ్వనివ్యాపారము-

కలదు. అనునంశము- అభిహితాన్వయవాదులకు - అపహ్నవనీయముకానిదై యున్నది. [నిరాకరింపరానిదని భావము]

పరీక్షా :— ఇట్లు - అభిహితాన్వయవాదులను - నిరుత్తరులనొనర్చి - అన్వితాభిధానవాదులుగూడ - దీనినంగీకరింపకతీరదని నిరూపించుటకు తదభిమతమునుపన్యసించుచున్నాఁడు.

— • అన్వితాభిధానవాది పూర్వపక్షము • —

లోచనము :— అన్వితాభిధాన వాదియో,

''యత్పరః, శబ్దః, సశబ్దార్థః''

''ఏశబ్దమునకు - ఏయర్థము తాత్పర్యవిషయమగుటవలన ప్రధానముగా ప్రతిపాద్యమో; ఫలితమగు నాయర్థమే - శబ్దార్థము'' అను నభిప్రాయమును హృదయమునందు గ్రహించును. కనుకనతఁడు - 'అభిధావ్యాపారమే - బాణము వలె, దీర్ఘదీర్ఘమగుచుండును' అను నభిమతముఁ గలిగియుండును.

పరీక్షా :— ''ధనుర్ధరునిచేత - వింటినుండి విడువఁబడినబాణము - శత్రునికవచమును ఛేదించుట, శరీరమును ఛేదించుట, ప్రాణమును హరించుట, అనువానిని [వ్యాపారములను] - వేగమను నొకేవ్యాపారముచేతనే - సాధించునట్లు, సుకవిప్రయుక్తమగు శబ్దముగూడ - పదార్థ, వాక్యార్థ, లక్ష్యార్థ, [భవదభిమత] వ్యంగ్యార్థములను, అభిధయను నొకేవ్యాపారముచేతనే - బోధించును'' అనునది - అన్వితాభిధానవాది మతము.

అవ :— ఇట్లు, అన్వితాభిధానవాది మతమునుదెలిపి, అది - సిద్ధింపదని, నిరూపించుటకు, ''నీవు - దీర్ఘదీర్ఘమగుననిన వ్యాపారము - ఒకటా ? లేక [విషయమునుబట్టి] అనేకమా ? అని ప్రశ్నించి - 'ఆవ్యాపారమొకటి కానేర' దనుచున్నాఁడు.

లోచనము :— ''దీర్ఘదీర్ఘమని చెప్పఁబడిన, [అభిధయను] వ్యాపారము- ఒక్కటియే'' అనునది - కుదురనేరదు. ఏలయనిన, విషయములు [పదార్థము - వాక్యార్థము, లక్ష్యార్థము- వ్యంగ్యార్థము,] భిన్నములుగదా !

పరీక్షా :— పదార్థ స్ఫూర్తి మొదలుకొని, వ్యంగ్యార్థ స్ఫూర్తివఱకును ప్రవర్తించునదియగు వ్యాపారము - ఒకటేయనుట - సిద్ధింపదు. విషయభేదముండునపుడు, తత్సంబంధి [విషయి] వ్యాపారభేదముగూడ - ఆవశ్యకమే

యగును. కనుక "దీర్ఘదీర్ఘమగు నభిధా వ్యాపారమొక్కటియే" అనునది - తగనిమాట.

అవ :— "అనేకమా ?" అని ప్రశ్నించి, నిరాకరించుచున్నాఁడు.

లోచనము :— "ఆవ్యాపారములు - అనేకములు" అని యందురా ? అట్లనినయెడల విషయభేదమువలనను, సహకారిభేదమువలనను, ఆవ్యాపారములు - సజాతీయములుకాక - విజాతీయములేయగుననుట యుక్తము.

ప్రభా :— వాచ్య, లక్ష్య, వ్యంగములను విషయములు- [అర్థములు] భిన్నములు. సమయ, ముఖ్యార్థబాధాది, వక్తృవైశిష్ట్యాదులను, సహకారులు - భిన్నములు, ఇట్లు విజాతీయములగు విషయములును- విజాతీయములగు సహకారులును, గలవియగుటవలన, శబ్దమునందుండునవియగు వ్యాపారములుగూడ - విజాతీయములేయని యంగీకరింపకతప్పదు.

అవ :— ఆ వ్యాపారములు - సజాతీయములనునెడలనొదువునది యగు దోషమునుజూపి, "అవి - విజాతీయములే" అని సాధించుచున్నాఁడు.

లోచనము :— శబ్దము, కర్మము, బుద్ధి, మున్నగుకొన్ని పదార్థములకు ఒకకార్యమునఁబ్రవర్తించి,విరమించిన పిమ్మట మరలసజాతీయమగు వ్యాపారము. పదార్థ [తత్త్వ] విదులచేత- [నైయాయికులచేత] నిషేధింపఁబడినది. కనుక, శబ్దమునందు సజాతీయమగు అనేకవ్యాపారము - అంగీకరింపఁదగినదికాదు. విజాతీయమగు [అనేక] వ్యాపారము నంగీకరించునెడల - అదిమామతమే యగును-

ప్రభామతి : అన్వితాభిదానవాది, పూ :- "అయ్యా! - ఒకేవ్యాపారము చేత - బాణము - అనేకకార్యముల నొనర్చునట్లు - ఒకే [అభిధా] వ్యాపారము చేత - శబ్దముగూడ - అనేకములగు నర్థములను ప్రకాశింపఁజేయును." అని చెప్పఁదగదా ?

వ్యంజనావాది-సి :— చెప్పఁదగదు. బాణమునందుఁగూడ- వేగమొక్కటియే - కార్యమును నిర్వహించునది కానేరదు. ఒకవేగము - రెండుక్షణములే యుండును. తదుపరి నింకొక వేగముదయించి కార్యమును నిర్వహించును.

అన్వి. పూ :— ఇట్లే - శబ్దమునందుఁగూడ- ఏకజాతీయములగు అనేక

వ్యాపారములు,[రెండు,మూడు] ఉదయించి-అనేకములగు నర్థములను భాసింపఁ జేయునని యేలచెప్పఁదగదు ?

వ్యంజనావాది,సి :— బాణమున కనేకములగు వేగ వ్యాపారము లున్నను, ''శబ్దము, కర్మము' బుద్ధి, మున్నగు పదార్థములు కొన్నిటికి, విర మించినపిమ్మట, మరల-సజాతీయమగు వ్యాపారముండదు''అని పదార్థతత్త్వవేదు లగు శ్రీమన్నైయాయికులు చెప్పుదురుగదా? కాఁగా: ఒకేశబ్దమునందుండు నవి యగు వ్యాపారములు - భిన్నవిషయములగునవి - సజాతీయములుకావు. కనుక నీవుగూడ, నవి - విజాతీయములని చెప్పవలయును. అట్లు నీవంగీకరించినయె డల, అది మామతమేయగును ''శబ్దమునందు - భిన్నములగు నర్థములను దెలుపు నవియగు విజాతీయ వ్యాపారములు - అభిధ, తాత్పర్యము, లక్షణ, వ్యంజన, అనునవి-కలవు'' అనియేగదా మాసిద్ధాంతము.

అవ :— ''శబ్దనిష్ఠమగు ఒకేవ్యాపారము - స్వరూపముతోనుండి అనే కములగు నర్థములను బోధింపఁజాలదు. శబ్దనిష్ఠములగు సజాతీయములగు ననేకవ్యాపారములుగూడ - అనేకములగు నర్థములను బోధింపఁజాలవు.'' అని నిరసించి, ఇంకొక పూర్వపక్షమునుద్భావించి, దూషించుచున్నాఁడు.

లోచనము :— అన్వితాభిధానవాది, పూర్వ :— ''నాలుగవ కక్ష్య యందు [లేక చివరికక్ష్యయందు] ఉండునదియగునర్థమే - వాక్యముచేత-ఝటితి [చట్టున] అభిధేయమగును.'' అనునదియే-మేము వివక్షించిన దీర్ఘ దీర్ఘత్వము.

ప్రభా :— పూర్వ :— ''అయ్యా: బాణమువలె, అభిధావ్యాపారమే - దీర్ఘ దీర్ఘమగుచుండును.' అనుచోట - అభిధావ్యాపారమునకు మేముచెప్పిన- దీర్ఘ దీర్ఘత్వము - ఏకత్వముగాని, ఏకజాతీయత్వముగాని, కాదు. ఇంతేమనిన, ప్రతిపాదింపవలసిన యర్థమును చట్టున స్ఫురింపఁజేయుటయే. కాఁగా; ''వ్యంగ్య మభిధకే విషయమగును.'' అనునది మాయభిమతము.

సి :— అది-సరికాదు. క్రిందిలోచనమును జూడుఁడు.

లోచనము :— ఆ [చివరి] యర్థమునందు-శబ్దమునకు సంకేతకరణము లేదు. కనుక, సంకేతము నపేక్షించునదియగు నభిధ - దానిని [చివరి యర్థ మగు వ్యంగ్యమును] సాక్షాత్తుగా నెట్లుచెప్పును ? [సంకేతము నపేక్షించునభిధ- వ్యంగ్యమును జెప్పనేరదు.]

ప్రభా :— చివరి కక్ష్యయందున్న వ్యంగ్యార్థము - సంకేతగోచరముకాదు. కనుక, అభిధయే - దానిని స్ఫురింపఁజేయుననుట - సంగతముకాదు.

అవ : – "పదార్థ, వాక్యార్థములకు - నిమిత్త, నైమిత్తికభావము - అంగీకృతముగదా॥నిమిత్తభూతములగుపదార్థములయందు సంకేతగ్రహణమున్నది. కనుక, అంత్యవాక్యార్థవిషయకమగు సంకేతము నపేక్షింపకయే - అభిధావ్యాపారము - చేతనే - ఆయంత్యవాక్యార్థ ప్రతీతికలుగఁగూడదా?" అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము : అన్వి, పూ :— నిమిత్తములయందు సంకేతమున్నది. కనుక నైమిత్తికమగు నీయర్థము [వ్యంగ్యార్థము] సంకేతమునపేక్షింపనిదియే యగును.

సిద్ధా :— అహా॥ శ్రోత్రియుని [ఛాందసుని] వచనకౌశలమెట్లున్నదో చూడుఁడు॥ చివరికక్ష్యను భజించునదియగు నర్థము - [నైమిత్తికము] మొదటఁ దెలియుననియు, దానికి, తరువాతివియగు పదార్థప్రతీతులు - దానికి నిమిత్తములగుచుండుననియుఁ జెప్పుచున్నాఁడు. ఇది - [నైమిత్తికమగు]- 'మీమాంసకునకు వానిమునుముఁడు నిమిత్త'మని యంగీకరించినట్లున్నది.

అన్వి - పూర్వ :— మొదటనచట, సంకేతగ్రహణముండును. తత్సంకేత గ్రహణజనిత సంస్కారముగల వ్యక్తికి - చివరియర్థమట్లు స్ఫురించును వస్తుస్థితి యిట్లుండుటచేత - పదార్థములు నిమిత్తములగుట సంభవించును.

సిద్ధా :— అట్లయిన, పార్యంతికార్థవిషయమగు ప్రతీతి ననుసరించుటయందు [స్వమతమున నిర్వహించుటయందు] ఉపయోగించునది [నిమిత్తము] ఇంచుకయు మీరుచెప్పినట్లు కానేరదు.

ప్రభా : సి :— సంకేతమును గ్రహించినవ్యక్తికి - అభిధచేత - సంకేతిత పదార్థజ్ఞానమే కలుగును. కాని, అసంకేతితమగు చివరియర్థము [వ్యంగ్యము] తెలియఁబడునదికాదు. అట్లు తెలియుననుట - అతిప్రసంగమేయగును.

అవ :— మొదట - పదార్థములందు సంకేతగ్రహణముకూడ - సంఘటింపదనుచున్నాఁడు.

లోచ : సిద్ధా :— మఱియు [అన్వితాభిధానవాదులగు మీమతమునందు]

అన్వితములకే [అన్వయమునొందిన యర్థమును బోధించునవియగు, అనఁగా, వాక్యత్వమునొందిన, పదార్థములకే] ఎప్పుడును, ప్రయోగనియమముండును. కనుక, ముందుగా పదార్థములయందు సంకేతమును గ్రహించుటకూడ - సంఘటిల్లునదికాదు.

ప్రభా :— అన్వితాభిధానవాదులు - "పదములు-వాక్యరూపమున నన్వితములగు నర్థములను దెలుపును." అనిచెప్పుదురు. కనుక, పదములకు - వేర్వేరగు ప్రాతిస్వికార్థములందు [ప్రత్యేకములగు పదార్థములయందు] ప్రయోగనియమము - లేకుండుటవలన- అన్వయప్రతీతికంటె ముందు - పదార్థములయందు సంకేతమును గ్రహించుటకు వీలుపడునదికాదు.

లోచనము : అన్వి, పూర్వ :— ఆవాపోద్వాపములచేత (స్వీకార తిరస్కారములచేత] వేర్వేరగు [ప్రత్యేకములగు] పదార్థములయందు సంకేత గ్రహణము కలుఁగవచ్చునే !

ప్రభా :— ప్రయోగాంతరములయందు, భిన్నభిన్నములగు పదములకు ప్రత్యేకార్థములయందు సంకేత గ్రహణము సులభమేయగునే! అని దీనిభావము.

లోచ : సిద్ధా :— [అపుడు] సామాన్యరూపమగు పదార్థమాత్రము నందే-సంకేతము నంగీకరింపవలయును. కనుక, విశేషార్థప్రతీతి - తరువాతిదే యగును.

అన్వి - పూర్వ :— తాత్పర్య [పార్యంతికార్థ] ప్రతిపత్తి. అతిశీఘ్రముగాఁ జూడఁబడుచున్నది. దీనిక మీరుగాని, మేముగాని, ఏమిచేయుదుము ?

సిద్ధా :— ఆయీశీఘ్రప్రతీతిని - మేముకూడ నంగీకరింపనివారలము కాము. ముందీవిషయము నిట్లు చెప్పనున్నాము.

ప్రభా : అప :— "మొదటిదగు పదార్థ, వాక్యార్థాది ప్రతీతులకును, చివరిదగు వ్యంగ్యార్థప్రతీతికిని, పౌర్వాపర్యరూపమగు [ప్రతీతి] క్రమముండిన యెడల, ఆక్రమమేల తెలియఁబడకుండును ?" అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— అయినను. చివరియర్థముయొక్క ప్రతీతియందు క్రమము

సంభావ్యమానమైనను, తెలియఁబడునదికాదు. [విజ్ఞులగు సహృదయులు] సాతిశయమగు [కావ్యాత్మ] పర్యాలోచనాభ్యాసముఁగలిగియుందురు. కనుక నాయభ్యాసమువలన [వాక్యార్థప్రతీతికి] సజాతీయములగు తద్వికల్పముల [పదార్థాది విషయకములగు జ్ఞానముల] పరంపరయుదయింపదు. కనుక, అభ్యస్తములగు [పునః పునః పర్యాలోచితములగు] విషయములయందు [ధూమాది హేతువునందును, గవాద్యర్థమునందును,] వ్యాప్తిస్మృతి, సంకేత స్మృతులకు క్రమముండియు, తెలియఁబడనట్లు, పార్యంతికమగువ్యంగ్యార్థప్రతిపత్తికిని [తత్పూర్వక్షణవర్తులగు] పదార్థాది ప్రతీతులకునుగల [పౌర్వాపర్యరూపమగు] క్రమము - సంభావ్యమానమైనను, [ప్రమాణముచేతఁ దెలియఁజేయఁబడుచున్నను] తెలియఁబడునదికాదు.

ప్రభా :— వహ్న్యాదిసాధ్యవ్యాప్తిస్మృతికిని, అనుమితికిని, క్రమముండియు, తెలియఁబడనట్లును, గవాది పదసంకేత స్మృతికిని, అనుమితికిని, క్రమముండియు, తెలియఁబడనట్లును, చివరిదగు వ్యంగ్యార్థప్రతీతికిని, మొదటివగు పదార్థాదిప్రతీతులకును, క్రమమున్నను, [కావ్యానుశీలనాభ్యాసమువలన, చివరియర్థము వడిగా స్ఫురించుటవలన] తెలియఁబడకుండును.

అవ :— ''తెలియఁబడని క్రమము-ఉన్నది'' అనుట నిర్మూలమేమో'' అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— కావున [సామాన్య, విశేషప్రతీతులకు కార్యకారణ భావ నిశ్చయమువలన] ప్రాథమికార్థ ప్రతీతులకును, పార్యంతికార్థప్రతీతికిని, నిమిత్తనైమిత్తిక భావము నవశ్యముగా నాశ్రయింపవలయును: అట్లుకానియెడల [అభిధయే - చివరియర్థమువఱకును, పరుగెత్తుననినయెడల] గౌణ, లాక్షణికార్థములు గూడ - ముఖ్యార్థముకంటె భిన్నములగుట సంభవించునదికాదు.

ప్రభా : అవ :— ఇట్లిచట, నిమిత్తనైమిత్తిక భావము నంగీకరింపనియెడల, లౌకికమగు శాబ్దవ్యవహారము మాత్రమేకాక, వైదికమగు వ్యవహారమర్యాదకూడ - పర్యాకులమగు ననుచున్నాఁడు.

లోచనము :— శ్రుతి, లిఙ్గాది ప్రమాణషట్కమునకు పారదౌర్బల్యమును జెప్పుట మున్నగు ప్రక్రియకూడ - భ్రష్టమగును. ఏలయనిన: ఇది-[లౌకిక వైదిక శబ్దప్రమాణప్రక్రియ ] నిమిత్తతయందలి వైచిత్ర్యము [భేదము] చేతనే - సమర్థింపఁబడును. నిమిత్తతయందగువైచిత్ర్యము నంగీకరించునెడల [వ్యాపార భేదమునుగూడ నంగీకరింపవలసియుండును. కనుక] మాయెడల నసూయయేల?

ప్రభా :— "నిమిత్తతావైచిత్ర్యము నంగీకరింపని యెడల, "శ్రుతి, లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలలో - ఉత్తరోత్తర ప్రమాణములు - ప్రబలములగు - పూర్వపూర్వ ప్రమాణములకంటె దుర్బలములు" అని చెప్పినదియగు మీమాంసక [వైదిక] ప్రక్రియకు దెబ్బతగులును. నిమిత్తనానాత్వము నంగీకరించునప్పుడే - ఈప్రక్రియ నమర్థింపఁదగినదగును. దానిని మీరంగీకరించు నెడల; అభిధయే - చివరియర్థమువఱకును పరుగిడునని చెప్పుట - కుదురదు' కనుక వ్యంజనను గూడ మీరంగీకరింపవలసివచ్చును. అట్లంగీకరించునెడల; మాయందీయసూయ - మీకు సముచితము కానేరదు" అనిభావము.

— స్ఫోటవాది నిరాసము —

లోచనము :— "అవిభక్తమగు [అఖండమగు] స్ఫోటమే - వాక్యము, తదర్థము, గూడ నగుచుండును" అని యెవ్వరు [వైయాకరణులు] చెప్పుదురో, వారుకూడ - అవిద్యాపద [వ్యవహారమార్గ] పతితులైయుండు నంతవరకును, [మాచేతనెనుకఁ దెలుపఁబడిన] ఈప్రక్రియను సర్వమునుగూడ ననుసరింపవలసియే యుండును. ఆయవిద్యనుండి, యుత్తీర్ణులగునప్పుడో - "సర్వమునుగూడ - పరమేశ్వరాద్వయమగు బ్రహ్మమే" అనునది - "తత్త్వాలోకము" అను గ్రంథమును విరచించిన అస్మచ్ఛాస్త్రకారునికి[బ్రహ్మవిద్యాపూర్ణుడగు ఆనందవర్ధనునికి] తెలియనిదికాదు.

— భట్టనాయకమతము - దానిఖండనము —

లోచనము :— "సంచరింపుము" అనుగాథయందు, దృప్తసింహాదిపద ప్రయోగమువలనను, ధార్మికపద ప్రయోగమువలనను, కలిగిన భయానకరసావేశముచేతనే-"సంచరింపకుము" అనునిషేధము తెలియఁబడును. దృప్తసింహమునందు వీరత్వము, ధార్మికునియందు భీరుత్వము, అనునవి - నియతములగు న్వభావములైయున్నవి. తత్ప్రకృతినియమము తెలియనిదే, వేరొకకారణముచేత [వ్యంజనావ్యాపారమాత్రముచేత] "సంచరింపకుము" అను నిషేధము తెలియఁబడదు. కనుక కేవలమగు నర్థసామర్థ్యము- నిషేధావగతికి నిమిత్తముకాదు" అని భట్టనాయకునిచేతఁజెప్పఁబడినది.

ప్రభా :— "ఇచటనిషేధప్రతీతి - భయానక రసావేశకృతమేగాని, అర్థసామర్థ్యమాత్రమొక్కదానిచేతనే - కృతమగునదికాదు. సింహాదులు - భయానకరసాలంబనములుగా ప్రసిద్ధములు. కనుక, 'దృప్తసింహ'పదములవలన-ఇచట

నాయాలంబనము తెలుపఁబడినది. ధార్మికపదముచేత - జ్ఞాతకుఁగల భయశీలత - తెలుపఁబడినది. కనుక, భయోత్పత్తి సామగ్రి - ఇచట సమున్మీలితమైయున్నది. కనుక, నిషేధావగతికి, భయానకరసావేశమే - ప్రధాననిమిత్తమగుచున్నది. అర్థ సామర్థ్యము - సహకారియేయగును.'' అనునది భట్టనాయకుని యభిప్రాయము.

అవ :— ధ్వనివాది - ప్రత్యుత్తరమునిచ్చుచు, అవిరుద్ధమగు నంశము నంగీకరించి - విరుద్ధమును నిరసించుచున్నాఁడు.

లోచనము :— దీనికిది సమాధానము. వక్తృవిశేషమును, జ్ఞాతృవిశేషమును, దెలియకయు, శబ్దగతమగు వ్యంజనావ్యాపారమును స్వీకరింపకయు, ఇచట - భ్రమణనిషేధము తెలియునని యెవరన్నారు ?

ప్రతిభా :— ''ఈ పలుకు పలికినది - సంకేతస్థాన పరిరక్షణోత్సుకయు, కామినియునగు స్వైరిణి. ఏతత్ ప్రతిపత్త [జ్ఞాత] - భయశీలుఁడు'' అని తెలియకయు, వ్యంజననాశ్రయింపకయు, ''సంచరింపకుము'' అనునర్థము స్ఫురించునని మేమన్నామా ? అతఁడిట్లు పలుకుటకు.

లోచనము :— ''వ్యంజనకు-ప్రతిపత్తృప్రతిభా సహకారమే-ప్రాణము'' అని మేమును చెప్పియున్నాము.

[ఇఁక రసావేశ మెవరికి జనించుననిన ;—] బోద్ధవ్యుఁడగు ధార్మికునకు భయమాత్రము జనించును. కాని, రసావేశము కలుఁగదు. సహృదయునకు మాత్రము - రసమభివ్యంజితమగును. [కానిజనింపదు.] రసాభివ్యక్తిచేతనే - సహృదయుఁడగు జ్ఞాతకు రసావేశము కలుగును. ఆరసముగూడ [బోద్ధవ్యుని యందు భయముదయించునట్లు సహృదయునియందు జనించునదికాక] వ్యంగ్యమే యగును. రసము శబ్దవాచ్యమనియతఁడు [భట్టనాయకుఁడు]కూడ, నంగీకరింపఁడు గనుక, రసము - వ్యంగ్యమే [వాచ్యముకానిదే] యగును.

ప్రతిభా : ప్రశ్న :— ప్రతిపత్తయగు సహృదయునకు - [భయానక] రసాభివ్యక్తివలె [భ్రమణ] నిషేధావగతికూడ కలుగఁగూడదా ?

లోచనము :— ప్రతిపత్తకుఁ [జ్ఞాతయగు సహృదయునకుఁ] గూడ - [భయానక] రసావేశము - నియతము [అవినాభూతము] కాదు. ఈ సహృదయుఁడు - భీరువగు ధార్మికునివంటివాఁడే యగునను నియమము లేదుగదా !

ప్రభా :— భట్టనాయకుఁడు కూడ - అభిధకంటె వేఱగు భావకత్వ వ్యాపారముచేత-రసముభావ్యమానమనిచెప్పెను. కనుక, రసమువ్యంగ్యమనునది-యత్నసాధ్యముకాదు. సహృదయులలో - నొకానొకఁడు - ధార్మికునివంటి భీరుఁడైనను గావచ్చును. గాని, యందఱునుగూడ-భీరులుకారు. వీరులుకూడనుందురు. కనుక నట్టివారికి భయానక రసావేశము కలుగదు. కనుక సహృదయునకు రసావేశము - నియతముకాదు. అయినను, వానికిఁగూడ నిషేధము స్ఫురించుననుట-సమంజసముకాదు,

లోచనము : పూర్వ :— "ప్రతిపత్తృవిశేషము [భీరువగు ధార్మికుని వంటి సహృదయుఁడు] కూడ - [భయానకాది రసాభివ్యక్తియందు] సహకారి యగును." అని కల్పింపఁగూడదా ?

సిద్ధా :— అట్లంగీకరించునెడల-వక్తృప్రతిభచేతను, ప్రతిపత్తృ ప్రతిభ చేతను, అనుప్రాణితమగు ధ్వనన వ్యాపారమును మీరేల సహింపఁగూడదు ?

పరిభా : అవ :— ధ్వనివాది - "ఓపూర్వపక్షీ ! నిషేధావగతి - రసావేశకృతము" అను నీయపసిద్ధాంతము నంగీకరించినను, నీకు ప్రయోజనములేదు. చూడు ! - నీవిట్లుచెప్పుట - (1) ఇచట "రసధ్వనియే యున్నది" అనుటకా ? (2) లేక, వస్తుధ్వనికంటె నిచటరసధ్వనికే ప్రాధాన్యమును సమర్థించుటకా ? (3) లేక, యిచట రసధ్వనికూడ నుండుటవలన దీనిని వస్తుధ్వనిమాత్రముగా నుదాహరించుట సంభవింపదనుటకా ? ఇందు "రసధ్వనియే యున్నది" అనుటకు వీలుపడదు. లోచనమునఁజూడుము.

లోచనము :— మఱియు నిచట వస్తుధ్వనిని దూషించుచున్న నీచేత - తదనుగ్రాహకమగు రసధ్వని - సమర్థింపఁబడుచున్నది. కనుక [నీవొనర్చిన] ధ్వనిధ్వంసము చాల బాగుగానున్నదే ! ఇది "క్రోధోఽపిదేవస్యవరేణ తుల్యః" "దేవుని కొదవిన కోపముకూడ - వరముతో తుల్యమైనది". అనునట్లున్నది.

ప్రభా :— భయానక విభావాదులను దెలుపునదియు, భయానక రసావేశశక్తిని సహకరించుకొనినదియు, నగు అభిధచేతనే - యిచట భ్రమణనిషేధము తెలుపఁబడునను నభిప్రాయమున 'వస్తుధ్వని యిచటలేదు' అనిచెప్పుచున్న భట్టనాయకునిచేత - ఇచట రసధ్వని సమర్థింపఁబడినది. ఆరసధ్వని - వస్తుధ్వని కనుగ్రాహకమేయగును. వస్తుధ్వని - అనుగ్రాహ్యమై యున్నది. ఇచట వస్తుధ్వనిని దూషించుటకు రసధ్వనిని సమర్థించుట - ఎట్లున్నదనఁగా, శాపముతోఁ దుల్యము

కాఁదగిన దేవునికోపము- వరముతోఁ దుల్యమైనట్లున్నది. కనుక "నీధ్వనిధ్వంసో ద్యోగము - మాకేయుపకారకమైనది." అని పూర్వపక్షి యుపహసింపఁబడుచు న్నాఁడని తెలియునది.

**లోచనము : పూర్వ :—** ఇంతవఱకును దెలిపినదానిచేత - రసమునకు ప్రాధాన్యమును దెలుపుటయే మాయభిమతము. [వస్తుధ్వనిని దూషించుట - మా యభిమతముకాదు]

సిద్ధా :— సరి. 'రసము - ప్రధానము' అను నంశము నిష్టపడని వాఁడెవఁడు ?

ప్రభా :— "రసధ్వని ప్రధానమగుటచేత- ఆత్మయనియు, వస్తు - అలంకార, ధ్వనులు - తత్పర్యవసానముగలవి. కనుక, అముఖ్యములనియు, మేమును జెప్పియేయున్నాము. కనుక వస్తుధ్వని - రసధ్వని కంగమనునది - మాకుఁగూడ, నభిమతమేయగును." అనిభావము.

లోచనము : పూర్వ :— వస్తుమాత్రమగు ధ్వనిగా దీనినుదాహరించుట యుక్తముగాదు" అనునది మా యభిమతము.

సిద్ధా :— అట్లయినను, ఇది- కావ్యోదాహరణము కనుక వస్తుధ్వనియు, రసధ్వనియుఁ, గూడ నిందుండనచ్చును. ఇట్లుండుటయందు దోషమేదియులేదు.

ప్రభా :— పూర్వ "ఇచట -వస్తుధ్వనినిగాని, రసధ్వనినిగాని, స్వీకరింప వచ్చునని ధ్వనివాది చెప్పినది - యుక్తముకాదు. రసధ్వనినే స్వీకరింపనగును. రసమే - సహృదయ హృదయాహ్లాదకారిగదా ;

లోచనము :— ఇచట - రసానువేధము [రసావేశము] లేనిదే సహృదయుఁడు సంతోషింపఁడుండువా ? అట్లయినను, ఇచట సహృదయహృదయ దర్పణమున భయానకరసావేశము కలుఁగునదికాదు. ఇంకేమనిన :— పూర్వోక్తనీతి ననుసరించి - సంభోగాభిలాషమునకు [ఉద్దీపన] విభావమగు సంకేతస్థానము యొక్కయు, తదుచితములును, విశిష్టములును, నగుకాకువు మున్నగు [కాకు విశేషములు. స్వరభంగాదులు- చేష్టలు, మొదలగు] అనుభావములయొక్కయు- సంవలనమువలన సహృదయునకిచట శృంగార రసావేశమే కలుగును.

ప్రభా : అవ : పూర్వ :— అట్లయినయెడల- శృంగార రసధ్వనియే,

ఇచట నంగియగును. దీనిని శృంగారధ్వని కుదాహరణముగా నొసంగక, నిషేధ రూపవస్తుధ్వని కుదాహరణముగా నొసఁగుట - సముచితమా ?

లోచనము :— రసము - అలౌకికము. కనుకను, తావన్మాత్రమున [రసస్వరూపమును నిరూపింపకయే, దీనినుదాహరించినంతమాత్రమున] తెలియఁ బడునదికాదు కనుకను, మొదట నిర్వివాదసిద్ధములును, వివిక్తములును, [భిన్నములును] అగు విధి, నిషేధములను ప్రదర్శించుట - సముచితమను నభిప్రాయమునను, [వృత్తికర్త - దీనిని రసధ్వన్యుదాహరణముగా నొసఁగక] వస్తుధ్వని కుదాహరణముగా నొసఁగెను.

ప్రభా :— ఈగాథ - రసధ్వని కుదాహృతిగా నొసఁగఁదగినదైనను, వస్తుధ్వని కుదాహృతిగా నొసఁగఁబడినది. రసధ్వనియే కావ్యాత్మగా ప్రతిపాదింపఁ దగియున్నను, దానిస్వరూపము లోకసిద్ధముకాదు. మఱియు. దాని స్వరూపమును పాఠకులకుఁదెలుపకయే - ఉదాహరణమాత్రము నొసఁగుటవలనఁ దెలియఁజేయఁ బడునదియుగానేరదు. కనుక మొదట లౌకికమగు వస్తుధ్వనిని - వాచ్యముకంటె భిన్నముగా ప్రదర్శించుటకు, వృత్తికర్త - దీనిని వస్తుధ్వని కుదాహరణముగా నుదాహరించెను. దీనివలన, "వాచ్యవ్యంగ్యములకుఁగల భేదము తెలియఁబడి - ధ్వనిసామాన్యము - నిర్వివాదసిద్ధమగునపుడు - రసధ్వనియు, ఉదాహరింపఁదగిన దగును." అనునది - వృత్తికారుని యభిమతమని తెలియునది. లౌకికమగు వస్తుధ్వనిని గుర్తించిన పిమ్మట - అలౌకికమగు రసధ్వనిని గుర్తించుట సులభమగును గదా ?

ప్రభా : అవ :-- ఇట్లు, భట్టనాయకవంతమును ఖండించి, ధ్వన్యాలోకమునకింతకు మునుపు "చంద్రిక" అనువ్యాఖ్యను రచియించిన ఒకపూర్వవ్యాఖ్యాత - ఈ యంశమునఁదెలిపిన యభిప్రాయము నుపహసించుచున్నాఁడు.

## —• చంద్రికాకార మత నిరసనము •—

లోచనము :— 'ధ్వనిని వ్యాఖ్యానించుట కుద్యమించి'- తాత్పర్యశక్తిని గాని, [సుగతమతానుగామి, నిగదితమగు] వివక్షాసూచకత్వమునుగాని, ధ్వననము - [వ్యాపారము] గాఁదెలిపిన మతముకూడ - మాహృదయము నాకర్షించునది కాలేదు.

ప్రభా :— "ధ్వనిని........ఉద్యమించి" అనునది పరిహాసవచనము.

ప్రవేశము నూహించుట కెట్లు వీలగును'? ఆకులుపూవులు లేకున్నను ప్రాణమైన దక్కును. కనుక నిల్లువిడువకుము'' అని భావము.

**(23)** మూలము :— ఒకచోట, వాచ్యమే - నిషేధరూపమైయుండ, వ్యంగ్యము - విధిరూపమైయుండును.

దీనికుదా :— బాటసారియొకఁడు గ్రామాంతరము వెళ్లుచు, బాటనడుమనున్న యొకచక్కని యింటివసారాయందు బసచేసెను. ఆయింటికోడలు - ప్రచలితశీల - చక్కనిది. మఱియు, తరుణి. ప్రోషితపతికగా నతనికిఁగనిపించినది. అతఁడామెతో "ఇచటనీరేయి వసింపఁగోరితి"ననినాఁడు. అతని యందచందములిమెకు నచ్చినవి. అతనికి తనయెడఁగలిగిన ఉబలాటమును గుర్తించి, సాభిప్రాయము గాను - అత్తగారును, తదితరులును గుర్తించి, సంశయింపకుండు నట్లుగాను - ఇట్లు - పలికినది.

తే॥ ఒడలెరుఁగ దిచ్చట శయించు నందునత్త,  
నేనొ, యిచటఁబరుందును, నీవొ; రేయి  
నంధుఁడవు, పాంథ! దివసకమందె, దీని  
చక్కఁగాఁజూడు 'పడకు మాశయ్యబందు'. (3)  
[నాశయ్యయందు]

లోచనము :— "అత్తా! ఏత్థణిమజ్జఇ, ఏత్థఅహం, దిఅసఅంపలోఏహి.' మాపహిఅరత్తి అన్ధఅ! సేజ్జాఏ మహణిమజ్జిహిసి [గాథాసప్తశతి శత7,గా 67.]

సంస్కృతచ్ఛాయ :— శ్వశ్రూ, రత్రనిమజ్జతి, [శేతే] అత్రాహం, దివసకం ప్రలోకయ! మాపథిక! రాత్ర్యంధ! శయ్యాయామావయోర్మాఙ్క్షీః. [శయిష్ఠాః.] [ప్రాకృతనిబద్ధమగు గాథయందు, "సేజ్జాఏమహ" అనియొక పాఠమును, "మహణఅకే" అనునింకొకపాఠమును, గలవు] "మహ" అనునది [కుము] 'నా' అనునర్థముగలదికాదు.] 'అనేకార్థ వృత్తి" [బహువచనాంతము.] అగు నిపాతము. కనుక "నాశయ్యయందుఁబడ కుము' అనునర్థము సముచితముకాదు. 'పడకుమాశయ్యలందు' అనునర్థమే -

సముచితమగును. ఇచట 'నాశయ్యయందుఁబడకుము'. అని విశేషించి [ప్రత్యేకించి] చెప్పుటయే - అత్తగారికిని, తదితరులకును, శంకాకారియగును. కనుక నప్పుడు - ప్రచ్ఛన్నముగాఁ దనశయ్యకుఁ జేరవచ్చునని అంగీకరించుట - కుదురదు.

[ప్రథామతి] "పడకు నాశయ్యయందు" అనితన్నువిశేషించిచెప్పునపుడు- ఎవ్వరికైనను, శంకకలుగకతప్పదు. "వీలుచూచికొని, నీవు నాశయ్యయందుఁ బరుండవచ్చును." అని తనయంగీకారము నిచట గూఢముగాఁ దెలుపుటయుఁ గుదురదు. అట్లు తెలుపనియెడలనది - సహృదయ చమత్కారియుఁ, గానేరదు.

[లోచ] సుందరాంగుఁడును, తరుణుఁడునగు] ఒకానొక బాటసారి - ఒకానొక తరుణిని [ఆకారచేష్టాది సన్నివేశముచేత] ప్రోషితపతికనుగా [పొరుగూర నున్న మగఁడుగల చిన్నదానినిగా] అవలోకించెను. చూచి చూచినంతనే, వాని హృదయమున మదనాంకురముదయించెను. ఆమె సౌందర్య, లావణ్య, విలాస చేష్టావిశేషములను మాటిమాటికిని జూచుటచేత నది ప్రవృద్ధమయ్యెను. ఆబాటసారి యభిలాషోద్వేగము నీప్రోషితపతికగుర్తించి "పడకుమాశయ్యలందు" అను వాచ్యమగు నిషేధద్వారమున - "నీవు వీలుచూచుకొని నాశయ్యయందు స్వేచ్ఛగాఁబరుండవచ్చును" అని వానికి గూఢముగు తన యంగీకారమును ధ్వనింపఁజేసినది. కనుక నిచట వ్యంగ్యమగు విధి - నిషేధాభావమే. ["నాశయ్యయందు మాత్రము, పరుండుట మానక్కరలేదు." అని నిషేధింపకుండుటయే] అగును. కాని, [తనతోడి కూటమికి] ప్రవర్తింపనివానిని [తనతోడిపొందునకు] ప్రవర్తింపఁజేయు స్వభావముగలది యగు నిమన్త్రణరూపము [ఆహ్వానరూపమగు నియోగము] కాదు, విధి - నియోగరూపమేయగునెడల, [ఆనాయికకు] సౌభాగ్యాభిమాన ఖండన ప్రసంగము సంభవించెడిని.

ప్రథామతి :— "పడకు మాశయ్యలందు" అని, వాచ్యమగు నిషేధద్వారమున - స్ఫురింపఁజేయఁబడినది - "నీవునాశయ్యయందు బరుండవచ్చును" అనునంగీకారమే యగుచున్నది. ఇది - నా,'సెజ్జకురమ్ము' అనిపిలుచునదియగు నియోగరూపమగు, విధి - కాదు. ఇంతేమనిన, 'నీవునాశయ్యయందుఁ బరుండుట మాననక్కరలేదు,'' అను నిషేధాభావరూపమేయగును. ఇట్లుచెప్పుట - 'నాశయ్యపైఁబరుండుము'' అను నియోగరూపమగు విధియే, - యగునెడల; ఈకాంత సౌభాగ్యాభిమానములేనిదని చెప్పవలసివచ్చును. కనుక, "ఇది - నిషేధాభావరూపమగు విధియే. అనఁగా, "పరుండవలదు" అని నిషేధింపకుండుటయేయగు విధియే - అనిభావము.

శీలమైనను, సౌభాగ్యాభిమానవతియగు నీతరుణి - "నాశయ్యయందు నీవు పరుండుము" అను నిమంత్రణరూపమగు [పిలుచుటయేయగు] విధిని - బాటసారికి ధ్వనింపఁజేసినది" అనుట - అయుక్తము. "నాశయ్యయందు నీవు పరుండుట కభ్యంతరములేదు." అని నిషేధాభావరూపమగు విధిని - బాటసారికి స్ఫురింపఁ జేసినది'. అనుటయేయుక్తము. అనునిది - దీనియందలి నిగూఢాశయముగా గ్రహింపనగును.

లోచనము :— 'పరుండుము' [పరుండవచ్చును.] అను వ్యంగ్యమగు భావమును, 'పరుండకుము' అనువాచ్యమగు తదభావమును సాక్షాద్విరోధము గలవి. కనుకనిచట "వాచ్యముకంటె వ్యంగ్యమువేరుగానున్నది'. అనునంశము స్పష్టమేయగు చున్నది. ఇచట భట్టనాయకుఁడొనర్చిన ధ్వని దూషణము - ధ్వని భూషణమే.

లోచనము :— "అభినయ విశేషముతోఁగూడిన "నేను" అనుపదము- ఆత్మావస్థను, [ఈ తరుణికొదవిన మదనావస్థను] దెలుపును గనుక, "పరుండ వచ్చును" అని, స్వాభిమతమును దెలుపు విధిరూపమగు నర్థముకూడ - [ధ్వని వాదులు - వ్యంగ్యమని తెలుపునవియగు నర్థముకూడ] శాబ్దమే" [వాచ్యమే.] అని భట్టనాయకుఁడనినది - యుక్తముకాదు. అట్లంగీకరించినను, [ఇచట - నేను అను] శబ్దమునకు "పరుండుము" అను విధిరూపమగు నర్థమునందు - సంకేత ములేదు. గనుక, "నేను" అను శబ్దమునకీయర్థము - సాక్షాదర్థము [వాచ్యము] కాఁజాలదు. కాకువు మున్నగువాని సహాయముగల యీశబ్దమువలన నీయర్థము సిద్ధించుననినయెడల; అప్పుడు మామతమునకు హానిలేదు. శబ్దమున - ధ్వనన వ్యాపారమేర్పడుటకు కాక్వాదుల సహాయమునే - మేమును ముఖ్యముగా నంగీ కరించియున్నాము. కనుక, భట్టనాయకుఁడిచట నొనర్చిన ధ్వని దూషణము [దైవగతిచేత] ధ్వనిభూషణమే యగుచున్నది.

ప్రశ్న :— కాక్వాదులలో - అభినయముగూడ నున్నదని తెలియునది.

అవ :— మీఁది గాథయందు - ఇట్లు, "వాచ్యముకంటె వేరగు వ్యంగ్య మున్నది" అని సిద్ధాంతీకరింపఁబడినది. కనుక, దానియందుగల పదములచేత స్ఫురింపఁజేయఁబడు వ్యంగ్యార్థములను వివరించుచున్నాఁడు. ఇందలిపదములను వీనిచేత స్ఫురింపఁజేయఁబడిన యర్థములను, ఇట్లెఱుంగునది.

లోచనము :— 'అత్త' అనుదానిచేత - "మనకిచట నొకశత్రువున్నది

గనుక; ఆమె ఒడలెఱుఁగక నిద్రించునదియైనను, ఒకికిడికి మేలుకొనవచ్చును గనుక, అనిభృతమగు [అనురాగోద్వేగముచేత ప్రకటమగునదియగు] సంభోగమును పరిహరించుటకు ప్రయత్నింపుము.'' అనువ్యంగ్యము - స్ఫురింపఁజేయఁబడినది. 'దివస' అను పదైకదేశముచేత - ''నీవుపాపము! మదనశరాసారవిదీర్యమాణహృదయుఁడవై యున్నావు గనుక, నిన్నుపేక్షింపఁదగదు. అయినను, నేనేమిచేయుదును!. ఇది - మనకు పగయైన పగలు. ప్రణయిజనాభిలషణీయ స్వచ్ఛందసురత మహోత్సవమునకు సముచితముకానిది. కనుక కుత్సితమైనది.'' అనునర్థము స్ఫురింపఁజేయుఁబడినది. దివసకమందే - అనుచోనున్న యజ్ఞార్థకమగు కప్రత్యయముచేత - ''ఈపగలు మనకు పగదై, యెంతోకాలముండునది కాదు. దీనినెట్లోగడుపుకొనవచ్చును''. అని స్ఫురింపఁజేయఁబడినది. ''చక్కఁగాఁజూడుము'' అనుదానిచేత - ''అట్లనిసర్వగా, నిన్నుపేక్షింపనులే! నేనెక్కడకిని వెళ్లను. ఇచ్చటనేయుందును. కనుక నన్నుఁజూచుచుండుము. 'మనమొకరినొకరు చూచుకొనుట' అను వినోదముచేత - [ఉపాయముచేత] ఈకొలఁది పగటినెట్లో గడుపుదుము''. అనునర్థము స్ఫురింపఁజేయ బడినది. 'రేయినంధుఁడవు' అనుదానిచేత ''ఇంచుక చీఁకటిపడగనే, ఒడలుతెలియక నాశయ్యయందుఁజేరకుము'' 'అత్త' అనుపేరుగల కంటకమునిదురించినదో, లేదో, గుర్తించుకొని మెల్లమెల్లగా నాపక్కకుఁజేరుము''. అని స్ఫురింపఁజేయఁబడినది.

(24) మూలము :— ఒకానొకచోట - వాచ్యము - విధిరూపమైయుండ - వ్యంగ్యము - అనుభయరూపమై [విధియు, నిషేధమును, గానిదై] యుండును. దీనికుదా :— [ఖండితనాయిక - యొకానొకతె - అన్యకామినీరక్తుఁడగు ప్రియుడు తనయొద్దకు వచ్చియుండ, నిట్లనుచున్నది.]

'చను'మీవు నిశ్వసన రో
దనములు నాకొక్కతికె యొదవనీ, ప్రియకా
మినినామెను విడుచుటచే
తనీకునివి యొదవనేల ? దాక్షిణ్యహతా ! (౮)

ప్రభా :— అన్యకాంతా సంభోగచిహ్నితుఁడగు ప్రియుఁడు-తన సన్నిధికి వచ్చునప్పుడు, ఈర్ష్యాకషాయితయగు నాయంగన - 'ఖండిత [నాయిక]' అని చెప్పఁబడును.

అన్యాంగనయందు బద్ధానురాగుఁడై, నిజకాంతయందు బాహ్యానురాగమును నటించుచు, గూఢమగు విప్రియమునొనర్చునతఁడు - ''శఠుఁడు'' అని చెప్పఁబడును.

మీఁది వాక్యమును బలికినది - ఖండితానాయిక. ఇట్టినాయికచేతఁబలుకఁబడినవాఁడు-శఠనాయకుఁడు. ''నీవిక వెళ్లు. ఈనిట్టూర్పులు - ఈయేడ్పులు - నాకేయుండనిమ్ము. నీకుప్రియురాలగు నాకామినినివిడిచి, ఏదోచుట్టరికపు చూపునకు నన్నుఁజూడవచ్చిన జాలిగుండె గలనీకుఁగూడ ఇవి- [పాపము! ఈనిట్టూర్పులు, ఏడుపులు,] ఏల ? అనునది యిందలి వాచ్యార్థము. ఇందు ''చనుము'' అనునది - వాచ్యమగు విధి.

లోచనము :— ఇచట 'చనుము' ['ఆమెయొద్దకే వెళ్లుము'] అనునది - వాచ్యమగువిధి. [ఇక ప్రతీయమానమిది :-] ''ఇంకొకనాయికతోడి సంగమము నీకు గాఢానురాగమువలననే కలిగినది. కాని, ప్రమాదమువలననే కలిగినదికాదు. కనుకనే; నీమొగమురంగు తీరుమారుటయు, గోత్రస్ఖలితము మున్నగునదియు, [ఆమెపేరున, నన్నుఁబిలుచుట మొదలగునదియు] నీయెడ సంభవించినవి. [దాక్షిణ్యహతా] పూర్వపు నడువడిని విడువకుండ, ననుసరించునదియగు దాక్షిణ్యము చేతను. నేను- ఎల్లప్పుడును, ఏకరూపుఁడనే[నీయందొక్కలాగుననున్నవాఁడనే] అనుసభిమానముచేతను మాత్రమే - నాయొద్దనుంటివి. [ఆమెయు,నేనును, భిన్నరూపములతోనున్నను-ఆమెయు, నేను, నొకరూపమున నుంటిమని ఆమెరూపమును నాయందారోపించుకొని నాయెదుట నుంటివి.] కనుక సర్వథా [ఎట్లు విమర్శించినను] శఠుఁడవైయున్నావు.'' అని యిచట - గాఢమన్యురూపమగు ఖండితనాయికాభిప్రాయము ధ్వనింపఁజేయఁబడినది. కనుకనిది - ''వెళ్లవలదు'' అను నిషేధముగాని, 'ఉండుము' అను విధిగాని, కాదు. [కనుక అనుభయరూపము,]

ప్రభా :— 'నీప్రవర్తనము - సముచితముకాదు. నీవుశఠుఁడవు''. అను ఖండిత నాయికాభిప్రాయమిచట వ్యంగ్యము. ''వెళ్ళుము'' అనుట- [వాచ్యము] ఈమెకభిమతముకాదుగదా ! ''చనవలదు'' అనిచెప్పుట - అన్యకాంతారక్తుడగు శఠునియెడల నుచితముకానిది. ఇంకొకతెయందు గాఢానురక్తుఁడగువాని'నిచట నుండుము' అనుట - ప్రయోజనశూన్యము. కనుక నిందలి వ్యంగ్యము - విధి, నిషేధము, అనునుభయరూపములును, కానిదైనది.కాఁగా, ''నీనడతమంచిదికాదు. నన్నిట్లేల బాధించెదవు''. అను ఖండిత నాయికకొదవిన కోపమిచట వ్యంగ్యము.

**(25)** మూలము :— ఇంకనొకచోట, వాచ్యము - నిషేధ రూపమగునపుడు, వ్యంగ్యము - అనుభయరూపమగుచుండును. దీనికుదా : —

గీ॥ మగువ! నినువేడెదఁ బ్రసన్నవగుచుమరలు,
మాన్య శశిచంద్రికా విలుప్తాంధకార
నికర! యన్యాభిసారికలకును నంత
రాయము నొనర్తువేల ? హతాశురాల ! (ఇ)
[స. శ. 944]

ప్రభా :— దీనికి మూలమగు ప్రాకృత శ్లోకమిట్లున్నది.

"దే, ఆ, పసిఅ, ణివత్తసు ముహససి జోహ్ణావిలుత్తతమణివహే
అహిసారి ఆణం విగ్ఘంకరోసి అణ్ణాణం విహాఆసే."

లోచనము :— ఇందు'దే' అనునది నిపాతము. 'ఆ' అనునది తావ చ్ఛబ్దార్థమునసున్నది. కనుక దీనియర్థము, [సంస్కృతచ్ఛాయ] ఇట్లుండును.

'ప్రార్థయే తావత్ ప్రసీద నివర్తస్వ
ముఖశశిజ్యోత్స్నా విలుప్తతమో నివహే !
అభిసారికాణాం విఘ్నం కరోష్యన్యాసామపిహతాశే!'

ఇచట, "పూనుకొనిన గమనమునుండిమరలుము" అనునర్థము ప్రతీతము. కనుక, 'వెళ్ళవలదు' అను గమననిషేధము-వాచ్యము. ఇది - దీనిసందర్భము. నాయకునింటికి వచ్చిన నాయిక. 'నాయకుఁడు - ఇంకొక కాంతపేరున తన్నుఁ బిలుచుట మున్నగు నపరాధము నొనర్ప, తానచ్చటనుండి మరలిచనుటకుద్య మించెను. అప్పుడు ప్రశంసోక్తి పురస్సరముగా నాయకుఁడామెను మరలించుట కనుచున్నమాటయిది :- "తరుణీ ! నీవు మరలిచనుటవలన నీకును, నాకును, మాత్రమే నిర్వృతి [సుఖ] విఘ్నము నొనర్చుచున్న దానవుకావు. నీవంటివారే యగు నభిసారికలకుఁగూడ సుఖవిఘ్నము నొనర్చుదానవగుచున్నావు. కనుక, నెప్పుడునుగూడ నీకించుకైనను, సుఖలాభము కలుఁగదు. కనుకనే, నీవుహతాశురాలవు! [నెరవేరని ఆశగలదానవు.]" అనునర్థము-ఇచట, వాచ్యమగుచున్నది.

కనుక నీవాచ్యార్థముచేత - ''నీకు సదృశురాలగు లావణ్యామృతతరంగిణియగు సుందరి - వేరొకతెలేదు.'' అనువల్లభుని యభిప్రాయరూపమగు చాటు విశేషము [నాయికయందలి యనురాగాతిశయమున నాయకునిచే నొనర్పఁబడిన నాయికా సౌందర్యప్రశంస] ఇచట వ్యంగ్యము. [ఇంకొకప్రకారముగల సందర్భముతెలుపఁ బడుచున్నది.] [అథవా] లేక, ప్రియతము నభిసరించుటకు - స్వగృహమునుండి వెడలవలదని ప్రియసఖి యుపదేశించినను, దానినివినక, స్వగృహమునుండి వెడలు చున్న యభిసారికనుజూచి - ఆసఖి - యిట్లనుచున్నది. ''నీముఖచంద్రికాకాంతుల చేత అంధకారసంచయము పటాపంచెలగుచున్నది. కనుక, తెలికతనముచేత - నీయాత్మనేనీవు బహుమానాస్పదముగాకుండఁ జేసికొనుచు, నీకొక్కతెకు మాత్రమే విఘ్నము నొనర్చుకొనుచున్న దానవుకావు. నీమోము వెన్నెలలచేత- బాటను [తళుకుమన్నట్లు] ప్రకాశింపఁజేయుటవలన, నితరులగు నభిసారికలకుఁ గూడ విఘ్నము నొనర్చుచున్నావు.'' అనునది వాచ్యము. దీనిచేత నిచట ''నీలా వణ్యము లోకోత్తరమైనది. ఏసుందరీమణులునుగూడ నీసరిరాఁజాలరు.'' అను సఖ్యభిప్రాయరూపమగు చాటు విశేషము వ్యంగ్యము. ఇట్లు ప్రదర్శింపఁబడిన వ్యాఖ్యానములు[ప్రథమ,ద్వితీయపక్షములు]రెండింటనుగూడ-''నీస్వగృహమునకు వెళ్ళవలయునను నిశ్చయమునుండి మరలుము. లేక, నీప్రియతమునింటికి వెళ్ళ వలయునను నిశ్చయమునుండి మరలుము.''[''నీయింటికి వెళ్లవలదు. లేక ప్రియ తమునింటికి వెళ్లవలదు.]'' అను వాచ్యమగు నర్థమునందే, ప్రథమ సందర్భము నందలివ్యంగ్యమునకును, ద్వితీయసందర్భమునందలి వ్యంగ్యమునకును, విశ్రాంతి కలుఁగును, కనుక, గుణీభూత [అప్రధానీభూత] వ్యంగ్యమునందలి భేదములగు, రసవదలంకారమునకుఁగాని, ప్రేయోఽలంకారమునకుఁగాని, మీఁదిగాథ - ఉదా హరణము కావలసివచ్చునుగాని, ధ్వని కుదాహరణముగాదు. కనుక దీనిసందర్భ మును, దీనియందలిభావమును [తృతీయపక్షముగా] నిట్లెఱుఁగనగును. పేని సందర్భమిది :—

ఒకానొక సుందరి - వడివడిగా ప్రియతమునభిసరింపుచుండెను. ఆమె హృదయవల్లభుఁడుకూడ - ఆమెయింటికే వచ్చుచుండెను. తనయింటికి వచ్చు చున్న ప్రేయసిని [ఆబాటనడుమను] గుర్తించిన ప్రేయసుఁడు ఆమెను గుర్తింప నట్లు మిషపెట్టి - ఇట్లాసుందరీమణిని ప్రశంసించుచున్నాఁడు. ''నీవెవతవోగాని, ముఖచంద్రజ్యోత్స్నచేత చీఁకటిగుంపులను తరుముచున్న లలితాంగివి'' అని.

ప్రభా : పరీక్ష :— అయ్యా ! అభిసారికయగు నాయిక - రహస్యము

గానభిసరణము నొనర్చునపుడు, ఆ ప్రియవల్లభుఁడెదురుపడి; ఆమాటనతఁ డిట్లు, ఉపశ్లోకించుట సముచితమా ?

ఉత్త :— ఆమెను తాను గుర్తింపనట్లు మిషపెట్టుటవలన, ఇట్లుపశ్లోకించుట సముచితమేయగును. తరువాతి లోచనమును జూచునది.

లోచనము :— ఇది - ప్రశంసారూపము. కనుకనే, ఆమెచేత - తనను గుర్తింపఁజేసికొనుటకే; ఇతఁడు 'హతాశుహాల' అను నర్మవచనమునుపయోగించెను. "ఇతరులగు నభిసారికలకును, నీయింటికి వెళ్ళుచున్న నాకునుగూడ - విఘ్నమును కలిగించుచున్నావు, నీకుఁగూడ నభీప్సితలాభము కాఁగలదను ప్రత్యాశ యెక్కడిది ?" అను నీయర్థము - దీనిచేత, వాచ్యమగుచున్నది. ఈవాచ్యార్థము చేత - నాయింటికివచ్చెదవా ? లేకనీయింటికి వెళ్లుదమా ? ఏమిచేయుదము ? అని ఉభయత్రకూడ - గమననిషేధమునందుఁగాక, [అనిశ్చితరూపమగు] గమనము నందలి తాత్పర్యముండుటవలన అనుభయరూపమును, చాటురూపమును, నగు 'వల్లభాభిప్రాయమే' - ఇచట వ్యంగ్యమని వ్యవస్థాపింపఁబడుచున్నది

ప్రభా :— శృంగారాదిరసము - తదితరమగు వాక్యార్థమునకంగమగు నపుడు - అది గుణీభూతవ్యంగ్యమగు రసవదలంకారమగును. అట్లే, నిర్వేదాది భావముగాని, దేవతాదివిషయమగు రతిగాని, ప్రధానమగు తదితరమునకంగ మగునపుడు - అది - గుణీభూతవ్యంగ్యమగు ప్రేయోలంకారమగును. ప్రథమ సందర్భమననుసరించి, ఇది - "తనయింటినుండి వెడలుచున్న అభిసారికతో నామెయందు రతిగల నాయకుఁడనుచున్నమాట" అని యనునెడల, అప్పుడిది - గుణీభూతవ్యంగ్యమగు రసవదలంకారమునకే ఉదాహరణమని చెప్పవలసివచ్చును. ద్వితీయ సందర్భమననుసరించి, ఇది - సఖీవచనమను పక్షమున - ఈసఖికి నాయికయందుఁగల రతియను భావము-వ్యంగ్యమగును. ఈసఖిపలికినపలుకులు-అనుభావములగును. ఈయనుభావరూపమగు నర్థద్వారమున, "ప్రియతమునింటికి వెళ్లవలదు" అను వాక్యార్థమగు నితరవాచ్యార్థమునకు-వ్యంగ్యమగు [సఖియందు గల] రతిభావమంగమగును, కనుక నప్పుడిది - ప్రేయోలంకారమున కుదాహరణము కావలసివచ్చును. ఆనందవర్ధనుఁడు - దీనిని, వాచ్యము - నిషేధరూపమగు నపుడు - అనుభయరూపమగు [విధియు - నిషేధముగాని] వస్తుధ్వని కుదాహృతిగా నొసఁగెను. ప్రథమ ద్వితీయ సందర్భములననుసరించినయెడల - ఇది -గుణీభూతవ్యంగ్యమునకుదాహృతియగును. వస్తుధ్వని కుదాహృతిగాదు. కనుక, శ్రీలోచనకర్త - మీఁది రెండుపక్షములయందును, తనకుఁగల అరుచినిసూచించి,

అపక్షములు - కుదురకుండుటవలన - వేరొకపక్షమునూహించి, దీనిని వస్తుధ్వని కుదాహృతియగునట్లు సమన్వయించెను. ఈతృతీయసందర్భమునందలి వ్యంగ్యము- "నాయింటికెననురమ్ము, లేక - నీయింటికి వెళ్లుదమా? ఏమిచేయుదము? అను నదిగా ప్రదర్శింపఁబడినది. ఇది - ప్రథమతృతీయ పక్షములందలి వ్యంగ్యార్థముల వలె 'వెళ్లవలదు' అను వాచ్యార్థమునకు - శోభాదాయకమగు నంగముకాదు. కనుక, గుణీభూతవ్యంగ్యముకాదు. ఇంకేమనిన 'మాయింటికి వెళ్లుదము' అని కాని, - 'వలదు' అనికాని, - 'నీయింటికే వెళ్లుదము' అనికాని, 'వలదు' అనికాని, విధి, నిషేధ, ఉభయరూపమునుకాని - వల్లభాభిప్రాయరూపమై యున్నది. కనుక నిది - అనుభయరూపమగు వస్తుధ్వని కుదాహృతియగునని తెలియునది.

లోచనము :— మీఁది యుదాహృతులయందిట్లు వాచ్యమునకును, వ్యంగ్యమునకును, విషయములగు - ధార్మికుఁడు, పాంథుఁడు, ప్రియతముఁడు, అభిసారిక, అనువారు ఒక్కొక్కరే. అయినను, ఆయుదాహృతులయందలి వాచ్యస్వరూపమునకును, వ్యంగ్యస్వరూపమునకును, భేదముండుటవలన భేదమున్నదని చెప్పఁబడినది.

లోచనము : — కొందఱుమాత్రము - "ఇచట సహృదయులగు తటస్థులభిసారికను గూర్చి యిట్లనుచున్నారు" అనిచెప్పుచున్నారు. [నాయికయందు రతిలేని తటస్థులకు నర్మోక్తిరూపమగు] "హతాశురాల" అనునామంత్రణము [సంబోధించుట] మున్నగునది - ఈపక్షమున, యుక్తమో, అయుక్తమో, సహృదయులే ప్రమాణము. [నిర్ణయించుకొనుఁడు.]

అవ :— మీఁది యుదాహృతులయందిట్లు వాచ్యమునకును, వ్యంగ్యమునకునుగూడ విషయములగు ధార్మికుఁడు, పాంథుఁడు, ప్రియతముఁడు, అభిసారిక, అనువారు - ఒక్కొక్కరేయగుటవలన, విషయైక్యమున్నను, వాచ్యస్వరూపమునకును, వ్యంగ్యస్వరూపమునకును, భేదముండుటవలన భేదమున్నదని చెప్పఁబడినది. ఇప్పుడో, విషయభేదమువలనఁగూడ - వ్యంగ్యము- వాచ్యముకంటె భేదించునని ప్రదర్శించుచున్నాఁడు.

A (26) మూలము :— కొన్నియెడల విషయభేదమువలనఁగూడ - వ్యంగ్యవస్తువు వాచ్యముకంటె వేరుగా వ్యవస్థాపితమగుచుండును. [వివిధముగా స్థాపింపఁబడఁదగినదగును.]

ప్రభా :— ఆమెయొకయవినీత, జారనాయకుఁడొకఁడు - బహుకాలము నుండియు నామెతోడిపొందునభిలషించుచుండెను. అదియెట్టకేలకు లభించుటవలన మదనావేశమున నుద్రిక్తుఁడయిన చోరకాముకుఁడానుకరోత్సవసమయమున, నొడలుతెలియక, అమె నెమ్మోవినిగాయపరచెను. ఆదేసమయమున, ఆయవినీతురాలిభర్త - తనప్రియురాలిని వెదకికొనుచు నచటికే [పెరటిలోనున్న పూలతోట లోనికే] వచ్చుచుండెను. ఈజారుఁడొకత పొదరింటదాఁగెను. భర్తసంశయించునని యాకులట - భయభ్రాంతురాలైయుండుటవలన, భర్త - 'ఇదియే'మని ప్రశ్నించు నపుడు, తానేమని బొంకవలసినదియుఁ దెలియనదైయుండెను. ఈప్రచ్ఛన్నసమాగమసంధానము నొనరించినసఖి - వచ్చుచున్న ఆయవినీతురాలి భర్తను జూడనట్లు నటించుచు, తనస్నేహితురాలిని మందలించుచున్న మిషపెట్టి - వచ్చుచున్న సఖీ భర్తయు, ప్రాతివేశికలోకమును, [ఇరుగుపొరుగువారును] సవతియు, తదితర సఖులును. తటస్థులగు విదగ్ధలోకులును, వినుచుండ, బిగ్గరగా నిట్లనుచున్నది.

B (26) దీనికుదా :- గీ॥ ఎవనికయిన నలుక పుట్టదే! వ్రణమ్ముఁ
గనిన ప్రియురాలికెమ్మోవిఁ గనినవేళ?
సాశసరసీరుహాఘ్రాణశీల ! మేలు
నేల వినవైతివపుడు: సహింపుమిపుడు. (౬)

లోచనము :— 'వ్యవస్థాపితమగుచుండును'. విషయభేదముగూడ-విచిత్ర రూపముగా [నానావిధముగా] సహృదయులచేత వ్యవస్థాపింపఁబడుటకు [విచిత్రముఁగా నెలకొల్పుటకు] వీలుపడును. అనియర్థము,

ప్రభా :— 'కస్సవణహోఇరోసోదట్ఠూణ పిఆఏసవ్వణం అహరమ్! సభమరపఉమాగ్ఘాఇణివారిఅవామేసహస్సుఏణ్హిమ్.' ఇది ప్రాకృతమునందలి గాధ.

లోచనము :— దీని సంస్కృతచ్ఛాయ - ఇది :-

కస్యవానభవతిరోషో దృష్ట్వాప్రియాయాః సవ్రణమధరమ్
సభ్రమర పద్మాఘ్రాణశీలే ! వారితవామే ! సహస్వేదానీమ్.

"ఎవనికైనను" ఈర్ష్యలేనివానికిఁగూడ - ప్రియురాలికెమ్మోవి - వస్తుతః, సవ్రణముగాకున్నను, ఏదోకారణమున దానిని సవ్రణముగాఁ జూచినయెడల, అపూర్వమగునట్లు చూడగానే, కోపము పుట్టుననిభావము.

'సాశినరసీరుహాఘ్రాణశీల':-'తుమ్మెదలతోఁగూడినపద్మమునుమూర్కొను స్వభావము గలదానా' ? ''శీలమును వారించుటకెట్లును శక్యముగాదు'' అని భావము. ''ఏలమేలువినవైతివపుడు'' భ్రమరసహితమగు నాపద్మమును మూర్కొనకుమని 'అపుడు' [నీవాపూవుఁద్రెంపునపుడు]''నేనుచెప్పిన హితమునేల వ్యతిరేకించి, దానిని మూర్కొంటివి ? ''సహింపుమిపుడు'' నేను, వారించినను వినవైతివి. కనుక నే, యిపుడు నీయధరమున [తుమ్మెదల కాటువలన] గాయమగుటవలనఁ గోపించిన, నీభర్త యొనరించునుపాలంభ (నింద) పరంపరను సహించుకొనుము. ఒకయవినీతయగు నాయిక - ఒకానొకనిచేత [ఎవఁడోయొక జారుని చేత] ఖండితాధరయయ్యెను. ఆమెభర్త - [అచటికివచ్చి]. ఆమెకుఁజేరువనే యుండినట్లు గుర్తించినసఖి - చతురురాలు గనుక, అతనిఁజూడనట్లు నటించి, భర్తయీయవినీతను నిందింపకుండఁజేయుట కిట్లనుచున్నది. కనుక, ''సహింపుము'' నీభర్తయొనర్చునదియగు నుపాలంభపరంపరనంతను సహింపుము''అనునంతవఱకును, మీఁదఁదెలుపఁబడిన వాచ్యార్థము- అవినయవతి విషయము. [అవినయవతి విషయముగాఁగలది. అవినయవతి నుద్దేశించిపలుకఁబడినది.]

[దీనిచేత- భర్త మున్నగువారినుద్దేశించి ధ్వనింపఁజేయఁబడిన వ్యంగ్యముల నిట్లెఱుఁగునది.]

**(1)** భర్తృవిషయము :-[భర్తనుద్దేశించి స్ఫురింపఁజేయఁబడిన వ్యంగ్యము] మీఁది వాచ్యముచేత - స్ఫురింపఁజేయఁబడిన ''ఈమెయెడల నపరాధమునులేదు.'' అనువ్యంగ్యము. 'స్వభావసిద్ధమగు పద్మాఘ్రాణచాపల్యమున నీప్రియురాలిట్లు ప్రణితాధరయయినది. ఈమె యొనర్చిన పొరపాటును క్షమించి కోపింపకుము. మఱియునిట్లు బాధింపఁబడిననీప్రియప్రేయసినిలాలింపుము.'' అనుభర్తృవిషయమేయగు వ్యంగ్యము నింకొకదానినిగూడ నిచట గ్రహించునది.

**(2)** ప్రాతివేశికజనవిషయము :- [పొరుగింటివారినుద్దేశించినది.] ప్రియతముఁడగు నిజభర్త - ఈమెనుగాఢముగా నుపాలంభించునపుడు - భర్తృవిషయమున నీమెరహస్యమగు తప్పిదమునొనర్చియుండునని శంకించు పొరుగింటివారిని గుఱించి, 'ఆమెయవినయమును గప్పిపుచ్చి, ''ఈమెవెఱ్ఱిబాగులది ! పాపము ! తుమ్మెదలీమె కెమ్మోవినెట్లుకఱచినవోచూడుఁడు! ఈమె - నిరపరాధిని'' అనునది.

**(3)** సపత్నీవిషయము :- ఈమెను భర్తయొనర్చుచున్న నిందలకును, ఈమెయొనర్చిన తప్పిదమునకును, మిగుల హర్షము నొందునదియగు సవతికి

ప్రియురాలి'' అనుశబ్దబలమువలన స్ఫురింపజేయఁబడినవ్యంగ్యము. అదెట్లనిన:- ''ఈమెకత్యల్పమగు గాయముగలిగినను, ఈమిభర్త, దుఃఖితుఁడగును. ఈసుందరిని, ప్రేమచేతనే కోపగించును. మిమ్మట్లు కోపగింపఁడు. మీయందిట్టి ప్రేమలేదితనికి. కనుక, ''మీసవతులందఱికంటెను నాసఖియే- సౌభాగ్యవంతురాలు!'' అని ఆమె సౌభాగ్యాతిశయమును ప్రకటించుట!''

(4) సఖీ [అవినయవతీ] విషయము :- సపతులనడుమను [నాయవినీతి స్పష్టపడుటవలన] ఇట్లు తేలికపరుపఁబడితినే; [అగౌరవింపఁబడితినిగూడ, నాబ్రతుకేల?] అను లాఘవమును నీమనస్సునందుంచుకొనకుము. [నీయవినయమును గప్పిపుచ్చి, నళినసుగంధమును నాఘ్రాణింపఁగోరునదియగు, లలిత సుకుమార మధురమధుర శీలముగల సౌభాగ్యవతిగా నిన్నుఁ బ్రదర్శించితిని]. కనుక, విశేషించి, నీకిప్పుడు గొప్పబహుమానము లభించినది. కనుక; నీయభిమానమును మఱింత విజృంభింపఁజేసికొని, ఇప్పుడు వెనుకటికంటెను నీసవతులనభిభవింపుచు, శోభింపుము.'' అనువ్యంగ్యము.

(5) చౌర్యకాముక విషయము :- 'నీప్రచ్ఛన్నానురాగిణియగు నీయీహృదయవల్లభ నిప్పటికెట్లో రక్షించితిని మరల నింకెప్పుడునుగూడ నిట్లు ప్రకటమగునట్లు - ఈలలితాంగి కెమ్మోవిని గాయమొనర్పకుమా! [ఇంతయొడలు తెలియనితనము నీకుఁదగదుసుమా!] అని జారుని హెచ్చరించునదియగు వ్యంగ్యము.

(6) తటస్థవిదగ్ధలోక విషయము :- 'చతురురాలను గనుక నేనీప్రమాదము నిట్లు తప్పింపఁగలిగితిని' అని స్వచాతుర్య ప్రదర్శనరూపమగు వ్యంగ్యము,

కనుకనే, ''వ్యుత్పత్తికారుఁడు వ్యవస్థాపితమగును.'' అనుదానిచేత - భర్తమున్నగు విషయములచేత - భిన్నమగు, వ్యంగ్యస్వరూపభేదమునే, ప్రదర్శించుటకు దీనినుదాహరించెనని తెలియునది.

ప్రభామతి :- 'సంచరింపుము''ఒడలెఱుఁగదత్త' 'చనుమీవు' 'మగువనినువేడెద' అనుమీదియుదాహృతులయందు, వాచ్యవ్యంగ్యములొకేవిషయముగలిగి[ఒకే వ్యక్తినుద్దేశించి]యున్నవి. ఆయుదాహృతులయందు వాచ్యవ్యంగ్యములకు రెంటికిని 'ధార్మికుఁడు', 'పాంథుఁడు', 'ప్రియతముఁడు' [శకుఁడు] 'అభిసారిక' అను వారు - ఒక్కొక్కరే విషయమై యున్నారుగదా!. కనుక నచట విషయైక్యమున్నది. క్రమముగా (1) వాచ్యము - విధిరూపమగుట, వ్యంగ్యము నిషేధరూపమగుట, (2) వాచ్యము-నిషేధరూపమగుట, వ్యంగ్యము- విధిరూపమగుట. (3)

వాచ్యము - విధిరూపమగుట, వ్యంగ్యము - అనుభయరూపమగుట [విధియు, నిషేధమునుగూడ కాకుండుట] (4) వాచ్యము నిషేధరూపమగుట, వ్యంగ్యము- అనుభయరూపమగుట. అనివానియందు వాచ్య - వ్యంగ్యముల స్వరూపమునందు విరోధముండుటవలన భేదచతుష్కము ప్రతిపాదింపఁబడినది.

''ఎవనికయిన నలుకపుట్టదే'' అను నీయుదాహృతియందలి - వాచ్యము - అవినయవతి [జారిణి] విషయముగాఁగలది. [అవినయవతి నుద్దేశించి చెప్పఁబడినది.] వ్యంగ్యమో - 'భర్త, పొరుగింటివాడు, సపత్ని, అవినయవతి, ఉపపతి, తటస్థలోకము,' మున్నగు అనేకులు విషయములుగాఁగలది. కనుక, విషయభేదముగలదగుచున్నది. కనుకనే, ఇచట వ్యంగ్యము - సహృదయులచేత విషయభేదముగలదిగా వ్యవస్థాపితమని, అనఁగా; వ్యవస్థాపింపఁదగినదని వృత్తికర్త చేతనే - పేర్కొనఁబడినది, కాఁగా; మీఁదియుదాహృతియందు, వాచ్యము కంటె వ్యంగ్యము వేరగుటవలన స్వరూప భేదమున్నది. మఱియు భర్త్రాది విషయ భేదముగల వ్యంగ్యముకూడ నానారూపమగుటవలన - వ్యంగ్య స్వరూపమునందుఁగూడ - పారస్పరికమగు భేదమున్నది. క్రమముగానిందు (1) 'ఈస్త్రీయేయని - కోపింపఁదగినదికాదు. సరిగదా లాలింపఁదగినది.' (2) 'ఈవెఱ్ఱిబాగులది నిరపరాధిని' (3) 'మీయందరికంటెను నాసఖియే - సౌభాగ్యవంతురాలు' (4) 'నీవుబహుమానాస్పదమైతివి గనుక శోభింపుము.' (5) 'ఎంతచిక్కువచ్చినదో చూచితివా; ఇఁకముందెప్పుడును ప్రకటిత చిహ్నముగాని సురతభోగమునే - ఈమెకు సంఘటింపుము' (6) చతురురాలను గనుక, నేనిప్రమాదము నిట్లు తప్పింపఁగలిగితిని' - అనునిందలి వ్యంగ్యములు - ఒకదానికంటె నింకొకటి - వేఱగుచున్నవి గదా!

(27) మూలము : వాచ్యముకంటె విశేషించి భేదించునవియగునిట్టి ప్రతీయమాన భేదములు - మరికొన్ని, ఇతరములు కూడ సంభవించును. ఇది - 'వానికి దిఙ్మాత్రమగు [సంక్షేపరూపమగు] ప్రదర్శనము'. 'వాచ్యముకంటె విభిన్నమగు' ద్వితీయ ప్రభేదము [అలంకారధ్వని] కూడ - సప్రపంచముగా [విస్తరించి] ముందు ప్రదర్శింపఁబడును.

[లోచనము] ''ముందు'' అనఁగా ''క్రమమసంలక్ష్యమైనదొక్కటి'' అని ''ద్వితీయోద్ద్యోతమున వివక్షితాన్యపరవాచ్య సంబంధియగు, ద్వితీయప్రభేద

మును వర్ణించునపుడు,'' అనియర్థము. విధి, నిషేధము, తదనుభయము, అను రూపమున వస్తుధ్వనిని కలయఁగూర్చి, సంక్షేపముగాఁదెలుపుటకిచట వీలైనది. 'అలంకారములు పెక్కులు, గనుక, అలంకారధ్వనినిట్లు తెలుపుటకు వీలుపడు నదికాదు.

[ప్రిభాషమతి] వెనుక, వస్తుధ్వనిభేదములు - కొన్ని సంక్షేపముగా నుదాహరించి, ప్రదర్శింపఁబడినవి. దీనివలెనే, అలంకారధ్వనికూడ వాచ్యముకంటె మిక్కిలి వేరైయున్నది. కనుక నదియు, నిచటనుదాహరించి, ప్రదర్శింపఁబడ వలసియున్నది, అయినను, అలంకారములు - పెక్కులైయున్నవి. కనుక, వస్తు ధ్వనులవలె, వానినిచటసంక్షేపించి ప్రదర్శించుటకు శక్యముగాకుండుటవలన నుదాహరించి - ప్రదర్శింపమైతిమి. ముందు ద్వితీయోద్ద్యోతమున-''క్రమమునంలక్ష్యమైన దొక్కటి నులక్ష్యక్రమమున్నదొకటియై'' అని వివక్షితాన్యపరవాచ్య సంబంధియగు ద్వితీయ ప్రభేదమగు 'సంలక్ష్యక్రిమవ్యంగ్యధ్వని నుదాహరించునపుడు- విస్తరించి, ప్రదర్శించెదమని భావము.

—• రసాదిధ్వని విశేషనిరూపణము •—

(28) మూలము :— రసాది లక్షణమగు తృతీయ ప్రభేదము మాత్రము వాచ్య సామర్థ్యమున నాక్షేపింపఁబడి, ప్రకాశించు చుండునుగాని సాక్షాత్తుగా శబ్దవ్యాపారమునకు గోచరించునదికాదు. కనుకనది వాచ్యముకంటె విభిన్నమే యగుచుండును.

లోచనము :— 'మాత్ర' శబ్దము [వస్త్వలంకారధ్వనులకంటె ఈరసాదికమునకుఁగల] వ్యతిరేకమును దెలుపును. వస్త్వలంకారములుగూడ నొకప్పుడు శబ్దాభిధేయములగునుగదా ! రసము, భావము, రసాభాసము, భావాభాసము, భావోదయము, భావసంధి, భావశబలత, భావప్రశాంతి, అనునవిమాత్రము - ఒకానొకప్పుడునుగూడ - శబ్దాభిధేయములు - [వాచ్యములు] కావు. [''ఇవి ] స్వప్నమునందయినను, శబ్దవాచ్యములుకావు'' అని వెనుకఁజెప్పఁబడినదిగదా !] అయినను [శబ్దవాచ్యములుగాకున్నను] ఈరసాదులు [సహృదయులచేత' ఆస్వాదింపఁబడుటయే - ప్రాణముగాఁగలవయి, భాసించుచున్నవి. [కనుక- ,,కుందేటికొమ్ము, వలె - ఈరసాదులున్నట్లు తోచుటయేగాని, యునికిగలిగి సిభాంచునవికావు'' అనిచెప్పుటకు వీలులేదు.] ఈరసాద్యర్థమును స్ఫురింపఁ

జేయునపుడు, [వెనుక నిరూపించినట్లే] శబ్దము - స్ఖలద్గతి కలదికాదు. కనుక, నిచట, ముఖ్యార్థబాధాదులవలన లక్షణావ్యాపారమును నిబంధింపవలయునని శంకించుటకు వీలుపడదు. కనుక, రసాది వ్యంజనవిషయమున ధ్వననవ్యాపార మునువినా; వ్యాపారాంతర కల్పనములేదు.

ఔచిత్యయుక్తముగ ప్రవర్తించునపుడుస్థాయియగు [చివరివఱకును, నిలుచు నదియగు] చిత్తవృత్తి-[రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము, అని తొమ్మిదివిధములుగలది] [సహృదయుల చేత] ఆస్వాదింపఁబడునపుడు, రసమగును.అట్లే, ఉచితముగఁ బ్రవర్తించునపుడు-వ్యభిచారియగు [వివిధమై, అభిముఖమై, తాత్కాలికముగ నుదయించునదియగు] చిత్తవృత్తి - [నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, అలసత, దైన్యము, చింత, మోహము, మొదలగునది] ఆస్వాద్యమై, భావమగును. అనౌచిత్యముగఁ బ్రవర్తించు స్థాయియగు చిత్తవృత్తి - ఆస్వాదింపఁబడి, రసాభాస మగును, అట్లే, అనుచితముగఁ బ్రవర్తించునపుడు, వ్యభిచారియగు చిత్తవృత్తి - ఆస్వాద్యమగునపుడు, భావాభాసమగును. రావణునకు సీతయందుదయించిన స్థాయిభూతమైన 'రతి' అనుచిత్తవృత్తి - అనుచితమగు ప్రవృత్తిగలది. కనుక నది సహృదయులచేత నాస్వాదింపఁబడునపుడు; రసాభాసమగుటయు, వానికొదవిన మోహము మున్నగు చిత్తవృత్తి [వ్యభిచారి] - ఆస్వాదింపఁబడునపుడది - భావాభాసమగుటయు, దీనికి దృష్టాంతమని తెలియునది.

''శృంగారాద్ధి భవేద్ధాస్యః [సః]''

''[ఆభాసరూపమగు] శృంగారమునుండి [అది - ఆభాసమని సహృదయులు వివేచించి, తదాస్వాదమునఁ దిరస్కరింపఁబడకుండునపుడు] హాస్యము స్ఫురింపఁజేయఁబడును.'' అను [భరతోక్త] ప్రమాణవచనమువలన - అనుచితమగునట్లు ప్రవర్తించినదియగు సీతావిషయక రావణరతికి - హాస్యరసరూపతయే కలుగును. అయినను, సామాజికులకు, సీతావిషయక రావణరతియందు స్ఫురింపఁజేయబడిన హాస్యరూపతానుభూతి - పాశ్చాత్యమే [అనఁగా; తన్మయీభావ దశయందుఁగాక, తదుత్తరకాలమున స్ఫురింపఁజేయఁబడునదియే] యగును. [సహృదయ సామాజికులు] తన్మయీభవన దశయందుండునపుడు మాత్రము [పౌర్వాపర్యవివేకమున్నను] పౌర్వాపర్యవివేకమును గోల్పోవుటవలన సీతా

విషయకమగు రావణరతి - ఆస్వాద్యమేయగును. కనుక, [అది-యాభాసమని గ్రహింపనివారికాశృంగారరసాభాసము] శృంగారముగనే స్ఫురింపజేయఁబడును.

"దూరాకర్షణమోహమన్త్ర ఇవమే తన్నామ్ని యాతే శ్రుతిమ్" "దూరాకర్షణమును, మోహమును,గలిగించునదియగు మంత్రమువలె, ఆసీతపేరు-నా శ్రుతిపథమునఁ బ్రవేశింపఁగానే" ఇత్యాది శ్లోకశ్రవణసమయమున తన్మయీభవనముచేత-విభావమగు సీతకును,'ఆ'పరకాంతా విషయమున రావణునియందుదయించినరత్యాదులకును, గలపౌర్వాపర్య[ముందువెనుకల] వివేకము-తిరస్కరింపఁబడుటవలన, సామాజికులకపుడు - సీతావిషయకమగు రావణరతి - ఆస్వాదింపఁబడి, శృంగారముగానే భాసించినను, అది - శృంగారాభాసమేయగును. కనుక సామాజికుల చేత నపుడాస్వాదింపఁబడునది - రత్యాభాసమే. కనుకనది శృంగారాభాసమే. ఈశృంగారాభాసమున కంగమగుభావము - భావాభాసము. రసమును వ్యంజింపఁజేయుట కారంభింపఁబడిన చిత్తవృత్తియొక్క ప్రశమమే- విశేషించి [సహృదయులను] ఆనందింపఁజేయునది. కనుకనది-భావశబ్దముచేతనే సంగృహీతమయినను, [బోధితమయినను] వేఱుగా పరిగణింపఁబడినది. దీనికుదా :—

ఒకశయ్యన్ మొగముల్ మలంచుకొని, మేయుక్తుల్ వినర్జించి, లోం
గక, దుఃఖింపుచు, హృద్గతానునయ యోగమ్మానియున్,మానర
క్షకులౌచున్, మెలమెల్లగా చలదపాంగ శ్రీమిళద్దృష్టులా
ప్రకృతిన్ బాసిరిదంపతుల్ స్మితజవవ్యావృత్తకంఠగ్రహుల్.
[అమరుక కావ్యము. 83వ శ్లోకమున కాంధ్రీకృతి]

ప్రభా :— "పెడమోములుంచుకొని, మౌనయుక్తులయి, పరస్పరలాలనాభిలాషమున్నను, గౌరవమును రక్షించుకొనుచున్న ప్రేయసీప్రేయసులగు దంపతుల కడకంటిచూపులు - ఎట్లో మెల్లమెల్లగ కలిసినవి. నవ్వులుచెలరేగినవి. ఆనవ్వులపరవడిలో, వారికిఁదెలియకుండనే కౌగిలింతలొదవినవి. ఇఁకమానమునకు తావులేక, మెల్లగా తప్పుకొన్నది."

లోచ :— మానము - ఈర్ష్యారోషాత్మకమగు చిత్తవృత్తి. దానికిచట ప్రశమము - ప్రదర్శింపఁబడినది. [కనుకనిది - భావప్రశమమని తెలియునది.]

ప్రభా : అవ :— 'ఈరసాదికము- వ్యంజనావ్యాపారగమ్యము' అని. సాధించుటకిది తాత్పర్యశక్తి ప్రకాశితముగాని, లక్షణావ్యాపార గోచరముగాని కాదని నిషేధించు చున్నాఁడు.

లోచ :— రసాదిరూపమగు నీయర్థము - "నీకుమగబిడ్డ పుట్టినాడు" అను లౌకికవాక్యమువలన శ్రోతకుదయించునదియగు హర్షమువంటిదికాదు. లక్షణచేత లక్ష్యమగునదికూడఁగాదు.

ప్రభా :— "నీకుమగబిడ్డ - పుట్టినాఁడు" మున్నగువాక్యము - ప్రియ రూపమగు నర్థమును బ్రతిపాదించి, శ్రోతకు హర్షమునుదయింపఁజేయునట్లు; కావ్యము - విభావాద్యర్థమును దెలిపి, తాత్పర్యశక్తిచేత - రసచర్వణ నుదయింపఁ జేయునదికాదు. మఱియు, లక్షణచేత - లక్షింపఁజేయఁబడునదియుఁ, గాదు.

"రసాదిరూపమగు నీయర్థము - ఇంకెట్లు స్ఫురింపఁజేయఁబడును" అనిన; రసాదిరూపమగు నీయర్థము మాత్రిము - సహృదయునకు [తన] హృదయ సంవాదబలమువలన, విభావానుభావప్రతీతి - తన్మయీభావమున [తనచేత] నాస్వాదింపఁబడునదియగుచునే, రస్యమానతయే ముఖ్యమగు ప్రాణముగాఁగలిగి సిద్ధస్వభావములగు [లౌకిక] సుఖాదుల [రత్యాదుల] కంటె విలక్షణమై, పరిస్ఫు రించును. కనుకనే, వృత్తియందు "రసాదిలక్షణమగు తృతీయప్రభేదముమాత్రము- వాచ్యసామర్థ్యమున నాక్షేపింపఁబడి [అభివ్యంజితమై] ప్రకాశించుచుండును." అని చెప్పఁబడినది. ఆకారణముచేత [రసాద్యర్థము- ప్రమాణాంతరగమ్యముగాని, అభిధా, తాత్పర్య, లక్షణావ్యాపారత్రయ జన్యముగాని, కాదు. కనుక] అర్థసహ కృతమగు శబ్దమునకీరసాద్యర్థమును ధ్వనింపఁజేయుటయే [ధ్వననమే] వ్యాపా రము. కాఁగా; రసాదిరూపమగు తృతీయప్రభేదము-వాచ్యాదివిలక్షణమేయగును.

ప్రభా :— అలౌకికములగు విభావానుభావ వ్యభిచారిభావములు - సత్యములైనను, సత్యములు కాకున్నను, విశిష్టములగు శబ్దములచేతను, చతుర్విధములగు నభినయములచేతను, సహృదయ హృదయమున సమ ర్పింపఁబడును. హృదయసంవాదముగల సహృదయుల హృదయము - కావ్యాను శీలనాతిశయమున నిర్మలమైయుండును. కనుక కావ్యనాట్యరసానుభూతియందు ముఖ్యాధికారులగు వారినిర్మలహృదయమున వర్ణనీయవిభావాది తన్మయీభావము కలుగును. ఈవిభావాదులచేత - రత్యాదులు మేల్కొలుపఁబడును. తదుపరి, అలౌకిక సంవిదానంద చర్వణావ్యాపారముచేత- ఆస్వాదింపఁబడుటయే-ప్రాణము గాఁగలదియగు రసము - పరిస్ఫురించును.

రసాదులెప్పుడును వాచ్యములు కావు.

ప్రభా :— రసాదులు వాచ్యములు కాఁగూడదా ? అని యాశంకించి,

"రసాదు లెప్పుడును వాచ్యములు కావు" అని చెప్పుచున్నాఁడు.

**(29)** మూలము : అదెట్లనిన :— రసాదులు [శృంగారాది] స్వవాచక శబ్దనివేదములగుటవలన వాచ్యములగునా ? లేక విభావాది ప్రతిపాదన ద్వారమున వాచ్యములగునా ? [అని విచారింపవలసియున్నది.]

ఇందు మొదటి పక్షమున; స్వవాచక శబ్దనివేదితములు కానపుడు, రసాదులు స్ఫురింపనివి కావలసివచ్చును. రసాదు లంతటనుగూడ స్వశబ్దనివేదితములై స్ఫురించుటలేదు. కాని, యెచ్చటనయినను, రసాదులు స్వశబ్దనివేదితములై స్ఫురించుచున్నను, అచ్చటఁగూడ - ఈరసాదుల ప్రతీతి - విశిష్టవిభావాది ప్రతిపాదన ద్వారముననేయగుచున్నది. [శృంగారము, నిర్వేదము, మున్నగు] స్వశబ్దములచేత నివేదితమై, అది- కేవలము, అనువదింపబడుచున్నదియే. కాని, దానిచేత - రసాదిప్రతీతి ఘటింపఁజేయఁబడుటలేదు.

ప్రభా :— అయ్యా ! అర్థము- తానేవ్యాపారముచేత - రసాదిప్రతీతికి హేతువగునో, ఆవ్యాపారమే - అర్థసహకృతమగు శబ్దమునకుఁగూడ - సముచితమగును. పుత్త్రజన్మాదికము హర్షాదికమునకు జనకమగునట్లు, అర్థముకూడ - రసాదిరూపమగు చిత్తవృత్తికి జనకమేయగును. కనుక, శబ్దముకూడ - రసాది జనకమేగాని, రసాదివ్యంజకముకాదు. కనుక, జననము [పుట్టించుట] అనునదియే - ఇచటి వ్యాపారము కాఁగూడదా ?

లోచనము :— పుత్త్రజన్మము - హర్షమును జనింపజేయునట్లు; విభావాద్యర్థముగూడ - చిత్తవృత్తిని జనింపఁజేయును. [జనింపఁజేయునదికాదు.] కనుక [శబ్దమునకువలె] అర్థమునకుఁగూడ- జననముకంటె ('పుట్టించుట' అనువ్యాపారముకంటె] వేరయిన ధ్వననవ్యాపారమే ధ్వనివాదులచేత చెప్పఁబడుచున్నది.

'స్వశబ్ద నివేదితములగుటవలన' - శృంగారాది శబ్దముచేత - అభిధా వ్యాపారవశమువలననే ప్రతిపాదింపఁబడుటవలన రసాదులు వాచ్యములగుట సంభవించునా ? లేక "విభావాది ప్రతిపాదన ద్వారమున" అనఁగా, తాత్పర్య

శక్తిచేత - వాచ్యములగుట - సంభవించునా ? అనియర్థము.

అందు మొదటి పక్షమున; స్వశబ్దమున కన్వయవ్యతిరేకములు - [స్వవాచకశబ్దమున్నచో, రసాదిప్రతీతి కలుగుట - అన్వయము. స్వవాచకశబ్దములేని యెడల, రసాదిప్రతీతి కలుగకుండుట-వ్యతిరేకము] రస్యమానతాసారమగు రసమునందు సిద్ధింపవని నిరాకరించుచు, 'ధ్వననవ్యాపారముననే యవిసిద్ధించును.' అని "రసాదులంతటను స్వశబ్దనివేదితములగుచునే స్ఫురించుటలేదు." అను దానిచేత పరిదర్శించుచున్నాడు.

భట్టేందురాజకృతమగు క్రిందిపద్యము - 'రసాదులు స్వశబ్దనివేదితములు కాకున్నను ధ్వననవ్యాపారముచేత స్ఫురింపఁజేయఁబడుటకు [వ్యతిరేకాభావమునకు] ఉదా :—

> లోలత్వమ్ముఁ బిరామమున్, నెగడునాలోకమ్ములన్ నేర్పునే
> తార్లే,లూన సరోజనాళములలీలన్ గార్శ్యమున్ దీప్పఁగా
> తార్లే, పాండిమసాంద్రమై వెలయు దూర్వాకాండ భాస్వత్ కపో
> లాలే, యౌవతవేషమయ్యె; యువయైరంజింపఁ గృష్ణుండిలన్.

ప్రభా :- శ్రీకృష్ణుఁడు-విజృంభించుచున్న నవయౌవనముగలిగియుండునపుడు యువతులగు కాంతల, వేషరచనలేనివేషరచన - యింపు వర్ణితము, "వారి లోచనములు - చంచలములగుచు, నడుమనడుమ విశ్రమించునవియగు చూపులుగలిగియున్నవి. వారియంగకములు - పరిమృదితములగు నవమృణాళీనాళములవలె మ్లానములగు వర్ణములుగలిగి, రోజురోజును దరిద్రములగుచున్నవి. [కృశించుచున్నవి] వారికపోలములయందు దూర్వాకాండమునుబోలిన పాండిమ - నివిడమైనది." మీఁది పద్యమునందలి ప్రథమపాదమున, యౌవనవతులగు కృష్ణానురాగిణుల విలోకిత వైచిత్ర్యము - సూచింపఁబడి, 'అలస' అనుదృష్టి - తెలుపఁబడినది. అదియనుభావము. దీనిచేత - అతివేలములగుచు, ఒకదానినొకటి తిరస్కరించుకొనుచున్నవియగు 'ఔత్సుక్య - వ్రీడలు' స్ఫురింపఁజేయఁబడుచున్నవి. "కృష్ణుండు" అనుదానిచేత, ఆలంబన విభావమును, 'యువయై' అనుదానిచేత-ఉద్దీపన విభావమును, దీనిచతుర్థపాదమునఁ బ్రతిపాదింపఁబడినవి. వీనిచేత - ఆ యువతులకు కృష్ణునియందు గాఢమగు రతి [ప్రేమ] స్ఫురింపఁజేయఁబడినది. ద్వితీయపాదమున, కార్శ్యమును, తృతీయపాదమున పాండిమ - అనఁగా; వైవర్ణ్యమును, దెలుపఁబడినవి. ఇవి-శృంగారావస్థలు. దశావస్థలలోనున్న తదితరావ

స్థలింతకుమున్నే వీరిచేత అనుభవింపఁబడినవని యూహించుకొనవలయును. వీని చేత - అభిలాషము, ఔత్సుక్యము వ్రీడ, చింత, స్మృతి, ఆలస్యము, గ్లాని, మున్నగు వ్యభిచారులు - స్ఫురింపఁజేయఁబడినవి. ఈపద్యమున, విభావానుభావ వ్యభిచారి సముదయమిట్లు ప్రదర్శితము. కనుకనిందు ధ్వనింపఁజేయఁబడినది - అభిలాష విప్రలంభ శృంగారరసము.

లోచనము :— ఇచట విభావానుభావములు [వాచ్యములుగా] తెలుపఁబడినతోడనే, తన్మయీభావయోగమున, తద్విభావానుభావములకుచితములగు చిత్తవృత్తులు- అభిలాషమను స్థాయిభావమును, వ్యభిచారిభావములును, స్ఫురింపఁజేయఁబడినవి. ఈచిత్తవృత్తి సంస్కారములచేత-అనురంజితమగు స్వసంవిత్తునకు [సహృదయ మనస్సునకు] కలుగుసదియగు ఆనందమయమగు చర్వణకు, అభిలాషవిప్రలంభ శృంగారరసరూపమగు నర్థము - గోచరమై స్ఫురించుచున్నది. ఈపద్యమున నిట్లు; అభిలాష చిన్తౌత్సుక్య నిద్రాధృతిగ్లాన్యాలస్యశ్రమస్మృతి వితర్కములు - స్వశబ్దనివేదితములు కాకున్నను[మహావాక్యముచేత, అభిలాషమును, అవాంతరవాక్యములచేత - ఔత్సుక్యాదులును, వ్యంజింపఁజేయఁబడి]అభిలాషాత్మకమగు విప్రలంభ శృంగారము- ధ్వనింపఁజేయఁబడుటవలన - 'స్వవాచకశబ్దము [అభిలాషము మున్నగునది] లేనియెడల - రసాదిప్రతీతి కలుగకుండుట'' అను వ్యతిరేకము - లేకుండుట-ప్రదర్శింపఁబడినది.

అవ :— ఇట్లు - వ్యతిరేకాభావమును ప్రదర్శించి, ''ఎచ్చటనయినను'' అనువాక్యముచేత [వృత్తికారుఁడు] అన్వయము - లేకుండుటను, ప్రదర్శించుచున్నాడు.

రసాదులు - ఒకప్పుడు, స్వవాచకములగు, [ఉత్కంఠాది] శబ్దములచేత - నివేదితములయినను, ఈ రసాదులప్రతీతి - విభావాది ప్రతిపాదన ద్వారముననే అనఁగా; శబ్దయుక్తమగు విభావాది ప్రతిపత్తిచేతనే యగుచున్నది. స్వవాచక శబ్దముచేత - ఆరసాదిప్రతీతి - కేవలము, అనువదింపఁబడుచున్నది.

ప్రభా :— విభావాదులకు వాస్తవమగు సత్త - ఆవశ్యకముకాదు. కనుక, ''విభావాదిప్రతీతి ద్వారముననే'' అనిచెప్పక, వృత్తికారుఁడు - విభావాది 'ప్రతిపాదన' ద్వారముననే, అని చెప్పుటవలన, లోచనాకారుడు - శబ్ద ప్రయుక్తమగు విభావాది ప్రతిపత్తిచేతనే, రసాదిప్రతీతికలుగుననివిశదీకరించెను. శబ్దప్రయుక్తమగు విభావాది ప్రతీతియే - రసాదిప్రతీతిని గలిగించును, విభావాది

ప్రతీతి - వాస్తవము కానక్కఱలేదు' అని దీనిభావము.

అవ : లోచనకర్త :— స్వవాచక శబ్దనివేదన మున్నచోటఁగూడ, - శృంగారాదిరసప్రతీతి- విభావాది ప్రతిపాదన ద్వారముననే యగును. 'స్వశబ్దము చేత - అదియనువదింపఁబడునదియేయగును.' అనుటకుదాహరించుచున్నాఁడు.

శా॥ నాళీకాక్షుఁడుచేరె ద్వారవతికిన్; తద్దత్తఝుంపానతన్,
కాళిందీతట రూఢవంజులలతన్, గౌగింటసంధించి, గీ
తాళింబాడె, సబాష్పగద్గదగళత్తారధ్వనిన్రాధ - కీ
లాలాంతశ్చరులున్ మహోత్కముగఁగూయన్గూయ, నోత్కంఠయై.

ప్రభా :— "కమలాక్షుఁడు - [మధురిపుడు] శ్రీకృష్ణుఁడు - జరాసంధు నోడించుటకు ద్వారవతికేగెను. ద్వారవతి - మహార్ణవము నడుమనున్నది. సుల భముగా వెళ్లిచూచుటకు వీలుపడునదికాదు. రాధ - శ్రీకృష్ణుని నిరతిశయ ప్రేమ సంభారపాత్రురాలగు ప్రసిద్ధగోపికకదా!. కనుకనప్పుడు - ప్రియవిరహమున తపించుచున్నది, కాళిందీతీరమునకరిగినది. ఆతీరమునందొకవంజులలత [పొగడ తీగె] యున్నది. శ్రీకృష్ణుఁడు రాధతోనచట విహరించునపుడావంజులలతనే - తనహస్తములతోఁ బట్టుకొని, యూఁపులనూగుచుండెను. కనుక, మంజులమగు నావంజులలత - తద్దత్తఝుంపానత, [కంపానత] అనఁగా; శ్రీకృష్ణునిచేత, ప్రీతి పురస్సరముగ నొసఁగఁబడిన ఝుంపచేత [అకృత్రిమబ విశేషముచేతనగు కంపము చేత] బాగుగావంగియున్నది. ప్రతిగ్రహీత - వంగియుండుట ప్రసిద్ధముగదా! కృష్ణునిచేత - దానికి ఝుంప-దత్తమైనది. కనుక ప్రతిగ్రహీత్రియగు, నాలత - ఆనతయయినది. మఱియు నీపుణ్యలత - రాధామాధవ పరస్పరానురాగ సంభార విజృంభిత స్వచ్ఛందవిహరణ విలాసవిశేషసర్వస్వసాక్షీభూత. శ్రీకృష్ణవియోగ వ్యథాభారమును - రాధతోఁగూడ తానునుపంచుకొని, పరితపించుచున్నది. గోపికలలో రాధవలె, లతలలో నీలతయే- కృష్ణప్రేమ పాత్రురాలు. ఇట్టివిశిష్టత - ఈమంజుల వంజులలతయందున్నది. కనుక, దీని సమాలింగనమున తనకు ప్రియ సమాలింగన మహోత్సవసుఖసంవేదన మొకింతకలుగక పోదనితలఁచినది. కనుకనే రాధ - దానిని గాఢముగా నాలింగనము చేసికొన్నది. బాష్పకణములు ముత్తెములవలె జార, డగ్గుత్తికతో కంఠమునెత్తి - 'ఉత్కంఠతో' ప్రేమగీతముల నాలాపింపసాగినది. ఈప్రణయమధురగీతికలను [నీటిలోనున్న] అంతర్జలచరము లగు జలచరములుకూడ విని, తన్మయములై ద్రవించినవి. అవికూడ - రాధవలె కంఠమునెత్తి, ఉత్కంఠతో గట్టిగా కూయసాగినవి."

ఇచట 'నాళీకాక్షుఁడు' అగు కృష్ణుఁడు - ఆలంబన విభావము. అతఁడు ద్వారకకు వెళ్లుట, [వియుక్తుఁడగు నాళీకాక్షుఁడు,] కాళిందీతటము, వంజులలత, మున్నగునవి - ఉద్దీపన విభావములు. లతాలింగన, బాష్పోత్స్వర్శన, గాద్గదిక, గీతాదులనుభావములు. చింతా, మోహ, స్మృత్యాదులు-వ్యభిచారులు. ఉత్కంఠ-స్ఫురింపఁజేయఁబడినది. విరహవిప్రలంభ శృంగారము - ధ్వని.

లోచనము :— ఇచట, విభావానుభావములు - [అమ్లానములగుచునే] క్లేశములేకుండ, వాచ్యములుగనే, ప్రతీతములగుచున్నవి. ఉత్కంఠకూడ - స్వశబ్దనివేతముగాకయే-వ్యంజనచేత] చర్వణాగోచర [అస్వాదవిషయ]మగుచున్నది. ''సోత్కంఠమై'' అనుపదము - [ఇచటనున్నను] కేవలము సిద్ధించినదానినే [వ్యంజనచేత స్ఫురింపఁజేయఁబడిన, [ఉత్కంఠనే] సాధించునదియగుచున్నది. [స్ఫురింపజేయఁబడిన దానినే తెలుపుచు, అనువదించునదియేయగుచున్నది.] ''కేవలము'' అనిచెప్పుటచేత - అనువాదకమగు నీయుత్కంఠాశబ్దము-విభావానుభావములకుచితమగు సహకారికూడ - కానేరదని ప్రదర్శింపఁబడినది. [అయిన నీయనువాదముకూడ - అర్థములేనిదికాదు.] సమానార్థకమగు ''ఉత్కముగన్'' అనుదానిచేత - [జలచరముల విషయమున] పూర్వోక్తములగు ననుభావముల ననుకర్షించుటకు సోత్కంఠాశబ్దము ప్రయోగింపబడినది. కనుక, ననువాదము కూడ - అనర్థకముకాదు. [జలచరములయందుఁగూడ - ఉత్కంఠను స్ఫురింపఁజేయుటకు] తిరుగననుభావములను దెలుపునెడల, పునరుక్తి దోషము కలుగుటయే గాక, తిరుగఁదెలుపఁబడిన యీయనుభావవర్గము - తన్మయీభవనమున కుపయోగింపనిది కావలసివచ్చును.

పరిభా : ప్రశ్న :— అయ్యా! ఇచట-''సోత్కంఠమై'' అని, ఉత్కంఠ-శబ్దనివేదితమై యున్నది. కనుక దానిచేత - ఉత్కంఠ - వాచ్యముగనే ప్రతిపాదితమని చెప్పఁదగదా;

ఉత్త : ఇచట - ఉత్కంఠ-విభావానుభావ ప్రతిపాదన ద్వారమున వ్యంజితము. ''సోత్కంఠమై'' అను ప్రయోగమిచట లేకున్నను గూడ, ఉత్కంఠ - స్ఫురింపఁజేయఁబడియే యున్నది అది - ఉత్కంఠాస్ఫురణమున, విభావానుభావములకు సహకరించునదికూడ కాదు. కనుక, కేవలము, అనువాదకమే యగును.

ప్రశ్న :— అట్లయిన, సోత్కంఠాశబ్దము - అనర్థకమగునా ?

ఉత్త :- కాదు. 'సోత్కంఠయై' అనుప్రయోగము - ప్రయోజనవంతమై యున్నది.

అదెట్లనిన 'గీతాళిన్ బాడె....రాధ- కీలాలాంతశ్చరులున్ మహోత్కముగఁ గూయంగూయ, సోత్కంఠయై'' అనిమీఁది పద్యమునఁ జెప్పఁబడినది గదా "కీలాలాంతశ్చరులున్'' అనఁగా; నీటియడుగుననున్న జలచరములు గూడ- 'మహోత్కముగన్' అధికమగు నుత్కంఠతో, "కూయన్‌గూయన్'' గట్టిగా కూతలుపెట్టునట్లు, "రాధ-ఉత్కంఠతో, ప్రణయవిరహగీతముల నాలాపించెను.'' అనిగదా దీని యర్థము ! ఈపద్యమున-జలచరములయందు సైతము - తన్మయత కలిగినదని చెప్పఁబడవలయును. రాధికయందువలె జలచరములయందుఁగూడ- ఉత్కంఠ కలుగవలయును. కనుక జలచరవిషయమునఁ గూడ ఆయనుభావము లను వర్ణింపవలయును. అట్లు వర్ణించుట-పునరుక్తియగునని, వానినిదిరుగఁజెప్పక, ఆయనుభావసాహిత్యము ననుకర్షించుటకిచట, 'మహోత్కమ్ముగన్' [అధికోత్కంఠతో] అను పదము-ప్రయోగింపఁబడినది. కాని, కేవలమగు 'మహోత్క-శబ్దముచేత-అనుభావానుకర్షణము కలుగదు. "రాధ-ఉత్కంఠతో నెట్లు పాడెనో, జలచరములు గూడ - ఉత్కంఠతోనట్లు కూయఁదొడఁగినవి.'' అనిచెప్పఁబడవలయును. కనుక పూర్వవాక్యమున, "సోత్కంఠయై'' అని ప్రయోగింపఁబడినది. కనుకనే, దానిచేత - సంగృహీతములగుననుభావములను- "సోత్కంఠయై'' అనుదానితో సమానమగు నర్థముగల "మహోత్కమ్ముగన్'' అనుపదము - సమాకర్షించుట - కుదురుచున్నది. కనుక - "సోత్కంఠయై'' అను పదము - అర్థము [ప్రయోజనము] లేనిదికాదు.

ప్రశ్న :— తిరుగ, జలచరవిషయముననను భావములను ప్రతిపాదింపఁ గూడదా ?

ఉత్త : దానివలన పునరుక్తి కలుగుటయేగాక, - ఆయనుభావసౌభాగ్య మనౌచిత్యప్రతిపత్తి గ్రస్తమగుటవలననది-తన్మయీ భావమున కుపయోగింపదు.

ప్రశ్న ;— ఈవిచారణమునఁ దేలిన ఫలితార్థమేదో తెలుపునది.

ఉత్త : " విభావాది ప్రతిపాదన ద్వారముననే, రసాది ప్రతీతియగును. స్వవాచక శబ్దము- [ఉత్కంఠాదికము] ఒకచోనున్నను, అది - అనువాదకమే యగును, గాని, దానిచేత - రసాదిప్రతీతి కలుగునది కాదు. "నాళీకాక్షుఁడు'' అను నీపద్యమునందున్న స్వవాచకశబ్దమగు ఉత్కంఠాశబ్దముకూడ - విభావాది వ్యంజనసిద్ధమగు నుత్కంఠకనువాదకమేయగును. అయిననిది, ప్రయోజనము లేనిదికాదు.'' అనునది - దీని ఫలితార్థము.

B (29) మూలము : విషయాంతరమునందు [శృంగారాది వాచక శబ్దనివేదితము గాకున్నను, విభావాది ప్రతిపాదనము చేత - రసాదికము ప్రతీతమగు స్థలమునందు] రసాదిప్రతీతి-స్వశబ్దనివేదితముగాఁ గాన్పింపకుండుట వలన, [శృంగారరసాది] స్వశబ్దముచేత నివేదితమగుటచేత - రసాది ప్రతీతి కలిగింపఁబడునది కాదు.

లోచనము :— 'స్వశబ్దనివేదితమగుటచేత రసాదిప్రతీతి కలిగింపఁబడునదికాదు.' అని చెప్పుటకు హేతువు - విషయాంతరమునందు, అనఁగా; 'లోలత్వము' ఇత్యాదిస్థలమున, రసాదిప్రతీతి - స్వశబ్దనివేదితముగాఁ గాన్పింపకుండుటవలన'' అనిచెప్పఁబడినది.

ప్రభా :— 'లోలత్వమ్ము విరామమున్ నెగడు నాలోకమ్ములన్ నేర్చునేత్రిలే' ఇత్యాదులందు - స్వవాచక శబ్దనివేదితముగాకున్నను, విభావాది ప్రతిపాదన ద్వారమున, అభిలాష విప్రలంభ శృంగారప్రతీతి - కలుగుచున్నది. కనుక "స్వశబ్దనివేదితమగుటచేత - రసాది ప్రతీతి కలిగింఁపబడునదికాదు." అనిదీనిచేత - వ్యతిరేకాభావము [వ్యతిరేకవ్యభిచారము] ప్రదర్శితము.

లోచనము :— ఏది - లేకున్నను, ఏది - కలుగునో, అది - దానిచేత కలిగింపఁబడునది కాదు గదా!

ప్రభా :— "స్వశబ్దనివేదితత్వము లేకున్నను, లోలత్వమ్మను నీపద్యమునందు [విభావాది ప్రతిపాదన ద్వారమున] అభిలాష విప్రలంభశృంగార ప్రతీతి కాన్పించుచున్నది. కనుక, ఆశృంగారరస ప్రతీతి - స్వశబ్దనివేదితత్వముచేత కలిగింపఁబడునదికా'' దని భావము.

లోచనము :— అవ :- శృంగారాది రసప్రతీతి స్వశబ్దనివేదితముగుచున్నట్లు కాన్పింపకుండుటనే, దృఢీకరించుచున్నాఁడు.

(30) మూలము : కేవలశృంగారాది శబ్దమాత్రముతోఁ గూడినదియు, విభావాది ప్రతిపాదనము లేనిదియు, నగు కావ్యమునందు, లేశమైనను రసవత్త్వ ప్రతీతి లేదుగదా.!

లోచనము :— 'కేవలశృంగారాది శబ్దమాత్రముతోఁ గూడినదియు'

ఆనుచో నున్న కేవలశబ్దార్థమే - 'విభావాది ప్రతిపాదనములేనిదియు' అనుదాని చేత స్పష్టపరుపఁబడినది. కావ్యమునందు - అనగా "రసాది ప్రతీతి-శృంగారాది స్వవాచక శబ్దకృతమేగాని, విభావాది ప్రతిపాదనద్వారమున స్ఫురింపఁజేయఁ బడునదికాదు. అను నీ మతమున కావ్యరూపముగా నభిమతమగు కావ్యమునందు" అని యర్థము. రసాదిప్రతీతి-స్వవాచకశబ్దనివేదితమను నీమతమునందు

"శృంగార హాస్యకరుణ రౌద్రవీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌచేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః."

అను లక్షణశ్లోకము నందుఁగూడ శృంగారాది రసప్రతీతి కలుగవలసివచ్చును.

ప్రభా :— మీఁది లక్షణశ్లోకమునందు శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, అను నాట్యరసము లెనిమిదియుఁగూడ స్వవాచక శబ్ద నివేదితములై యున్నవి. అయినను ఆరసము లిచట నించుకయుఁబ్రతీతములగుటలేదు. కనుక, నిచట 'శృంగారాది స్వవాచక శబ్దమున్నచో, రసాదిప్రతీతికలుగుట' అనునన్వయము వ్యభిచరించినది. కనుక నిది-అన్వయాభావమున [అన్వయవ్యభిచారమున] కుదాహరణమని తెలియునది

లోచనము : అవ :— ఇట్లు, 'స్వశబ్దనివేదితము కానపుడు, రసాది ప్రతీతిలేకుండుట' అనువ్యతిరేకమునకును, స్వశబ్దనివేదితమగునపుడు, రసాది ప్రతీతికలుగుట, అనునన్వయమునకును, అభావమును, ఉపపత్తిపురస్సరముగాఁ బ్రదర్శించి, అట్లే [విభావాదులు ప్రతిపాదింపఁబడినపుడు, రసాదిప్రతీతికలుగుట, విభావాదులు ప్రతిపాదింపఁబడనపుడు రసాదిప్రతీతికలుగకుండుట, అనునన్వయ వ్యతిరేకముల కలిమిని ప్రదర్శించి, ముగించుచున్నాఁడు.

(31) మూలము :— శృంగారాది శబ్దములచేత బోధింపఁ బకకున్నను, కేవలములగు విభావాదులవలన రసాదులు ప్రతీతము లగుచున్నవి. కేవలములగు శృంగాదిశబ్దములచేత బోధింపఁబడు చున్నను, విభావాది ప్రతిపాదనములేనపుడు, [రసాదులు] ప్రతీత ములుకాకున్నవి, కావున, నిట్లు; అన్వయవ్యతిరేకములవలన రసా దులు - అభిధేయ [వాచ్య] సామర్థ్యమున నాక్షేపింపఁబడునవియే గాని, యెట్లునుగూడ, అభిధేయములగునవికాకున్నవి. కనుక,

తృతీయమగు ప్రభేదము [రసాదికము] కూడ - వాచ్యముకంటె భిన్నమేయగునని సిద్ధించుచున్నది. అయినను రసాదిప్రతీతి-వాచ్యముతోఁగూడియుండునది, వలెనేయుండును. [రసాదులు వాచ్యముకంటె వేరుగా స్ఫురించుచున్నను, వేరుగా స్ఫురించుచున్నట్లు కాన్పింపక, వాచ్యముతోఁగూడియే స్ఫురించుచున్నట్లుండును.] ఈయంశము - ముందు [ద్వితీయోద్ద్యోతమున] ప్రదర్శింపఁబడును.

ప్రభా :— విభావాదులున్నపుడు రసాదును ప్రతీతములగుట - అన్వయము. విభావాదులులేనపుడు, రసాదులు ప్రతీతములుగాకుండుట-వ్యతిరేకము. రసాదులు - అభిధేయసామర్థ్యమున నాక్షేపింపఁజేయఁబడి, ప్రకాశించుచుండును. కాని సాక్షాచ్ఛబ్దవ్యాపారమునకు [అభిధావ్యాపారమునకు] గోచరింపవు'' అని చెప్పినప్పుడే, ఇట్లన్వయ వ్యతిరేకములు సిద్ధించుననిభావము. అభిధేయ సామర్థ్యమున నాక్షేపింపఁబడి ప్రకాశించును. అనఁగా, విభావాదిప్రతిపాదన ద్వారమున శబ్దార్థములచేత ధ్వనింపఁజేయఁబడి రసాదులు స్ఫురించుననియే యర్థము నెఱుఁగునది.

అవ :— 'అభిధేయ సామర్థ్యమున నాక్షేపింపఁబడుట' అను దాని యర్థమును విశదీకరించుచున్నాఁడు.

లోచనము :— శబ్దము - రసాదులను ధ్వనింపఁజేయునపుడు, దాని కభిధేయమగు విభావాదికమే - సహకారిశక్తిరూపమగు సామర్థ్యమగుచుండును. అర్థము - రసాదులను ధ్వనింపఁజేయునపుడు, ఆయర్థమునకు [గుణాలంకారాది] విశిష్టమును, సముచితమును, [రసానుగుణమును] అగువాచక [శబ్ద] సాకల్యమే - సామర్థ్యమగుచున్నది. అనఁగా; శక్తియగుచున్నది. విభావాదిరూపమగు నభిధేయము - రసాదిప్రతీతిని జనింపఁజేయునదిగాని, అనుమానింపఁజేయునది గాని కాదు. పుత్రజన్మాదికము హర్షాదికమును జనింపఁజేయునట్లు [పుట్టించునట్లు] [వాక్యార్థ - రసాదులకు జన్యజనకభావ సంబంధములేకుండుటవలన] విభావాద్యర్థము - రసాదికమును జనింపఁజేయునదిగాదు. ఇట్లు; అర్థగతధ్వననవ్యాపారము పుత్త్రిజన్మహర్షభిన్నయోగక్షేమమైయున్నది. కనుక, అర్థనిష్ఠమగు వ్యాపారము-జననము [పుట్టించుట]కాదు.['దేవదత్తుఁడు బలిసియున్నాఁడు. పగలు భుజింపఁడు' అనుచోట] దివాభోజనములేని, బలిసిన దేవదత్తునియందు - రాత్రి భోజనమును మానింపఁబడును. [రసాదులకును, తద్వ్యంజక వాక్యార్థమునకును, అవినాభావ

ములేకుండుటవలన,] ఇచట, అర్థగతమగు వ్యాపారము - అనుమానముకూడఁ గాదు. కనుక, శబ్దము, అర్థము, అను రెండింటికినిగూడ [రసాదిప్రతీతియందగు] వ్యాపారము - ధ్వననమేయగును.

ప్రశ్న :— అర్థమునకు, జనకత్వమునో, అనుమాపకత్వమునో, వ్యాపారముగఁజెప్పఁదగిదా ?

ప్రభా :— రసాదిప్రతీతియందు, శబ్దార్థములు రెంటికినిగూడ వ్యాపారము - ధ్వననమే, [ధ్వనింపఁజేయుటయే.] కాని, వేఱొకటికాదు- శబ్దమునకు రసాదిప్రతీతియందు ధ్వననవ్యాపారమును జెప్పునపుడు, "అభిధేయమేవ సామర్థ్యమ్" అని కర్మధారయమును, అర్థమునకు రసాదివిషయమున ధ్వననవ్యాపారమును జెప్పునపుడు, 'అభిధేయస్య సామర్థ్యమ్' అనిషష్ఠీతత్పురుషసమాసమును, జెప్పవలయును.

అర్థమునకును- రసాదులకును,జన్యజనకభావమును జెప్పునెడల; విభావాదులులేకున్నను, రసాదిప్రతీతి కలుగవలసివచ్చును. కనుక, అర్థమురసాదులను పుట్టించునది [రసాది జనకము]కాదు.

అవినాభావరూపమగువ్యాప్తి లేకుండుటవలన నిచటలింగలింగిభావములేదు. కనుక, అర్థము-రసాద్యనుమాపకమును,[రసాదుల ననుమానింపఁజేయునదియుఁ] గాదు. ఇంకేమనిన; ధ్వనింపఁజేయునదియే [ధ్వనియే] యగును.

లోచనము :— [రసాదులు - స్వ[వాచక] శబ్దనివేదితములగుటవలన వాచ్యములగుట, విభావాది ప్రతిపాదన ముఖమున వాచ్యములగుట, అని] ఇట్లు-పక్షములు - రెండుపక్రమింపఁబడి, మొదటిది-రసాదులు, స్వశబ్దనివేదితములగుట చేత వాచ్యములగుట - దూషింపఁబడినది. రెండవది, విభావాది ప్రతిపాదనద్వారమునవాచ్యములగుట - ఒకవిధమునదూషింపఁబడినది. ఒకవిధమున నంగీకరింపఁబడినది ?[ఎట్లు-దూషింపబడినది? ఎట్లంగీకరింపఁబడినది ? అనిన][అభిధేయసామర్థ్యమునఆక్షేపింపఁబడుటయనఁగా; పుట్టింపఁబడుటఅనిగాని, అనుమానింపఁజేయఁబడుట, అనిగాని, అభిమతమగునెడలనది సమంజసముకాదు. కనుక] ఆక్షేపింపఁబడుట-జనన,మనన, వ్యాపారములచేతనగునది కాదనునభిప్రాయమున,దూషింపఁబడినది. అక్షేపింపఁబడుటయనగా; 'ధ్వనింపఁజేయఁబడుట' అని యభిప్రాయమగు నెడల; నది సమంజసమగునను నభిప్రాయమున నంగీకరింపఁబడినది.

ప్రభా : అవ :— "రసాదులు - అభిధేయసామర్థ్యమున నాక్షేపింపఁబడి" అనిచెప్పినవృత్తికర్తకు, రసాదులను ప్రకాశింపఁజేయునదిగా నభిమతమగు [ఆక్షేప] ధ్వననవ్యాపారము - తాత్పర్యశక్తియేకాని, దానికంటె వేఱయి, చతుర్థకక్ష్యయందుఁ బ్రవర్తించునదియగు నింకొక వ్యాపారమేదియుఁగాదు. కనుక, పాపము శ్రమపడి మీరిట్లు తాత్పర్యశక్తికంటె వేరుగా, ధ్వననవ్యాపారమును వ్యాఖ్యానించుట యుచితముకాదు" అని యెవఁడోయని యుండెను. లోచనకర్త వానిమతమునను వదించి దూషించుచున్నాఁడు.

లోచనము :— ఎవడు - ఇచ్చటఁగూడ- ['సంచరింపుము' అను స్థలము నందేకాక, రసాదిప్రతీతి స్థలమునందుఁగూడ] తాత్పర్యశక్తినే - ధ్వననముగాఁ దలఁచుచున్నాఁడో, వాఁడు - వస్తుతత్త్వవేదికాఁడు. విభావానుభావప్రతిపాదకమగు వాక్యమున - ఈ తాత్పర్యశక్తి - భేదమునందుఁగాని, సంసర్గమునందుఁగాని పర్యవసించును. కాని రస్వమానతా సారపుగు రసమునందు పర్యవసించునదికాదు. ఈవిస్తృతిచాలును.

కనుక, తృతీయప్రభేదముకూడ- [రసాదికముకూడ] వాచ్యముకంటె భిన్నమేయగును. 'వలెనే' అనుటచేత, వాచ్య - వ్యంగ్యముల ప్రతీతికి క్రమమున్నను, కాన్పించునదికాదు. అనిచెప్పఁబడుచున్నది. ఈయంశము,"ముందు" అనఁగా ద్వితీయోద్ద్యోతమునందుఁజెప్పఁబడును. అనియర్థము.

ప్రభా :— తాత్పర్యశక్తి - విశేషవిషయమని వెనుకఁదెలుపఁబడినది. ఆవిశేము - ఒక వాక్యార్థమున కింకొక వాక్యార్థముతోడి భేదమేయగు వ్యావృత్తిగాని, వ్యావర్తకభూత విశేషణ సంబంధముగానియగును. తాత్పర్యశక్తి - ఈవిశేషమునుదెలిపి నివర్తించును. రసాద్యర్థము - భేదరూపముగాని, సంసర్గరూపముగానికాదు. కనుక తాత్పర్యశక్తిగోచరముకానిదియు, అలౌకికమైనదియునగు రసాదికము - చతుర్థకక్ష్యానివిష్టమగు ధ్వననవ్యాపారముచేతనే ధ్వనింపఁజేయఁబడును.

లోచనము :— ఇట్లు - "ఇఁకఁబ్రతీయమానమొ" అనునంతవఱకును గల కారికలచేత - [వాచ్యముకంటెవేరగు] ధ్వనిస్వరూపము [ఉన్నదిగా] వ్యాఖ్యాతమైనది. ఇప్పుడు- క్రిందికారికచేత - ఇతిహాసవ్యాజమున, 'అరసాదిధ్వనియే కావ్యాత్మ' అని ప్రదర్శించుచున్నాఁడు.

**(32) మూలము :**

కావ్యస్యాత్మాస ఏవార్థస్తథా చాదికవేఃపురా
క్రౌఞ్చద్వన్ద్వవియోగోత్థఃశోకః శ్లోకత్వమాగతః॥ 5

తే॥ ఆరసాద్యర్థమొకటె, కావ్యమున కాత్మ
యగుచు వెలయు, నదెట్లన; నాదికవికి
క్రౌంచయుగళ వియోగ సంక్రాంతమయిన
శోకమేగద; తొలినొక్క శ్లోకమయ్యె : 5

లోచనము :— మీఁది కారికయందు గ్గడింపఁబడిన, యితిహాసబలమువలనను, "రసాదిలక్షణమగు తృతీయప్రభేదముమాత్రము" అని వెనుకనుపక్రమింపఁబడినవృత్తిగ్రంథార్థబలమువలనను, ప్రక్రాంతమయినప్రతీయమానమాత్రమునందుఁగూడ - "తృతీయమగు రసాదిధ్వనియే - కావ్యమునకాత్మ" అని యుక్తి పురస్సముగా నిశ్చయింపఁదగియున్నది. కనుక, [ఇట్లు విశేషరూపమున నిర్దేశించుటచేత] వస్తుతః, రసమే - ఆత్మ. వస్తుధ్వని, అలంకారధ్వనులు మాత్రము - సర్వథా,రసమునందే పర్యవసానము నొందును గనుక, వాచ్యముకంటె, ఉత్కృష్టములు. కనుక, "ధ్వనిగాకావ్యమునాత్మ" అనుకారికయందు సామాన్యరూపమున [రసాదిధ్వనితోఁగూడ] వస్త్వలంకార ధ్వనులుకూడ - కావ్యాత్మగాఁ జెప్పఁబడినవి.

ప్రభా : ప్రశ్న :— ప్రథమకారికయందు - వస్తు, అలంకార, రసాది రూపమగు ధ్వనిప్రభేదమంతయుఁగూడ - కావ్యాత్మయని చెప్పబడినది, ఇప్పుడీ కారికయందు రసాదిధ్వనిమాత్రమే - కావ్యాత్మయని చెప్పఁబడుచున్నది. ధ్వని ప్రభేదములు మూడునుగూడ - కావ్యాత్మ. కావా ? ఏల ?

ఉత్త :— సహృదయ మనోవిశ్రాంతి యెచటనుండునో, అదియే కావ్యాత్మయగును. సహృదయహృదయము, రసానుభూతి నొందువఱకును విశ్రమించు నదికాదు. కనుక, విశ్రాంతిధామమగు రసధ్వనియే- కావ్యాత్మగాఁ జెప్పబడినది. వస్తుధ్వనియు, అలంకారధ్వనియుఁగూడ - సహృదయహృదయ విశ్రాంతిధామములుకావు. అవియు-రసధ్వనియందే విశ్రమించును. అయినను, వాచ్యములగు నలంకారాదులకంటె నుత్కృష్టములగుటవలన, సామాన్య నిర్దేశమున నవియు కావ్యాత్మగాఁదెలుపఁబడినవి. ఈవస్త్వలంకార ధ్వనులు - అంగులైనను, అంగములైననుగూడ-రసమునందే పర్యవసించును. తదితరములకంటె శ్రేష్ఠములగుట వలన వీనికికావ్యాత్మత్వము - ఔపచారికముగఁ జెప్పఁబడినదను నంశము - లోచనకర్త వెనుకనే తెలిపియుండెనుగదా !

అవ :— మీఁది కారికయందు "అరసాద్యర్థమొకటె కావ్యమునకాత్మ" అని ప్రతిజ్ఞకావింపఁబడినది. "ఆదికవికి" ఇత్యాది కారికాభాగముచేత - పురా వృత్తముపన్యసింపఁబడి, ఇతిహాసవ్యాజమున [వాచ్యముగాని, వస్తుధ్వనిగాని, అలంకారధ్వనిగాని, కావ్యాత్మకావని] 'రసమే - కావ్యాత్మ' అనియుపపాదింపఁ బడినది. పూర్వకారికాశేషమిట్లు తెలుపుచున్నది, "సహచారియగు మగపక్షిని - వ్యాధుఁడు చంపుటవలన క్రౌంచద్వంద్వమునకు సాహచర్య ధ్వంసరూపమగు వియోగము [విరహము] కలిగినది. క్రౌంచికి శోకముదయించినది. తద్విభావాది సందర్శనమున అదికవియందుదోద్బోధింపఁబడిన శోకమే - శ్లోకరూపత్వమునఁ బరిణమించినది". అనునది - యీకారికా శేషమునకు సంగతియగుచున్నది.

పూర్వ :-- "క్రౌంచీ, క్రౌంచ, గతమగుశోకము - వాల్మీకియందు, చిత్త వృత్తిరూపమును, స్థాయియగు భావమును, నగు అలౌకిక శోకమెట్లైనది ?

2 చిత్తవృత్తిరూపమగు శోకమునకు శబ్దార్థరూప శ్లోకత్వపరిణామమెట్లు కలిగెను" ? 3 ఈయితిహాసమువలన - రసాదికమే-"కావ్యాత్మ : అనుప్రస్తుత విషయమెట్లు సిద్ధించును ?

సిద్ధా :— శ్రీలోచనకర్త, దీనిని వ్యాఖ్యానించుచు, ప్రత్యుత్తరము నిచ్చు చున్నాఁడు. చూడుఁడు !

లోచనము :— క్రౌంచద్వంద్వ వియోగముచేత- అనఁగా, సహచర హననముచేతనగు సాహచర్యధ్వంసముచేత - ఆడుక్రౌంచమునకు - స్థాయియగు ఏశోకభావముదయించెనో, ఆశోకము-నిరపేక్షభావము.[పునస్సమాగమాశలేనిది] కనుక, విప్రలంభ శృంగారోచితమగు రతిస్థాయిభావముకంటె వేరగునదియే యగును.

పరిభా : ప్రశ్న :— అయ్యా! ఇచట, ద్వంద్వవియోగమువలననుద యించిన స్థాయియగు భావము - శాపాది హేతువువలననగు వియోగమునఁ బుట్టిన స్థాయిభావమగు రతివలె, విప్రలంభ శృంగారమువ కుచితమగు రతియే కాఁ గూడదా ?

ఉత్త :— విప్రలంభ శృంగారమున స్థాయియగు రతిభావము-సాపే క్షము. అనఁగా; పునస్సమాగ మాభిలాషయుక్తము. లేక, సంగమప్రత్యాశగలది. భవభూతివిరచితమగు నుత్తరరామచరితమునందుసీతారాముల కొదవిన వియోగము

"అయమపివియోగోనిరవధిః" అని పునస్సమాగమాశలేనిదిగా అనువాదరూపము నంగూడఁజెప్పఁబడినది. విభావాదిప్రదర్శనమున నచట సమగ్రముగా కరుణరసము ధ్వనింపఁజేయఁబడినది. అచటి రతివలె, నిచటి రతిగూడ - నిరపేక్ష భావము. అనఁగా; పునస్సమాగమాభిలాషమున కవకాశములేనిది గనుక, నిచటి శోకముగూడ - రతికంటె భిన్నమేయగును. రతి - నిరపేక్షమగుటవలన, నిచట శోకమే స్థాయిభావమగును.

అవ : శోకము — శ్లోకమ్మెట్లైనదియు, వ్యాఖ్యానించుచున్నాడు.

లోచనము : ఆశోకమే -[మగపక్షియగు క్రౌంచముతోడి వియోగము వలన ఆడుపక్షియగు క్రౌంచమునకుఁ గలిగినదియు, వాల్మీకిహృదయమున బహు జన్మసంస్కారరూపమున స్థాయియగు భావముగానున్నదియు, నగుశోకమే] వాల్మీకిచేత నాస్వాదింపఁబడి శ్లోకరూపమున పరిణమించినది.

అదెట్లనిన :- తథాభూతమగు [నిషాదునిచేత నిహతమయి, శోణితపరీతాంగ మయి, విరహకాతరమగుచు - నేలఁబడిదొరలుచున్న మగక్రౌంచము, సహచారి యగు నామగపక్షితోడి యెడబాటునొందియున్న ఆడుపక్షియగు క్రౌంచము,అను] విభావములయు, [జాలిఁగొలుపువాక్కులతోఁగూడి ప్రసరించుచున్న] దానియా క్రందనము మున్నగుననుభావములయు, చర్వణచేత - సహృదయుఁడగు వాల్మీకికి హృదయసంవాదము [వీనిప్రతిఫలనము] కలిగినది. తదుపరి. తన్మయీభావమొ దవినది. పిదప, [విభావానుభావ ప్రతిఫలనమువలన మేల్కొలుపఁబడిన ప్రాచీన సంస్కారమును, స్థాయిభావమును అలౌకికరూపమునునగు]శోకము - సమాస్వా ద్యమానతనొందినది. ఆశోకమే - లౌకికశోకముకంటె వేరయినదియు, తన్మయీ భావమునుండి వెలువడి, నిరర్గళమగునట్లు శరీరమునుండి నిర్గమించుచున్న పులకల చేత గుర్తింపఁదగి, స్వీయమగు చిత్తమునుండి యుదయించిన 'ద్రుతి' [ద్రవీభవిం చుట - కఱఁగుట] అను [సూక్ష్మతర] వృత్తిచేత - సమాస్వాద్యమగు సారము గలదియు,[చక్కఁగానాస్వాదింపఁదగిన ప్రాణముగలదియు,]అగు, కరుణరసరూ పతనందినది. [లౌకికశోకమిట్లు - అలౌకిక శోకరూపమగు కరుణరసరూపమున పరిణతినందినది.]

ప్రభా :— "అయ్యా, క్రౌంచీగతమగు శోకమిట్లు; అలౌకిక శోకాత్మక మగు కరుణరసరూపమున పరిణతినందుట బాగుగనేయున్నది. కాని, ఆత్మభూత

మగు కరుణరసము - శబ్దార్థాత్మకమగు శ్లోకరూపమున వెలుపలికి పరిణమించుట యెట్లుసంగతమగును?" అనియాశంకించిచెప్పుచున్నాఁడు.

లోచనము :— [ ఆశోకమే - ఇట్లు రసరూప పరిణామమునొందిన పిమ్మట] రస [జల] పరిపూర్ణమగు [మౌళిస్థ] కుంభమునకొదవిన [నీటితోనిండి శిరస్సునందుండిన కుండకుఁగలిగిన] ఉచ్చలనమువలన [కదలికవలన] దానినుండి వెలికిస్రవించిన జలమువలెను, దుఃఖప్రమోదాదిచిత్తవృత్తి నిష్యందస్వభావములగు [చిత్తవృత్తినుండి బయలువెడలిన పరిణామములగు] వాగ్విలాప ప్రశంసావచనాదులవలెను, కరుణరసముగూడ - [అలౌకికశోకముకూడ] వెలుపలికుద్గమించి, శ్లోకరూపమునఁబరిణమించినది.

ప్రభామతి :— శ్రీశంకుకాదిమతము ననుసరించిన ప్రశ్న :— అయ్యా! విభావాది చర్వణాగోచరమును, స్థాయిభావమును, నగు లౌకికశోకమే - రసము; కనుక, నదియే - కావ్యాత్మ, కాఁగూడదా?

ఉత్త :— రస్యమానతైకసారమగు శోకము - అలౌకికము. కనుకనే, యిది-సిద్ధస్వభావ లౌకికశోకాది విలక్షణము, కరుణరసరూపమగునదియే - కావ్యాత్మ, లౌకికమగు శోకము - కావ్యాత్మకాఁదగదు.

ప్రశ్న :— రసమలౌకికమనుటకు ప్రమాణమేదియులేదు. కనుక, నది-కుందేటికొమ్మువంటిదే కావలసివచ్చునని తోఁచుచున్నది.

ఉ :— అది - స్వీయమగు చిత్తమునుండి వెలువడిన 'ద్రుతి' అను వృత్తిచేత - సమాస్వాద్యమగు, సారముగలదిగా, అనఁగా, స్వసంవేదన సిద్ధముగాఁ జెప్పఁబడినది. స్వానుభవైకవేద్యమగునది - కప్పిపుచ్చుటకు వీలుకానిది. కనుక, దానికి ప్రమాణమావశ్యకముకాదు.

లోచనము :— సమయాపేక్షలేకున్నను, [సంకేతాదుల యపేక్షలేకున్నను] లోకమునందు వాగ్విలాపాదికమువలన - శోకాది చిత్తవృత్తి - వ్యంజితమగునట్లు, క్రౌంచ, క్రౌంచీ, - తదాక్రందనాది - విభా,వానుభావములవలన- వాల్మీకియందుదోృధింపఁబడిన, అలౌకికమగు శోకమే - అకృతకముగనే -[ఈయర్థమునీ శబ్దముచేతఁబ్రకాశింపఁజేయుదును" అని బుద్ధిపురస్సరమగు ప్రయత్నములేకుండఁగనే] ఆవేశవశమువలన [రసవ్యంజనమునకు] సముచితములగు శబ్దములు, ఛందము, వృత్తము, మున్నగువానిచేత - నియంత్రితమైన శ్లోకరూపత్వము

నిట్లుపొందెను.

"మానిషాదః ప్రతిష్ఠాంత్వమగమః శాశ్వతీస్సమాః ।
యత్ క్రౌఞ్చమిథునాదేక మవధీః కామమోహితమ్" అని

ప్రథా :— రసావేశపూర్ణుఁడగు మహాకవి, ఆదికవి, వాల్మీకి ముఖపద్మమునుండి - ఛందోరూపయగు దివ్యభారతి - కావ్యశ్లోకరూపమున ప్రపంచమున మొట్టమెదట నిట్లువెలువడినది ।

అవ :— 'ఆదికవికి శోకమొదవినదేమో' అనిశంకించి, "లేదు లేదు" ఆతనికొదవిన శోకమలౌకికమనుచున్నాఁడు.

లోచనము :— 'మునికి [లౌకికమగు] శోకముకలిగినది.' అని తలఁపఁదగదు. అట్లగునెడల [మునికిఁగూడ శోకమాత్రము కలుగునెడల] ఆదుఃఖముచేత నతఁడుకూడ - దుఃఖితుఁడేయగును. కనుక నప్పుడు [శోకాద్యాత్మకమగు]రసము-కావ్యాత్మయగుట - అవకాశములేనిది కావలసివచ్చును. మఱియు దుఃఖసంతప్తునట్టిదశ [శాపకర్తృత్వరూప, లేక శ్లోకరచనారూప, అగునవస్థ] గలుగదుగదా॥

ప్రథా :— "మునికి" "అనఁగా" ఆత్మానంద నిష్ఠుఁడగుటవలన దుఃఖసంబంధములేనివానికి," అని యర్థము. మునికిఁగలిగినది - అలౌకిక శోకరూపమగు కరుణరసము. అది - లౌకికశోకముగాదు. అది - అలౌకికశోకసంమిళిత చిదానందానుభూతిరూపము. రసీభవించిన శోకము - లౌకికశోకమువలె దుఃఖింపజేయునదికాదు. కనుక, నదియలౌకికమగుచున్నది.

ప్రశ్న :— రసాస్వాదనము- సామాజికునకును, శ్రోతకును, గలుగును. కావ్యశ్రోతగాని, నాట్యప్రేక్షకుఁడుగాని, కాని వాల్మీకికి - రసాస్వాదనమెట్లు కలుగును? కనుక; వాల్మీకికి క్రౌంచవియోగసందర్శనమున జనితమైనది - శోకమేయగును. అది - లౌకిక చిత్తవృత్తిరూపమేయగును. ఆశోకమే - శ్లోకమైనది. అనియేలచెప్పఁదగదో ?॥

ఉ :— "నాయకునకును, కవికిని, శ్రోతకును, గూడ సమానమగునను భూతియేకలుగును" అనుభట్టతౌతాచార్యునభిప్రాయము ననుసరించునెడల, మహాకవియగు నాదికవికి గలిగినది - లౌకిక [చిత్తవృత్తిరూప] శోకముకానేరదు.

ప్రభా :— ముగించుచున్నాఁడు.

లోచనము :— ఇట్లు 'మానిషాద' అనుమీఁది శ్లోకము - చర్వణోచిత మును, శోకస్థాయిభావ, మాత్మగాఁగలదియు, నగు కరుణరసముయొక్క సముచ్ఛలనము [బహిఃప్రసరణము, అనఁగా; వెలుపలికి వచ్చుట]స్వభావము [స్వరూపము] గాఁగలదియైయున్నది. కనుక, ఆకరుణరసమే - కావ్యమున కాత్మయగుచున్నది. ఆత్మయనఁగా; సారభూతస్వభావము. [ప్రాణరూపము, లేక జీవితరూపము.]తదితర [లౌకిక వైదికాది]శబ్దములకంటె కావ్యశబ్దములకు విలక్షణతను గూర్చునదికూడ - కావ్యాత్మయగురసమే. ఈయంశమే - హృదయదర్పణమున నిట్లుచెప్పఁబడినది.

''యావత్ పూర్ణోనచైతేనతావన్నైవవమత్యముమ్''
''రసపూర్ణుండగునంతకున్ గవి-రసప్రస్యందికాఁజాలునే?'' అని.

ప్రభా :— ''మానిషాద'' అనుశ్లోకము - కావ్యరూపము. ఈకావ్యము-కరుణరసనిష్యందరూపము. [కరుణరసమునుండి వెలువడినది.] కనుక, రసమే - కావ్యమున కాత్మయగుట సిద్ధించినది. రసము - కావ్యమున కాత్మయనఁగా; రసమే - కావ్యమునకు జీవమని యర్థమునెఱుఁగునది. రసమువలననే కావ్యశబ్దములకు తదితరశబ్దములకంటె వైలక్షణ్యమేర్పడుచున్నది. ''మహాకవి - [మొదట తాను] విభావాది చర్వణాకృతమగు హృదయసంవాదము, తన్మయీభావము, రత్యాదిస్థాయిభావాస్వాదము, అనుక్రమమున రసముచేతఁబ్రపూర్ణుఁడగునంతవఱకును, కావ్యాత్మయగురసమును వెలికిఁబ్రసరింపఁజేసి, సహృదయులచేత -ఆస్వాదింపఁజేయఁజాలఁడు'' అని హృదయదర్పణమీయంశమునే తెలిపినది. కవి - రసప్రపూర్ణుఁడగునపుడే -కావ్యరూపమున రసమునువెలికిఁబ్రసరింపఁజేయును. కనుక రసవమనరూపముగుకావ్యము - రసరూపమేయగునని తెలియునది. ఇట్లు రసమునుండి వెలువడినకావ్యమునకు - రసమే యాత్మయగుట - యుక్తియుక్తమని సిద్ధించుచున్నది.

లోచనము :— ''మానిషాదప్రతిష్ఠాంత్వమగమః'' అను నాదికవి శ్లోకమున ''అగమః'' అనుచోనున్న అడాగమము - ఛాందసము. [నిషేధార్థకము కాదనిభావము] అరసాద్యర్థమొకటె [సఏవ] అని కారికయందున్న ఏవకారార్థకముచేత [ఏవకారముచేత] ''రసభావాదికమే - కావ్యాత్మగాని, వేరొకటియేదియు, కావ్యాత్మకాదు'' అనిచెప్పుచున్నాఁడు. ['రసాదికమే - కావ్యాత్మ'అని] ఇట్లు

చెప్పుటచేత—

''శబ్దము - ప్రధానమగునది - శాస్త్రమందు
నర్థము - ప్రధానమగునదాఖ్యానమందు,
రవి - యముఖ్యములగుచుచుండ; వ్యాపృతియె ప్ర
ధానమగునది - కావ్యాభిధానమగును''

అనిభట్టనాయకుఁడుచెప్పినది - అపాస్తమయినది.

అదెట్లనిన :— అతఁడు - ప్రధానమని తెలిపినవ్యాపారము - ధ్వననమా? అభిధయా, ? ఆవ్యాపారము - రసీభవింపఁజేయుటయే స్వభావముగాఁగల ధ్వననమే యగునెడల; [అదియే ప్రధానమని మేముచెప్పియుండుటవలన] భట్టనాయకుఁడు - క్రొత్తగాఁజెప్పినదేదియులేదు. ''ఆవ్యాపారమభిధయేయగునెడల; [ప్రధానమగు నభిధయే కావ్యత్వప్రయోజకమగునెడల శాస్త్రాదులకుఁగూడ కావ్యత్వముకలుగవలసివచ్చును. కనుక కావ్యవిషయమున] దానికి ప్రాధాన్యము లేదు'' అని మేమింతకుముందే తెలిపియుంటిమిగదా!

అవ :— [వృత్తికారుఁడు - ] [కారికా] శ్లోకమును వ్యాఖ్యానించుచున్నాఁడు.

**(33) మూలము ;—** వివిధ [విశిష్ట] వాచ్య, వాచక, రచనా, ప్రపంచసుందరమగు కావ్యమునకు [వివిధమును, - విచిత్రమును, కనుకనే, విశిష్టములగు వాచ్యము, వాచకము, రచన, అనువానియందు, అధికమును,నగు శబ్దరాలంకారగుణ సౌందర్యముగల, కావ్యమునకు] ఆయర్థమే-[తృతీయధ్వని ప్రభేదమని తెలుపఁబడిన రసాదిధ్వనియొక్కటియే] సారభూతము. [సారమయినది.]

అదియెట్లనిన :— తనసహచరము - [మగక్రౌంచము] నిషాదునిచేత నిహతముకాఁగా; విరహకాతరమగుచున్న [ఆడు] క్రౌంచమొనర్చు నాక్రందముచేత - ఆదికవియగు వాల్మీకికి జనించిన

[విభావాది చర్వణచేత, హృదయసంవాదాది క్రమమున నాస్వాద గోచరమయిన] శోకమే - శ్లోకరూపమున నిట్లుపరిణతినందినది.

మానిషాద ప్రతిష్ఠాంత్వమగమశ్శాశ్వతీస్సమాః
యత్ క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్.

కం॥ బ్రతుకవుసుమాఁ నిషాదుఁడ;
ప్రతిష్ఠగనికెన్నొయేండ్లవనిఁ; గామవిమో
హితమౌచుఁ గ్రౌంచమిథున
స్థితిఁగలిగిన యొక్కనినిజదిపితివి గనుకన్. (7)

అని.

ప్రభా :— వాల్మీకికొదవిన అలౌకికశోకమునుండి యుదయించి, శ్రీమద్రామాయణరచనకు నాందీశ్లోకమయి, ప్రపంచలోకులచేతఁగూడ- శ్లోకింపఁబడుచున్న యీశ్లోకమునకిట్లు మూడర్థములు చెప్పుదురు.

(1) నిషాదపరమగునర్థము : "ఓనిషాదుఁడా! నీవు క్రౌంచపక్షి మిథునమునుండి, కామమోహితమగు మగపక్షినొకదానినిజంపితివి. ఆకారణమున నీవిఁక పెక్కేండ్లు ప్రతిష్ఠనొందకుము" (బ్రతుకకుము) ఇదివాచ్యార్థము. దీనివలననే స్ఫురింపఁజేయఁబడిన వ్యంగ్యార్థములలో మొదటిది - (2) శ్రీరామ ప్రతిష్ఠాపరమగు వ్యంగ్యార్థము :— 'మా' అనఁగా! లక్ష్మి. ఆమెకు అశ్రయము కనుక, మానిషాదుఁడనఁగా; శ్రీనివాసుఁడేయగు. రాముఁడు. క్రుంచయనఁగా; కుటిలగతి. క్రుంచగతిగల కైకసియనురాక్షసి-క్రౌంచి. దానిసంతతియగు పురుషుఁడు - రావణుఁడు - క్రౌంచుఁడు. ఇట్లు క్రౌంచుఁడగు రావణునిపత్నియగు మండోదరి - క్రౌంచి. క్రౌంచ క్రౌంచులమిథునము - క్రౌంచమిథునము. సహృదయులు- ఇప్పుడు దీనియర్థము నిట్లెఱుఁగునది

"శ్రీనివాసుఁడవగు శ్రీరామా! నీవు క్రౌంచమిథునమగు రావణమండోదరీ మిథునమునుండి [పరసతీ] కామమోహితుఁడగునొకనిని [లోకకంటకుఁడగు రావ

ణుని] వధించితివి. కనుక నీవుశాశ్వతవర్షస్థాయియగు ప్రతిష్ఠనొందుము"

(3) రావణప్రతిష్ఠాభంజకమగు వ్యంగ్యార్థము :— ఇందుదేవర్షులను బాధించుచు, త్రిలోకకంటకుఁడగుటచేత - క్రూరుఁడగు రావణుడునిషాదుఁడుగా సంబోధింపఁబడుచున్నాఁడు. రాజ్యపరిత్యాగ, వనవాసాది దుఃఖములచేత 'క్రుంచను' అనఁగా; 'కృశించుట' అను అర్థిభావమునుబొందిన సీతారాములు- క్రౌంచమిథునముగాఁ జెప్పఁబడుచున్నారు. కాఁగా, దీనియందలి వ్యంగ్యార్థమునిట్లు ఉంగునది.

"కిరాతుఁడవగు రావణా ! శ్రీజానకీరామ మిథునమునుండి నీవు జానకీ రూపమగునవయవమును [చదిపితివి] వధించితివి. అనఁగా! అపహరించితివి. [సీతాపహరణము - ఆదంపతులకు వధకంటెను పీడాకరము గనుక, అపహరించుటయే-వధించుటగాఁజెప్పఁబడినదని తెలియునది.] కనుక నీవిఁకనెన్నో సంవత్సరములు - ప్రతిష్ఠను, అనఁగా; 'లంకనేలుట' యున్నగు బ్రహ్మవరదత్తమగు ప్రతిష్ఠను, బొందకుము."

ఆంధ్రీకృతపద్యమునందుగూడ - మీఁదియర్థములు మూడుననుసంధింపఁబడినవి.

(1) నిషాదుఁడా! = కిరాతుఁడా! ప్రతిష్ఠగ = భూలోకస్థితికలుగునట్లు (నీవు) బ్రతుకవుసుమా!— ఒక్కనిని = మగపక్షిని. చదిపితివి = వధించితివి.

(2) సుమానిషాదుఁడ ! = యోగ్యురాలగు శ్రీదేవికాశ్రయుఁడవగు అనఁగా; సుశ్రీనివాసుఁడవగు శ్రీరామా! 'ప్రతిష్ఠగ నింకేన్నోయేండ్లవనిన్' = భూలోకమునందు పెక్కుసంవత్సరములు, సత్కీర్తి యుక్తముగా (నీకు) బ్రతుకు + అవున్ = జీవితముకలుగును. ఒక్కనిన్ = రావణుని.

(3) నిషాదుఁడా! = కిరాతుఁడవగురావణా! బ్రతుకవు — జీవింపవు. ఒక్కనిన్ = సీతారూపమగు అవయవమును, చదిపితివి = అపహరించితివి. ("ఒక్కఁడు" అనునది- మహదమహత్సాధారణవాచకము.

లోచనము :— 'వివిధమును' అనఁగా; వాచ్యాదులగు నాయావ్యంజకములచేత వ్యంజనీయములగు నాయారసాదుల కనుగుణమగుటచేత -[అభివ్యంజన యోగ్యతను సంపాదించుటచేత] విచిత్రమయినదియు, [కనుకనే] వాచ్యమునందును, వాచకమునందును, రచనయందును. [సంఘటన, లేక కూర్పునందును]

అధికమైనదియు, నగుసౌందర్యము--కలదియగు కావ్యమునకు, అనఁగా; [రసాద్యనుగుణశబ్దార్థరచనారూపములగు] శబ్దార్థాలంకార, గుణములతోఁగూడియుండుటవలన సుందరమగు కావ్యమునకు - అరసాదిధ్వనియే - సార [జీవ] మయినదనియర్థము. ఆకారణముచేత [రసానుగుణ వాచ్య, వాచక, రచనారూప - శబ్దార్థాలంకారగుణ, [సౌందర్యయుక్త] మగునదియే కావ్యమగుటచేత-] అంతటను గూడ - ["మాణవకుఁడు సింహము" మున్నగులౌకిక వ్యవహారాదులయందుఁ గూడ] ధ్వననవ్యాపారమున్నను. అచట, కావ్యత్వవ్యవహారముకలుగదు. [విభువగు] ఆత్మ - అన్నిఁటియందునుగూడనున్నను, కొన్నిఁటియందే [మనుష్యాదులయందే] జీవత్వవ్యవహారముకలుగుచుండునని వెనుకనేచెప్పియుంటిమి. కనుక, "అట్లయినయెడల [ధ్వననయుక్తమగునదియే కావ్యమగునెడల] అంతటనుగూడ [లౌకిక, వైదికశాస్త్రవ్యవహారములయందుఁగూడ] కావ్యత్వవ్యవహారము కలుగవలసివచ్చును" అని హృదయదర్పణమున నొనర్పఁబడిన యాక్షేపము - నిరవకాశమగుచున్నది. ["నిహత, సహచరీవిరహకాతర క్రౌఞ్చాక్రన్దజనితః" అనుపాఠము ననుసరించునపుడు] నిహతమయినదియు, సహచరీవిరహకాతరమయినదియు, నగు మగక్రౌంచము - [ఆలంబన] విభావము. దానియాక్రందనమనుభావము. ["సన్నిహితసహచరీవిరహకాతర క్రౌంచాక్రన్దజనితః" అనుపాఠము ననుసరించునపుడు]

వాల్మీకికి సమీపమునందు, తనవిరహముచేత కాతరమగుచున్న మగక్రౌంచమును గుఱించి యాక్రందనమునొనర్చుచున్నసహచరి [ఆడుపక్షియగు క్రౌంచి-] ఆలంబనవిభావము. దానియాక్రందనమనుభావము.

ప్రభా :— ధ్వన్యాలోకవృత్తియందుగల - "నిహతసహచరీవిరహకాతర క్రౌఞ్చాక్రన్దజనితః" అనుపాఠమును, "సహచరీహననోద్భూతేన సాహచర్యధ్వంసేనోత్థితః', అనులోచనపాఠమును, బరిశీలించునపుడు, నిషాదునిచేతఁజంపఁబడినది - ఆడుక్రౌంచముగాఁజెప్పబడినట్లుతోచును. ఈయంశము- శ్రీమద్రామాయణమునందు బాలకాండమునందలి ద్వితీయసర్గమునందున్న క్రిందియంశముతోడి విరోధముగలదగుచున్నది.

తస్యాభ్యాశేతు మిథునం చరన్తమనపాయినమ్
దదర్శభగవాంస్తత్ర క్రౌఞ్చయోశ్చారునిస్వనమ్.[బా.ద్వి 9]
తస్మాత్తుమిథునాదేకం పుమాంసం పాపనిశ్చయః
జఘానవైరనిలయో నిషాదస్తస్యపశ్యతః (10)

తం శోణితపరీతాఙ్గం వేష్టమానం మహీతలే
భార్యాతునిహతం దృష్ట్వారురావకరుణాంగిరమ్ (11)
..........................................................
..........................................................

[ 13, 14, 15] [వీనియర్థము నిట్లెఱుంగునది]

"భగవానుఁడగు వాల్మీకి - ఆవనమున తనసన్నిధియందే - ఏయపాయ మును లేక, జోడుఁబాయక, సుందరనిస్వనములుగలిగి, సంచరించుచున్న క్రౌంచ మిథునమును జూచెను (9) పాపనిశ్చయుఁడును, వైరనిలయుఁడును, నగు నొక నిషాదుఁడు - ఆక్రౌంచమిథునమునుండి పురుషపక్షినొకదానిని - వాల్మీకి చూచు చుండఁగనే, పడఁగొట్టెను (10) రక్తముచేతనంతటను సిక్తమగు నంగముగలది యు, [తనతోడి వియోగమును సహింపఁజాలక] నేలఁబడిదొరలుచున్నదియు, నగుమగక్రౌంచమును, జంపఁబడినదానినిగాఁ జూచి- సహచారియు, [తనతోఁగూడి తిరుగునదియు,] పతియు, నగు నామగపక్షితోడి వియోగమునొందిన భార్యయగు క్రౌంచి - జాలిఁగొలుపునవియగు వాక్కులతో బిగ్గరగా విలపించెను. (11)

అప్పుడు నిషాదునిచేత [చంపఁబడి] నిపాతితమయిన మగపక్షినిజూచిన ధర్మాత్ముఁడగు నాఋషికి - కారుణ్యము [జాలి, లేక, రసాత్మకమగు శోకము,] కలిగెను. (13) తదుపరి. ఆద్విజుఁడగు వాల్మీకి - కరుణవేది, కనుక, నేడ్చు చున్న క్రౌంచినుద్దేశించి- 'అధర్మ'మని చెప్పియోచాచ్చి, [నిషాదునిఁగూర్చి] యీ వాక్యమును వచించెను. (14)

"ఓనిషాదుఁడా! నీవు క్రౌంచమిథునమునుండి కామమోహితమగు మగపక్షి నొకదానిని జంపితివి. కనుక, పెక్కుసంవత్సరములు - నీవిఁక ప్రతిష్టను [పొన్ని స్థితిని] పొందకుము! 15

తదుపరి, "............ పాదబద్ధము. సమాక్షరము, తంత్రీలయ సమన్విత మునగుచు, శోకార్తుఁడనగు నానుండియిట్లుప్రవర్తించిన యిది-[యీవాక్యము]శ్లోక మేయగును. ఇంకొకవిధముగలదికాదు." అనివాల్మీకియత్యాశ్చర్యమున భరద్వా జునితోననెను. (18)

మీఁదిశ్లోకములవలన, మగక్రౌంచమే - నిషాదునిచేత - బాణముచేతఁగొట్టఁ బడి, [సహచరీవిరహకాతరమగుటవలన] నేలఁబడిదొరలుచున్నట్లు చెప్పఁబడినది. కనుక; చంపఁబడినది - మగక్రౌంచమేయనుట స్పష్టము. ఆడుపక్షియగు క్రౌంచి యే-యాక్రందనమొనర్చినట్లు చెప్పఁబడుటవలనను, మగపక్షి యాక్రందనమొన ర్చినట్లు చెప్పఁబడకుండుటవలనను, క్రౌంచినే - ఆలంబనవిభావముగాను, దాని, యాక్రందనాదికమునే అనుభావముగాను, జెప్పుటయే - సముచితమగును.

లోచనమున, "సహచరహననోద్భూతేన" అను పాఠముండియుండు ను. ఆపాఠము - "సహచరీహననోద్భూతేన" అని లేఖకప్రమాదమున తప్పు గాఁబడియుండవచ్చును.

"గ్రంథాంతమునందలి సింహావలోకనమునసీయంశము-విమర్శింపఁబడును. కనుక, నిచట సమగ్రముగావిమర్శింపఁబడుటలేదు."అచట, నీయంశమునుపాఠ కులు పరిశీలించునది.

ప్రభా :— "అయ్యా! వృత్తిగ్రంథము నవలోకించునెడల - ఆక్రందన మును వినుటచేత - వాల్మీకిమునికి - లౌకికమగుశోకమే - జనించినట్లును, చిత్త వృత్తిరూపమును, లౌకికమును,నగునాశోకమే - శ్లోకముగాఁబరిణమించినట్లును, తోచుచున్నది.లోచనము-'మునికి[లౌకికమగు] శోకముకలిగినదనితలఁపఁదగదు.' అనిశోకమును నిషేధించుట-ఎట్లుకుదురును"అనియాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— "జనించినశోకము" అనఁగా; [అనాదివాసనారూపము న, మునిహృదయమునుండి] విభావాదిచర్వణచేత గోచరీకృతమయిన [అలౌకిక] శోకము" అనునర్థమునెఱుఁగవలయును.

ప్రభా :— లౌకికమగుశోకముద్వేజకమేయగును. చర్వణాగోచరమగు శోకమలౌకికము. చర్వణావస్థగల శోకమునుండియే - శ్లోకపరిణతికలిగినది.

అవ :— "శోకమేగద తొలినొక్కశ్లోకమయ్యె!" అనిచెప్పినధ్వనికర్త యభిమతము ననుసరించునెడల, చర్వణావస్థగలశోకమే - శ్లోకముగాఁబరిణమించి నట్లున్నది. కనుక చర్వణావస్థగల శోకమే- కావ్యమున కాత్మయనిచెప్పఁదగును రసమును - కావ్యాత్మగాఁజెప్పఁదగదు. శోకమే - కరుణరసముకాదుగదా!" అని యాశంకించి, ఈ యంశమును - ఆలోకకర్త - మీఁదఁజెప్పుచున్నాఁడని యవ తరణిక నొనర్చుచున్నాఁడు.

లోచనము :— అవ :— ''అయ్యా! శోకచర్వణవలన శ్లోకముద్భవించినచో, [అభిధావృత్తిబోధ్యమగు నాశోకమే - కావ్యమునకాత్మకావలసియున్నది.] ప్రతీయమానమగు వస్తువు [వ్యంజనాగమ్యమగు రసాదికము] కావ్యమునకాత్మఅనుసది - ఎట్లుసంగతమగును.'' అనియాశంకించి, చెప్పుచున్నాఁడు.

34 మూలము :— శోకము -కరుణరసస్థాయి భావము గదా; [కరుణరసమునకు స్థాయియగుభావముగదా!] అది- [కరుణరసస్థాయిభావమగు శోకము] ప్రతీయమానరూపమే, అని ప్రతిపాదింపఁబడినది.

లోచనము :— కరుణమనురసము -శోకచర్వణకేగోచరించునది, యగు స్వరూపముగలది. కనుక, శోకమే -కరుణరసమునకు స్థాయిభావమగుచుండును. [వర్ణింపఁబడునవియగు క్రౌంచ్యాదులయందున్న] శోకాదికము - స్థాయియగు భావమైయుండునపుడు, ['ఆ'శోకాదికమునకు కారణములగు] విభావములును, [కార్యములగు] అనుభావములును, ఏవేవివర్ణింపబడునో, అవి-సహృదయులగు చర్వయితలచేత, చర్వ్యమాణములగును. [ఆస్వాదింపఁబడును.]ఆస్వాదింపఁబడునవియగు నాయావిభావానుభావములకు సముచితమగు [శోకాదిరూపమగునేయే స్థాయిభావము - కావ్యమునందు వర్ణింపఁబడుచున్న, ఆయావ్యక్తులయందుండునో, దానికి సజాతీయమగు నాయాస్థాయిభావము - సహృదయుఁడగు నాస్వాదయితయందుఁగూడ వాసనారూపమునసున్నదియే - మేల్కొలుపఁబడును. ఇట్లుమేల్కొలుపఁబడిన] శోకాదిరూపమగు చిత్తవృత్తి - రస్యమానాత్మయై.. [ఆస్వాదింపఁబడునదియై] కరుణాదిరసమగును. కనుక, ఔచిత్యమువలన [స్థాయియగుభావమై, రసమునందుపయోగించునదియగుటవలన] 'స్థాయిభావము (కూడ) రస'మని ఉపచారవశమునఁజెప్పఁబడుచుండును.

ప్రభా :— ఆస్వాదమను మారుపేరుగలదియు, ఆనందఘనమును, స్వసంవేదనగోచమును, అగునేయర్థముగలదో, అదియే-కరుణాదిరూపమగు రసమని తెలియునది.

ప్రశ్న : అవ ;— అయ్యా! అలౌకికమగురసము-స్థాయిభావముకంటె వేరయినయెడల, 'స్థాయియగుభావమే రసము.' అనియు, 'శోకమే - శ్లోకమ

య్యెను.' అనియు, స్థాయియగుభావమునే - రసముగావ్యవహరించుట విరుద్ధము గదా!

ఉత్త :— రసచర్వణయందు స్థాయిభావమగు శోకాదికముపయోగించుటవలన శోకాదులను- రసములుగా వ్యవహరించుట-ఔపచారికమేయగును. కాని, ముఖ్యముకాదు.

కరుణమునందు శోకముపయోగింపఁబడును. కాని, శోకమే- కరుణరసము కాదు. శోకము - కరుణముగాకున్నను, కరుణమునందుపయోగించునదియగుట వలన, శోకమువలన - శ్లోకముదయించినదని చెప్పఁబడినది. నిజస్థితిచేత - కరుణమునుండియే - శ్లోకముదయించినదని చెప్పఁబడవలయును. 'ఋషికి కారుణ్యము కలిగెను.' 'కరుణవేది - కనుక,' అని తెలిపిన వాల్మీకియభిమతముగూడ నిదియే యగును.

అవ :— ఎట్లుపయోగించునదియు చెప్పుచున్నాడు.

లోచనము :— [సహృదయునిచేత] తనయందనుభవింపఁబడినదియు, నితరమునందు [క్రౌంచ్యాదులయందు] ఆక్రందనాదులచేత అనుమానింపఁబడినదియు, నగు చిత్తవృత్తిజాతము -[శోకాది స్థాయిభావము] సంస్కారక్రమమున [మేల్కొలుపఁబడి, హృదయసంవాద, తన్మయీభావములనొదవించి] 'చర్వణయందుపయోగించునదియగుట' - అను నౌచిత్యమువలన- స్థాయిభావమగు శోకాదికమే - రసమని వ్యవహరింపఁబడునని [ఉపచరింపఁబడునని] చెప్పఁబడినది.

ప్రభా :— ఈయంశముగూడ - మరల రసవిచారమునందు విస్తరించి చెప్పఁబడును గనుక, నిచట విస్తరింపఁబడుటలేదని తెలియునది.

అవ :— 'ధ్వనిప్రభేదమంతయుఁగూడ - కావ్యాత్మ, అని, గ్రంథాదిని దెలుపఁబడినదిగదా! ఇచట - రసాదిధ్వని ప్రభేదమాత్రమే - కావ్యాత్మయని చెప్పుట - అయుక్తముగనున్నది'' అనియాశంకించునదియగు నవతరణిక నొనర్చుచున్నాఁడు.

లోచనము : — అవ -— అయ్యా! ప్రతీయమానరూపము [ధ్వనింపఁజేయఁబడిన యర్థమంతయు] కావ్యాత్మ [యే] యగును. అది - భేదత్రయము గలదిగా ప్రతిపాదింపఁబడినదిగాని, రసైకరూపముగాఁదెలుపఁబడినదికాదు. మీఁ

దియితిహాసముచేత-రసమే- ఆత్మయనిచెప్పఁబడినట్లగుచున్నది. [అదియుక్తమా?] అనియాశంకించి, అంగీకరించి, ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

(35) మూలము :— ప్రతీయమానమునకుఁగూడ [వస్త్వలంకారధ్వని రూపములగు] అన్యప్రభేదములు కాన్పించుచున్నను [రసమునకుఁగల] ప్రాధాన్యమువలన [అన్యములగు వస్త్వలంకారధ్వనులు ప్రధానమగు రసమునందే పర్యవసానమునొందునవి కనుక] రసభావాదిద్వారముననే, [అవికూడ - కావ్యాత్మలగునని] ఉపలక్షింపఁబడుచుండును. [అముఖ్యముగా గ్రహింపఁబడును.]

లోచనము :— "వస్తుధ్వని ప్రభేదమును,'అలంకారధ్వనిప్రభేదమును' రసముసందే పర్యవసానమునొందును. కనుక, [వానికి రసభావాదిముఖముననే కావ్యాత్మత - ఉపలక్షితము.] వస్త్వలంకారములు - తమస్వరూపమాత్రమునందు విశ్రాంతినొందకున్నను. అన్యశబ్దములకంటె [కావ్యమునకు] విలక్షణతను గలిగించుచుండును. ఇట్లు వైలక్షణ్యమును గూర్చుటయను నౌచిత్యమువలన, వస్త్వలంకారధ్వనులకుఁగూడ - కావ్యజీవితత్వము -[ఔపచారికముగ] చెప్పఁబడును" అని భావము.

ప్రభా :-- ప్రశ్న :— వస్తుధ్వనికిని, అలంకారధ్వనికిని,ముఖ్యమగు కావ్యాత్మత్వములేదా? ఏల ?

ఉ :— లేదు. ఏది-స్వరూప మాత్రమునందు విశ్రాంతినొందునో, దానికే ప్రాధాన్యముండును. ఇట్లు ప్రధానమగునదియే - ఆత్మయనిచెప్పఁబడుట కుచితమగును. వస్తుధ్వనియు, అలంకారధ్వనియుఁగూడ - స్వరూపమాత్రమునందు విశ్రాంతినొందునవికావు. కనుకనవి - విభావానుభావాదిరూపమున రసభావాదులయందే-పర్యవసానమునొందును. [తమ] స్వరూపమాత్రమునందు విశ్రమించుటయను పర్యవసానములేకుండుటవలన, వస్త్వలంకారధ్వనులకు ముఖ్యమగు కావ్యజీవితత్వములేదు.

ప్రశ్న :— రసాదిధ్వనిప్రభేదమే-ముఖ్యమగు కావ్యజీవితమని చెప్పఁబడుటకు హేతువేది ?

ఉ :— సహృదయహృదయము - స్వానుభవవైకవేద్యమగు రసము

నందే, సంపూర్ణమగు విశ్రాంతినొందును. కనుక, రసమునకు స్వరూపమాత్రము నందే - విశ్రాంతిరూపమగు పర్యవసానముండుటవలన, రసాదిప్రభేదమే-ముఖ్యమగు కావ్యజీవితమని చెప్పఁబడును.

ప్రశ్న :— "వస్త్వలంకార ధ్వనులు-రసభావాది ద్వారమువనే, కావ్యాత్మలని ఉపలక్షింపఁబడుచుండును", అనువృత్తియందలి వాక్యమునకభిప్రాయమేమి?

ఉ :— ముఖ్యుఁడగు రాజుతోఁగూడి, తత్సంబంధియగు పరివారముగూడ వెళ్లునదియేయగును. కనుక, "రాజు బయలువెడలెను" అనుచోటనున్న 'రాజు' అను పదముచేత, అముఖ్యమగు తత్సంబంధి పరివారముగూడ గ్రహింపఁబడును గదా! ఇట్లు, 'ప్రధానమగు దానిచేత - అప్రధానమగు తదితరమును గ్రహించుటకు ఉపలక్షణమని పేరు. ప్రధానములగు రసభావపదములిచట అముఖ్యములగువస్త్వలంకారధ్వనుల కుపలక్షకములగుచున్నవి. అనఁగా, వస్త్వలంకారధ్వనులుగూడ-ఇచట రసభావపదములచేత-అముఖ్యముగా గ్రహింపఁబడుచున్నవన్నమాట. 'ఇవి, స్వరూపమాత్ర విశ్రాంతినొందక, రసమునందే,విశ్రమించుచున్నను, రసధ్వనిగతములగుటచితరశబ్దములకంటె, కావ్యమునకుపలక్షణతను గూర్చుచుండుట'-అను నౌచిత్యమువలన, అముఖ్యములగు కావ్యాత్మలుగా గ్రహింపఁబడునని భావము.

ప్రభా : అవ :— అయ్యా! వస్త్వలంకార ధ్వనులవలె, వ్యభిచారియగు భావముకూడ - కరుణాదిరసస్థాయిభావమగు శోకాదిచర్వణయందే పర్యవసించి, ఆస్థాయిభావమున కుచితమగు రసమునందు ప్రతిష్ఠనొంది, తద్ రసద్వారముననే కావ్యజీవితమగుట యుక్తమగును. ఇట్లుండ, "రసభావద్వారముననే" అనువృత్తియందు, రసశబ్దముతోఁగూడ - భావశబ్దమును గ్రహించుట - సంగతమగునా? రసమునకువలె ప్రత్యేకమగు భావమునకుఁగూడ - ప్రధానముగా ఆస్వాదింపఁబడి కావ్యజీవితమగుట సంభవమా? అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— "ఆస్వాదింపఁబడుచున్న [లజ్జమున్నగునదియగు] వ్యభిచారిభావమునకుఁగూడ - తనవ్యభిచారిస్వరూప మాత్రమునందే - విశ్రాంతిలేకున్నను, [ఒక్కొక్కప్పుడు] స్థాయిభావచర్వణయందు, పర్యవసానమునొంది, ఆస్థాయిభావమున కుచితమగు రసమునందు ప్రతిష్ఠను [ఉనికిని] పొందకయుండుటకూడ - కలుగుచుండును. కనుక నప్పుడాభావమునకుఁగూడ - ప్రాణత్వము [కావ్యజీవితత్వము] కలుగుచుండును."

అను నీయంశము-భావగ్రహణముచేత-[రసశబ్దముతోఁగూడ భావశబ్దమును

గ్రహించుటచేత, వృత్తియందు] తెలుపఁబడినది.

ప్రభా :— వ్యభిచారిభావమునకు సామాన్యముగా స్వరూపమాత్ర విశ్రాంతియుండదు. ఏది - స్వరూపమాత్రమునందు విశ్రమించునో, అదియే - కావ్య. జీవితమగును. స్వరూపమాత్రమునందు విశ్రమింపని [వ్యభిచారి] భావము - స్థాయిభావచర్వణయందు పర్యవసించి, తదుచితరసమునందుండి, ఆరసము ద్వారముననే, కావ్యజీవితమగుచుండును, గాని, స్వరూపముచేత- కావ్యాత్మకాదు రస్యమానతయే, అనఁగా; ఆస్వాదింపఁబడుటయే, సారముగాగలదియే - రసమని చెప్పఁబడును. అదియే - జీవితమగును. అయిన నొకప్పుడు - తనకుచితమగు విభావాదిసంబంధ మొదవునపుడు, ప్రత్యేకమగు వ్యభిచారిభావమునకుఁగూడ - ప్రధానముగా నాస్వాదింపఁబడుట - కలుగవచ్చును అప్పుడది - కావ్యజీవితమునుగా వచ్చును. దీనికుదా :

గీ॥ దిగఁబడుచున్న వలయమ్ముఁ దీర్చికొనుచు,
గోటి,కొనగోట నీటుగా మీటుకొనుచు,
అందియ యొకింతనినదింప, అవనిదేశ
మున పదమురాయుచుండె నాముద్దరాలు.

ప్రభా :— ఒకముగ్ధ- తన్నువిడిచి,దేశాంతరమునకేగిన తనప్రియుఁడు- వచ్చుచున్నాఁడనితెలిసికొని, ఇట్లొనర్చినది 'దిగ....దీర్చికొనుచు' అనుదానిచేత - ప్రియతమునెడబాసియుండుటచేత - ఉదయించిన కార్శ్యము [కృశించుట] వ్యంజితము. క్రింది యనుభావములచేత స్ఫురింపఁజేయఁబడినదియగు,ముద్దరాలికొదవిన ప్రియతమవార్తాశ్రవణము-ఇచట విభావము. దిగజారుచున్న వలయమును సరుదుకొనుట, గోటిని-కొనగోటితో మీటుకొనుట, మందమును, కలమధురమును, నగు, నినదముగలిగి, రుచిరమగు చరణకిసలయమును నేలరాయుట అను అనుభావములచేత - ఇచట, లజ్జయనుభావము-స్థాయియగు రతిచర్వణయందు విశ్రాంతి నొంది, [పర్యవసించి] తదుచితశృంగారరసమునఁబ్రవేశమునొందకయేయున్నను, ప్రధానముగా నాస్వాదింపఁబడి, కావ్యజీవితమై, సహృదయహృదయమణిముకురస్థలినధివసించు చున్నదిగదా !

రసభావశబ్దమున, రసాభాసభావాభాసతత్ప్రశమములు[ప్రశమాదులుకూడ] సంగ్రహింపఁబడునవియేయగును. అవాంతర వైచిత్ర్యమున్నను [స్వరూపభేదము లేకుండుటవలన] అవియు, తదేకరూపములే. [రసభావరూపములే]కనుక; వానిని గూడ గ్రహింపవచ్చును.

అవ :— ఇట్లు, ఇతిహాసముఖమున ప్రతీయమానమును- కావ్యాత్మగాఁ బ్రదర్శించి, 'ప్రతీయమానము - కావ్యాత్మ' అనునిది - స్వసంవిత్ సిద్ధము [సహృదయస్వానుభవసిద్ధము] గూడనగునని చూపుచున్నాఁడు.

(36) మూలము :—

సరస్వతీ స్వాదుతదర్థవస్తు నిష్యన్దమానా మహతాంకవీనామ్।
అలోకసామాన్య మభివ్యనక్తి పరిస్ఫురన్తం ప్రతిభావిశేషమ్.(6)

గీ॥ స్వాదు, గమ్యార్థవస్తు నిష్యందమాన
యై మహాకవివాణి - మహాకవులకు
ఒక మహాప్రతిభను పరిద్యోతితముగ
మహివెలార్చు నలోక సామాన్య సరణి. (6)

మహాకవి వాణి - [సరస్వతి] వస్తుతత్త్వమును [వ్యంగ్యార్థ రూపమగురసాదికమును] నిష్యందింపఁజేయునదియై, మహాకవులకు అలోకసామాన్యమైన [లౌకికముకాని] ప్రతిభావిశేమును పరిస్ఫురించు దానినిగా [సాక్షాత్కారగోచరమగు దానినిగా] అభివ్యక్తికరించును. [అంతటనువెలార్చును] కనుకనే, అతివైచిత్రికవిపరంపరావాహినియగు [కావ్య] సంసారమున కాళిదాస ప్రభృతులు - ఇద్దరు, ముగ్గురు, గాని, ఐదారుగురుగాని, మహాకవులనిగణింపఁబడుచున్నారు.

లోచనము :— వాణి-[సరస్వతి] 'వాగ్రూపయగు భగవతి' అనియర్థము. కారికయందలి అర్థశబ్దమునకు వస్తువనియు,[అభిప్రాయమనియు] వస్తుశబ్దమునకు తత్త్వమనియు, వృత్తికర్తచేత వ్యాఖ్యానింపఁబడుచున్నది. నిష్యందమానయై-దివ్యమగు ఆనందరసమును స్వయముగా స్రవింపఁజేయుచున్నది [చేపునది] యై, అనియర్థము, [వాణికిచట - ధేనువుతోడి సామ్యము సూచింపఁబడినది.]

గీ॥ వాణియనియెడిధేనువు బాలతృష్ణ
స్వయముగ స్రవింపఁజేయు రసమ్ముతోడ
జతనము వహించి యోగులు పితికిపొందఁ
దగిన రసమెట్లు సరిచేయఁదగినదగును ?

అని. భట్టనాయకుఁడుకూడ-నిట్లేచెప్పెను.

ప్రభా :— [మహాకవులయందుఁగల] వాణియను [కావ్యరూపమున, పరిణమించిన] పాడియావు - అలౌకికమగు రసమును [రసమను పాలను] బాలుని వలె నేమియు నెరుఁగని వాగ్దేవతోపాసకుఁడగు సహృదయ (కవి) బాలుఁడను దూడయందు - కారుణ్యమను వాత్సల్యముచేత- [రసావేశముచేత] స్వయముగా ప్రస్నవింపఁజేయు [చేపు] చున్నది. కనుక, యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యానసమాధిరూపమగు ప్రయత్నముగల యోగులచేత - సంపాదింపఁబడుచున్న బ్రహ్మానందరసము-[కూడ] దానికి [సరస్వతీ ప్రసాదము చేత స్వయముగా లభించిన కావ్యానందరసమునకు] సాటిచేయఁదగినదికాదు. స్వయముగా పండినపండు - ప్రయత్నించి పండింపఁబడిన పండును - రుచియం దతిశయించునట్లు, స్వయముగా స్రవింపఁజేయఁబడుచున్న పాలు-[కావ్యరసము] ప్రయత్నముచేత పితుకఁబడినపాలను [బ్రహ్మానందరసమునుగూడ] అతిశయించుట-యుక్తమేయగునని భావము.

లోచనము :— యోగులచేత - ఏరసము - ప్రత్యాహారాది సాధనక్రమమున, ఆక్రమించి పితుకఁబడుచున్నదో. ఆరసము - రసావేశముచేతనే - ఉపాసక సహృదయ (కవి) వత్సములకు లభించుచున్నది.

ప్రభా : అవ :— పితుకఁబడిన పాలకంటె- స్వయముగా స్రవించిన పాలకుఁగల అతిశయమునకు-ప్రామాణ్యమును ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— కనుకనే,

గీ॥ ధరముల్లెల్ల హిమాద్రి వత్సముగఁజేసి,
దోహదక్షుండు మేరువు - దోగ్ధగాఁగ;
పృథునము పదిష్టయయిన ధరిత్రికనిన
రతనములు మహౌషధులును బితికికొనియె. [కుమారసంభవము]

అనుశ్లోకమున, భూమియను ధేనువునుండి, మేరువను పాలుపితుకువాఁడు- పాలుపిండునపుడు, హిమాలయుఁడు-దూడగానున్నట్లు చెప్పుటచేత - "దూడగాఁ దెలుపఁబడిన హిమవంతుఁడే - పృథివికి సారభూతములును, మొదటనుదయించిన వియు, నగు (రత్నాది) వస్తువులకు పాత్రమయ్యెను." అని చెప్పఁబడినదిగదా!,

ప్రభా :— "భగవతియగు సరస్వతి - వాగ్రూపయేగదా! కనుకనే; ఆయమ్మ-మహాకవులయందు వాణియైయున్నది. ఆమహాకవివాణి- దివ్యమును, ఆనందరూపమును, వ్యంగ్యార్థరూప కావ్యతత్త్వమును, నగు రసమును, స్వయముగనే - ఆమహాకవులకు నిష్యందింపఁజేయుచుండును. కవుల కొదవునదియగు రసావేశముచేత - లోకసామాన్యము కానిదగుటవలన-అలౌకికమును, అంతటను స్ఫురించునదియు, [సాక్షాత్కార గోచరమగునదియు] నగు వారిప్రతిభావిశేషము- [సరసకావ్యరచనా నిదానమును, నవనవోన్మేషశాలినియు నగు ప్రజ్ఞ] అన్నిటను స్ఫురించి, అంతటను వ్యంజించును. [ప్రసరించును.] తదుపరి,కవిగతమగురసము- కావ్యనాట్యమంటపవర్తులగు సహృదయ గ్రహీతలందును స్ఫురింపఁజేయఁబడి, వారియందుగూడ - వ్యంజింపఁజేయఁబడును." అని దీనియర్థము.

అవ :— "పరిద్యోతితముగ మహివెలార్చు" అని "పరిద్యోతితమగు నవస్థగలదియే - అభివ్యంజకమగునని చెప్పుటచేత - కవికివలె, శ్రోతకుఁగూడ - ఆప్రతిభ-ప్రత్యక్షముగాఁజేయబడునదియేయగును" అని ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— ప్రతిపత్తలవిషయమున [గ్రహీతలగు] శ్రోతలయందును, సామాజికులయందును,[ప్రేక్షకులయందును]ఆప్రతిభ-[కవులయందున్నది యగు ప్రతిభ] అనుమానింపఁజేయఁబడునదికాదు. ఇంకేమనిన; తదావేశముచేతనే [కవి ప్రతిభకు విషయమగు రసావేశముచేతనే] భాసమాన. [సాక్షాత్కరించునది] అగుచుండును, ఈయంశము మాయుపాధ్యాయుఁడగు భట్టతౌతునిచేత -

"నాయకస్య; కవేశ్శ్రోతుః; సమానోఽనుభవస్తతః"

నాయకునకును, కవికిని, శ్రోతకును, [ప్రేక్షకులకును] గూడ దానినుండి [ ప్రతిభనుండి ] సమానమగుననుభవమే కలుగుఁను. ప్రతిభయనఁగా; అపూర్వ వస్తునిర్మాణనిపుణమగు ప్రజ్ఞ. దానివిశేషము అనఁగా; రసావేశముచేత నగు వైశద్యముచేత [స్పష్టతచేత] సుందరమగు కావ్యమును, నిర్మించుటయందలి సామర్థ్యము. ఈయంశమును భరతముని "కవేరంతర్గతంభావం" 'కవిహృదయమునందున్న భావమును భావింపఁజేయునదిభావము' అని చెప్పియున్నాఁడు. కనుకనే; అనఁగా; అంతటను వ్యంజింపఁజేయునదియు, అంతటను స్ఫురించునదియు, నగు ప్రతిభావిశేషమను నిమిత్తముచేత - "మహాకవి" అను గణనకలుగునని భావము.

ప్రభా :— "మహాకవి పూర్వజన్మ సంస్కారమువలన, వర్ణింపఁబడు

వస్తువున, తన్మయుఁడగును. రసావేశపారవశ్యమునొందును. ఆమహాకవినరస్వతి-కావ్యాత్మయగు రసమును స్రవింపఁజేయును. అప్పుడు, ఆమహాకవి గ్రహావిష్టుని వలెను, ఉన్మత్తునివలెను, లోకులకుఁగాన్పించును. కాని, అతఁడు - పూర్వమహాకవులు తెలిపిన యర్థమునే - అపూర్వముగా నిర్మించుటయందుఁగాని, అపూర్వమగు వస్తువునే - నిర్మించుటయందుఁగాని, సామర్థ్యముగల ప్రజ్ఞవలన - తన కొదవిన రసావేశముచేత [భగ్నావరణచిత్సంవలిత రత్యాదిరూపమగు రస సాక్షాత్కారముచేత] స్ఫుటమగు నిర్మలసౌందర్యముగల కావ్యమునునిర్మించుటయందు సామర్థ్యమును [ప్రతిభా విశేషమును] గలిగియుండును. కనుకనే; ఇతఁడు - రాజకుమారులవంటి సుకుమారహృదయులకుఁగూడ - ధర్మార్థకామమోక్ష ప్రబోధముకొఱకు విభావాదులను ప్రదర్శించి, తానొందిన రసానందమును శ్రోతలకుఁ గూడఁ గలిగించి, తనయందు పరిస్ఫురించుచున్న ప్రతిభావిశేషమును సహృదయులకుఁగూడ - స్ఫురింపఁజేయును'' అనిభావము. ''వాగ్దేవీప్రసన్నత రసానుభూతి-నాయకునకును, కవికిని, శ్రోతకును. గూడ సమానమైయుండును'' అని శ్రీమదభినవగుప్తపాదుని నాట్యాచార్యుఁడగు భట్టతౌతాచార్యుఁడుకూడ-తెలిపియుండెను. వీరిలో, మహాకవియొక్కఁడే- తనహృదయమునందు రసావేశముచేత స్ఫురించిన-భావమును సహృదయులకు ప్రత్యక్షముగ కావ్యరూపమున స్ఫుటీకరింపఁజేయునది యగు సామర్థ్యమునుగలిగియుండును. ఈప్రతిభ-ఎవ్వరికపూర్వముగానుండునో, వారే - మహాకవులుగ, పరిగణింపఁబడుదురు. ఈకావ్యసంసార మహానది - అతి విచిత్రమగు కవి పరంపరను ప్రవహింపఁజేసినది. అయినను, అందు - 'కాళిదాసు' మొదలగువారు - ఇరువురో, ముగ్గురో, లేక ఐదుగురో, ఆరుగురో మహాకవులని పరిగణింపఁబడుచున్నారు. సహస్ర సంఖ్యాకులగు ప్రపంచకవులలో. మహాకవులు మిక్కిలి స్వల్పసంఖ్యలో నుందురని భావము.

(37) మూలము :— ఇదికూడ - ప్రతీయమానమగు నర్థమున్నదనుటకు సాధనమగు మఱియొక ప్రమాణము :—

గీ॥ శబ్దమర్థము శాసించు జ్ఞానమెఱిఁగి
నంతమాత్రముచేతనే, యది గ్రహింపఁ
బడదు, కేవలము, నది - కావ్యార్థతత్త్వ
వేత్తలగు వారికేకదా! వేద్యమగును!

అది - కేవలమును కావ్యార్థతత్త్వజ్ఞులచేతనే తెలియఁబడును.

కను, శబ్దార్థశాస్త్ర [వ్యాకరణాదిశాస్త్ర] జ్ఞానమున్నను, ఆయర్థము - స్పష్టముగ తెలియఁబడునదికాదు.

లోచనము :— కేవలము "ఇఁక ప్రతీయమానమొ" అను కారికచేత సూచింపఁబడిన స్వరూపభేద-విషయభేదములే, కాక, భిన్నమగు సామాగ్రిచేతఁ దెలియఁబడుటకూడ-వ్యంగ్యము వాచ్యముకంటె వేరనుటకు ప్రమాణమగుచున్నదని, 'ఇదికూడ' అనుదానిచేత - చెప్పఁబడినది.

ప్రభా : అవ :— అయ్యా! "ఇఁక ప్రతీయమానము" అను కారికచేత స్వరూపభేదముగాని, విషయభేదముగాని, స్పష్టముగాఁ జెప్పబడినదా ? దీనిచేతఁ దెలుపఁబడినదేమి ?

ఉత్తరము :— ఆకారికయందు 'అన్యమే' అనుదానిచేత-స్వరూపభేదమును, విషయభేదమును,సూచింపఁబడినవి. కనుకనే, లోచనమునందు 'సూచింపఁబడిన' అని చెప్పఁబడెను. ఈకారికచేత . వాచ్యవ్యంగ్య ప్రతీతులకుఁగల భిన్నసామగ్రి తెలుపఁబడెను. వాచ్యార్థప్రతీతియందు శబ్దార్థశాస్త్రజ్ఞానరూపమగునే సామగ్రియుండునో, వ్యంగ్యప్రతీతియందుగూడ, నాసామగ్రిమాత్రమే లేదు. రసాస్వాదనమునందు సమర్థమును, విమలమును, నగు మతిముకురము కలిగియుండుటకూడ - ఆవశ్యకమైయున్నది. వాచ్యార్థవ్యంగార్థములకు భేదములేనియెడల [ఐక్యమేయుండినయెడల] వాచ్యవ్యంగ్యములు రెండునుగూడ- ఏకసామగ్రీవేద్యములే కావలసివచ్చును. ఇట్లు విభిన్నసామగ్రిచేత జనించునదియగు జ్ఞానముచేత-తెలియఁదగియుండుటవలనఁగూడ, అవి - భిన్నములగుచున్నవని దీనిచేతఁదెలుపబడినది.

(38) మూలము :— ఈయర్థము - [వ్యంగ్యము] వాచ్యరూపమేయగునెడల, తద్వాచ్యవాచక స్వరూపపరిజ్ఞానమువలననే దానిప్రతీతి కలుఁగవలసియుండును. ఇంతియేకాక, శబ్దార్థలక్షణమాత్రమునందే పరిశ్రమమొనర్చిన వారలగు కావ్యతత్త్వార్థభావనావిముఖులకు-అప్రగీతులగు [కేవల] గాంధర్వ [సంగీత] లక్షణవేత్తలకు స్వరశ్రుత్యాదిలక్షణమువలె [స్వరూపమువలె] ఈవ్యంగ్యార్థము - అగోచరమే యగుచుండును.

లోచనము :— శబ్దార్థశాస్త్రజ్ఞాన విదులకుఁగూడ - వ్యంగ్యార్థము తెలి

యునదికాకపోదు. కాని,వారికి కావ్యార్థతత్త్వజ్ఞానముకూడనుండిననే,వ్యంగ్యార్థము తెలియఁబడుననిభావము. కావ్యమునకు తత్త్వభూతమగు [సారమగు] నేయర్థము గలదో, వాచ్యముకంటె వేరుగా దానిభావన, అనఁగా; అనవరతమగుచర్వణ. [ఆస్వాదము.] దానియందు విముఖులకు, అనఁగా; ఆసక్తిలేనివారికి [పెడమొగము పెట్టినవారికి] ఈవ్యంగ్యార్థము - గోచరింపదు.

స్వరములు- షడ్జాదులు· [షడ్జము. ఋషభము, గాంధారము, మధ్యమము పంచమము, ధైవతము, నిషాదము, స. రి. గ. మ. ప. ధ. ని.] సప్తసంఖ్యగలవి శ్రుతియనఁగా [గీతాదిరూపమగు] శబ్దమునకు పరస్పరభేదమును మాత్రముగలిగించునదియగు [గీతాదిశబ్దము వినఁబడునప్పుడు, ఆశబ్దమునకుఁగల లవము మున్నగుకాలాంశమును నిమిత్తముగాఁజేసికొని, జనించునదియగు]రూపాంతరము, [వేరొకరూపము] ఏదికలదో, తత్పరిమాణయు, [తత్కాల ప్రమాణముఁగలది అనఁగా; తన్మాత్రకాలముగలదియు,] స్వరమునకును తదంతరాళమునందుఁగల ఉభయమునకును,[పార్శ్వద్వయమునకును]గలభేదములచేలక్షింపఁబడినదియు, నగు ద్వావింశతి [ఇరువదిరెండు] విధములుగల స్వరాంశము. ఆదిశబ్దగ్రహణముచేత - జాతి, అంశకము, గ్రామము, రాగము, భాష, విభాష, అంతరభాష, దేశి, మార్గము, గ్రహింపఁబడుచున్నవి. ప్రగీతులనఁగా; ప్రకృష్టమగు గీతముగలవారు లేక [స్వరసాక్షాత్కారరూప] ఫలపర్యంతమును గానమొనర్చుటకు ప్రారంభమొనర్చువారు. అట్టిఅభ్యాసముచేత నొందఁబడుగాన కౌశలములేనివారు - అప్రగీతులు. అప్రగీతులగు గాంధర్వలక్షణమాత్రవిదులకు - స్వర, శ్రుతి, జాత్యాదుల స్వరూపము తెలియదు.

ప్రభా :— ''స్వర, శ్రుత్యాది లక్షణమివాప్రగీతానామ్'' అనుపాఠమే లోచనకారాభిమతముగాఁగాన్పించుచున్నది. ప్రాణాగ్ని సంయోగమువలన అభివ్యక్తమగు ధ్వని - నాదమని చెప్పఁబడును. ''ప్రాణానల సంయోగమువలన ప్రణవనాదము సప్తస్వరములైపరగె'', అని త్యాగరాజుగూడ- చెప్పెనుగదా! ఆనాదము- అభివ్యంజకములగు నాడీభేదములవలన ద్వావింశతి [ఇరువదిరెండు] ప్రకారములు గలదియగుచున్నది. ఈభేదములే - శ్రుతులని వ్యవహరింపఁబడుచున్నవి. అవి - ఇరువదిరెండనియు, అరువదియారనియు, అనంతములనియుఁ, జెప్పఁబడుచున్నవి. అవి - ఇరువదిరెండనునది గ్రంథకారాభిమతము.'శ్రూయతే' ఇతి' = వినఁబడుచున్నది. కనుక; 'శ్రుతి', అనునది - శ్రుతిశబ్దవ్యుత్పత్తి. ప్రథమశ్రవణమువలన హ్రస్వమాత్రకమగుశబ్దమే వినఁబడుచుండును. స్వరావయవలక్షణమగునది - 'శ్రుతి' అని యెరుఁగునది. స్వరము - సహకారి కారణము

నపేక్షింపకయే, 'స్వయంరంజయతి, ఇతి = 'స్వయముగా శ్రోతలచిత్తమును రంజింపఁజేయునది. కనుక, స్వరమని చెప్పఁబడును. ఇది - స్వరశబ్దవ్యుత్పత్తి. ఈస్వరములు - శ్రుతులనుండియే యుదయించును కనుక, శ్రుత్యనంతరభావులు. షడ్జాదులగు వీని సంక్షిప్తనామములు. స. రి. గ. మ. ప. ధ. ని అనునవి, 'షాడ్జి' మున్నగుజాతులు - పదునెనిమిదిగలవు. ఈజాతులు గ్రామమేళనమువలన నేర్పడును. గ్రామమనఁగా; స్వరసమూహము. అది-షడ్జగ్రామము, మధ్యమగ్రామము, అనిద్వివిధము. జాతులకు-అంశములుండును. స్వరవిశేషములంకే-అంశ(క)ములని పేరు. ఒకేస్వరముగల అంశము- ఏకాంశ(క)మని చెప్పఁబడును. ఇట్టియంశముల విభాగము - భరతనాట్యశాస్త్రములయందు,ప్రదర్శితము. ఆయంశములు - అరువదిమూడున్నవి. జాతిజన్యములుగా ప్రసక్తములగు రాగములు - గ్రామరాగము. భాష, విభాష, అంతరభాష, దేశి, మార్గము మున్నగునవి. వీనిస్వరూపములు 'సంగీతరత్నాకరము'న, రాగవివేకాధ్యాయమునుండి తెలియఁదగినవి. గ్రామాదుల స్వరూపము, విభాగము, మున్నగునవి - సంగీతరత్నాకరమునందలి స్వరాధ్యాయమువలనఁ దెలియఁదగినవి. ప్రకృతమనుసరింతము.అభ్యాసపాటవముచేత-పొందఁదగిన - గానకౌశలములేక, కేవలసంగీతశాస్త్రీయ పదార్థసంబంధులగు లక్షణములను మాత్రమే - తెలిసినవారికి, స్వరము, శ్రుతి, జాతి, గ్రామము,రాగము మొదలగువానిస్వరూపములు స్వానుభవరూపమున,తెలియనట్లు, కేవలశబ్దార్థజ్ఞాపకమును, వాచ్యవాచకలక్షణ మాత్రమును, అగు వ్యాకరణాది శాస్త్రములయందు గాని, వివిధములగు కళలయందుగాని, పరిశ్రమమొనర్చినను, కావ్యతత్త్వమగు రసాదిరూప వ్యంగ్యమును - వాచ్యముకంటె వేరుగా ఆస్వాదించుటయనుభావనయందు విముఖులగువారికి [కేవలవైయాకరణాదులకు] వ్యంగ్యార్థము - బుద్ధిగోచరముకాదు. అనఁగా: కావ్యార్థతత్త్వజ్ఞులగు సహృదయులుకాక, 'దుకృఞ్ కరణే' ఇత్యాది శాస్త్రార్థమునే, జీవితలక్ష్యముగాఁగొని పరిశ్రమించువారికిఆనందరసాత్మకమగు ప్రతీయమానార్థము - గోచరము కానేరదు. కావ్యార్థతత్త్వజ్ఞులగు కవిసహృదయులకుఁగూడ - తమకుఁగల సహృదయతకుఁదోడుగా, ఛందోలంకార నిఘంటు వ్యాకరణాది విజ్ఞానము - ఆవశ్యకమేయగును. 'శబ్దమర్థము- ....మాత్రముచేతనే' అనుచోనున్న మాత్రశబ్దముచేత - అవియు నావశ్యకములను నంశము స్పష్టమగుచున్నదిగదా! "స్వరశ్రుత్యాది లక్షణమివప్రగీతానామ్" అను పాఠాంతరమును స్వీకరించునెడల - ప్రకృష్టగీత సంబంధి స్వరశ్రుత్యాది లక్షణమువలె" అనునర్థమేర్పడును. దీనిచేత - వాచ్యార్థజ్ఞానమునకు శబ్దార్థశాసనజ్ఞానము కావలయుననియు, వ్యంగ్యార్థజ్ఞానమునకు, కావ్యార్థతత్త్వజ్ఞానము కావలయుననియు, భిన్నసామగ్రి తెలుపఁబడినది. "దీనివలన వ్యంగ్యార్థమున్నది." అని సాధింపఁబడుచున్నది.

(39) మూలము : అవ : — ఇట్లు "వాచ్యార్థముకంటె వేరగు వ్యంగ్యార్థమున్నది". అని ప్రతిపాదించి, అదియే - ప్రధానమని ప్రతిపాదించుచున్నాఁడు.

సోఽర్థస్తద్వ్యక్తి సామర్థ్యయోగీ శబ్దశ్చకశ్చన
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌతౌ శబ్దార్థౌ మహాకవేః. (8)

గీ॥ ఆప్రతీయమానమును, తద్వ్యక్తిశక్తి
యుక్తమగుచుండు శబ్దమ్ము నుండునెదియొ।
అట్టిశబ్దమ్ము నర్థమ్ము, యత్నమున మ
హాకవికి - ప్రత్యభిజ్ఞేయమయినవగును, (8)

లోచనము :— "ఇట్లు" అనఁగా; ["ఇఁతప్రతీయమానమొ" అను కారికయందు] స్వరూప, విషయభేదముచేతను, [వెనుకటికారికయందు] భిన్న సామగ్రిచేతఁ దెలియఁదగుటచేతను, [వాచ్యముకంటె వేఱగు వ్యంగ్యార్థమున్నదని ప్రతిపాదించి' అని సమన్వయము] 'ప్రత్యభిజ్ఞేయములైనవి" అనుచోట - 'అర్హములు' అనునర్థమున, కృత్యప్రత్యయము ప్రయోగింపఁబడినది. [అట్టి శబ్దార్థములు - ప్రత్యభిజ్ఞానార్హములు] తనుకనే, సహృదయకవిజనమంతయు [వానినేగ్రహించుటకు] ప్రయత్నించుచున్నది. దీనిచేత [అట్టిశబ్దమును, ఆయర్థమును, ప్రత్యభిజ్ఞార్హములనుటచేత] వ్యంగ్యమునకుఁగల ప్రాధాన్యమున-(సహృదయ) లోకసిద్ధత్వము - ప్రమాణముగాఁ జెప్పఁబడినది. ఇచ్చట 'ప్రత్యభిజ్ఞేయములు' అనుచోనున్న కృత్యప్రత్యయముచేత - 'ప్రత్యభిజ్ఞార్హములు' [విశేషించి తెలియఁదగినవి] అనునర్థమొక్కటియేకాక 'విశేషించి తెలియవలయును.' అని నియోగించునదియగు నర్థముచేత - 'శిక్షాక్రమముగూడఁ' జెప్పఁబడినది. ప్రత్యభిజ్ఞేయశబ్దముచేత - ఇది చెప్పఁబడుచున్నది :—

శ్లో॥ కావ్యంతు జాతుజాయేతకస్య చిత్ ప్రతిభావతః"

"శాస్త్రాదులకంటె వేరైన కవికర్మయగు కావ్యము - ఏదోజన్మమునందు సహస్ర సంఖ్యాకులగు మనుష్యులలో ప్రతిభావంతునికి [రసావేశవిశదసుందర హృదయుఁడగువానికి] ఒకానొకనికి మాత్రమే జనించును." అనునట్లు స్వయముగానే, యీకావ్యతత్త్వము స్ఫురించును. అయినను, సామాన్యముగా స్ఫురించిన

యీకావ్యతత్త్వమునే, ఇది, ఇట్లు [చేయఁదగినది] అని విశేషించి నిరూపించునపుడు [విశేషించి తెలిసికొనిచేయఁబడునపుడది] సహస్రశాఖలుగలదియగును. [విస్తరించును.] మాపరమ గురువులగు [మాగురువులగు భట్టేందురాజులకు సాక్షాత్తుగాగురువులగు] శ్రీమదుత్పలపాదులచేత [ప్రత్యభిజ్ఞాశాస్త్రము చివరను] ఈయంశమిట్లు చెప్పఁబడినది.

శా॥ అయ్యారీతులవేడ, దానుపగతుండయ్యున్, సమీపస్థితుం
డయ్యున్, గుర్తిడకున్న, లోకసముద్రై-యాకాంతుఁడాకాంతతో
సయ్యాటంగొనఁ, డాత్మయయ్యు, నపరిజ్ఞాతుం, డటులే స్వామి, మే
లియ్యన్ జాలఁడు, ప్రత్యభిజ్ఞ - యిది; మాయీబోధ గుర్తింపుఁడీ !

కనుక, తెలియఁబడిన దానినిగూడ-మాటిమాటికిని అనుసంధించి, విశేషముగాఁదెలిసికొనుటయే - ఇచట ప్రత్యభిజ్ఞానమని చెప్పఁబడినది. అంతియేకాని 'అదియే - యిది' అనునంత మాత్రమేకాదు.

ప్రభా :— ప్రాచీన జన్మసంస్కారమున ఒక్కొక్కనికి, కావ్యతత్త్వము స్ఫురించును. సామాన్యముగా స్ఫురించిన కావ్యతత్త్వమును ప్రయత్నముచేత - విశేషించి తెలిసికొనుటయే - ప్రత్యభిజ్ఞానము. కవులకు శబ్దార్థములు స్ఫురించినను, వ్యంగ్యమగు నర్థమును, దానిని స్ఫురింపఁజేయునదియగు శబ్దమును. ప్రయత్నించి, ప్రత్యభిజ్ఞేయములు-విశేషించి 'తెలిసికొనఁదగినవి. ''తెలిసికొనవలసినవి'. అని,'అర్థములు'అనునర్థమును,నియోగించునదియగునర్థమును,గూడ-నిందున్నవి' సామాన్యముగఁదెలిసినను, ఈశ్వరుని విశేషించి తెలిసికొనినయెడల, సాక్షాత్కారాదిరూపమగు ఫలప్రాప్తి కలుఁగకుండునని తెలుపునదియగు పరమగురువుల శ్లోకముదాహరింపఁబడినది. శ్రీమదుత్పల పాదులు- ప్రత్యభిజ్ఞాప్రస్థాన ప్రవర్తకులలో ముఖ్యులైయున్నారు. వారు రచించిన పద్యమునందలి యర్థమిది :- ''దూతినంపియు, ప్రణయలేఖలు వ్రాసియు, పలుతీరులగు ప్రార్థనలచేత రావింపఁబడిన ప్రియుఁడు, - తనచెంతనిలచియున్నను, తన్నురావించిన యామె '- 'అతఁడే యితఁడు' అని తన్నుగుర్తింపకుండునపుడావచ్చిన ప్రియుఁడు : ఆమెతోడి ప్రణయవిహారమును గావింపఁజాలకుండును. అట్లే, సజ్జనులచేత- తమకాత్మయనియు, ప్రభువనియు, సామాన్యముగాఁదెలియఁబడినను, జ్ఞానయోగాది సంస్కారములచేత-విశేషించి తెలియఁబడకుండుటవలన -ప్రాణులహృదయగుహలయందున్నను, గూడ - విశ్వేశ్వరుఁడు-వారికి సాక్షాత్కారాది ఫలములనొసఁగఁజాలకుండును.'' అనునది - దీనియర్థము. దీనిచేత - సామాన్యముగాఁ దెలియఁబడినదానినైనను

విశేషించి, నిరూపించుట' అను నిరంతరానుసంధానరూపమగు 'ప్రత్యభిజ్ఞానము' తెలుపఁబడినది.

(40) మూలము :— అవ్యంగ్యార్థమును, దానిని వ్యంజింపఁజేయునదియగు [ప్రకాశింపఁజేయునదియగు] సామర్థ్యముగల [వ్యంజక] శబ్దమును, ఏదోయుండును. ప్రతిశబ్దమును వ్యంజకము కాదు. ఆశబ్దార్థములే-మహాకవులచేత - ప్రత్యభిజ్ఞేయములు. [విశేషించి, తెలియఁదగినవి.] సుప్రయుక్తములగు వ్యంగ్య వ్యంజకముల వలననే, మహాకవులకు, మహాకవిత్వలాభము [సిద్ధి] కలుగునుగాని, వాచ్యవాచక రచనామాత్రమున, [ఏవోశబ్దములను, అర్థములను గూర్చినంతమాత్రిముచేతనే] మహాకవిత్వసిద్ధి-కలుగునదికాదు.

లోచనము :— 'నేను - మహాకవినగుదునుగాక' అని, యెవఁడాశంసించునో, [వానిచేతనట్టి వ్యంగ్యార్థమును, వ్యంజకశబ్దమును, విశేషించి తెలిసికొనఁదగినవి, తెలిసికొనవలసినవి.]

అవ :— ఇట్లు వ్యంగ్యమగు నర్థమునకును, వ్యంజకమగు శబ్దమునకును, ప్రాధాన్యమును జెప్పుటవలన, వ్యంగ్యవ్యంజకభావము [వ్యంజనావ్యాపారము] నకుఁగూడ - ప్రాధాన్యము - చెప్పఁబడినదియే యగుచున్నది. కనుక, (ధ్వనతి) శబ్దము ధ్వనించును, (ధ్వన్యతే) అర్థము - ధ్వనింపఁజేయఁబడును, (ధ్వననమ్) వ్యాపారము - ధ్వనించుట, అనుమూడును, [వ్యుత్పత్తిత్రియమును,] కుదురునని చెప్పఁబడినది.

లోచనము : అవ :— "అయ్యా! మొట్టమొదట నుపపాదింపఁబడుట వలన - వాచ్యము, వాచకము, వాచ్యవాచకభావము, [అభిధ] అనువానికే - ప్రాధాన్యము కలుగవలసియున్నదిగదా!" అని యాశంకించి, "ఉపాయములకే-ప్రథమోపాదానము-[మొదట స్వీకరింపఁబడుట - లోకసిద్ధమగుచుండును. కనుక, ఉపాయములగు, శబ్ద, అర్థ, తద్వ్యాపారములనే మొదట నుపపాదించుట] యుక్తమగును.'' అను నభిప్రాయముచేత - ప్రాధాన్యమునకు సాధకముగాఁ దెలుఁపబడిన [మొట్టమొదట నుపపాదింపఁబడుట అను] మీఁది హేతువు - వాని ప్రాధాన్యమును సాధింపఁజాలకుండుటయేగాక, విరుద్ధముకూడ నగుచుండును."

అని "వ్యంగ్యవ్యంజకములు" ఇత్యాది వాక్యముచేతఁ జెప్పుచున్నాఁడు.

ప్రభా : అవ :— అప్రధానమయిననుగూడ - ఉపాయమే - మొదట స్వీకరింపఁబడును. కనుక, మొదట స్వీకరింపఁబడునదియే, ప్రధానమనునది- విరుద్ధహేతువనుచున్నాఁడు.

(41) మూలము : అవ :— "వ్యంగ్యవ్యంజకములు- ప్రధానములు. అయినను, కవులు - మొట్టమొదట వాచ్యవాచకములనే, యుపపాదించెదరు. అట్లుపపాదించుటకూడ - యుక్తమే యగును." అని యిప్పుడు చెప్పుచున్నాఁడు.

ఆలోకార్థీ యథాదీపశిఖాయాం యత్నవాన్ జనః।
తదుపాయతయా తద్వదర్థేవాచ్యే తదాదృతః॥ (9)

గీ॥ వస్తుసందర్శనార్థి దీపశిఖఁబడయ,
యత్నమునొనర్చుఁ దదుపాయమగుటవలన,
వ్యంగ్యమున నాదరముఁగల్గువాఁడు, నట్లె -
వాచ్యమగు నర్థమున, యత్నవంతుఁడగును. (9)

ఒకమనుష్యుఁడు - తాను - ఆలోకమును- [వస్తుసందర్శనమును] గోరుచున్నవాఁడే యగుచున్నను, తదవలోకమునకుపాయమగుటవలన, [మొదట] దీపశిఖను గ్రహించుటకు ప్రయత్నముగలవాఁడగుచుండునుగదా!. అట్లే సహృదయుడగు జనుఁడు- వ్యంగ్యమగు నర్థమున నాదరముగలవాఁడే యగుచున్నను, [వ్యంగ్యార్థవ్యంజనమున కుపాయమగుటవలన] వాచ్యమగు నర్థమును స్వీకరించుటకు, యత్నముగలవాఁడగుచుండును. దీపశిఖలేనిదే-యాలోకము సంభవింపదుగదా! [అట్లే, వాచ్యములేనిదే - వ్యంగ్యమును సంభవింపదు.]

దీనిచేత - "ప్రతిపాదఁకుడగు కవి - వ్యంగ్యార్థమును

గుణించినదియగు వ్యాపారము నొనర్పవలయును" అని దర్శింపఁ బడినది.

లోచనము :— "ఆలోకము" అనఁగా; ఆలోకనము = సుందరీ ముఖాదుల సందర్శనము. దానికుపాయము - దీపశిఖయే.

ప్రభా :— 'ఆలోక'శబ్దమిచట, కరణవ్యుత్పత్తిచేత - ప్రకాశగుణవాచకముగాక, భావవ్యుత్పత్తిచేత - చాక్షుషజ్ఞానవాచకమై యున్నది. కనుక, అది - వస్తుసందర్శన రూపమేయగును. వస్తుసందర్శనమునందుమాత్రము - ఉపాయమగునది - దీపశిఖయేగదా ॥.

(42) మూలము :— [ప్రతిపాద్యమగు వస్తువుకూడ - (వాచ్యముకూడ) వ్యంగ్యార్థము నుద్దేశించి, [స్వప్రతీతి నుత్పాదించి] - ప్రవర్తించునదియే కావలయునని] ప్రతిపాద్యమగు వాచ్యమునకుఁగూడ - వ్యంగ్యార్థము నుద్దేశించునదియగు వ్యాపారమును జూపుటకై చెప్పుచున్నాఁడు :—

యథాపదార్థద్వారేణ వాక్యార్థః సమ్ప్రతీయతే
వాచ్యార్థ పూర్వికాతద్వత్ పతిపత్ తస్యవస్తునః. (10)

కం॥ తొలుత పదమ్ముల యర్థము
తెలిసిన వాక్యార్థమవల తెలిసినభంగిన్
దొలి వాచ్యార్థము తెలియ, న
వల వ్యంగ్యార్థమునకుఁ బ్రతిపత్తి జనించున్.
[అవల నావస్తువునకు, ప్రతిపత్తు జనించున్.] (10)

మొదట పదార్థములు తెలియఁబడి, వాని ద్వారమున, వాక్యార్థజ్ఞానము కలుగునట్లు, మొదటవాచ్యార్థము తెలియఁబడి, తరువాత, వ్యంగ్యార్థజ్ఞానము కలుగును.

లోచనము :— భావార్థమున'కిప్పు'రాగా; 'ప్రతిపత్' అనియగును. 'ప్రతి

పత్తు' అనగా, 'ప్రతిపత్తి' - అనియేయర్థము.

సంస్కృతమూలమునఁగల [''తస్యవస్తునః''] ''ఆవస్తువునకు''అనుదానికి- ''సారమగు వ్యంగ్యరూపమునకు'' అని యర్థము.

ఈశ్లోకముచేత - [కారికచేత] ''అత్యంతశబ్దవృత్తజ్ఞుఁడు [వాక్యార్థమును, వృత్తాదులనుగూడ నధికముగాఁదెలిసినవాడు] కానివానికే - పదార్థ - వాక్యార్థముల, క్రమము - స్పష్టముగాఁదెలియునట్లు, అత్యంతసహృదయుఁడు-కానివానికే. వాచ్యార్థ - వ్యంగ్యార్థములక్రమము-స్ఫుటముగా సంవేద్యమగును.'' అని తెలుపఁబడినది. ''[అత్యధికమగు పరిచయముగలిగియుండుటవలన] వాక్య,వృత్త[జ్ఞాన] కుశలుఁడగువానికి, పదార్థ - వాక్యార్థములయందున్న క్రమము - తెలియనట్లు, కాష్ఠాప్రాప్తమగు [అత్యున్నతినొందిన] సహృదయతకలవానికి మాత్రము - వాచ్యార్థ, వ్యంగ్యార్థములయందు క్రమమున్నను, అభ్యస్తమగు [చిరకాలమలవడిన] విషయమున, అనుమానమును [అనుమితిని] విడిచియుండని, (వ్యాప్తి) స్మృతి, మున్నగువానియందున్న క్రమమువలె, తెలియఁబడునదికాదు.'' అని ప్రదర్శింపఁబడినది.

ప్రభా :— ''మొదట- పదములయర్థము తెలియఁబడును. తదుపరి నా పదార్థము - ఆకాంక్షా, యోగ్యతా, సన్నిధి, సామర్థ్యమున, వాక్యార్థమును ప్రతీత మొనర్చును. ఇది - పదార్థ - వాక్యార్థ, క్రమమైయున్నది. అయినను, వాక్యార్థమును, వృత్తాదులను, మిక్కుటమగునభ్యాసముచేతఁదెలిసినవాఁడగు పండితునకు, పదార్థ - వాక్యార్థములకుఁగల ప్రతీతిక్రమము - భాసింపదు. వాక్యాదిజ్ఞానమంతగాలేని, సామాన్యజ్ఞానియగు పాఠకునకు, [అభ్యాసపాటవము లేకుండుటవలన] పదార్థజ్ఞానముకలిగిన పిమ్మటనే, మెల్లమెల్లగా వాక్యార్థజ్ఞానముకలుగును. కనుక, వానిక్రమము - భాసించును. అట్లే, వాచ్య, వ్యంగ్య ప్రతీతులకుఁగల క్రమము కూడ - గొప్పసహృదయతకలవానికి, అనుమితికిని, వ్యాప్తిస్మృత్యాదులకునుగల క్రమమువలె, భాసించునదికాదు, అంతగా సహృదయుఁడుకాక, కొంచెపుసహృదయతకలవానికే, వాచ్య - వ్యంగ్యముల ప్రతీతులందుఁగల క్రమము - స్పష్టముగా భాసించును.'' అనియర్థము.

అవ :— ''వాచ్యార్థ-వ్యంగ్యార్థప్రతీతులకు క్రమముండిననుండుఁగాక; మొదట, ప్రతీతమగుటవలన, వాచ్యార్థమే - ప్రధానమని యేలచెప్పఁదగదు ?'' అనియాశంకించి, వృత్తికారుఁడు కారికాద్వయినవతరింపఁజేయుచున్నాఁడు,

(43) మూలము :అవ:- వ్యంగ్యార్థప్రతీతికిముందు, వాచ్యార్థప్రతీతియుండిననుగూడ - వ్యంగ్యార్థమునకుఁగల ప్రాధాన్యమునకు భంగము [లోపము] కలుగకుండునట్లు ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— "భంగముకలుగకుండునట్లు." [వ్యంగ్యార్థము] ప్రధానము. కనుకనే, ప్రయోజనముగు ప్రతీయమానార్థము, గోచరించునంతవఱకును, ప్రతీయమానరూపమగు తాత్పర్యమునుగుఱించి, అనుసరించుట [బుద్ధిచేత పరుగెత్తుట] యందగు రణరణనము [ఉత్కంఠ] చేత, త్వరనొందింపఁబడి, [సహృదయులు] నడుమను [వాచ్యాంశచర్వణయందు] విశ్రాంతినొందకుందురు. కనుక, వాచ్య - వ్యంగ్య ప్రతీతులకు క్రమమున్నను, దెలియఁబడునదికాదు. ఉన్నక్రమము తెలియఁబడకుండుటయే - వ్యంగ్యము ప్రధానమనుటకు హేతువు.

ప్రభా :— "సహృదయుల హృదయము - కావ్యాభ్యాసపాటవము వలన, వ్యంగ్యార్థము గోచరించునంతవఱకును పరుగెత్తును. ఉత్కంఠాతిరేకమున, వాచ్యార్థమునాస్వాదింపక, పరుగిడి, వ్యంగ్యాంశమునాస్వాదించునపుడు,విశ్రాంతి నొందును. ఆహృదయమునకు, వాచ్యార్థ - వ్యంగార్థ ప్రతీతిక్రమము - భాసింపదు. ఆక్రమము తెలియఁబడకుండుటయే - వ్యంగ్యప్రాధాన్యమునకు జ్ఞాపకమగు హేతువగుచున్నది. ఇట్లుండ; వానిక్రమమును పర్యాలోచించునపుడు, వాచ్యముకంటె వేరయిన వ్యంగ్యమునకుఁగల ప్రాధాన్యమును వేరుగాఁజెప్పనేల." అని భావము.

(44) మూలము :—

స్వసామర్థ్యవశేనైవ వాక్యార్థం ప్రతిపాదయన్।
యథా వ్యాపారనిష్పత్తౌ పదార్థో నవిభావ్యతే. (11)

గీ॥ ఏవిధమ్మున, స్వసమర్థతావశమ్మున
నె, పదార్థమ్ము - వాక్యార్థమును వచించి;
తాను - వ్యాపారనిష్పత్తియైన వెనుక
వేరుగా నుండినట్లు భావింపఁబడదొ. (11)

ఎట్లు - పదార్థము - స్వసామర్థ్యవశముచేతనే, వాక్యార్థ

మును ప్రకాశింపఁజేసియు, వ్యాపారనిష్పత్తి [వాక్యార్థబోధనాను కూలక్రియానిష్పత్తి - అనఁగా; వాక్యార్థబుద్ధి] కలుగునపుడు, [ఆపదార్థము] తాను - [వాక్యార్థముకంటె] వేరుగానున్నట్లు, భావింపఁబడకుండునో,

తద్వత్ సచేతసాం సోఽర్థో వాచ్యార్థవిముఖాత్మనామ్,
బుద్ధౌ తత్త్వార్థదర్శిన్యాం ఝటిత్యేవావభాసతే. (12)

గీ॥ అట్లె, వాచ్యార్థమున విముఖాత్ములయిన
వారలగు సహృదయుల తత్త్వార్థదర్శి
యై వెలయుబుద్ధియందు - వ్యంగ్యార్థమునకు
సత్వరమ్మగు స్ఫురణమ్ము - సంభవించు. (12)

లోచనము :— "స్వసమర్థతావశమ్మనసే" అనఁగా: "[సహకారులగు] ఆకాంక్షా, యోగ్యతా, సన్నిధుల [సమవధానమును]సామర్థ్యముచేతనే [పదార్థము- వాక్యార్థమును, తాత్పర్యశక్తిచేత-తెలియజేయును" అనియర్థము] "నవిభావ్యతే అను మూలకారికయందున్న 'వి'శబ్దముచేత - వేరుగానుండుట చెప్పఁబడినది. కనుక, "వాక్యార్థముతెలిసిన సహృదయులచేత - వాక్యార్థము - పదార్థముకంటె, వేరుగానుండుట - తెలియఁబడునదికాదు" అని యర్థమగుచున్నది.

[ఈయర్థమే - ఆంధ్రీకృతమగు పద్యమున "వేరుగానుండినట్లు భావింపఁ బడదో" అని, విశదీకరింపఁవడినది.] దీనిచేత - "పదార్థప్రతీతికిని, వాక్యార్థప్రతీ తికిని, క్రమముండినను, చక్కఁగాఁదెలియఁబడునదికాదు" అని చెప్పఁబడినది. కనుక, ["ఉన్నక్రిమమే-గుర్తింపఁబడునదికాదు" అనుటవలన,] "వాక్యమును, దానియర్థమునుఁగూడ - అవిభక్త [అఖండ] స్ఫోటరూపములే" అను, స్ఫోట విషయకమగు నభిప్రాయముచేత - "[పదార్థ-వాక్యార్థాది ప్రతీతులకు]క్రమమే- లేదు" అని కొందఱుచెప్పినది - మీదుమిక్కిలి విరుద్ధమేయగును.

"వాచ్యార్థమున విముఖాత్ములు" అనఁగా; "వాచ్యమగు నర్థమునందు 'విముఖమగు' అనఁగా; విశ్రాంతినిబంధన [కారణ] మగు పరితోషమునుపొందని. 'ఆత్మ' అనఁగా; 'హృదయము' గలవారు" అని యర్థమగుచున్నది. కనుక, "వాచ్యార్థమున విముఖాత్ములయిన వారలగు" అనుదీనిచేత- దీనితరువాతనున్న,

"సహృదయులు" అనుదానియర్థమే - అభివ్యక్తమయినది.

పూర్వ :— ["వ్యంగ్యమని చెప్పఁబడుచున్న యర్థమును దెలిసికొనుట యను] ఈమహిమ - సహృదయులదియేకానిండు ; కావ్యమునకుమాత్రమియతిశయమేదియునులేదు." అని చెప్పఁదగదా ?

ఉ :— "సత్వరంబుగు స్ఫురణంబు సంభవించు" అని కారికయందు చెప్పఁబడినదిగదా; [దానియర్థమేమి ? కావ్యవ్యాపారవిశేషమగు వ్యంజనచేతనే-సహృదయులకీవ్యంగ్యము స్ఫురింపఁజేయఁబడుననియేగదా; కనుక, నీయతిశయము - కావ్యసంబంధియేయగును.]

దీనిచేత - [కారికాద్వయవ్యాఖ్యానముచేత] - వాచ్యార్థము - వ్యంగ్యార్థముకంటె 'వేరుగా' భాసింపకుండుట - చెప్పఁబడినది. కాని, 'వాచ్యము - సర్వథా [స్వరూపముచేతఁగూడ] భాసింపదు' అని చెప్పఁబడుటలేదు వాచ్యము - వేరుగాభాసింపకున్నను, వ్యంగ్యముతోఁగూడి భాసించుచునేయుండును. కనుకనే, ప్రస్తుతగ్రంథమునకు - [విషయమునకు] తృతీయోద్ద్యోతమునందు ఘటప్రదీప దృష్టాంతమునొసఁగి - "వ్యంగ్యప్రతీతికాలమునందుఁగూడ - వాచ్యప్రతీతి - విఘటితముకాదు." అనిచెప్పఁబడునదియగు విషయముతోడి విరోధము-కలుగదు.

ప్రథా :-- ప్రకర్షముచేత, లేక ప్రథమముగా [ముఖ్యముగా] సహృదయులబుద్ధి - ఏయర్థమునందుంచఁబడునో, 'అది-ప్రధానము.' అనిచెప్పఁబడును. దానిభావము - ప్రాధాన్యము.

సహృదయులబుద్ధి - వాచ్యార్థమునందు, పదబంధమును, అనఁగా; విశ్రాంతిని, (నిలుకడను) పొందక, ప్రధానమగువ్యంగ్యార్థమునందే-విశ్రాంతినిబొందును. కనుక, ప్రతీయమానమగు నర్థమునకే ప్రాధాన్యముండునని తెలియునది. ఎచ్చట, పరితోషలాభము - కలుగునో, అచ్చటనే, బుద్ధికి విశ్రాంతి [నిలుకడ] కలుగును. వాచ్యార్థమునందు పరితోషలాభము కలుగకుండుటవలన. దానియందు విముఖత నొంది, ఎవరిబుద్ధి- ప్రతీయమానార్థము లభించునంతవఱకును, విశ్రాంతినొందక, ఔత్సుక్యాతిరేకమున, అనుధావనము నొనర్చుచుండునో, వారే - సహృదయులు. ఇట్లు, వాచ్యార్థవిముఖతనొందిన మనస్సుగల సహృదయులబుద్ధియే - తత్త్వార్థదర్శి యగుచుండును. కనుక, నట్టి తత్త్వార్థదర్శియగు బుద్ధియందే - వ్యంగ్యార్థము స్ఫురించి, [ప్రధానముగా] ధ్వనించును. "ఇట్లు వ్యంగ్యమగు నర్థమును దెలిసికొనునది - సహృదయుల బుద్ధియే. కనుక, దీనిని గ్రహించునదియగు మహిమ -

సహృదయులదియే,'' అని భ్రమింపఁగూడదు. కారణమగు కావ్యమును వినిన పిమ్మట, స్ఫుటమగునట్లు లభించిన, వ్యంగ్యార్థస్ఫురణమను కార్యము - కావ్య వ్యాపారవిశేషమగు వ్యంజనచేతనే, కలిగినదని నిశ్చయింపక తీరదు. మీఁది కారికలు రెండింటిచేతను, సహృదయుల బుద్ధియందు స్ఫురింపఁజేయఁబడినవ్యంగ్యము కంటె - వాచ్యము వేరుగానున్నట్లు భాసింపకున్నను, స్వరూపముతో భాసించుచుండునదిగనే చెప్పఁబడినది. కాఁగా; సహృదయుల హృదయమున, వాచ్యము-వేరుగాఁ దెలియఁబడకున్నను, వ్యంగ్యముతోడి సంవలనమునొంది, అవిభక్తముగ భాసించునదియే యగుచుండును'' అని తెలియునది. తృతీయోద్ద్యోతమున 33వ కారికకు సంబంధించిన విషయమున నీయంశము - వివరింపఁబడినది. పాఠకులు - అచట, నీయంశమును జూచునది.

— • ధ్వని లక్షణము • —

(45) మూలము : అవ :— ఇట్లు, వాచ్యముకంటె విలక్షణమగు వ్యంగ్యార్థమునకు - సద్భావమును [ఉనికిని] ప్రతిపాదించి, దానిని [ప్రధానమగు దానియునికిని] ప్రకృతమున [కావ్యవిశేషమగు ధ్వనిలక్షణమునందు] ఉపయోజింపఁజేయుచు, [ఉపయోగము నొందఁజేయుచు] చెప్పుచున్నాఁడు.

యత్రార్థః, శబ్దో,వా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ
వ్యఙ్క్తః కావ్యవిశేషః సధ్వనిరితి సూరిభిః కథితః. (13)

గీ॥ అర్థమయిన, శబ్దమయిన, స్వార్థములు ప
సర్జనీకృతములుగ, నెచ్చటను వ్యంగ్య
[అర్థమైన, శబ్దమైన, స్వార్థముల ప్ర
ధానతను బాసి, యెచ్చోటఁదాము - వ్యంగ్య]
మైన యర్థమ్మును ధ్వనింపఁజేయునవియొ;
ఆ, కృతివిశేషమును - 'ధ్వని' యనిరి బుధులు. (13)

"ఏకావ్య [విశేష]మునందు, వాచ్యవిశేషమగు నర్థముగాని, వాచకవిశేషమగు శబ్దముగాని, [రసాదిరూపమగు] ఆయర్థమును -

వ్యంజింపఁజేయునవి యగుచుండునో, ఆకావ్యవిశేషము - ధ్వని" అనియర్థము.

లోచనము :— "సద్భావమును" అనఁగా; సత్తను, [సాధుభావమును] మఱియు, ప్రాధాన్యమును, అనియర్థము. వెనుక, నిట్లు రెండును - [వ్యంగ్యము నకునికియు, ప్రాధాన్యమును, గూడ] - ప్రతిపాదింపఁబడినవియేగదా! ప్రకృతమున = [ధ్వని] లక్షణమున, ఉపయోజింపఁజేయుచు — ఉపయోగము నొందఁజేయుచు. ఆ "వ్యంగ్యమైన యర్థమ్మును" అనుదానిచేత - వెనుకఁదెలుపఁబడిన, సత్తాప్రాధాన్యములుగల వ్యంగ్యము - పరామర్శింపఁబడి, వానికిచట నుపయోగము కలుగఁజేయఁబడినదని తెలియునది. 1 స్వశబ్దము - ఆత్మవాచి. [స్వంచ, అర్థశ్చ = స్వార్థౌ.] స్వ + అర్థములు = స్వార్థములు. స్వ = ఆత్మ, అర్థము = వాచ్యార్థము. "[ఈ రెండును] ఉపసర్జనీకృతములుగన్ = గుణీకృతములయినవిగా, ప్రధానతను బాసినవిగా, నయి" అనియర్థము.

"తనయాత్మను [స్వరూపమును] అప్రధానముగాఁజేసికొనిన, వాచ్యమగు నర్థముగాని, తనయర్థము నప్రధానముగాఁజేసికొనిన, వాచకమగు శబ్దముగాని. వ్యంగ్యమగు నాయర్థమును, అనఁగా; "స్వాదుగమ్యార్థవస్తు" అని, వెనుకఁదెలుపఁబడిన యర్థమును, ఏకావ్యమున - ధ్వనింపఁజేయునవియొ, అనఁగా; ప్రధానముగా వ్యంజింపఁజేయునవియో, ఆకావ్యవిశేషము - ధ్వని" అనునది ఫలితార్థము. ["వ్యఙ్క్తః"] "ధ్వనింపఁజేయునవియొ" అనుచోటనున్న, ద్వివచనముచేత - [ధ్వనికారుఁడు - గంభీరమగు] ఈయర్థమునిట్లు తెలుపుచున్నాఁడు. "అవివక్షిత వాచ్యధ్వనియందు - శబ్దమే - ప్రధానముగా వ్యంజకమగుచుండును. అయిన, నచటఁగూడ - దానియర్థమునకుఁగల సహకారిత్వముకూడ - తొలగుఁనది కాదు. అట్లుకాదనినయెడల, అజ్ఞాతార్థకమయినను - [అర్థము తెలియఁబడనిదయినను] గూడ, శబ్దము - వ్యంగ్యార్థవ్యంజకము, కావలసివచ్చును. వివక్షితాన్యపర వాచ్యమునందో; అర్థమే - ప్రధానముగా వ్యంజకమగుచుండును. అయినను, శబ్దమునకుఁగూడ - [అచట] సహకారిత్వముండియేయున్నది. ఏలయనిన; [రసాద్యనుగుణ వర్ణాదిభేదమువలన] విశిష్టమగు శబ్దముచేతఁ జెప్పఁబడకయే - ఆయర్థము - వ్యంజకముకాఁజాలదు. కనుక, ఇట్లింతటనుగూడ - శబ్దార్థములు రెండిం టికినిగూడ, కలిసియే- ధ్వననవ్యాపారముండును." అని.

కావున, [ద్వివచనప్రయోగమింతయర్థము నుద్దేశించునది. కనుక,] భట్టి

నాయకుఁడిచటి ద్వివచనమునుదూషించుట-గజనిమీలికచేతనేయగును. [''ఏనుఁగు బుద్ధిపూర్వకముగాఁగాక, స్వభావముచేతనే కన్నులుమూసికొనునట్లు, భట్టనాయ కుఁడీధ్వనినెల్లో దూషించుటయే స్వభావముగాఁగలవాఁడు. కనుక, ఇచటి ద్వివ చనము - గంభీరార్థకమగుటవలన సంగతమేయగునని విచారింపక, కన్నులు మూసికొని యిట్లనెను.'' అనిభావము.]

[శబ్దార్థములు- రెండునుగలిసియే-వ్యంజనావ్యాపారమునొనర్చును.కనుక,] ''అర్థమైన, శబ్దమ్మైన'' అను వికల్పాభిధానము - [వికల్పించిచెప్పుట] -''శబ్దా ర్థములలో, ఏదియయినను, వ్యంగ్యమును వ్యంజింపఁజేయును'' అని చెప్పునది కాదు. ఇంకేమనిన;''శబ్దార్థములలోదేనికయినను, వ్యంజనక్రియనొనర్చుటయందు ప్రాధాన్యముండును.'' అను నభిప్రాయమును దెలుపునదియేయగును. ఆ,కృతి విశేషమును, అనుచోట-''కావ్యమును, దానివిశేషమును.'' అని కర్మధారయ మును)గాని, ''కావ్యముయొక్క విశేషమును'' అని (షష్ఠీతత్పురుషమును)గాని చెప్పుకొననగును. మొదటి నిర్వచనమున, ''శాస్త్రాదులకంటె వేరయినదియగు కావ్యవిశేషము.'' అనునర్థమును, రెండవనిర్వచనమున, ''కావ్యమును విశేషిం పఁజేయునదియగు ఉత్తమకావ్యము'' అనునర్థమును, లభించును. ''కృతివిశేష మును'' అనుచోట - కృతి [కావ్య] శబ్దమును, గ్రహించుట [ప్రయోగించుట] వలన-''ధ్వని లక్షణమగు ఆత్మ- గుణాలంకారాదులచేత నలంకరింపఁబడిన, శబ్దా ర్థములకుఁదరువాత ప్రసరించునదియేయగును'' అని తెలిపినట్లయినది. [శబ్దార్థ ములు - ధ్వనికి వ్యంజకములు, కనుక, వ్యంజకములగు శబ్దార్థములకు వెనుకనే, ధ్వని - ధ్వనింపఁజేయఁబడుట యుక్తముగదా! ] కనుక, ''శ్రుతార్థాపత్తియందుఁ గూడ - ధ్వనివ్యవహారము కలుగవలసివచ్చును'' అనువాదము - నిరవకాశమగు చున్నది.

ప్రభా :— శ్రుతార్థపత్తియందుఁగూడ - ధ్వనివ్యవహారము కలుగవలసి వచ్చునను పూర్వపక్షి :- అయ్యా ! ''పీనోదేవదత్తోదివానభుఙ్క్తే'' ''దేవ దత్తుఁడు, బలిసినవాఁడు - పగలు భుజింపఁడు.'' అనుచోట - రాత్రి భోజనము గమ్యమగుచుండునుగదా!. కనుక, ఇట్లు శ్రుతమగు నర్థాపత్తియందుఁగూడ- ధ్వని యను వ్యవహారము కలుగఁగూడదా ?

సిద్ధా :— మీఁదికారికయందు, కావ్యవిశేషశబ్దముచేత - ''గుణాలంకారాదుల

చేత నలంకృతములగు శబ్దార్థములకుఁదరువాత స్ఫురింపఁజేయఁబడునదియే - ధ్వని.'' అని వ్యపదేశింపఁబడుటవలన, ''దేవదత్తుఁడు'' ఇత్యాది శ్రుతార్థాపత్తి యందు రాత్రిభోజనరూపమగు నర్థము-గమ్యమైనను, గమ్యమగు నీరాత్రిభోజనము గుణాలంకారోపస్కృత శబ్దార్థపృష్ఠపాతికాదు. కనుక, 'ధ్వని' అని చెప్పఁదగినది కానేరదు.

లోచనము :— అయ్యా ! [''గుణాలంకారములవెనుక స్ఫురించునది యగు సౌందర్యమే - కావ్యాత్మ'' అని మీరనుచున్నారుగదా!] ''అట్లయిన యెడల, ఆసౌందర్యప్రతీతియే - కావ్యాత్మకావలసివచ్చును [అది-ధ్వనికాదు.]'' అనునొకమతమేది చెప్పఁబడినదో, ఆమతమునందు, [ధ్వన్యాత్మ - సౌందర్యాత్మ వాదులుభయులకును] పేరునందే వివాదమగుచున్నది. కనుక, దానినంగీకరించు వారలమే యగుచున్నాము.

ప్రభా :— సౌందర్యప్రతీత్యాత్మవాది ప్రశ్న :- అయ్యా! సౌందర్య హేతువులుగా ప్రసిద్ధములగు గుణాలంకారములకంటె, కావ్యాత్మయని చెప్పఁబడు చున్నధ్వని వేరగునెడల, నప్పుడా కావ్యాత్మ - సౌందర్య ప్రతీతియేకానిండు!. సౌందర్యప్రతీతియే-యచట కనిపించుచున్నదిగదా!. కనిపించుచున్న సౌందర్య ప్రతీతిని- కనిపింపని యింకొక వస్తువగు ధ్వనినిగాఁజెప్పుట - గౌరవకల్పనమే యగును. కనుక, సౌందర్యప్రతీతికంటె వేరయిన ధ్వనిలేదు.

ఉ :— ఈసౌందర్యప్రతీతి - ఏవస్తువునకు సంబంధించినది ? అని విచా రించునెడల, ఈప్రతీతికి విషయమో, లేక కారణమో, అగు నాధారవస్తువును జెప్పకతీరదు. ఆలంబనవస్తువులేనిదే సౌందర్యజ్ఞానముకలుగదు. కనుక,ఆయాధా రమునకేదో పేరుండవలయునుగదా!. గుణాలంకారాది సౌందర్యప్రతీతికంటె వేరయినదగుచు, స్ఫురించునదియగు నాసౌంద్యముగలవస్తువును-పూర్వోక్తయుక్తి ననుసరించి, 'ధ్వని'అనుటయే - యుక్తము.

—• సౌందర్యప్రతీతియే - కావ్యాత్మకాదు •—

లోచనము :— ''చారువస్తుప్రతీతియే - కావ్యాత్మ'' అగునెడల, వస్తు గతమగు నాసౌందర్యప్రతీతి - ప్రత్యక్షాది ప్రమాణములవలనఁగూడ - కలుగును. కనుక; నదియు, [ప్రత్యక్షాదిజన్యమగు వస్తుసౌందర్యప్రతీతికూడ] కావ్యాత్మయే- కావలసివచ్చును. అనిచెప్పఁబడిన మతమేదికలదో, ఆమతము-సందర్భవిరుద్ధము. శబ్దార్థమయమగు కావ్యమునకు - ఆత్మను దెలుపునదియగు ప్రస్తావమున, ఈ ప్రసంగమేమి?ఇదిసంగతమగునా? [ఇట్టిప్రసంగమునకుపయోగమేదియునుండదు.]

లోచనము : ప్రశ్న :— [కావ్యము - శబ్దార్థవ్యాపారరూపముగదా!. అందు - ఆ,'కృతివిశేషము - ధ్వని,' అని కారికయందుఁదెలుపఁబడిన] ధ్వని శబ్దార్థము - అర్థమా ? శబ్దమా ? వ్యాపారమా ?

ఉ :— "ధ్వనతీతిధ్వనిః" ధ్వనించును గనుక [వ్యంజకమగు] వాచ్యార్థము - ధ్వని, అని వ్యవహరింపఁబడవచ్చును. అట్లే, [వ్యంజక] శబ్దముకూడ - ధ్వని, అని చెప్పఁబడును. "ధ్వన్యతే ఇతిధ్వనిః" ధ్వనింపఁజేయఁబడును గనుక, వ్యంగ్యము - ధ్వనియగును. "ధ్వననమ్- ధ్వనిః" ధ్వనించుట-శబ్దార్థములవ్యాపారము. కనుక, నదికూడ - ధ్వనియని చెప్పఁబడును.

కారికచేతమాత్రము - దీనిసముదాయమగు కావ్యరూపమే, ప్రధానమగుట చేత, ముఖ్యముగా ధ్వనియగునని ప్రతిపాదింపఁబడినది.

ప్రభా :— ప్రధానమగుటవలన సముదాయమగు కావ్యరూపమే-ముఖ్యముగా ధ్వనియని చెప్పఁబడినది. కనుక, అర్థము మొదలగునవి - అముఖ్యముగా ధ్వనియని చెప్పఁబడును.

ఇట్లు [వ్యంజకమగు 1 శబ్దము, 2 వ్యంజకమగునర్థము, - 3 వ్యంగ్యము, 4 వ్యంజన, 5 కావ్యవిశేషము. అనునైదును ధ్వనియనిచెప్పఁబడినను, అందు శబ్దాదులు నాలుగును యోగార్థముచేత ధ్వనియని చెప్పఁబడుననియు, కావ్యవిశేషమమాత్రమే - రూఢిచేత - ధ్వనియని చెప్పఁబడుననియు, గ్రహింపనగును.

(46) మూలము :— దీనిచేత [ధ్వని కావ్యలక్షణమునిట్లు చెప్పుటచేత]వాచ్యవాచక సౌందర్యహేతువులగు నుపమాదులకంటెను, అనుప్రాసాదులకంటెను; ధ్వనికిఁగల విషయము - విభక్తమే [వేరయినదియే] అగునని, ప్రదర్శింపఁబడినది. కావున,"ప్రసిద్ధమగు ప్రస్థానము [సంప్రదాయసిద్ధ, శబ్దార్థ, తద్గుణాలంకారాది పరిష్కృతమార్గము] కంటె వేరగుమార్గముగల, కావ్యప్రకారము-కావ్యత్వమునే కోల్పోవును. కనుక "ధ్వనిలేదు"అని యింకొకరు [ద్వితీయాభావవాదులు] చెప్పునదికూడ - యుక్తముకాదు. ఏలయనిన; ఆధ్వని - లక్షణకారులకుమాత్రమే ప్రసిద్ధముకానిదైయున్నది. కాని లక్ష్యమును బరీక్షించునెడల, అదియే - సహృదయ హృదయాహ్లాద

కారియగు కావ్యతత్త్వమగుచున్నది. దానికంటె [ప్రధానవ్యంగ్య రూపమగు ధ్వనికావ్యముకంటెను, అప్రధానవ్యంగ్యరూపమగు గుణీ భూతవ్యంగ్యకావ్యముకంటెను] వేరయినది - 'చిత్రమే' అగునను నంశమునుముందు ప్రదర్శించెదము. కనుక; "కామనీయకము నతిక్ర మింపని[సౌందర్య హేతువుకాకతీరని]ధ్వనికూడ-[పూర్వోక్తచారుతా హేతువులగు] అలంకారాదులయందే, యంతర్భవించును" అని వేఱొక కొందఱిచేత - ఏదిచెప్పఁబడినదో, అదికూడ - సమీచీనము కానేరదు. ఏలయనిన; వాచ్యవాచకములను మాత్రమే సమాశ్రయిం చునదియగు, ప్రస్థానమునందు-వ్యంగ్యవ్యంజక సమాశ్రయణముచేత వ్యవస్థితమగు ధ్వని-ఎట్లంతర్భవించును ?

"వాచ్యవాచకసౌందర్య హేతువులగు నుపమాదులు-[కావ్యా త్మయగు] ధ్వనికంగభూతములేకాని, అంగి [ధ్వని] రూపములు కావు." అనిముందు ప్రతిపాదింపఁబడును.

ప్రభా : అవ :— "గుణాలంకారములకును, ధ్వనికిని, విషయభేదముం డుటవలన, వానియందిది-యంతర్భవింపదు." అనుచున్నాఁడు.

లోచనము :— [ధ్వనికివిషయము] 'విభక్తమే' = భిన్నమే. [విషయ భేదమెట్లనిన :-] [శబ్దార్థ సంఘటనాశ్రయములగు] గుణాలంకారములు - వాచ్య వాచకభావమే - ప్రాణముగాఁగలవి. ధ్వనియో, వానికంటె భిన్నమగు వ్యంజక భావమే- సారముగాఁగలది. [వ్యంజ్యనాశ్రయించునది.] [ఇట్లు, విషయభేద మున్నది.] కనుక, దీనికి వానియందంతర్భావము కలుగదు.

ప్రభా :— మీఁదియర్థము నుపపాదించుటకు "విశేషేణబధ్నాతి, స్వస మ్బన్ధినమ్, పదార్థమితి, విషయః" "తనకుసంబంధించిన పదార్థమును విశేషించి బంధించునది" - విషయము" అనువ్యుత్పత్తి నంగీకరించి, విషయశబ్దార్థమును దెలుపుచున్నాఁడు.

లోచనము :— అనన్యత్రభావము - [ఇంకొకచోట లేకుండుట] విష యశబ్దార్థము. కనుక; ధ్వనికివిషయము అనఁగా; "దేనికంటె నితరమగుచోట

'ధ్వని' వ్యవహారమున కునికి లేకుండునో, అవి - ధ్వని'' అనియర్థము.

ఇట్లు [నిర్దుష్టమగు ధ్వనిలక్షణమును దెలుపుటచేతనే - ధ్వనిస్వరూపము నునికి ప్రతిపాదింపఁబడుటవలన] ''గుణాలంకారములకంటె వేరయిన ధ్వని నామకమగునిదియేది ?'' అను [ప్రథమాభావవాది] మతము-నిరాకరింపఁబడినది.

ప్రభా :— ''ధ్వని - లక్షణకర్తలకు ప్రసిద్ధముకాదు కనుక; అలక్షణీయమగునా ? లేక లక్ష్యమునందు ప్రసిద్ధముకాదు, కనుక, అలక్షణీయమగునా?'' అనియాశంకించి, మీఁదిమతమును దూషించుచున్నాఁడు.

లోచనము :— లక్ష్యమునందీధ్వని - ప్రసిద్ధమైయున్నది. కనుక, దీని లేమిని సాధించుటకుఁ దెలుపఁబడిన, లక్షణకారాప్రసిద్ధత- విరుద్ధహేతువు.

ప్రభా :— ''లక్షణకారులకు ప్రసిద్ధముకాకుండుటవలన ధ్వనిలేదు'' అని ధ్వని లేమిని సాధించుటకుఁ దెలుపఁబడిన, లక్షణకారుల కప్రసిద్ధమగుట అను హేతువు - ధ్వనిలేమిని సాధింపఁజాలకుండుటవలన, విరుద్ధమగు హేతువగుచున్నది.

అవ :— ఈ హేతువెట్లు విరుద్ధమయినదియనినఁ, జెప్పుచున్నాఁడు.

లోచనము :— ఆ హేతువువలననే [లక్షణకారులకు ప్రసిద్ధముగాకుండుట వలననే] అది - ప్రయత్నించి లక్షింపఁదగినదగునుగదా । [మాచేతలక్షింపఁబడిన ధ్వని-రామాయణ, మహాభారతాదులయందంతటను, ప్రసిద్ధమగుచున్నది కనుక,] అది - లక్ష్యమునందు ప్రసిద్ధముకాదు. కనుక, ధ్వనిలేదు. అని, లక్ష్యమునందు అప్రసిద్ధతను జెప్పినయెడల, అది - అసిద్ధమగు హేతువగును.

[ధ్వని - కృతివిశేషముగాఁ జెప్పఁబడినది. కనుకనది - కావ్యవ్యాపారగోచరమనిచెప్పినట్లయినది. నృత్తగీతాదులు కావ్యవ్యాపారగోచరములుకావు. కనుక,] ''ధ్వని-నృత్తగీతాదులవంటిది''అని చెప్పబడినవాదముకూడ- కావ్యమునకు సంబంధించిన ధ్వనివిషయమున నుపహసింపఁదగినదియేయగును.

ప్రభా : అవ :— అర్థాంతర ప్రసిద్ధమగు ''చిత్ర'' పదము - కావ్యమునెట్లు తెలుపునని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

— చిత్రకావ్యశబ్దనిర్వచనము —

లోచనము :— ఆశ్చర్యమును గలిగించునవియగు వృత్తములు [యమకోపమాదులు] మున్నగునవి కలిగియుండుటవలన, [ధ్వని, గుణీభూతవ్యంగ్య కావ్యములకంటె భిన్నమగు - కావ్యము] "చిత్రము" అని చెప్పఁబడను. [ఈ చిత్రకావ్యము - ధ్వనికావ్యమువలె] సహృదయాఖిలషణీయ చమత్కారసార రసనిష్యందమయముకాదు. విష్ణ్వాదిరూపమునుగాని, ప్రాణిరూపమునుగాని,యను కరించునదియు, ఆలేఖ్యమాత్రమగునదియు, [చిత్రలేఖకాదులచేత- రచింపఁబడిన దిమాత్రమేయగునదియు] కళామాత్రమగునదియు, నగుచిత్రమువలె- [జీవము లేని బొమ్మవలె] (1) కావ్యమున ననుకరించునదియు, (2) ఆలేఖ్యమాత్రమయి నదియు, [ఆత్మవంటి రసాదికములేక, ఆశ్చర్యజనకమగు నదియగు రచనమాత్రమేగలదియు,] (3)కళామాత్రమును,[అపూర్ణమగుకళయే,అనఁగా; అంశము మాత్రమే-యగునదియు,] అగుచుండుటవలన [ (1) ఆభాసరూపమును, (2) నిస్సారమును, [నిర్జీవమును] (3) అపూర్ణమును, అగు] ఈకావ్యము - చిత్రము [బొమ్మ] వంటిదగుచున్నది. కనుక; 'చిత్రకావ్య'మని చెప్పఁబడును.

ప్రభా :— "చిత్రములగు [ఆశ్చర్యకరములగు] శబ్దాలంకారాదులు మాత్రమే కలిగియుండుటవలన తృతీయమగు కావ్యము - చిత్రము" అనిచెప్పఁ బడును. లేక, చిత్రమువలె [బొమ్మవలె] అనుకరించునదియు, ఆలేఖ్య [శిల్ప] మాత్రమగునదియు, కళామాత్రము [అంశమాత్రము]ను, అగుటవలన-చిత్రము" అని చెప్పఁబడును.

చిత్రమునకును, [చిత్తరువునకును] చిత్రము [అధమకావ్యము] నకును, గల సామ్యము నిట్లెఱుఁగునది.

| (1) చిత్రము [బొమ్మ] — | (2) చిత్ర కావ్యము — (3) ఎట్టిది? |
|---|---|
| (1) ఏదో సత్యమగు వస్తువుయొక్క రూపముననుకరించును. | కావ్యము ననుకరించును. కనుక అభాసము. |
| (2) జీవములేని శిల్పరచనామాత్రమే యగును. | కావ్యాత్మయగు ధ్వనిలేక, చిత్రమగు రచనను మాత్రమే కలిగియుండును. కనుక, నిస్సారము. |
| (3) అపూర్ణమగు[అసత్యమగు] అంశముమాత్రమే యగును. | జీవరస [కావ్యాత్మ] పూర్ణముకానిదగు నంశము మాత్రమే యగుచుండును. కనుక; అపూర్ణము. |

లోచనము :— "ముందు" అనఁగా; తృతీయోద్ద్యోతమునందు—

"వ్యంగ్యమునకీ సరణి, గుణీభావమును బ్ర
ధానతయు, నుండుట, వ్యవస్థితమ్ములగుచుఁ
గావ్యములు-రెండెనఁగు, వానికంటె భిన్న
మయి పొలుచుదానిఁ జిత్రకావ్యమనియంద్రు."

అని, ఈయంశమే - తెలుపఁబడును.

(47) మూలము :— ఈ యంశమున, పరికరశ్లోకమిది :—

మంజరి :- వ్యంగ్య, తత్‌వ్యంజక, వ్యాపార, రూప
మగు నిబంధనముంగలది - ధ్వని; గాన
వాచ్య, వాచక, సుశోభా నిమిత్తముల
యందది - యెట్లు తానంతర్భవించు ?

లోచనము :— 'పరికరముకొఱకు' అనఁగా; కారికార్థమునకు అధికా వాపమును [అపేక్షితమగు నధికార్థముయొక్క ప్రక్షేపమును] కావించుటకు ప్రవర్తించునదియగు శ్లోకము - పరికరశ్లోకము.

ప్రభా :— "గుణీభూత వ్యంగ్యములగు నలంకారములయందు ధ్వని యంతర్భవించునేమో" అని యాశంకించి, నిరాకరించుచున్నాఁడు.

(48) మూలము :— అయ్యా! ఎచ్చట - [ఏయలంకారములయందు]-వ్యంగ్యమగు నర్థమునకు విశదమగు [సుందరమును, స్ఫుటమును, నగు] ప్రతీతియుండదో, అవి - ధ్వనికి విషయముకాకుండుఁగాక!. కాని, సమాసోక్తి, ఆక్షేపము, అనుక్తనిమిత్తమగు విశేషోక్తి, పర్యాయోక్తము, అపహ్నుతి, దీపకము, సంకరము, మొదలగునే [యే]యలంకారములయందు, దానికిప్రతీతి - కలుగుచుండునో. ఆయలంకారములయందు - ధ్వనియంతర్భవించును." ఇత్యాద్యభిప్రాయమును నిరాకరించుటకై "స్వార్థము లుపసర్జనీ

కృతములుగ" అని [కారికయందు] చెప్పఁబడినది. గుణీకృతమగు [అప్రధానీకృతమగు] ఆత్మ [స్వరూపము] గల, యర్థముగాని, గుణీకృతమగు [అప్రధానీకృతమగు] నర్థముగల, శబ్దముగాని, యే కావ్యమునందు - వేరొకయర్థము నభివ్యంజితమునొనర్చునో, ఆకావ్యము - ధ్వని. [ధ్వనికావ్యము.] అని, దానియర్థము. ఆయలంకారములయందు - [ఇట్టిలక్షణముగల] ధ్వనికెట్లంతర్భావము కలుగును ? వ్యంగ్యము ప్రధానమగునపుడుగదా ధ్వనియగును॥. 'సమాసోక్తి' మున్నగు నలంకారములయందు [కూడ] వ్యంగ్యమునకు ప్రాధాన్యములేదు.

లోచనము :— "ఎచ్చట" 'ఏయలంకారమునందు'- 'విశదమగు' [విశదశబ్దముభయార్థకము గనుక] 'సుందరమును, స్ఫుటమునునగు' అనియర్థము. "చెప్పఁబడినది" అనునది-భూతప్రయోగము. "ధ్వనింపఁజేయునవియో" అనునది - ఇంతకుముందే, వ్యాఖ్యానింపఁబడినది. కనుక, 'చెప్పుచున్నాఁడు' అని చెప్పఁబడక, 'చెప్పఁబడినది' అని చెప్పఁబడినది. "స్వార్థములు" అనుచోనున్న, స్వశబ్దార్థము - 'ఆత్మ'గాఁజెప్పఁబడినది.

"వాచ్యార్థమున విముఖాత్ములయిన వారలగు సహృదయుల తత్త్వార్థదర్శియైనెలయుబుద్ధియందు వ్యంగ్యార్థమునకు సత్వరంబగు స్ఫురణంబుసంభవించును" అని, చెప్పఁబడిన న్యాయమునను సరించి [ప్రాధాన్యాప్రాధాన్య జ్ఞానరహితమగు] అఖండమగు [రసాదివ్యంగ్యముయొక్క] చర్వణయందే-సహృదయహృదయము-విశ్రమించును. కనుక, వ్యంగ్యమునకుఁగల ప్రాధాన్యముగాని, అప్రాధాన్యముగాని, జ్ఞప్తియందు [కావ్యార్థప్రతిపత్తి కలుగునపుడు] స్ఫురించునదికాదు.

అయినను, వివేచనము నొనర్చువారగు, సహృదయులచేత- [అఖండమగు చర్వణకలిగినపిమ్మట] జీవితాన్వేషణ మొనర్పఁబడునపుడు, వ్యంగ్యమగు నేయర్థము - వాచ్యముచేత వ్యంజింపఁజేయఁబడి, తరువాతిదియగు వ్యంగ్యకక్ష్యయందుండి, తిరుగ, వాచ్యకక్షయందుఁబ్రవేశించి] వాచ్యమునే, అనుప్రాణింపజేయుచుండునో, అప్పుడది - ఆవాచ్యమున కుపకరణమగుచుండును. కనుకనే, దానికలంకారమగును. [ఇట్లు వస్తురూపమగు వ్యంగ్యము - వాచ్యము నలంకరించు

నపుడు] వ్యంగ్యార్థముచేత - ఉపస్కృత [అలంకృత]మగు వాచ్యార్థమువలననే- చమత్కారలాభము కలుగును. [సమాసోక్త్యాదులయందు, గుణీభూతమగు వ్యంగ్యముచేత నలంకరింపఁబడిన వాచ్యమే - రసాదిధ్వని కలంకారమగునని భావము.]

ప్రభా : అవ : ప్రశ్న :— అయ్యా! వ్యంగ్యమగువస్తువు - వాచ్యము నలంకరించి వాచ్యముఖముననైనను, చివరికక్ష్యయందున్న రసధ్వని పర్యంతమగు చుండును. చివరనున్న రసధ్వని యందు, వాచ్యము - విభావమయి, యారసాదిక మును స్ఫురింపఁజేయునుగదా!. సమాసోక్త్యాదులయందు, చమత్కారకారియగు వాచ్యము నలంకరించుచున్న యీవ్యంగ్యమప్పుడు - రసాదిధ్వనిరూపమున తానే ప్రధానమయియుండును. వ్యంగ్యముచేత నలంకరింపఁబడిన వాచ్యము - రసాది ధ్వనిరూపముననున్న యీవ్యంగ్యము నప్పుడలంకరించుచునే, చమత్కారకారి యగును. కనుక, సమాసోక్త్యాదులయందైనను, వ్యంగ్యమునకు ప్రాధాన్యహాని లేదు. కనుక, నది - గుణీభూత [అప్రధానీకృత] మెట్లగును ?

ఉ :— అచట - వ్యంగ్యమునకు ప్రాధాన్యములేదు. కనుక, గుణీభూత మగును. చూడుఁడు!

లోచనము : ఉ :— చిట్టచివరను - రసధ్వనియుండినను, మధ్యమకక్ష్య యందుండిన యీవ్యంగ్యార్థము - స్వతంత్రించి, రసమునకున్ముఖి [అభిముఖము గానుండునది] కాదు. ఇంకేమనిన; ఇది- [సమాసోక్త్యాదులయందుండునదియగు] వాచ్యార్థమును సంస్కరించుటచే [అలంకరించుటచే] పరుగిడును. కనుక, నిది - గుణీభూతవ్యంగ్యమగునని చెప్పఁబడినది.[అప్రధానముగాఁజేయఁబడినవ్యంగ్యము- గుణీభూతవ్యంగ్యము. అట్టివ్యంగ్యముగల కావ్యము - గుణీభూతవ్యంగ్యకావ్యమని చెప్పఁబడినది.]

ప్రభా :— 'సమాసోక్తి' మున్నగునలంకారములయందు, మొదటిది - వాచ్యకక్ష్య. తరువాతిది - వస్తురూపమగు వ్యంగ్యకక్ష్య. చిట్టచివరిది - రసాది ధ్వనికక్ష్య. అందు మధ్యమకక్ష్యయందుండునదియగు, వ్యంగార్థము - తనకంటె ముందలిదియగు, ప్రథమకక్ష్యయందున్న, వాచ్యమునే,యలంకరించుచు, తద్ వాచ్యార్థద్వారముననే, చివరికక్ష్యయందున్న రసాదిధ్వనికున్ముఖమగును. కాని, స్వతంత్రముగా [వాచ్యమునువిడిచి సాక్షాత్తుగా] అభిముఖమగునది కానేరదు. "ఇట్లు, వస్తురూపమగు వ్యంగ్యము - జలప్రవాహమువలె, క్రిందికిదిగి, వాచ్యా ర్థము నుపస్కరించుటవలన - తనకుఁగల ప్రాధాన్యమును గోల్పోవును. కనుక

నది సమాసోక్త్యాదులగు నలంకారములయందు, గుణీభూత [అప్రధానీకృత] మగు చుండును. కనుకనే; ఈసమాసోక్త్యాదులు - గుణీభూతవ్యంగ్య ప్రకారములగు చున్నవి. కనుకనే, ఆయలంకారములయందు - అప్రధానమగు వ్యంగ్యము - గుణీభూతవ్యంగ్యమని, వివేకదృష్టినపేక్షించి, వృత్తికర్తచేత - చెప్పఁబడినది. "ఏది - (అధిక) చమత్కారకారియగునో, ప్రస్తుతమగు నేయర్థమున, సహృదయహృదయము- విశ్రమించునో, అదియే-ప్రధానము. సమాసోక్త్యాదులయందు- వ్యంగ్యమున్నను, అదివాచ్యోపకరణము. కనుక,(అధిక) చమత్కారకారి-కాదు. దానిచేత నుపస్కరింపఁబడిన వాచ్యమే- (అధిక) చమత్కారకారియగును. అధిక చమత్కారకారియు, ప్రస్తుతమును, నగువాచ్యమునందే- సహృదయహృదయము- విశ్రాంతినొందును. కనుక, నచట - వాచ్యమే - ప్రధానమగునని వివేచకదృష్టికి గోచరించును. అఖండమగు రసచర్వణ యందిప్రాధాన్యము గోచరింపకున్నను, "ఏదిప్రధానము ? ఏది - అప్రధానము" అని వివేచించునపుడు "సమాసోక్త్యాదులయందు - వ్యంగ్యము ప్రధానముకాదు" అని గ్రహింపఁబడును" అనునది- ఫలితార్థము.

## (49) మూలము :— సమాసోక్తియందు

'సముదితరాగవాహి'యగు చంద్రుఁడు - చంచల'తారకమ్ము'గా
నమరు నిశాముఖమ్మునపుడట్లు గృహీతమొనర్చెఁదాను, పూ
ర్వమునసె జారియున్నఁ, దిమిరాంశుక- మత్తరి, దానిచే సమ
స్తము, ఘనరాగయోగమునఁ దానెఱుఁగంబడకుండునట్లుగన్.

అనునది - ఉదాహరణముగానున్నది.

లోచనము :- యత్రోక్తౌగమ్యతేఽన్యోర్థః, స్తత్సమానైర్విశేషణైః।
సాసమాసోక్తిరుదితా, సంక్షిప్తార్థతయా (యథా)బుధైః.

(౧) ప్రస్తుతము - వర్ణితముగ, నప్రస్తుతమెట
గమ్యమగునో (౨) విశేషణ సామ్యయుక్తి;
(౩) నది - సమాసోక్త్యలంకార'మనిరి బుధులు,
(౪) తనరు సంక్షిప్తమయిన యర్థమ్ముకలిమి.

ఇచ్చట [మీదిభామహీయ లక్షణమున] సమాసోక్తికి 1 లక్షణస్వరూపము

[స్వరూపలక్షణము] 2 హేతువు 3 పేరు 4 (శబ్ద) నిర్వచనము. నాలుగుపాదములందును క్రమముగాఁ జెప్పబడినది.

ప్రభా :— సమాసోక్తికి - లక్ష్యముగా నొసఁగఁబడిన, దీని మూలశ్లోక మిట్లున్నది.

"ఉపోఢరాగేణ విలోలతారకం
తథాగృహీతం శశినానిశాముఖమ్,
యథాసమస్తం తిమిరాంశుకంతయా
పురోఽపిరాగాద్ గళితం నలక్షితమ్."

ఇందు ప్రస్తుతమగుటవలన, నిశాచంద్రవృత్తాంతము- వాచ్యమగుచున్నది. అప్రస్తుతమగుటవలన, తత్సమానములగు విశేషణములచేత- గమ్యమగు నాయికానాయక వృత్తాంతము - వ్యంగ్యమగుచున్నది.

అవ :— విశేషణసామ్యమును ప్రదర్శించుచు, వ్యాఖ్యానించుచున్నాఁడు. అందు, మొదట, అభిధాతాత్పర్యశక్తులచేత - వాచ్యమగు ప్రస్తుతార్థమున, నిశాచంద్రపరమగు నర్థమిట్లు తెలుపఁబడుచున్నది.

లోచనము :— సముదితరాగ వాహియగు = లెస్సగానుదయించిన సంధ్యారుణిమను వహించినవాఁడగు; చంద్రుఁడు = శశి; చంచలతారకమ్ముగాన్ = చలించుచున్నట్లున్న జ్యోతులు [నక్షత్రములు] కలుగునట్లు, నిశాముఖమ్మును = రాత్రియొక్క ప్రారంభమును; అపుడు = రాత్రి ప్రారంభసమయమున; అట్లు, గృహీతము + ఒనర్చెన్ = శీఘ్రముగనే ప్రకాశింపఁజేసెను.

['ఎట్లురాత్రి ప్రారంభమునాభాసింపఁజేసెను ?' అనియాశంకించి, తత్సమాధానమును పద్యమునందలి యుత్తరార్థమునఁ జెప్పుచున్నాఁడు.]

పూర్వముననె = తూర్పునందె; జారియున్నన్ = ప్రశాంతమైనను, [అడఁగియున్నను]; తిమిర + అంశు + కము = చీకటియు, సూక్ష్మములగు చంద్రకిరణములును, గలది. అనగా; చంద్రకిరణములతోఁగలిసి, చిత్రముగాఁ జేయఁబడిన, తమఃపటలము. అత్తరిన్ = ఆసమయమునందు; దానిచేన్ = కరణభూతయగు రాత్రిచేత, లేక, చీకటియొక్కయు, కిరణములయొక్కయు. కూడికను దెలుపుటవలన నుపలక్షణమగు రాత్రిచేత; సమస్తము - మిశ్రితము

[చీకటితోను, చంద్రికిరణములతోను, గూడినదిగా]; ఘనరాగయోగమునన్ = ఎక్కువయిన యెరుపురంగుతోడి సంబంధమువలన; తాను + ఎఱుఁగంబడకుండు నట్లుగన్ = నిజకిరణమిశ్రితమగు నాతమఃపటలము - లోకముచేత - తెలియఁబడ కుండునట్లు. చీకటితోఁగూడిన కిరణములు - స్పష్టముగాఁగనిపించినయెడల, ఇది-రాత్రిప్రారంభమని లోకముచేత- గుర్తింపఁబడునుగాని. స్ఫుటమగు వెలుతురు కలిగినప్పుడిది-రాత్రి ప్రారంభమని తెలియఁబడునదికాదుగదా!

పరిభా :— ఇట్లు వాచ్యమగు ప్రస్తుతార్థము తెలియఁబడినపిమ్మట, వ్యంజనావ్యాపారముచేత గమ్యమగు నప్రస్తుతార్థమునందు, నాయికానాయక వ్యాపారమిట్లు స్ఫురింపఁజేయఁబడుచున్నది. [ఇందలివ్యంగ్యమిది :—]

లోచనము :— సముదితరాగవాహియగు = చక్కగానొదవినప్రేమ [అనురాగము] కలవాఁడగు, చంద్రుఁడు = "చంద్రుఁడు" అనుపేరుగలనాయ కుఁడు. "చంచలతారకమ్ముగాన్" = చలించుచున్న నేత్రత్రిభాగములు [కనీ నికలనుపేరుగల కంటినల్లగుడ్లు] కలుగునట్లు, నిశాముఖమ్మును = నిశయను నాయికయొక్క ముఖమను కోకనదమును [ముఖపద్మమును] అపుడు = ప్రేమ రభసముచేత-గృహీతమొనర్చెన్ = ముద్దిడుకొనెను.

["ఎట్లు నిశయను నాయికయొక్క ముఖపద్మమును [నాయకుఁడు గృహీ తమొనర్చెను?] ముద్దాడెను ? అని యాశంకించి, తత్సమాధానమును పద్యము నందలి యుత్తరార్ధమునఁజెప్పుచున్నాఁడు.]

పూర్వముననె = ఎదుటనే; జారియున్నను = జారిపడియున్నను; తిమిర + అంశు + కము = నీలజాలిక. ఆప్రౌఢయగు నవోఢావధువునకు [క్రొత్త పెండ్లికూతు(రు)నకు] ఉచితమైనది - సున్నితములగు నల్లనిదారములుగల మేలి ముసుగు, అత్తరిన్ = సురతోత్సవవేళయందు; దానిచేన్ = నిశయనునాయిక చేత, సమస్తము = కప్పగాఁబడిన నీలజాలికయంతయు; ఘనరాఘగయోగమునన్ = అధికమగుప్రేమ సంబంధము కలిగినతరువాత; తాను - ఆతిమిరాంశుకము, [నీలజాలిక] ఎఱుఁగంబడకుండునట్లుగన్ = [తనయెదుటనే దిగజారిపడినను గూడ] ఆనీలజాలిక - ఆమెచేత గుర్తింపఁబడకుండునట్లు, (గృహీతమొనర్చెను.)

అప్రస్తుతమగు నాయికాపక్షమున "దానిచేన్" అనునది కర్తృపదము. ఇచట 'నాయకుఁడు, నాయికవెనుకనుండి ముద్దిడుకొనుట కుపక్రమింపఁగనే, 'పూర్వముననె' అనగా; నాయికకు ముందలి ప్రదేశమునందే, నీలాంశుకముదిగ

జారిపడినది.' అనిగాని, '(సురతోత్సవమునకు) ముందుగానే చంద్రుఁడను నాయకుఁడు నిశయను నాయికమొగమును ముద్దిడుకొనెను' అనిగాని, సమన్వయించుకొననగును.

(50) మూలము :— ఇచ్చట వాక్యార్థము [ప్రధానముగాఁ దెలియఁదగినయర్థము] "లెస్సగానారోపింపఁబడిన నాయికానాయక వ్యవహారముగల, నిశాచంద్రులే" అగుచున్నారు. కనుక, "సముదిత" ఇత్యాదులయందు [సమాసోక్తిగల స్థలములయందు] వ్యంగ్యానుగతమగు [వ్యంగ్యముచేత నుపస్కృతమగు] వాచ్యమే - ప్రధానముగాఁ బ్రకాశించుచుండును.

లోచనము :— దీనిచేత ['సముదిత' అనుదానిచేత నిట్లు] వ్యంగ్యము స్ఫురించినను, దానికి ప్రాధాన్యములేదు. అదెట్లనిన :— ఇచట, నిట్లు వ్యంగ్యమగునాయికానాయకవ్యవహారము-శృంగార (రసధ్వని) విభావములగు, నిశాచంద్రులను సంస్కరించుచు, [ఆరోపముచేత నలంకరించుచు, ప్రధానమగు వాచ్యార్థమునకు] అలంకారత్వము నొందుచున్నది. ఇట్లు సంస్కరింపఁబడినదియు, [గుణీభూతవ్యంగ్యమగు నాయికానాయక వ్యవహారముచేత] విభావముగాఁజేయబడినదియు, నగుచున్న [ప్రధానమగు] వాచ్యమువలననే – రసనిష్యందము - [రస ప్రతీతి] కలుగుచున్నది.

ప్రభామతి :— మొదటనిందు వాచ్యమగు నిశాచంద్రవృత్తాంతము - ప్రకరణము [సందర్భము] వలనఁదెలియును. అది తెలిసినతరువాత - సమానములగు విశేషణములచేత - నాయికానాయక వ్యవహారరూపమగు వ్యంగ్యార్థము - స్ఫురింపఁజేయఁబడును. అప్రస్తుతమగు నీవ్యంగ్యార్థము, - ప్రస్తుతమును, వాచ్యమును- నగు, వెనుకటి నిశాచంద్రవ్యాపారమునకు - నాయికానాయక వ్యాపార సమారోపమునుగలిగించి, యలంకరించినపిమ్మట, వెనుకటి నిశాచంద్రవ్యాపారము - వ్యంగ్యమగు నాయికానాయక వ్యాపారముగా స్ఫురించును. అప్పుడు నాయికానాయక వ్యాపారసమారోపముగల (వ్యంగ్యాలంకృతమగు) నిశాచంద్ర వ్యాపారము (వాచ్యము) వలననే-సహృదయులకు చమత్కారలాభముకలుగును. కనుక, సమాసోక్తియందు వ్యంగ్యముచేత నలంకృతమగు వాచ్యమే-ప్రధానమగుచుండును. కనుక, నిచటివ్యంగ్యము - గుణీభూతవ్యంగ్యమని చెప్పఁబడును.

ఇట్లు - మధ్యమకక్ష్యయందుఁగల వ్యంగ్యము నపేక్షించి,యీపద్యము-గుణీభూతవ్యంగ్యమున కుదాహరణగుచున్నది. ఇది యొకానొక కావ్యమునందలి పద్యము. కనుక, నందు ప్రధానమగు రసమునపేక్షించునపుడు, దీనియందు ప్రధానవ్యంగ్యమగు శృంగారరసధ్వనికూడ-నున్నదని చెప్పవలసియున్నది. అప్రధానవ్యంగ్యమగు, నాయికానాయకవ్యాపారమిచట, వాచ్యమగు నిశాచంద్రవ్యాపారమునలంకరించి, వాచ్యార్థద్వారమున పార్యంతికమగునాశృంగారరసస్ఫురణమునందుపయోగమునొందుచు, రసధ్వనినేయలంకరించుచున్నది. కనుకనే, యప్రధానమగుచున్నది. మొదట, విభావముకాకున్నను, వ్యంగ్యార్థకృతమగు సంస్కారణమువలన విభావత్వమునొందిన నిశాచంద్రవ్యాపారమే - అది - సాక్షాత్తుగానే పార్యంతికమగు రసధ్వని స్ఫురణమునందుపయోగించుటవలన ప్రధానమగుచున్నది.కాఁగా; ''ఇట్లిచట వ్యంగ్యమగు సమాసోక్తి - ధ్వనికాదు'' అనునది- ఫలితార్థమని తెలియునది.

''ఎవఁడు [ఈధ్వన్యాలోకమునకే ''చంద్రిక'' అనువ్యాఖ్యను రచించినవాఁడు] '[తయా] ''దానిచేన్'' = ''నిశచేత'' అనునది- [చేతనవాచకమగు] కర్తృపదము. అచేతనమగునిశకు-కర్తృత్వముకుదురదు. కనుక, నాయికానాయకవ్యవహారమిచట - శబ్దముచేతనే. ఊహింపఁబడి [కల్పింపఁబడి] అభిధేయమే [అభిధచేత - తెలుపఁబడునదియే] అగుచున్నది. కాని వ్యంగ్యముకానేరదు. కనుకనే, [సంగ్రహమగు నుక్తిగలదియను, సంజ్ఞాబలముచేత - అభిధేయమేయగుటవలన] 'సమాసోక్తి' అనిచెప్పఁబడుచున్నది''- అనివ్యాఖ్యానమునొనర్చెనో, అతఁడొనరించిన, ఆవ్యాఖ్యానము ''వ్యంగ్యానుగతమగు [వ్యంగ్యముచేతనలంకరింపఁబడిన] వాచ్యమే - ప్రధానముగా, ప్రకాశించుచుండును'' అను ప్రకృతగ్రంథార్థమునే [ధ్వన్యాలోకమూలమునే] త్యజించినది.

ప్రభా :— ''చంద్రికాకర్త- ఇచట, ధ్వన్యాలోకమున కొనర్చినవ్యాఖ్య సంగతముకాదు'' అని ఇంకొకదూషణము నొనర్చుచున్నాఁడు.

లోచనము :— మఱియు నట్లయినయెడల, [చంద్రికాకర్తచెప్పినట్లు మీది పద్యమునందలి నాయికానాయక వ్యవహారము . అభిధేయమేయగునెడల] మీది పద్యమునందలి యలంకారము . రూపకము కావలసివచ్చును.

''రాజహంసై రవీజ్యంత శరదైవ సరోనృపాః.''
''రాజహంసలచేత, శరత్తుచేత వీవఁబడిరి సరోనృపుల్''

"సరస్సులను నృపతులు - శరత్కాలమును, చామరగ్రాహిణిచేత - రాజహంసలను, చామరములచేత - వీవఁబడిరి".

ఇచట, శబ్దముచేత-సరస్సులుమాత్రమే-నృపతులుగా రూపింపఁబడినవి. తదుపరి, వీచుట అనుక్రియకు సమన్వయము కలిగించుటకు, శరత్తు - చామరగ్రాహిణిగాను, రాజహంసలు - చామరములుగాను, అర్థముచేతమాత్రమే - రూపింపఁబడినవి. కనుకనిది - వాచ్యమగు "ఏకదేశవివర్తిరూపక" మగుచున్నది. కాని తుల్యవిశేషణములు లేకుండుటవలననిది 'సమాసోక్తి' కాదు. మీదిపద్యమునందు వలె'సముదిత' అనుప్రస్తుతపద్యమునందు నాయికానాయకవ్యవహారము-వాచ్యమే అగునెడల, అదియును రూపకమేకావలసివచ్చును. "సమానములగు విశేషణములచేత వేరొకయర్థము గమ్యమగునెడల నది 'సమాసోక్తి'" - అను లక్షణముచేత-సమాసోక్తియందు, అభిధావ్యాపారము - నిరసింపఁబడినది. కనుకను, సమానవిశేషణములుండుటవలనను, ప్రస్తుతపద్యమున స్ఫురించునదియగు, నాయికానాయకవ్యవహారము-వాచ్యముకాదు. ఈవ్యాఖ్యానవిషయమున నింతకంటెనెక్కువ చెప్పవలసినదిలేదు.

ఈపద్యమునందు, నాయికానాయక వ్యవహారమిట్లు వ్యంగ్యమగుచు, స్ఫురించిన పిమ్మట, "నాయకునివిషయమున, నాయికకు [నిలజాలిక-జారినను, దెలియకుండుట మున్నగు] వ్యవహారమేదికలదో, ఆవ్యవహారము - (వాచ్యమగు) నిశయందు-సమారోపింపఁబడినది. నాయికవిషయమున, నాయకునకగు [ముఖమును ముద్దిడుకొనుట మున్నగు] వ్యవహారమేదికలదో, అది - చంద్రునియందు - సమారోపింపఁబడినది." అని వ్యాఖ్యానించుటవలన- "నాయికానాయక వ్యవహారము గల" అనుచోటవృత్తికర్తయేకశేషసమాసము నొనర్పకుండుటవలననగుదోషము నకవకాశములేకుండఁజేయఁబడినది.

ప్రభా : అవ ;— "సమాసోక్తియందు వ్యంగ్యోపస్కృతమగు వాచ్యమే-ప్రధానము. కనుక, నచట - ధ్వనిలక్షణమున కతివ్యాప్తికలుగదు" అని ప్రదర్శించి, 'ఆక్షేపాలంకారమునందుఁగూడ - ధ్వనిలక్షణమున కతివ్యాప్తిలేదు'. అని చెప్పుచున్నాఁడు.

**(51) మూలము :—** ఆక్షేపాలంకారమునందుఁగూడ - వ్యంగ్యవిశేషము నాక్షేపించునదియగు [ఆకర్షించునదియగు] వాచ్యమునందే సౌందర్యముండును. (ఇట్లు) "వ్యంగ్యార్థము నాక్షేపించు

నదియగు నావాచ్యార్థమే - ప్రధానముగా వాక్యార్థము" అనునది- ఆక్షేపమనునుక్తియొక్క సామర్థ్యమువలననే - తెలియఁజేయఁబడు చున్నది. అదెట్లనిన :- ఆక్షేపాలంకారమున, శబ్దోపారూఢమగు [శబ్దవాచ్యమగు] రూపముగలదియు, [వ్యంగ్యమగు] విశేషమును జెప్పవలయునను నిచ్ఛచేత, నిషేధరూపమగునదియు, నగు, నేయాక్షేపముగలదో, నిషేధరూపమగు నావాచ్యమే - వ్యంగ్యవిశేషము నాక్షేపించుచు, [ఆకర్షించుచు] ముఖ్యమగు కావ్యశరీరమగు చుండును.

లోచనము :— "ప్రతిషేధ ఇవేష్టస్యయో విశేషాభిధిత్సయా।
వక్ష్యమాణోక్తవిషయః సఆక్షేపోద్విధామతః.

"[వ్యంగ్యమగు] విశేషమును దెలుపవలయునను నిచ్ఛచేత - తెలుపుట కిష్టమగు నంశమును - నిషేధించుచున్నట్లు చెప్పుట - [నిషేధాభాసము] ఆక్షేపాలంకారమునకు లక్షణము. అది - 'వక్ష్యమాణవిషయము' 'ఉక్తవిషయము' అనిద్వివిధము.'' అనిమతము. [భామహాభిమతము.] అందు, వక్ష్యమాణమగు విషయముగలదియగు [చెప్పఁబోవునదియగు (వ్యంగ్య) విషయముగలిగినదానికి, నిషేధమును జెప్పునదియగు] ప్రథమ ప్రభేదమునకిది - యుదాహరణము :— పయనమున కుద్యమించుచున్న ప్రియతమునితో, సోత్కంఠయగు తత్కామిని యనుచున్నది.

గీ॥ ఉత్సుకతగల నేను - నిన్నొకక్షణమ్ము
యినను, జూడనిచో - చాలునిదియె, దీని
కంటె వేరగునట్టి వాక్యమ్ము నీకు
నప్రియమ్మగు దాని, నేనాడనేల ?
[ఇది - భామహీయమగు నుదాహృతి కాంధ్రీకృతి]

అనునిది - వక్ష్యమాణవిషయమును, [చెప్పబోవునదియగు, మరణము - (వ్యంగ్యము) - విషయముగాగలదియు,] నిషేధాత్మయు, [''దీనికంటె........ నేనాడనేల'' అని చెప్పదలఁచిన వ్యంగ్యమగు విశేషమును నిషేధించుచున్నట్లున్నదియు] నగు, ఆక్షేపాలంకారమగుచున్నది. 'చాలునిదియె' అను వాచ్యార్థమే-

(నిన్నుఁజూడని క్షణములోనే)''మరణింతును'' అనువ్యంగ్యమును, ఆక్షేపించుచు [వ్యంజింపఁజేయుచు] ప్రధానముగా, సౌందర్యప్రతీతినిబంధన మగుచుండును. [ఆక్షేప్యమగు మరణము - సౌందర్యప్రతీతినిబంధనము - కాదు. కనుక,] ఆక్షేప్యమగు [ఆక్షేపింపఁబడునదియగు] ''మృతినొందుదును'' అనువ్యంగ్యముచేత- ఆక్షేపకమగు [ఆకర్షించునది, లేక వ్యంజింపఁజేయునది, యగు] వాచ్యార్థము- అలంకృతమగుచు, ప్రధానమగుచున్నది. [చెప్పఁబడిన విషయమునకు (వ్యంగ్యమునకు) నిషేధమును జెప్పునట్లున్నదియగు] ఉక్తవిషయమునకు [ద్వితీయభేదమునకు] ఉదాహరణము - నాయదియే. [అభినవగుప్తకృతమే.] [ఇందు - అప్రకృతమగు 'పాంథుడు' 'మరుమార్గము' అను విషయము - వాచ్యము. ప్రకృతమగు, 'దుష్ప్రభుసేవా వైఫల్యవృత్తాంతము.' వ్యంగ్యము]

శా॥ ఓయోపాంథ! అనర్ఘదేశమున కయ్యో వచ్చితేలయ్య ! మూ
ఢా! యెంతో తృషఁగొన్ననాకు గతిలేదన్యమ్ము, డాచెన్ జల
మ్మా యాపథ్య, అయో! యకాలసులభమ్మౌ తృష్ణపైనల్గవ
య్యా, యీమార్గము, మారవమ్ము-త్రిజగత్ ఖ్యాత ప్రభావమ్మయా!

ఒకానొక సేవకుఁడు - [సేవింపఁదగిన ప్రభువునొకనిని] సేవించెను. ''పొందఁదగినదానిని [ధనాదికమును] ఈప్రభువువలననేకారణమునఁబొందనయితినో''అని ప్రత్యాశచేత వ్యాకులపెట్టఁబడిన హృదయముగలవాఁడయ్యెను. ఆప్రభువునే చిరకాలముసేవించి [విసిఁగి]న, యింకొకఁడు - [''నీవసత్పురుషుఁడగు ప్రభువునుసేవించి, విఫలుఁడవయితివి.'' అను వ్యంగ్యవిశేషమును దెలుపునభిప్రాయమున ''అనర్ఘదేశమున కయ్యో ! వచ్చితేల య్య ?'' అను నిషేధరూపమగు] ఆక్షేపముచేత - ఈక్రొత్తసేవకుని, ప్రతిబోధించుచున్నాఁడు.

ప్రభా : ఎదురుపడినవ్యక్తి :— ఓయియోయి! బాటసారీ! నీవురాఁదగని చోటికేలవచ్చితివయ్యా! [అనునది - వాచ్యము.] మహాలోభియగునీప్రభునియొద్ద కేలవచ్చితివయ్యా ! [అనునది - వ్యంగ్యము]

బాటసారి :— [కోపగించి, యనుచున్నాఁడు.] ఓరీ మూఢుఁడా! నాకెంత దాహము కలిగినదో, నీకేమితెలియును ? నాకువేరొక దారిలేక యిచటికి వచ్చితిని. ఈదారియందు నాకు నీరుదొరకినదికాదు. [అనునది - వాచ్యము ] ఓరీ మూఢుఁడా! నాకింకొక ప్రభువుగోచరింపకుండుటవలన నిక్కడికి వచ్చితిని. ఈ పత్రిభువు - ధనమునిచ్చినాఁడుకాఁడు. ఏమిచేయుదును ? [అనునది-వ్యంగ్యము.]

ఎదురుపడినవ్యక్తి :— నన్నేల కోపగించెదవు. తగనిచోటికివచ్చి, విషయము లభింపకుండుటవలన, సులభముగా కలిగిన నీతృష్ణనే - కోపింపుము. ఈ మరుమార్గము - నిర్జలమనునంశము-త్రిలోకవిదితముగదా! [అనునది-వాచ్యము] ''ఈప్రభువు - పరమలోభియని ముల్లోకములకును దెలియును. నీకేలతెలియదో?'' [ఇది - వ్యంగ్యము.] ఇచట, అప్రకృతమగు పాంథునికిని, మరుమార్గము [మరుభూమికి సంబంధించినమార్గము - మారవము] నకును, సంబంధించిన యర్థము - వాచ్యము. ప్రకృతమగు లుబ్ధదుష్ప్రభుసేవా వృత్తాంతము- వ్యంగ్యము.

లోచనము :— ఇచట, ప్రభునిసేవించుటకు వచ్చినవాని రాకను-అనర్హదేశమునకయ్యో వచ్చితేలయ్యా?'' అనువాచ్యము నిషేధించుచున్నది. [నిషేధించుచున్నట్లున్నది] కనుక, నిషేధరూపమగు, నీయాక్షేపము- వాచ్యమగుచున్నది. వాచ్యమగు నీయాక్షేపముచేత - ''అసత్పురుషసేవ - విఫలము'' అను వ్యంగ్యమాక్షేపింపఁ [ఆకర్షింపఁ] బడుచున్నది. ఇచట, శాంతరసస్థాయిభావమగు నిర్వేదమునకు - ఈయసత్పురుష సేవావైఫల్యము - విభావరూపమగుచున్నది. ఆసేవ-విఫలమగుటచేత - పాంథునికొదవిన యుద్వేగ, మనుభావమగుచున్నది. ఆక్షేప్యమగు, [వ్యంగ్యమగు] అసత్పురుషసేవా వైఫల్యాదికముచేత - అలంకృతమగు, వాచ్యమే - యిచట చమత్కృతిని గలిగించుచున్నది. [కనుక, అప్రకృతమైనను గూడ - అదియే - ప్రధానము.]

ప్రభా :— మీఁది యుదాహృతియందు, ''లుబ్ధప్రభుసేవ - విఫలము'' అనువ్యంగ్యము - ''నీవీయనుచిత ప్రదేశమగు మరుమార్గమునకు రాఁదగదు'' అను నాక్షేపకమగు వాచ్యమునకు శోభనొదవించుచున్నది, తదలంకృతమగు నీ వాచ్యము - [ఆక్షేపకము] - సహృదయహృదయమునకు చమత్కారమును గలుగఁజేయుచున్నది. కనుక, నదియే - ప్రధానము. కాఁగా, ''ఉక్తవిషయమగు నాక్షేపాలంకారముగూడ - గుణీభూతవ్యంగ్యమేయగును'' అని తెలియునది.

లోచనము :— ''ఇంతిముఖమొప్ప, శశిచేత - నేమిఫలము?'' అనుచోటనువలె, 'ఉపమానమగు చంద్రాదికమును, ఆక్షేపించుటయే'-అనఁగా; 'నిరసించుటయే - ఆక్షేపము.' అను నభిప్రాయముగల వామనోక్తమగు నాక్షేపమునకు మాత్రము, 'ఉపమానాక్షేపమే - ఆక్షేపము' ['ఉపమానమును నిరసించుటయే - ఆక్షేపము'.] అనునది - లక్షణమగుచున్నది.

దీని కుదాహరణము :—

శా॥ శ్రీసౌమ్యప్రియసుందరీ ముఖము - భాసింపంగఁ, బూర్ణేందుఁడే
లా ? సౌందర్యఖనుల్, తదీక్షలుగ; నీలాబ్జమ్ము లేలా ? స్వయో
షాశుభ్రాధరమొప్ప; కోమలరుచిస్యందుల్, కిసాలమ్ము లే
లా ? సృష్టిన్ బునరుక్తిఁగూర్చు గ్రహమేలా నూత్న, మీధాతకున్.

ఇచట, [చంద్రాదిసాదృశ్యరూపమగు] ఉపమార్థము- వ్యంగ్యమైయున్నను, అది - ఆక్షేపరూపమగు [చంద్రాది నిరసనరూపమగు] వాచ్యమునే - యలంక రించును. కనుక, "పూర్ణేందుఁడేలా ?" అని చంద్రాది నిరసనరూపమగు నాక్షేప మగు వాచ్యమే - ఇచట చమత్కారకారణమగుచున్నది. "ఉపమానాక్షేపమే - అనఁగా, వ్యంగ్యమగు చంద్రాద్యుపమానమును [నిరసించుటకాక] అర్థసామర్థ్య మున ఆకర్షించుటయే - [వ్యంజింపఁజేయుటయే] - ఆక్షేపము" అగునెడల; దాని కిది - యుదాహరణము :—

ఆ॥ ఐంద్రమైన ధనువు నార్ద్రనఖక్షతా
భమును, సితపయోధరమునఁ బూని;
శశిఁ, గళంకయుతుఁ, బ్రసన్నుఁ జేయుచు, శరద్
వేళ - రవిని గడుఁదపింపఁజేసె.

అను నిచట, ఈర్ష్యచేత - కాలుష్యమునొందిన, [చంద్రుఁడను] నాయకుఁ డొకఁడు-[నాయికయొకతెయు] ఉపమానముగా నాక్షేపింపఁ [వ్యంజింపఁజేయఁ] బడుచున్నను, [ఆక్షేపింపఁబడిన యీవ్యంగ్యము-ఇందలి] వాచ్యార్థమునే యలంక రించుచున్నది. కాని, యిది-[వామనమతమున, నిదియాక్షేపాలంకారమగుచున్నను, భామహమతమున] సమాసోక్తియే యగుచున్నది.

ప్రభా : ఇందలి వాచ్యమిది :— "శరద్వేళ, [శరత్కాలము] పచ్చిగా నున్న, గోటినాటువలెనున్న, యింద్రచాపమును తనకు సంబంధించిన తెల్లని పయోధరమునందు [నీటినిధరించునదియగు మేఘమునందు] ధరించి, కళంకము తోఁగూడిన, చంద్రుని, ప్రసాదాతిశయయుక్తునిగాఁజేయుచు, సూర్యుని, మిక్కిలి తాపము నొందించెను."

వ్యంగ్యము :— శరద్వేళయను నాయిక - ఇంద్రచాపమువలెనున్న, గోటినాటును, తెల్లగానున్న తన పయోధరమునందు [పాలనుధరించిన స్తనము నందు] వహించి, ఈర్ష్యాకలుషితుఁడగు [అపరాధియగు] శశియను నాయకుని, ప్రసాదయుక్తునిగాఁజేయుచు, [దానినిఁజూచి, యీర్ష్యనొందిన] రవియను నింకొక

నాయకుని - పరితాపము నొందునట్లొనర్చెను.

అవ :— "ఇచట, వాచ్యమే - ప్రధానము. వ్యంగ్యము - ప్రధానము కాదు" అనుటకు హేతువును జెప్పుచున్నాఁడు.

(52A) మూలము :— వాచ్యవ్యంగ్యముల ప్రాధాన్య వివక్ష - వానికిఁగల సౌందర్యోత్కర్షనుబట్టియే - నిర్ణయింపఁదగినది గదా !

లోచనము :— "ప్రాధాన్యవివక్ష - చారుత్వోత్కర్షనుబట్టియే - సిద్ధించును" అనుటకు ప్రసిద్ధమగు దృష్టాంతమును ప్రదర్శించుచున్నాఁడు.]

(52B) దీనికుదాహరణము :—

కం॥ మిప్పుల ననురాగవతియును,
దివసపురస్సరయు, నగుచు దీపించును సం
ధ్య; విధి విధానమ్మెట్టిదొ
యపుర! ప్రవర్తిలదుతత్సమాగమ, మయినన్.(౯)

ఇచట వ్యంగ్యప్రతీతి యుండినను, వాచ్యమునందుఁగల సౌందర్యమే - ఉత్కర్షవంతమగుచున్నది. కనుక, దానికే, ప్రాధాన్యము - వివక్షింపఁబడును.

లోచనము : 'వాచ్యము' 'వ్యంగ్యము' అనువానిలో, దేనియందధిక సౌందర్యముండునో, 'అదియే - ప్రధాన'మను నంశమును నిరూపించుటకే, ప్రసిద్ధమగు మీఁది దృష్టాంతమొసఁగఁబడినది. దీనిచేత - ఆక్షేపప్రమేయ సమర్థనమే- పరిసమాప్తము కాలేదని తలఁపఁదగియున్నది. కనుక, ఇచట [ఆక్షేపమును సమర్థించుటకే] సమాసోక్తిగల పద్యము - ప్రదర్శితమయినది.

ప్రభా :— "సంధ్య = సంధ్యాసమయము. అనురాగవతి = ఎఱుపుగలది. [మఱియు] దివసపురస్సర = తనకుముందు పగటిదినముగలది. అయినన్ = అట్లయినను గూడ, సంధ్యా, దివసములకు - సమ్మేళనము కలుగదు." అనునది-వాచ్యము.

"సంధ్య = సంధ్యయను పేరుగల నాయిక, అనురాగవతి = (మిక్కిలి) ప్రేమగలది. దివసపురస్సర = తనయెదుటనే దివసుఁడను నాయకుఁడు గలిగి యున్నది. అయినను, [అచింత్యమగు గురుపారతంత్ర్యాది నిమిత్తమువలన] ఈ సంధ్యానాయికకును, దివసనాయకునకును, సమావేశము కలుగదు." అనునది-వ్యంగ్యము.

లోచనము :— గురు పారతంత్ర్యాదికము ['అత్తమామలు' మున్నగు పెద్దలచాటున నుండుట - మొదలగునది] సమాగమము - ప్రవర్తిల్లకుండుటకు, నిమిత్తమని తెలియునది. "దానితే" అనఁగా; 'వాచ్యమునకే' అని, అర్థము నెఱుఁగునది.

ప్రభా : అవ :— "సమాసోక్తియందు, వాచ్యప్రాధాన్యమును సమర్థించుటయే-గ్రంథకర్తయాశయమగునెడల, "సముదితరాగుఁడై" అనుపద్యమే-చాలియున్నదిగదా! తిరుగ నింకొక, సమాసోక్త్యుదాహరణమును, వ్యర్థముగా నేల ప్రదర్శింపవలయును ?" అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— [నాయకరూపమగు వ్యంగ్యముసమానముగా నాక్షేపింపఁబడుటవలన] వామనాభిప్రాయముననిది ['మివులననురాగవతి' అనునది-] ఆక్షేపాలంకారమగుచున్నది. ['అనురాగవతి' ఇత్యాది విశేషణ సామ్యమువలన - అప్రస్తుతమగు వ్యంగ్యము- గమ్యమగుటవలన] భామహాభిప్రాయమున మాత్రము-సమాసోక్తియగుచున్నది. ఈయభిప్రాయమును హృదయమునందుంచుకొనియే, యీగ్రంథకర్త - యుక్తిచేత, ఆక్షేపమునకును, సమాసోక్తికిని, గూడ- "మివులననురాగవతి" అను దీని నొక్కదానినే యుదాహరణముగా నొసఁగెను. "ఇది - సమాసోక్తియైనను, ఆక్షేపమైనను, మాకు దానిచేత ప్రయోజనమేదియును లేదు. 'ఈయలంకారములన్నింటియందునుగూడ వ్యంగ్యము - వాచ్యమునందు గుణీభావము (అప్రాధాన్యము) నొందుచుండును'. అనునదియే- మేముసాధింపవలసినది." అను నభిప్రాయము మాగురువులచేత - ఈగ్రంథమునకు [వాచ్య.... ప్రాధాన్యవివక్ష. సౌందర్యోత్కర్షబట్టియే నిర్ణయింపదగినదిగదా! అను వాక్యమునకర్థముగా] నిరూపింపఁబడినది.

అవ :— 'ఇట్లు [వాచ్యవ్యంగ్యముల] ప్రాధాన్యవివక్షయందు దృష్టాంతమును దెలిపి, ' వ్యపదేశముకూడ - [దీపకాదినామనిర్వచనముకూడ] వాచ్యప్రాధాన్యకృతమేయగును." అనునంశమున, తనకును, పరులకును, ప్రసిద్ధమగు దృష్టాంతమును దెలుపుచున్నాఁడు.

(53) మూలము :— అదెట్లనిన :- "దీపకము, అపహ్నుతి, మొదలగు నలంకారములయందు, ఉపమ-[ఉపమానోపమేయభావము] వ్యంగ్యమగుచున్నను, అది-[వ్యంగ్యమగునుపమానోపమేయభావము] ప్రధానముగా వివక్షింపఁబడకుండుటను. కనుక, నచట [దీపకాదివ్యపదేశమేగాని] ఉపమయను వ్యపదేశము-[నామనిర్వచనము] కలుగనట్లు, ప్రస్తుతములగు నాక్షేపాదులయందుఁ గూడ - వ్యంగ్యమున్నను, ఆవ్యంగ్యమునకు - [సౌందర్యోత్కర్షకృతమగు] ప్రాధాన్య వివక్షలేకుండుటవలన, [ఆక్షేపాది వ్యపదేశమేకలుగునుగాని] ధ్వనివ్యపదేశముకలుగదు" అనితెలియవలయును.

లోచనము :— "అదిమధ్యాంత విషయంత్రిధా దీపకమిష్యతే"

గీ॥ "ఆదిమధ్యాంత వాగ్విషయమ్ముగాన,
దీపకాలంకృతి - వెలుంగు త్రివిధయగుచు"

అనునది (భామహోక్తమగు) దీపక లక్షణము.

ప్రభా :— అందు - అంత్య (వాగ్) విషయమగు దీపకము నుదాహరించుచున్నాఁడు. ఇది - "నవలా" అను పేరుగల జాతియమగు పద్యము. ప్రభామతి కర్తృప్రదర్శితము.

లోచనము :— దీనికుదాహరణము :— [నవలా]

శాణోల్లీఢమయిన, మణి - శరదాశ్యానపులినయగు తరంగిణి - మదక్షీణుఁడయిన, నాగాధిపుఁడు- కళాశేషుఁడయిన, శ్రీకుముదబాంధవుఁడు- ప్రాణేశప్రియసురత మృదితయగు, బాల- హేతిప్రహతుఁడు, రణవిజయుఁడు- తానర్థులయెడ గళితవిభవుఁడగు, దాతయు- "కృశించియును శోభింతురు."

అను నిచటనున్న చారుత్వము - దీపనకృతమే యగుచున్నది.

ప్రభా :— "దీపింపఁజేయునది - దీపకము" అనునది-దీపకవ్యుత్పత్తి. అనేకస్థలములయందు [వాక్యములందు] ఏకధర్మాన్వయము - దీపనము. ఈదీపనధర్మముగలది - దీపకము. ఆది వాక్యగతమగు దీపనధర్మముగలది - అది

దీపకము. మధ్యవాక్యగతమగు దీపనధర్మముగలది - మధ్యదీపకము. అంతేవాక్య గతమగు, దీపనధర్మముగలది - అంత్యదీపకము. మీఁది పద్యమునందు, ''కృశించియును శోభించుట'' అనుదీపనధర్మము - అంతవాక్యగతమగుటవలన నిది - అంత్యదీపకోదాహరణమగుచున్నది. విస్తృతి భయమువలన, తదితరదీపకములు దాహరింపఁబడుటలేదు. ఇచట, మణి, తరంగిణీ, ప్రభృతులకుపమానోపమేయ భావము - వ్యంగ్యమయినను, దీనియందు [సౌందర్యాతిశయము - వాచ్యమగు, దీపనధర్మముచేత - కృతమేయగుచుండును; గాని, వ్యంగ్యమగు నుపమానోపమేయభావముచేత - కృతమగునది - కాదు. కనుక, సౌందర్యాతిశయకృతమగు ప్రాధాన్యవివక్ష - [వాచ్యమగు] దీపకమునందే - యుండుటవలన, ఇది - దీపక మనియే వ్యవహరింపఁబడుచున్నది. ఇచట, వ్యంగ్యమగు నుపమ - వాచ్యమగు దీపకమున కుపస్కారకమగుచు, దీపకవ్యాపారముననే - ఆస్వాద్యమగునని తెలియునది.

అవ :- అపహ్నవాలంకృతికి భామహోక్తములగు లక్షణోదాహరణములను ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— ''వ్యంగ్యముపమగ, స్వాభిమతార్థమెటన
పహ్నుతినిగాంచు, నదియె - యపహ్నవమ్ము''.

దీనికుదా :— కం॥ తుమ్మెదమొత్తము - మత్తిలి,
యిమ్ముగఁగావించునినదమిదిగా, దాకృ
ష్టమ్మగు, కందర్పుని చా
పమ్మున 'భా'మ్మని జనించు ధ్వనియగునరయన్.

ఇచట, అపహ్నుతి [నిషేధము] చేతనే - శోభకలుగుచుండును.

ప్రభా :— ఇచట, భృంగావళీనినాద-కందర్పచాపధ్వనుల, కౌపమ్యము-గమ్యమగుచున్నను, వాచ్యమగు భృంగనాద నిషేధమునందే - (అపహ్నవమునందే] సౌందర్యాతిశయముండుటవలన, వాచ్యమగు నపహ్నవమే, ప్రాధాన్యవివక్షగలదగుచున్నది. కనుక, నిది యపహ్నవమనియే వ్యవహరింపఁబడుచున్నది. ఈ దీపకాపహ్నుతులయందువలె, ఆక్షేపాలంకారమునందుఁగూడ - ఆక్షేపింపఁబడిన యర్థమునకుఁ బ్రాధాన్యము లేకుండుటవలనను, వ్యంగ్యార్థాలంకృతమగు వాచ్యమునందే - సౌందర్యాతిశయముండుటవలనను, ఆక్షేపమనియే - వ్యవహరింపఁబడునని భావము.

లోచనము :— ఆక్షేపప్రమేయము నిట్లు సమర్థించి, ఉద్దేశక్రమము నను సరించి, [సమాసోక్తిని, ఆక్షేపమును సమర్థించి,] ప్రమేయాంతరమును [అనుక్త నిమిత్తవిశేషోక్తి ప్రమేయమును] దెలుపుచున్నాఁడు.

ప్రభా : అవ :— విశేషోక్తిభేదములగు, "అచింత్యనిమిత్తము, ఉక్త నిమిత్తము," అనువానియందు వ్యంగ్యములేకున్నను, అనుక్తనిమిత్తమగు [విశే షోక్తి] భేదమునందు వ్యంగ్యముండును. "అయిన, నచట - వ్యంగ్యమునకు ప్రాధాన్యములేదు" అను నంశమును దెలుపుచున్నాఁడు.

(54) మూలము :— అనుక్తనిమిత్తమగు [నిమిత్తము చెప్పఁబడని] విశేషోక్తియందుఁగూడ-

> పిలువంబడియు సహాయుల
> వలన 'నిదిగోవచ్చితి' (వచ్చెద)నని పలికియు, నిద్రన్
> దొలఁగియు, పాంథుఁడు, వెడలఁగఁ
> దలఁచియు, సంకోచమును వదలకయెయుండెన్."

ఇత్యాదులందు ప్రకరణ [సందర్భ] సామర్థ్యమువలన వ్యంగ్యమునకు ప్రతీతిమాత్రముండును. కాని, తత్ప్రతీతి నిమిత్త మగు సౌందర్యనిష్పత్తి-యేదియు, నిచటనుండదు. కనుక, నిందలి వ్యంగ్యమునకు - ప్రాధాన్యములేదు.

లోచనము :— వస్తుగతము, కారణమునై, వరలునంశ
> మొకటి లోపించినను, మఱియొకగుణమ్ము
> సంస్తుతమ్మగు నెట, విశేషమ్ము-ప్రథన
> మొందఁజేయుట, 'కదివిశేషోక్తి'యగును.

ప్రభా :— అనునిది - విశేషోక్తి లక్షణము. "ఒకవస్తువునందలి విశేష మును వెలువరించుటకుగాను, ఆవస్తువునందు కారణరూపమగు, నొకయంశము- లోపించినను, కార్యరూపమగు వేరొక ధర్మమున్నట్లు వర్ణించుట-'విశేషోక్తి' అని భామహునిచేత స్మరింపఁబడినది." వెలువరింపఁగోరిన, వస్తుగతమగు విశేషము

నలంకరించునదియగు నిమిత్తము- అచింత్యమో, ఉక్తమో, అనుక్తమో,యగును. కనుక, అది- అచింత్యనిమిత్తము, ఉక్తనిమిత్తము, అనుక్తనిమిత్తము, అని త్రివిధమగుచుండును. అందు అనుక్తనిమిత్తమగు విశేషోక్తియందుమాత్రమే- వ్యంగ్యమగు నిమిత్తముండుటవలన, వృత్తికర్త - దానినిమాత్రమే యుదాహరించెను. దాని ప్రకరణార్థముల నిట్లెఱుఁగునది. ''మిత్త్రులతోఁగలిసి, పయనించుచున్న బాటసారి - దారినడుమ, నొకచోటనిద్రించుచుండెను. వేకువజామున, అతని మిత్త్రులువచ్చి, పయనించుటకు రమ్మనిపిలచిరి.'' ''సహాయులగు మిత్త్రులు - తన్నుఁబిలుచుచున్నను, 'ఇదిగోవచ్చుచున్నాను' అని తానుసమాధానమునిచ్చుచున్నను, మేల్కొనియున్నను, వారితోఁగలిసి పయనించుటకు తలఁపుగొనియున్నను, గూడ - ఆ పాంథుఁడు - సంకోచమును [కన్నులుమూసికొనుట, అంగములను బిగించుట, దుప్పటికప్పుకొనుట, మున్నగువృత్తిని] విడువనేవిడువఁడు'' ఇందు, వ్యంగ్యమగు నిమిత్తము - చలిబాధయో, ఇంకేదియో, యగును. ఆ నిమిత్తమిచట, చెప్పఁబడుటలేదు, కనుక, నిది-అనుక్తనిమిత్తమగు విశేషోక్తి కుదాహరణమగుచున్నది.

లోచనము :— అందు, అచింత్యనిమిత్తయగు విశేషోక్తి కుదా :—

కం॥ ఆకుసుమాయుధుఁ డొక్కఁడు
లోకమ్ములు మూఁడయిన గెలుచువానిని, భ
స్మీకృత శరీరుఁజేసియు,
శ్రీకంఠుఁడు నతని బలిమిఁజెరుపఁగలిగెనే ?

ప్రభా :— శరీరముండిననే, బలముండును. అదిలేనియెడల, బలముండదు. ఇచట, శరీరములేకుండినను, బలమున్నట్లు చెప్పఁబడినది. ఆ బలముండుటకు - నిమిత్తమేదోయున్నను, అది - యచింత్యము. [ఊహింపరానిది] కనుక, నిది - యచింత్యనిమిత్త విశేషోక్తి కుదాహరణమగుచున్నది.

ఇచట - దేహభస్మీకరణరూపమగు కారణమున్నను, బలహరణరూపమగు కార్యము - కలుగనట్లు చెప్పఁబడినది.

లోచనము :— ఇచట, వ్యంగ్యమగు నిమిత్తమేదో యుండవలయును· కాని, అది - యచింత్యమగుచున్నది. కనుకనిచట వ్యంగ్యమున కునికిలేదు. ]ఉండినను, గూఢమయినది కనుక, నున్నట్లు, ఆశంకింపఁదగినదికాదు.] ఉక్తనిమిత్తయగు విశేషోక్తియందుఁగూడ - [చెప్పఁబడిన నిమిత్తము] వస్తుస్వభావమాత్ర

మునందే పర్యవసించును. కనుక, నచటఁగూడ - వ్యంగ్యమున్నదని యాశంకింపఁ దగదు. అదెట్లనిన :—

కప్పురమ్ముఁబోలె, - కాల్పంబడియు, నెల్ల
జనతయందు, నాత్మశక్తిఁజూపు,
నాయవార్య వీర్యుఁడయిన ప్రసూన బా
ణునకు - మన్నమస్కృతిని ఘటింతు.

ప్రభా :— ఇచట, దహింపఁబడిన యనంగుఁడు - శక్తిహీనుఁడుకావలసి యుండ (అధికమగు)శక్తిని బ్రదర్శించుటకు నిమిత్తము - 'అవార్యవీర్యత్వమే'. అనఁగా; 'అకుంఠితశక్తియేయగును'· ''అవార్యవీర్యుఁడయిన'' అనుదానిచేతనా నిమిత్తమిచటఁజెప్పఁబడినది. కనుకనిది - ఉక్తనిమిత్తమగు, విశేషోక్తి కుదాహృతి యగుచున్నది.

లోచనము :— ఆకారణముచేత - [అచింత్యనిమిత్తము; ఉక్తనిమిత్తము నగుప్రభేదములు రెండింటనుగూడ - వ్యంగ్యములేకుండుటచేత] ఆప్రకారద్వయ మునువిడిచి, తృతీయప్రకారమునందు [అనుక్తనిమిత్తమునందు]వ్యంగ్యముండుట వలన, దానికే ప్రాధాన్యము కలుగఁగూడదా ? అనియాశంకించి ''అనుక్తనిమిత్త యగు విశేషోక్తియందుఁగూడ,'' అను వాక్యముచేత- వ్యంగ్యమునకుఁబ్రాధాన్య ములేదని నిరూపింపఁబడినది.

లోచనము :— ''సంకోచమును వదలకుండుటకు, గమ్యమగునిమిత్తము చలిబాధయేయగును.'' అనిభట్టోద్భటుఁడుచెప్పెను తదభిప్రాయము నుద్దేశించి, ఇచట తత్ప్రతీతికృతమగు సౌందర్యనిష్పత్తియేదియునుండదు.'' అని వృత్తికర్త చేతఁ జెప్పఁబడినది.

ప్రభా : అవ :— ''అయ్యా ! చలివలనఁగలిగినయార్తి - సంకోచము నువదలకుండుటకు నిమిత్తముకాదు. దీనికంటె నితరమును· రమణీయమును,నగు నేదో నిమిత్తము - వ్యంగ్యముకావచ్చును. వ్యంగ్యమగు నానిమిత్తము - సౌందర్య నిష్పత్తిహేతువునుగావచ్చును. కనుకనిచట, వ్యంగ్యమునకే - ప్రాధాన్యము కలుఁగవచ్చునే'' అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— ''నడిచివెళ్లుటకంటె, కలఁగనుటయే, కాంతాసమాగమ మునకు సులభమగు నుపాయమని తలఁచి, నిద్రనొందవలయునను బుద్ధిచేత

సంకోచమును విడువకుండెను.'' అని రసికుల చేత కల్పితమయిన [వ్యంగ్యమగు] నిమిత్తమేదికలదో [కేవలమగు] ఆనిమిత్తముకూడ [కేవలమగు] సౌందర్యహేతువని [విశేషోక్తి నలంకారముగా నిష్టపడిన] అలంకారవిదులచేత కల్పింపఁబడుట లేదు. ఇంకేమనిన [ప్రియతమాస్వప్న సమాగమోపాయమను వ్యంగ్యమగు నిమిత్తముచేత నలంకరింపఁబడిన, "సంకోచమును వదలకయెయుండెన్'' అను వాచ్యమగు] విశేషోక్తిభాగమే - సౌందర్యహేతువగును. [కాని, కేవలమగు నిమిత్తమాత్రమే - సౌందర్యహేతువుకాదు.] అట్లుగానియెడలనో, [వ్యంగ్యమగు నిమిత్తముచేత నుపస్కృతినొందనియెడలనో,] ఇది- విశేషోక్తియే,కాకుండును. ఇట్లు [ఉద్భటునిచేతఁ దెలుపఁబడినదియు, రసికులచేత దెలుపబడినదియు, నగు] ఈయభిప్రాయములను రెండింటినిగూడ - మనస్సునందుంచుకొని, "వ్యంగ్యమునకు ప్రతీతిమాత్రముండును. ప్రాధాన్యములేదు.'' అనుసాధారణోక్తిచేత- గ్రంథకారుఁడు- "ఉభయవిధమగు వ్యంగ్యమునకును ప్రాధాన్యములేదని నిరూపించెను. కాని, ఉద్భటుఁడు తెలిపిన [పలిబాధయను] అభిప్రాయము నొకదానినే, మనస్సునందుంచుకొని యీగ్రంథమును రచించుటలేదు'' అని తెలియునది.

(55) మూలము :— ధ్వని మహావిషయముగలదనియు, అంగియనియు, ముందు ప్రతిపాదింపఁబడును. కనుక, పర్యాయోక్తమునందుఁగూడ - వ్యంగ్యమునకుఁ బ్రాధాన్య ముండినయెడల, అపర్యాయోక్తమే- ధ్వనియందంతర్భవించును. కాని, దానియందు ధ్వని - యంతర్భవించునదికాదు.

లోచనము :— గీ॥ వాచ్యవాచక వ్యాపారవర్జితమయి,
యవగమన రూపమయిన, యన్యప్రకార
మున - సమభిధీయమానగునది-యెదియొ,
అదియె - వెలయు పర్యాయోక్తమను సమాఖ్య.

ప్రభా :— ఇది పర్యాయోక్తలక్షణము. పర్యాయముతో అనఁగా;'ప్రకారాంతరముతో'అనియర్థము,"వాచ్యవాచకవ్యాపారము[అభిధ]లేనిదియు, 'వ్యంజనావ్యాపారమను వేఱొకప్రకారముతో' అనఁగా; వ్యంజనావ్యాపారవిషయమగు వ్యంగ్యముతోఁగూడినదియు నగుచు, ఏది-[ఏవాచ్యార్థము] సమభిధీయమానమగునదియొ,[చెప్పఁబడునదియగునో;] అదియె, అనఁగా; అభిధీయమానమగుచుండునదియగు[చెప్పఁబడునదియగు] ఆవాచ్యమే-పర్యాయోక్తమను నామముచేతఁబ్రకా

శించును''. అనునది-దీనిలక్షణము. ''వ్యంజనయనువేఱొకవ్యాపారముచేత వ్యంజింపఁజేయఁబడిన వ్యంగ్యముతోఁగూడుకొని, అభిధచేత - చెప్పఁబడునదియగు నర్థము-పర్యాయోక్తము.'' అని తాత్పర్యము.

లోచనము :— దీనికుదాహరణము :

గీ॥ శత్రువిచ్ఛేదకృతి దృఢేచ్ఛాపరీతుఁ
డగుచు, నుత్పథగామియౌనట్టి మునికి,
పరశురామున, కాత్మచాపమున - భీష్ము
డపుడు, ధర్మోపదేశమ్ము నాచరించె.

ఇచట, ''భీష్ముని ప్రభావము - భార్గవుని ప్రభావమును. తిరస్కరించెను.'' [అనుకారణరూపమగు] నర్థము - ప్రతీయమానమగుచున్నది. అయినను, తత్సహాయమగు [ఈవ్యంగ్యార్థముచేత నలంకృతమగు] ''ధర్మోపదేశమ్మునాచరించె'' అను [కార్యరూపమగు] అభిధీయమానము [వాచ్యము]చేతనే వాచ్యార్థ[కావ్యార్థ] మలంకృతమగుచున్నది.

ప్రభా : - మననధర్మము గలమునికి, శత్రువులుండుటయే-అనుచితము. శత్రువిచ్ఛేదకృతి - మఱియు ననుచితము. ఏహేతువుననో, అది - కలిగినను, దానియందు, దృఢమగు నిచ్ఛతో, బాగుగాఁగూడియుండుట- అత్యంతానుచితము. కనుకనే, అతఁడు, 'ఉత్పథగామి' అనఁగా; 'మునిమార్గము నతిక్రమించినవాడు' అనిచెప్పఁబడినది. అట్టివానికి ధర్మోపదేశము - మాటతోడఁగాక, వింటిచేతనే గావింపఁబడుట యుక్తముగదా ! [ఇట్లిచట,వాచ్యార్థమే-ప్రధానముగాని, వ్యంగ్యముకాదు.] కనుకనే; ''ఏది - పర్యాయముతో; అనఁగా; వ్యంజనాత్మకమగు [వ్యంజనావ్యాపార విషయీభూతమగు] ప్రకారాంతరమగు వ్యంగ్యముతోఉపలక్షితమగుచు [కూడినదగుచు] అభిధీయమానమగునో, అభిధీయమానమగునదియే - అనఁగా: వచనవ్యాపార విషయీకృతమగునట్లు చెప్పఁబడినదియే - పర్యాయోక్తమనిచెప్పఁబడును'', అనులక్షణపదము, పర్యాయోక్తమను లక్ష్యపదము, అర్థాలంకారమగుటయను సామాన్యలక్షణము, అనుసర్వమును - కుదురుపడుచున్నది.

లక్షణపదమనఁగా; లక్షణమును దెలుపునదియగు వాక్యము. దీనిచేతనే - వ్యంగ్యముతోఁగూడిన వాచ్యమునకు ప్రాధాన్యము తెలుపఁబడినది. లక్ష్యపదమనగా; సార్థకమగునామము. ''పర్యాయమున, ఉక్తము'' - [చెప్పఁబడినది.] అనుసార్థకమగు నామముచేతఁగూడ వాచ్యమునకుగల ప్రాధాన్యము

ప్రకాశింపఁజేయఁబడినది. సామాన్యలక్షణ మనఁగా; [వాచ్యార్థము నలంకరించుట యను] సామాన్యధర్మము. వాచ్యార్థము నలంకరించుట - అర్థాలంకారములకన్నిటికిని సమానమగు ధర్మముగదా! వ్యంగ్యము ప్రధానమగునెడల, నదియలంకారముకాక, అలంకార్యమగును. కనుక; అపుడిదియలంకారము కాకపోవలసి వచ్చును. వ్యంగ్యము ప్రధానముగాక, వాచ్యము ప్రధానమగునపుడే - 'ఈలక్షణ వాక్యము, లక్ష్యపదము, సామాన్యలక్షణము,' అను సర్వమును - యుక్తమగునని భావము.

అవ :— "అయ్యా! "అభి" అనునది యాభిముఖ్యమునందు వర్తించును. అభిముఖ్యము - ప్రాధాన్యనిబంధనము. "ధీయతే" అనఁగా; ["ప్రధానముగా బుద్ధియందు] ఉంచబడునది". అనియర్థము. కనుక, "అవగమనరూపమయిన, యన్యప్రకారమున, సమభిధీయమానమగునదియొ" అనుదానికి "వ్యంజనయను వ్యాపారభేదముచేత - సహృదయుల బుద్ధియందు ప్రధానముగా నుంచబడునదియగు వ్యంగ్యమొ" అనునర్థమును జెప్పవచ్చును. అప్పుడు-వ్యంగ్యమగు నదియే - పర్యాయోక్తమని సిద్ధించును. కాని, "శత్రువిచ్ఛేదకృతి" అను పద్యమునవాచ్యమునకే ప్రాధాన్యముండుటవలన, నపుడదిపర్యాయోక్తమున కుదాహరణముకానేరదు. కనుక; "సంచరింపుము ధార్మిక" అనునది - దానికుదాహరణముగానేల చెప్పదగదు ?" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— "సమభిధీయమానమగునదియొ" అనుదానికి, 'ప్రధానముగా ప్రతీయమానమగును" అని [కపోల] బలముచేత [కష్టపడి శబ్దమును పిడించి] వ్యాఖ్యనొనర్చి, "భ్రమినొనర్పుము" మొనలగుదానిని దానికుదాహరణముగాఁదెలుపునెడల; అపుడది - [అలంకార్యమగు] కావ్యాత్మరూపమునందు, పర్యవసించుటవలన, అలంకారమగుటకే - దూరమైనదగును.

ప్రభా : పరిశ్న :— అయ్యా! అదియలంకారముకానియెడల, కాకపోవుఁగాక. ఎవఁడయినను, మహోన్నతస్థానమునందధివసించుటకుఁ గోరికలేనివాఁడు కాఁడు. కనుక, అదియలంకార్యమే, అనఁగా; ప్రధానమగు నంగియేకానిండు!.

లోచనము :— తనకు ప్రసిద్ధమగు నలంకారత్వస్వభావమును విడిచి, [ఈపర్యాయోక్తమలంకార్యమే యగునెడల] అప్పుడిది యలంకారమధ్యమున పరిగణింపఁదగినదికానేరదు. [అలంకార్యమగునపుడు ప్రధానమగు వ్యంగ్యము బహువిధము. గనుక,] దీనికి భేదాంతరములుగూడ చెప్పవలసివచ్చును. కనుకనే పర్యాయోక్తమునందుఁగూడ - వ్యంగ్యమునకు ప్రాధాన్యముండినయెడల, ఆప

ర్యాయోక్తమే - ధ్వనియందంతర్భవించునుగాని, దానియందు ధ్వనియంతర్భవింపదు.'' అనివృత్తికర్త - చెప్పియున్నాఁడు.

ప్రభా : అవ :— వృత్తికారుఁడిచట - పర్యాయోక్తమున, వ్యంగ్యము ప్రధానమగునప్పుడది ధ్వనియందంతర్భవించుననిమాత్రమే చెప్పెను. కాని, లోచనకర్త - 'అప్పుడది యలంకారముకూడ - కాకపోవలసివచ్చును' అని చెప్పుచున్నాఁడు.

లోచనము :— [వ్యంగ్యము ప్రధానమగునప్పుడు] ఆత్మయగు ధ్వనియందీపర్యాయోక్తమంతర్భవించును. కనుక, ఇదియే యాత్మకాకున్నను [అప్పుడిదియు] ఆత్మయేయగును. కనుకనే, అలంకారము కాకపోవలసివచ్చును.

ప్రభా : అవ :— పర్యాయోక్తమునందే, ధ్వని యంతర్భవింపఁగూడదా? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము : — ''[అప్రధానీభూతమగు వ్యంగ్యముగల] ఎటువంటి యలంకారము - అలంకారము [వాచ్యాదుల నలంకరించునది]గా వివక్షింపఁబడునో, అటువంటి యలంకారమునందు ధ్వనియంతర్భవింపదు. [వ్యంగ్యము - ప్రధానమగునప్పుడు ధ్వనియగునని మేము చెప్పియున్నాము. కనుక] అటువంటిది ధ్వనియని మేము చెప్పువారలముకాముగదా ! ఏలయనిన :-ధ్వనిమహావిషయము [ పర్యాయోక్తమునందే గాక ] పెక్కుస్థలములయందుండుటవలన వ్యాపకమైయున్నది, [గుణాలంకారాదు లన్నియు, దీనియందే యుండును. కనుక] సమస్తప్రతిష్ఠా స్థానము. కనుకనే; అంగి. కటకకుండలాద్యలంకారము వలెనే. పర్యాయోక్తము మున్నగునలంకారము, కూడ-వ్యాపకముకాదు. మఱియు నలంకార్యతంత్రమగుటవలన అనఁగా; [అంగియగు] అలంకార్యము ననుసరించునదియగుటవలన, అంగికాదు. పర్యాయోక్తమునకు, సంచరింపుము'' మున్నగుదాని నుదాహరణముగాఁగైకొని, అది- వ్యాపకమును, అంగియు, నగుననియంగీకరించి, దానికిఁగల అలంకారత్వమును విడిచినయెడల, కేవలమగు మాత్సర్యముచేతనగు నభినివేశముచేత - దానిని పర్యాయోక్తమనుటయేకాని, అది - 'మా' ధ్వనినయము నాశ్రయించుటయేయగును'' అనిభావము.

ప్రభా :— అలంకారమలంకార్యము నలంకరించును. అలంకార్యములేనియెడల; అలంకారమునకు స్వరూపలాభము [అలంకరించుట] కలుగదు. మహావిషయమును, [వ్యాపకమును] అలంకార్యమును, అంగియు, నగుధ్వని-అవ్యాపక

మును, [అల్పవిషయమును] అలంకార్యపరతంత్రమును, అంగమును, నగు పర్యాయోక్తమునందంతర్భవింపదు. [ధ్వని - పర్యాయోక్తముకాదు.] అదియలంకారముకాక, వ్యాపకమును, అంగియు, నగునెడల; నప్పుడది ధ్వనియందంతర్భవించును. [ఆత్మయగు ధ్వనియేయగును.] అలంకారముకాదు. వ్యంగ్యప్రాధాన్యమువలన ధ్వనియయిన పర్యాయోక్తమలంకారముకాకున్నను, మీరు దానిని (ఆత్మయగు) ధ్వనియని, అనక; అది పర్యాయోక్తమేయని వ్యవహరించునెడల, నది - ధ్వనివాదులయెడల, మీకుఁగల మాత్సర్యమునఁబొడవిన, దురాగ్రహవిలసితమేయగును. అలంకారముకానిదాని, నలంకారనామమున వ్యవహరించుట దురాగ్రహము కాక యింకేమగును ?

లోచనము : అవ :— వ్యంగ్యమునకుఁగల, యీప్రాధాన్యమునుగూడ- ప్రాచీనులు - కనుగొనినవారుకారు. దీనిని మేమే యున్మీలించితిమి'' అని ప్రదర్శించుచున్నాఁడు.

(56) మూలము :— భామహునిచేత నుదాహరింపఁబడిన దానికి సదృశమగు నుదాహరణమునందుఁగూడ - వాచ్యమునకు పసర్జనీభావము [అప్రాధాన్యము] వివక్షింపఁబడుటలేదు. కనుక; నచ్చటనైనను వ్యంగ్యమునకు ప్రాధాన్యములేదు.

లోచనము :— భామహునకు, పర్యాయోక్తమునకు సంబంధించినరూపము- ఎటువంటిదిగా నభిమతమో, అటువంటిరూపముగలదియే, యుదాహరించి, ప్రదర్శింపఁబడినది. [దానిచేత నాయుదాహరణమున కనురూపముగనే పర్యాయోక్త స్వరూపముండుట - తదభిమతమని తెలియఁబడుచున్నది.] ఆయుదాహరణము నందుఁగూడ - వ్యంగ్యమగు నర్థమునందు చారుత్వహేతుత్వము లేకుండుటవలన, నందలి వ్యంగ్యమునకు ప్రాధాన్యములేదు. కనుక; భామహోదాహృతికి సదృశమగు నింకొక యుదాహరణమును గల్పించినను, వ్యంగ్యమునకచట ప్రాధాన్య ప్రసంగమే సంభవించునది కానేరదు. భామహాచార్యుడు - సర్వాలంకారికగురు శిరోమణి. ఆభామహోక్తమగు నుదాహరణము [సరియయినదికాదని, దాని] నాదరింపక ''సంచరింపుము ధార్మిక'' మున్నగుదానిని పర్యాయోక్తమునకుదాహృతిగాస్వీకరించునెడలను మాత్రము - [పర్యాయోక్తమునందు ధ్వనినంతర్భవింపఁ జేయఁబూనిన]వారు-మాశిష్యులేయగుదురు. [అది-కావ్యాత్మయగుధ్వనియేయగుట వలన, అలంకారముకాకుండుటవలన, పర్యాయోక్తాలంకారమునందు ధ్వనినంతర్భవింపఁజేయువారి సిద్ధాంతమపసిద్ధాంతమేయగును.]

కేవలమగు నయము నాశ్రయింపక [గురువునాశ్రయించి, యథావిధిగా గురుముఖమున శాస్త్రరహస్యము నెఱుఁగక] శ్రవణాభాసముచేత - [అతీంద్రియమగు] ఆత్మయొక్క సంస్కారమును సంపాదించుట - అనార్యచేష్టితమే యగును. కనుకనే,

''అవజ్ఞయాప్యవచ్చాధ్య, శృణ్వన్ నరకమృచ్ఛతి''

''విద్యయందును, గురువునందును, గల తిరస్కారబుద్ధిచేత, ఆత్మనవచ్ఛాదించుకొని, శాస్త్రమును విను వాఁడు - నరకమునొందును.'' అని యైతిహాసికులు చెప్పుదురు. భామహునిచేత నుదాహరింపఁబడినదిగదా :

''గృహేష్వధ్వసువానాన్నం భుజ్ఞ్మహే యదధీతినః।
విప్రానభుఞ్జతే'' [తచ్చ రసదాననివృత్తయే.]

తే॥ ముందుగనధీతులయిన విప్రులుభుజింప
కున్న యన్నమ్మును, భుజింపకుందుమేము.
మందిరములందయిన, త్రోవలందయినను,.........అని.

ఇది - భగవానుఁడయిన వాసుదేవుని వాక్యముగదా! ఇది - పర్యాయమున, అనఁగా, అవగమనరూపమగు ప్రకారభేదమున, రసదానమును [విషదానమును] నిషేధించుచున్నది. [విషదాననివృత్తిని స్ఫురింపఁజేయుచున్నది.] [ఇచట, 'శిశుపాలుఁడు నావిషయమున సంకల్పించిన విషమిశ్రితాన్నభోజనము నాకుఁగలుగకుండుగాక !' అనిగాని, 'నాకువిషములేని భోజనమగుఁగాక' అనిగాని, భగవానుని యభిప్రాయము - సహృదయులకు వ్యంగ్యమగునని భావము.] ఆభగవానుఁడే - [మీఁది పద్యమునందలి తుదిపాదమున] ''అదేలనిన; రసదాననివృత్తి కొఱకు'' అని చెప్పెనుగదా! ఈ రసదాననిషేధరూపమగు వ్యంగ్యమునందు - కొంచెమైనను, సౌందర్యములేదు. ఇట్లుండ, నీవ్యంగ్యమునకు ప్రాధాన్యమును శంకించుటకెట్లు వీలుపడును ? వాచ్యమునందే - సౌందర్యమున్నది. కనుక, దానికే ప్రాధాన్యమును జెప్పఁదగుననిభావము. [నాకు విషమిశ్రితాన్న భోజనము కలుగకుండుఁగాక ! అను ప్రకారాంతరమగు] వ్యంగ్యముతోఁ గూడుకొనిన ''ముందుగా విప్రులుభుజింపని యన్నమును మేము భుజింపము'' అనువాచ్యమే- పూర్వోక్తప్రకారమున, పర్యాయమున, నుక్తమగుచు, ప్రస్తుతమగు [''అధ్యయనమొనర్చిన విప్రులు భుజింపఁగా మిగిలిన యన్నమునే మేము భుజింతుము''అను]

భోజనార్థము నలంకరించును. నాకు, నిర్విషమగు భోజనముకలుగుఁగాక ! అను వ్యంగ్యము - ఇతనికి వివక్షితము - [ఈవాసుదేవుఁడు శిశుపాలునికిఁ దెలుపుట కిచ్ఛగించునది] కానేరదుగదా; కనుక; [ఈయుదాహృతియందుఁగల] పర్యాయోక్తమలంకారమేయగునని చిరంతనుల [మిక్కిలి ప్రాచీనులగు నాలంకారికుల] యభిమతము'' అని [వృత్తికారుని] తాత్పర్యము.

ప్రభా :— ''ఇచట, ''నాకు విషభోజనము కలుగకుండుగాక !'' అను వ్యంగ్యమునకు-కేవలము సౌందర్యము లేకుండుటవలననేకాక, అది- [వాసుదేవునికి] వివక్షితము- [చెప్పఁదలఁచినది] కాకుండుటవలనఁగూడ-ప్రాధాన్యము లేమ'' అనునంశము-''నాకు నిర్విషమగు'' అను మీఁదివాక్యముచేతఁ దెలుపఁబడినదని తెలియునది.

(57) మూలము :— ఇఁక, నపహ్నుతి దీపకాలంకారములయందుఁగూడ వాచ్యము-ప్రధానమగుటయు, [ఉపమారూపమగు] వ్యంగ్యము - దాని కనుయాయియగుటయు, ప్రసిద్ధమే.

లోచనము :— [వాచ్యము - ప్రధానమగుటయు, వ్యంగ్యము - వాచ్యానుయాయియగుటయు, అను] ఇది - యింతకుమునుపే - [''అదెట్లనిన :—దీపకము'' అనుచోటనే] నిర్ణయింపఁబడినది. కనుకనే; ''ప్రసిద్ధమే'' అని చెప్పఁబడినది. ప్రసిద్ధమనఁగా; ప్రతీతమును, ప్రసాదితమును, ప్రామాణికమును, గూడ నగుననియర్థము.

ప్రభా :— ''ప్రసిద్ధము'' అనఁగా; ఈయంశము- అందఱికిని దెలిసినదియు, బాగుగాసాధింపఁబడినదియు, ప్రమాణసిద్ధమైనదియుగూడ - నగుచున్నది.'' అని త్రివిధమగు నర్థము.

లోచనము :- దీపకము మున్నగునలంకారము [నందు వ్యంగ్యమగు నుపమయున్నను] ప్రధానముకాకుండుటవలననది - ఉపమాదివ్యపదేశ భాజనము కాదనుఛాయచేత [ప్రకారమున] నీయంశమింతకుముందు దృష్టాంతముగాఁజెప్పఁబడినది. అయినను, ''పర్యాయోక్తము, అపహ్నుతి, దీపకము, అనునుద్దేశక్రమమును, పూరించుటకు గ్రంథశయ్యను [ఏకరూపమగుసన్నివేశవిశేషమును] సంపాదించుటకు, వ్యంగ్యప్రాధాన్యము లేకుండుటవలన [దీపకమునందు వ్యంగ్యము] ధ్వనికాదని యింకొక ప్రకారమున-వెనుకటియంశమే- మరలచెప్పఁబడినది. [పున

రుక్తిగా నిచట] 'వ్యంగ్యమగు నుపమ - ధ్వనికాగూడదా' అని యాశంకించుట వలన ఉభయత్రి, వస్తుపుమాత్రిము - [ఉపమారూపమగు వంగ్యమునకు ప్రాధాన్యము లేదనునది] ఒకటియే యగుచున్నది.

పరీక్షా :— దీపకమునందు వ్యంగ్యమగు నుపమ - ప్రధానముకాకుండుటవలన, నచట, ఉపమయను వ్యపదేశములేదని వెనుకఁజెప్పఁబడినది. వ్యంగ్యమగునుపమ - ప్రధానము కాకుండుటవలన నది-ధ్వనికాదనియిచట జెప్పఁబడినది కనుక, ఈపునరుక్తియందు, 'వ్యంగ్యమునకు ప్రాధాన్యములేకుండుట' అను విషయస్వరూపైక్యమున్నను, ప్రకారభేదముండుటవలన, దోషములేదు. అనితెలియునది. వివరణ కారుఁడిచట-"సర్వత్ర [దీపకభేదము లన్నింటనుగూడ] దీపకమునకు వ్యంగ్యమగు నుపమతోడియన్వయములేదు. [కనుకనది ధ్వనియనిశంకించుటకవసరములేదు.]" అని, అనేకములగునుదాహరణములను ప్రపంచించుచు, విచారించెను. కాని, ఆవాదము - అనుపయోగియు, నిస్సారమును, సుప్రతిక్షేపమును, గూడనగుచున్నది.

ప్రభా :— ఈవివరణకర్త - ఎవ్వరోతెలియకున్నది. [చంద్రికాకర్తయే యగునేమో!] "దీపకమునందు కొన్నిచోట్ల వ్యంగ్యమగునుపమ యున్నను, బహుస్థలములయందులేదు. కనుక, దీపకమునందు ధ్వనియంతర్భవింపదు." అని ప్రదర్శించుట కితఁడు వ్యంగ్యమగునుపమలేని దీపకోదాహృతులను పెక్కింటి నొసఁగెను. "ఎచ్చటవ్యంగ్య ప్రతీతియుండునో, అచ్చటధ్వనియంతర్భవించును. [అదియే - ధ్వని]" అనునది - ప్రస్తుతమగు నాశంకమైయున్నది. వ్యంగ్యమగు నుపమలేని, దీపకమున, ధ్వయంతర్భవింపకున్నను, వ్యంగ్యోపమగల దీపకమున ధ్వనియంతర్భవించునను నాశంక-యింకను మిగిలియేయున్నది. కనుక,ఈవివరణకర్తయొనర్చినవిచారమువలన దీపకమునందు - ధ్వన్యంతర్భావశంక- తొలఁగకుండుటవలన, నదియనుపయోగియగును. ఇచట నతఁడొనర్చిన యలంకార స్వరూప విచారము-అప్రస్తుతము. కనుక నిస్సారమగును.

అవ :— మఱియు నచటఁగూడ - ఉపమయన్వయించునని ప్రదర్శించుటకుపీలున్నది. కనుక, నది- సుప్రతిక్షేపము. అనఁగా; బాగుగానాక్షేపింపఁదగినది కూడనగుననుచున్నాఁడు. సుప్రతిక్షేపమనుటకుదాహృతి నిచ్చుచున్నాఁడు

లోచనము :— మదమది - ప్రీతినిగూరుచు,
నది - మానవిభంజకునినినంగు, నతండున్-

సుదతి గమనోత్సుకత్వము,
నదియును - నెమ్మది కసహ్యమగు వ్యథఁగూర్చున్.

[వివరణకారునిచే నుదాహృతమయిన] మీఁది పద్యమునందుఁగూడ - [మదము, - ప్రీతిని, ఆప్రీతి - మానవిభంజకుఁడగు ననంగుని, ఆయనంగుఁడు - ప్రియాసంగమోత్కంఠను, ఆయుత్కంఠ - మనస్సునకు సహింపరానివ్యథను, కలిగించుటవలన] ఉత్తరోత్తరములు పూర్వపూర్వజన్యములగుచున్నను, [క్రమజన్యములగుచున్నను] [మనోవికాసమును గూర్చుటయందు - దేనికన్నఁదేనికి సామ్యముండుటవలన] ఉపమానోపమేయభావమును చక్కఁగనే కల్పింపవచ్చును. [కనుకనచట - వ్యంగ్యమగు నుపమలేదనుట - బాగుగా నాక్షేపింపదగినదియే యగును.]

[ఉత్తరోత్తర జన్యములగుటవలన] క్రమికములగు వానికుపమానోపమేయ భావము లేదనుట లేదుగదా ?

అదెట్లనిన :— [క్రమికములకుఁగూడ నుపమానోపమేయభావముండు ననుట కుదా : —]

ఆ॥వె॥ రాముసట్లు పంక్తిరథుఁడు, పంక్తిరథుని
బోలియజుఁడు, నజునిబోలి, రఘువు
రఘువువలె, దిలీపరాజు, నుండెను చిత్ర
మిది - సుకీర్తి - రాముఁనిది, ధరిత్రి.

ఇచట [క్రమికులగు దశరథాదులకు, గుణవిశేషసామ్యముచేతనగు ఉపమానోపమేయభావము] లేకుండుటలేదు. [ఉపమానోప మేయభావముండనే యున్న దని భావము.] కనుక, క్రమికత్వముగాని, [శాణోల్లిఖమయినమణి" ఇత్యాదుల యందు] ప్రస్తుతవ్యక్తులకగు సామ్యముగాని, ఉపమను - [ఉపమానోపమేయభావ మును] నిరోధించుననునిషయమేల? కనుక, గర్దభీదోహానువర్తనము-[గాడిదపాలు పితుకుట ననుసరించుట] ఇఁకచాలును.

(58) మూలము :— సంకరాలంకారమునందుఁగూఁడ నొకయలంకారము - వేఱొక యలంకారముయొక్క ఛాయననుగ్రహించునపుడు, వ్యంగ్యము - ప్రధానముగా వివక్షింపఁబడకుండుట

వలసనది-ధ్వనికివిషయమగునదికాదు. [ఇచ్చట,] అలంకారములు-రెండున్నవని సంభావించునపుడు, వాచ్యవ్యంగ్యములు రెండింటికిని గూడ, ప్రాధాన్యము - సమానమేయగును.

ప్రభా :— నీరక్షీరన్యాయమున నలంకారములకగు మిథస్సమావేశము-సంకరాలంకారమని చెప్పఁబడును. అది 1 సందేహము 2 ఏకవాక్యవర్తనము 3 ఏకవాక్యాంశవర్తనము 4 అనుగ్రాహ్యానుగ్రాహకభావము, అను భేదములచేత చతుర్విధము. భట్టోద్భటమతము ననుసరించి, వాని లక్షణములను ప్రదర్శించుచున్నాఁడు. అందు - మొదటిదగు సందేహసంకరమునందు - ధ్వనియంతర్భవింపదనుటకు, దాని లక్షణోదాహృతులను ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— గీ॥ బహ్వలంకృియోల్లేఖమ్ము వరలునపుడు,
ఒక్కమారుగ తద్వృత్తి యొదవనపుడు;
నొకటిఁగోన, సాధకమ్ము, బాధకము, గలుగ-
నపుడు; సందేహ సంకరమండ్రుదాని.

''అనేకములగు [విరుద్ధములగు] నలంకారము లొకచోనుండునపుడు, వానికన్నిటికిని, ఒకచోనగునునికి - సంభవింపకుండును. అప్పుడందొకదానిని విడిచి, వేరొకదానిని స్వీకరించుటకు సాధకమును, బాధకమును,నగు ప్రమాణము లేకుండునపుడది-సందేహసంకరమని చెప్పబడును.'' అనునిది సంకరాలంకారము నందు - సందేహమను ప్రథమప్రకారమునకు లక్షణము

దీని కుదాహరణము - నాయదియే. [అభినవగుప్తకృతి కాంధ్రీకృతి]

కం॥ సితకుందదశనపంక్తి, అ
సితసరసిజ శుభనయన, శశివదన, గగన
స్థితజలసంభవ హృద్యా
కృతిగా, పరమేష్ఠియీమె సృజియించెనహో!

ఇచ్చట, 'శశివదన' అనుచోట, [''శశీ. వదనమ్, అస్యాః''] 'చంద్రుఁడే ముఖముగాగలది'. అనునది - విగ్రహవాక్యమగునపుడు, రూపకాలంకారమగును. [''శశివవదనమస్యాః''] ''చంద్రునివంటి ముఖముగలది'' అనునది - విగ్రహ వాక్యమగునపుడుపమ - యలంకారమగును. ఇట్లు, రూపకోపమలయుల్లేఖము వలన - అనేకమగు, ఈయలంకారద్వయమొకసారియేప్రవర్తించుట సంభవింప

కున్నది. ఇందొక యలంకారమునువిడిచి, వేరొకయలంకారమును గ్రహించుటకు సాధకమును, బాధకమునునగు, ప్రమాణము [ఏదియునిచట] లేకుండుటవలన [ఇదిరూపకోపమా సందేహముగల] సంకరమగుచున్నది. [ఇచటనున్నది - ఉపమయో, లేక రూపకమో ? వీనియందేది వ్యంగ్యమో, ఏది వాచ్యమో ? అను సందేహమువలన] ఇచట, వాచ్యవ్యంగ్యముల నిశ్చయమేకలుగకున్నది. ఇట్లుండ; నిట్టిచోట - [వ్యంగ్యప్రాధాన్యము ననుసరించి నిర్ణయింపఁదగిన] ధ్వనిత్వసంభావనకూడనా ?

ప్రభా :— "సందేహాగ్రస్తమగు సంకరప్రకారమునందు - ధ్వనియంతర్భవింపదు. అనగా; సందేహసంకరాలంకారము-ధ్వనికాదు" అని భావము.

అవ :— ద్వితీయ ప్రకారమగు శబ్దార్థవర్త్యలంకార సంకరమును [ఏకవాక్య వర్తనసంకరమును- ఏకవాక్యమునందు- శబ్దమునందును, అర్థమునందును, వర్తించునవియగు నలంకారముల సంసర్గముగల సంకరాలంకారమును] లక్షణపురస్సరముగా నుదాహరించి, అదికూడ - ధ్వనికాదనుచున్నాఁడు.

లోచ :— "శబ్దాలంకారమును, అర్థాలంకారమునుగూడ, నొకేవాక్యమునందుండుట' అనులక్షణముగల, సంకరాలంకారద్వితీయప్రకారము నందుఁగూడ-ప్రతీయమానశంక లేదు.

"స్మర! స్మరమివప్రియంరమయసే యమాలింగనాత్"

ఇచట నొకవాక్యమునందే - "స్మరస్మర" అనుచోట యమకమును, "స్మరమివ" అనుచోట నుపమయునున్నవి.

ప్రభా :— ఇచట - యమకమును, ఉపమయుఁగూడ, వాచకమును, వాచ్యమునునగు, నలంకారములేయగుచున్నవి. కనుక, నిచటఁగూడ - ధ్వనిత్వశంక లేదనిభావము.

అవ :— సంకరాలంకారమునందలి, తృతీయప్రకారమగు, ఏకశబ్దాభిధాన సంకరమునందుఁగూడ - అనఁగా; ఒకవాక్యముయొక్క యంశమునందు [ఏకదేశమునందు] అనేకములగు నలంకారముల సంసర్గము రూపముగాఁగలదియగు, ఏకవాక్యాంశవర్తన సంకరమునందుఁగూడ - ధ్వనియంతర్భవింపదనుచున్నాఁడు.

లోచనము :— ఏకవాక్యాంశము నందెచ్చట - అనేకములగు నర్థాలంకా

రములయను ప్రవేశముండునో, అచ్చటఁగూడ - అందలియలంకారములు రెండిం టికిని, వాచ్యత్వము - సమానమేయగుటవలన, అందొకదానిని వ్యంగ్యమని శంకిం చుటకు వీలుపడునదికాదు.

అదెట్లనిన :— క॥ రవికిఁదనకు నుదయించుట,
యవసానముఁగనుట, తుల్యమగుట - దివసమా
రవి యస్తమింపఁగనె తా
నవిసి, తమోగుహను జొచ్చినదివలె నుండెన్.

ఇచట, "తమోగుహ" "చీకటియనెడి గుహ" అను నేకదేశవివర్తి రూప కము- దివసమును - స్వామికివిపత్తి కలుగునపుడు, సముచితమగు (గుహానివాస) వ్రతమును - గ్రహించుట కుద్యుక్తుఁడగు, కులపుత్రునిగా, [రాజపుత్రునిగా] రూపింపఁజేసినది. [లేక, కవి - దివసమునను కులపుత్రరూపణమును జెప్పు చున్నాఁడు] "చొచ్చినదివలె నుండెన్" అనుచోటనున్న 'వలె' శబ్దముచేత నుత్ప్రేక్ష చెప్పఁబడినది.

ప్రభా :— మీఁది పద్యమున, ఏకదేశవివర్తియగు [ఏకదేశమునందు మాత్రమే- విశేషించి వర్తించుచున్నదియగు] 'తమోగుహ'[చీకటియనెడిగుహ] అనురూపకము, రవిని - (సూర్యుని) స్వామినిగాను, అస్తమించుటను - విపత్తిని గాను, గుహను జొచ్చుటను - వ్రతగ్రహణమునుగాను, దివసమును - [ప్రభుభక్తి గల] రాజపుత్రునిగాను, రూపింపఁజేయుచున్నది. కనుక, దీనియందలిభావము నిట్లెఱుఁగవలసియున్నది, "దివసమను ప్రభుభక్తిగల రాజపుత్రుఁడు - స్వామికొద విన యుదయమును తనయుదయముగను, స్వామికొదవిన యాపదను తనయాపద దగను,భావించి, సూర్యుఁడను తనప్రభువున కస్తమయమను నాపదకలుఁగగానే, తాను దిగులుపడి, చీకటియను గుహయందు, ప్రవేశించుటయను వ్రతగ్రహణ వ్యాపారము "నొనర్చుచున్నవాడువలె నుండెను." ఇచ్చటఁగూడ-ఏకదేశవివర్తి యగు-రూపకమును, ఉత్ప్రేక్షయు, వాచ్యములగు నలంకారములే యగుచున్నవి కనుక; నిచటధ్వనిత్వము నాశంకించుటకు వీలుపడదనిభావము.

లోచనము :- ఈయీ [సంకరాలంకార]ప్రభేదద్వయమిట్లునిరూపింపఁబడినది.:

గీ॥ ఒకవచనమందు, శబ్దమందుండునవియు,
నర్థమందుండునవియును, నగు నలంక్రి
యలకు సంకర - మేకవాక్య ప్రవృత్తి.
అంశమున, వానివృత్తి - వాక్యాంశవృత్తి. అని

ప్రభా :— "ఒకేవాక్యమునందు, శబ్దాలంకారములయు, అర్థాలంకారములయు, కలయిక - ఏకవాక్యవృత్తిసంకరమని చెప్పఁబడును. ఒకేవాక్యమునందలి యేకదేశమున, ననేకములగు నర్థాలంకారములయునికి - ఏకవాక్యాంశవృత్తి సంకరమని చెప్పఁబడును.

లోచనము :— అలంకారముల కనుగ్రాహ్యానుగ్రాహకభావరూపమగు [సంకరాలంకార] చతుర్థప్రకారమునకిది లక్షణము.

"తాము - స్వాత్మలాభము స్వతంత్రముగ నొంద
నేర, కొకదాని కొకఁడుపకారమును ఘ
టింపుచు, నలంకృతులు వెసంగు నెచట, నదియు-
పకరణనంగాంగి భావసంకరమనంగ." అని.

దీనికుదా :— గీ॥ ఆయతాక్షియధీర రమ్యావలోక
మది - ప్రవాతనీలోత్పలానన్యవిభము,
దానిని మృగాంగనలనుండి కరుణకొనెనో ?
కాంతయుంచుండియామృగాంగనలె కొనిరో ?
[కుమారసంభవము]

ఇచట, మృగాంగనావలోకనమునకును, పార్వతీదేవియవలోకనమునకును, [ఉపమానోపమేయభావమువలన] ఉపమ - వ్యంగ్యమేయగును. అయినను సందేహాలంకారమును బయటికిఁదీయుటచేత - తదనుగ్రాహకమగు నీయుపమ - అనుగ్రాహ్యమగు సందేహమునందు - పర్యవసానము నొందుటవలన, గుణీభూతమగుచుండును. [వ్యంగ్యమగు నుపమ - యిచట, నంగమగుటవలన, అప్రధానమే యగును.] అనుగ్రాహ్యానుగ్రాహక సంకరమునందు ధ్వనిలేదను నంశమే, వృత్తికారునిచేత "ఒకయలంకారము - వేరొకయలంకారముయొక్క ఛాయనను గ్రహించునపుడు, వ్యంగ్యము - ప్రధానముగా వివక్షింపఁబడకుండుటవలన, నది ధ్వనికి విషయమగునదికాదు" అనిచెప్పఁబడినది. ఇట్లు, చతుర్థ ప్రకారమునందుఁగూడ - ధ్వని యంతర్భవించునను నంశము నిరాకరింపఁబడినది. "ద్వితీయ తృతీయ భేదములయందు వ్యంగ్యసంభావనయేలేదు" అని చెప్పఁబడినది. ప్రథమ ప్రభేదముగా నుదాహరింపఁబడిన సందేహసంకరమున, "సితకుందదశనపంక్తి" అను పద్యమునందలి "శశివదన" అనుచోటఁగూడ - వ్యంగ్యసంభావన - క్లిష్టముగా నున్నదని యాశంకించి, అచట,[సందేహసంకరమున] వాచ్యవ్యంగ్యములు రెండు సందేహింపఁబడుటవలన [వృత్తికారునిచేత] "అలంకారములు రెండుగా

సంభావింపఁబడునపుడు [సందేహసంకరమునందు] మాత్రము - వాచ్యవ్యంగ్యములు రెండింటికిని [వాచ్యాలంకార, వ్యంగ్యాలంకారములు రెండింటికిని] గూడ - ప్రాధాన్యము సమానమేయగును'' అని చెప్పఁబడినది.

అవ :— అయ్యా ! [ఈసంకరాలంకారమునందు] ఎచ్చటనైన వ్యంగ్యమే - ప్రధానముగా భాసించునెడల, అచటనేమిచేయవలయును ?

అదెట్లనిన :- గీ॥ వారు లోకప్రసిద్ధి కైవల్యగతులు,
ఖలులకు గుణానురాగమ్ము కలుగదెపుడు;
కరఁగు శశిమణి - చంద్రునిన్ గాంచునపుడు,
కరఁగ దస్మత్ప్రియాస్యమ్ముఁ గాంచునపుడు.

''మీఁది పద్యమున, అర్థాంతరన్యాసము - వాచ్యముగనే భాసించుచున్నది. కాని-వ్యతిరేకమును, అపహ్నుతియును, ప్రధానముగా వ్యంగ్యములగుచున్నవి. [కనుక, నిటువంటి సంకరమే-ధ్వనికావచ్చును.'' అను నభిప్రాయమునాశంకించి, యుత్తరము నిచ్చుచున్నాఁడు.

ప్రభా :— ఇచట - ''వివేకులగు సహృదయ సజ్జనశిరోమణులు - విశేషించి వర్ణించుచున్నను, స్వయముగా నెఱిఁగియున్నను, గూడ - లోకప్రసిద్ధి మాత్రశరణులగుటవలన, వస్తుతత్త్వ విమర్శనములేని ఖలులకు, సద్వస్తుగతములగు, గుణములయందనురాగము కలుగదు'' అను సామాన్యమును, ''శశిమణి [చంద్రికాంతమణి] తనకుఁగల 'శశిమణి' యను నామప్రసిద్ధిమాత్రము ననుసరించి,జడత్వముమున్నగుదోషములతోఁగూడి,నిస్సారమగుచున్నచంద్రుఁడనుపేరుగల నీచవస్తువునుజూచి, పులకించికరఁగుచున్నది. దీనికించుకైనను, గుణానురాగమున్నయెడల, దోషరహిత, మధురలాలిత్య విలసన, విభాసితమును, సకలసంసారసారసర్వస్వభాజనమును, నగునాప్రియురాలి ముఖబింబమును జూచి, కరఁగకుండునా ?'' అను విశేషముచేత-సమర్థింపఁబడుచున్నది. ఈ యర్థాంతరన్యాసము - వాచ్యము. దీనిచేత - 'ప్రియాముఖము - చంద్రునికంటె నధికగుణవంత'మను నంశము-స్ఫురింపఁజేయఁబడుటవలన, వ్యతిరేకమును, 'ఈచంద్రుఁడు-చంద్రుఁడు కాడు. నాప్రియకాంత ముఖమే - చంద్రుఁడు'' అను నపహ్నవమును, అధికచమత్కారకారులగుటవలన ప్రధానముగా వ్యంగ్యములగుచున్నవి. కనుక, 'నిట్టి సంకరాలంకారమునందే ధ్వని యంతర్భవించును' అని, కృతికర్తయాశంకించి, ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

(59) మూలము :— అట్లుగాక, అచటఁగూడ [సంకరము నందుఁగూడ] వాచ్యము నుపసర్జనముగాఁగొని. [అప్రిధానముగాఁ జేసికొని] వ్యంగ్యము - ప్రధానముగా నుండునెడల, నప్పుడదికూడ ధ్వనికి విషయమగుగాఁక ః. కాని, పర్యాయోక్తమున, నిర్దిష్టమగు న్యాయమువలన, అదియే-[సంకరాలంకారమే] ధ్వనియనిచెప్పుటకు వీలుపడునదికాదు. మఱియు, సంకరమను మాటయే - సంకరాలంకారమునందెచ్చటనయిననుగూడ — ధ్వని సంభావనను నిరాకరించును.

లోచ :— "అట్లుగాక-వాచ్యము నుపసర్జనముగాఁగొని, వ్యంగ్యముప్రధానముగానుండునెడల" అనునది-యాశంక. "అదికూడ-ధ్వనివిషయముగుఁగాక!" అనునది - ఉత్తరము. [వ్యంగ్యము - ప్రధానమగునపుడు] అది - సంకరాలంకారము కానిదియేయగును, ఇంకేదియగుననిన; అలంకారధ్వనియనుపేరుగలదియగుచు, ధ్వనికి సంబంధించిన ద్వితీయప్రభేదమేయగును. ఏన్యాయము - పర్యాయోక్తవిషయమున నిరూపింపబడినదో, అది - [వ్యంగ్యము ప్రధానముగాగలయలంకారములయందు] అంతటనుగూడ, ననుసరింపఁదగియున్నది. మఱియు, సంకరప్రభేదములన్నింటియందునుగూడ - సాధారణమగు వ్యంగ్యసంభావనను నిరసించునదియగు ప్రకారమును జెప్పుచున్నాఁడు. "మఱియు, సంకరమను మాటయే - సంకరాలంకారమునందెచ్చటనయినను" అని సంకరమను నామమే - దానికిఁగల భేదములన్నిఁటిచేతనుభిన్నమగుచున్న సంకరాలంకారమునందంతటను గూడ ధ్వనియుండునను సంభావనను నిరాకరించునని భావము.

ప్రభా :— "సంకరము" అనుమాటయే "అది - ధ్వనియనునూహను నిరాకరించుట" యెట్లు ? అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— సంకీర్ణతయనఁగా; [తిలతండులములకుఁగలుగునదియగు సంబంధమాత్రము వంటిదికాదు.] మిశ్రిత్వము - అనఁగా, లోలీభావము. [నీరక్షీరములకువలె, ఆత్యంతికమగు సంశ్లేషము.]

ప్రభా :— కలిసియున్న నీరక్షీరములయం దొకదానికి ప్రాధాన్య మెట్లు కలుగును ?

అవ :— క్రిమప్రాప్తమగు నప్రస్తుత ప్రశంసాలంకారమునందుఁగూడ-ధ్వనియంతర్భవింపదనుటకు భామహోక్తమగు నప్రస్తుతప్రశంసాలక్షణమును దెలుపుచున్నాఁడు.

కం॥ ప్రస్తుతముగాక యుండిన
వస్తువునన్యమగు దానిఁబ్రస్తావింపన్
బ్రస్తుతము గమ్యమగునెడ;
శస్తమ్మప్రస్తుతప్రశంస త్రివిధగన్.

ప్రస్తుత [విషయ]ము నాక్షేపించునదియగు నప్రస్తుత విషయమును వర్ణించుట - అప్రస్తుతప్రశంస. ఆయాక్షేపము [స్ఫురింపఁజేయుట]కూడ - సామాన్య విశేషభావమువలనను, నిమిత్తనిమిత్తి భావమువలనను, సారూప్యమువలనను, మూడుప్రకారములచేతనగుచున్నది. అందు 'ప్రథమప్రకారములు రెండింటను, ప్రస్తుతాప్రస్తుతములకుఁగల ప్రాధాన్యము - తుల్యమేయగు'నని ప్రతిజ్ఞనొనర్చుచున్నాఁడు.

(60) మూలము :— అప్రస్తుత ప్రశంసయందుఁగూడ - సామాన్యవిశేషభావమువలనఁగాని, నిమిత్తనిమిత్తి [నిమిత్త, నైమిత్తిక] భావమువలనఁగాని, వాచ్యమగు నప్రస్తుతమునకు - వ్యంగ్యమగు ప్రస్తుతముతోడి యభిసంబంధముండినయెడల; నప్పుడావాచ్యవ్యంగ్యములకు [రెండింటికినిగూడ] ప్రాధాన్యము - సమానమే యగుచుండును.

వాచ్యమును, అప్రస్తుతమును, నగు సామాన్యమునకు - వంగ్యమును, ప్రస్తుతమును, నగు విశేషముతోడి సంబంధము - ఉండినయెడల, నపుడు విశేషప్రతీతికి ప్రాధాన్యముండినను, ఆవిశేషము- సామాన్యమును విడిచియుండదు. కనుక, సామాన్యమునకుఁ గూడ - ప్రాధాన్యముండును. [ఇట్లే] విశేషము- సామాన్యనిష్ఠమై యున్నను, [వ్యంగ్యమును, ప్రస్తుతమునునగు] సామాన్యమునకు ప్రాధాన్యముండునపుడు,[వాచ్యమును,అప్రస్తుతమును,నగు] విశేషమునకుఁగూడ - ప్రాధాన్యముండును. ఏలనిన :- సామాన్యము

నందు సర్వవిశేషములను నంతర్భావింపక తీరదుగదా !

లోచనము :— ఇచట [ఆప్రకారములు- రెండింటిలోను] సామాన్యవిశేష భావమునందుగూడ - ప్రకారములు - రెండున్నవి. అప్రస్తుతమగు సామాన్యము - శబ్దముచేతఁజెప్పఁబడి, ప్రాకరణికమగు విశేషముమాత్రము-గమ్యమగు నపుడు - అది - [సామాన్యముచేత విశేషమునకు ప్రతీతిగలదియగు] ఒకప్రకార మగుచున్నది. దీనికుదా :—

ఆ॥వె॥ చాలచిత్రమకట: సంసారనైర్ఘృణ్య;
మహహయాపదల దురాత్మతా ప్తి!
కటకటా! స్వభావకుటిలుండువిధి, తత్కృ
తులు, గతులు, దురంతములుగఁదోచు!.

ఇచట - సంసారనైర్ఘృణ్యాదులయందంతటను [అనుగతమగుటవలన] సామాన్యరూపమగు దైవప్రాధాన్యము [దైవస్వాతంత్ర్యము] అనుప్రస్తుతము-వర్ణింపఁబడి, ప్రస్తుతమగు [ప్రేయసి, పుత్త్రుఁడు, మున్నగు] నేదోవినాశము నొందిన, విశేషరూపమగు వస్తువునందు - పర్యవసించుచున్నది.

ప్రభా :— సర్వమును దైవస్వాతంత్ర్యమున కధీనమగుచున్నది. కనుక, నిచట దైవప్రాధాన్యము సామాన్యమగుచున్నది. దీనిచేత - ప్రేయసీపుత్త్రాది ప్రియవస్తు వినాశరూపమగు నేదోవిశేషము - సమాకర్షింపఁబడుచున్నది. అది - వ్యంగ్యమైయున్నది.

అవ :— 'అయ్యా ! ఇచట. వ్యంగ్యమగు విశేషమునకే, ప్రాధాన్యమును జెప్పుటయుక్తము. వాచ్యమగు సామాన్యమునకు దానితోడి సమప్రాధాన్యమును జెప్పుటయెట్లు ?' అని యాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచనము :— ఇచ్చటఁగూడ - విశేషాంశము-సామాన్యముచేత వ్యాపింపఁబడుటవలన, వ్యంగ్యమగు విశేషమునకువలె, వాచ్యమగు సామాన్యమునకుఁ గూడ - ప్రాధాన్యముండును- సామాన్య విశేషముల కొక్కవూరేకలుగునదియగు ప్రాధాన్యము - విరోధించునదికాదుగదా ! [వాచ్యమయిన] అప్రస్తుతమగు విశేషము - ప్రస్తుతమగు సామాన్యము నాకర్షించునపుడు, [స్ఫురింపఁజేయునపుడు] అది - ద్వితీయప్రకారమగును. దీనికుదా :—

మ॥ అదియేమంతది! పద్మపత్రగతమై యంభఃకణమ్ముండఁ, దా
నది ముక్తామణిగా, జడుండతఁడు - మున్నాత్మన్ విభావించు; తీ
య్యది యూలింపుమికొండు, బ్రేలనదివాఁడుంచన్, బయమ్మొంద,నా
యది యాకాశము మీఁదికేఁగె,నని ఆహా! యేడ్చునిర్నిద్రుఁడై॥

ప్రభా :— దీనిసందర్భమిది :- ఇద్దఱుమిత్త్రులు - లోభియగు నొక జడుని నుద్దేశించి - సంభాషించునపుడు, తనమిత్రుఁడు తెలిపినయంశమునను వదించుచు, వారిలోనిరెండవమిత్త్రుఁడు - "నీవుచెప్పినదంతవిచిత్రముకా"దని యంతకంటెను విచిత్రమగు నంశమును దానుజెప్పుచున్నాఁడు. "ఓయీ! ఆజడుఁడు - మొదట పద్మపలాశమునొందియున్న జలకణముఁజూచి, దానిని ముక్తామణియని భ్రమపడినట్లు నీవుచెప్పినది - వాని మౌఢ్యమును దెలుపువిషయమున నత్యల్పమైనది. ఇంతకంటె వేరగునదియగు విశేషమును - నేను దెల్పుదానిని, నీవు వినుము. "తరువాత నతఁడు దానినిగ్రహించుటకు-తనవ్రేలిచివరితో మెల్లగా దానినంటెను. అంతనతోడనేయది- అతనివ్రేలికేయంటుకొని, కాన్పింపకుండెను. "అయ్యో! నామణి - ఆకసముమీఁదికెగిరిపోయి యెటకేఁగినదో" అని యామూఢుఁడేడ్చుచు,నిప్పటికినినిద్రింపకున్నాఁడు" అని.ఇది-అప్రస్తుతమగువిశేషము.

అసద్రూపమగుటవలన, లేక నళినీదళగతజలమువలె, మిక్కిలి చంచలమగుటవలన, విలువలేనిదగు భోగ్యపదార్థమునకు - తత్త్వజ్ఞానములేని మానవుఁడొసఁగునదియగు మహత్త్వసంభావన - ప్రస్తుతమగు సామాన్యము. ఇది - భల్లటుఁడను కవిరచించిన శతకమునందలిది. అద్వైతానుసారులగు,లేక తత్త్వజ్ఞులగు, సహృదయులకమృతాయమానమగునది.

లోచనము :— ఇచట, [జడుఁడగు వ్యక్తి]-అస్థానమున మహత్త్వమును సంభావించుట - [యోగ్యముకానివస్తువునందు గొప్పతనము నూహించుట] - అనువ్యంగ్యమగు సామాన్యము - ప్రస్తుతము. అప్రస్తుతమో - జలబిందువునందు మణిత్వసంభావన. ఇదివాచ్యమగు విశేషము. [విశేషముచేతనగు సామాన్యప్రతీతిగల] ఇచ్చటఁగూడ-సామాన్యవిశేషముల కొక్కపర్యాయముననేయగు, ప్రాధాన్యమునందు విరోధములేదు." అనిచెప్పఁబడినది. ఇట్లు, [అప్రస్తుతప్రశంసాలంకారమునందలి] ఒకభేదము - [ప్రథమప్రకారము] ద్విభేదములుగలది - "వాచ్యమును, అప్రస్తుతమును,నగు........విశేషమునకుఁగూడ - ప్రాధాన్యముండును". అనువృత్తివాక్యముచేత - విచారింపఁబడినది.

అవ :— [ఉపజీవ్యోపజీవకభావరూపమగు] ఈన్యాయముననే, నిమిత్త

నైమిత్తికభావ [ప్రకార]మునందుఁగూడ - అతిదేశించుచు, అదికూడ - ద్విప్రకారకమగుచుండునని, ప్రదర్శించుచున్నాఁడు.

ప్రభా :— అస్థానమునందు, అనఁగా; అయోగ్యస్థానమునందు-జడులకగు మమత్వసంభావన'' ఇచట సామాన్యమని కావ్యప్రకాశము.

**(61) మూలము :— నిమిత్తనిమిత్తి [నిమిత్త - నైమిత్తిక] భావమునందుఁగూడ - ఇదియే [అనుసరింపఁదగిన] న్యాయము.**

లోచనము :— ఒకానొకప్పుడు వాచ్యమగుచు, అప్రస్తుతమగునిమిత్తము - [కారణము] ప్రస్తుతమగు నైమిత్తికము[కార్యము] నాక్షేపించును.[ఆకర్షించును.] అదెట్లనిన ;— [తనమాటను నమ్మింపఁజేసికొనుట కొకఁడనుచున్నాఁడు.]

> గీ॥ అభ్యుదయమందు నెడప్రీతినందువారు,
> వ్యసనములుగల్గవిడువనివారు, నెవరొ,
> వారె - బాంధవులగువారు, వారె-హితులు,
> అపరమగు లోకమిదియెల్ల - స్వార్థపరము ।

ప్రభా :— ''చుట్టాలే - చుట్టాలుకారు. మిత్త్రులే - మిత్త్రులుకారు. వారు-బాంధవాదినామధారులే!. పరులకభ్యుదయముకలుగునపుడు ప్రీతినొందుచు, వారికాపదలు గలుగునపుడు, వారిని విడువకుండువారే - నిజమైన చుట్టాలును మిత్త్రులును. అపరమగులోకమనఁగా; దీనికివిపరీతమయిన వృత్తిగలది. [పరుల యభ్యుదయమునుజూచి, యసూయపడుచు, సంపదలుగల్గునపుడు (మావాఁడు, మావాఁడని పొగడుచు) వెళ్లి, దానిననుభవించి, అపదలయందువారెవరో మేమెఱుఁగమని విడుచునదియగు లోకమును పేరుగలజనము. ఈలోకమంతయు - స్వార్థపరమే''. అనునదివాచ్యము, ''నేనుమీకు నిజమైన బంధువను,హితుఁడను. కనుక, నామాట - శ్రద్ధేయము''. అనునది - వ్యంగ్యము.

లోచనము : 'తనమాట - నమ్మఁదగినది' అనుప్రస్తుతమగు నైమిత్తికము నభివ్యంగ్యమొనర్చుట కొకఁడు - సజ్జన [స్తుతియందలి] సంసక్తిచేత, మిత్త్రిబంధురూపమగు నప్రస్తుత నిమిత్తమును వర్ణించుచున్నాఁడు. ఇచట ['నామాట విశ్వసింపఁదగినది'అను] నైమిత్తికప్రతీతియందుఁ[కార్యస్ఫురణమునందుఁ]గూడ- ['నేనేనీకు నిజమైన బాంధవుఁడను, మిత్త్రుఁడను'అను] నిమిత్తప్రతీతియే - అనుప్రాణకమగుచుండుటవలన, ప్రధానమగుచున్నది. [ఉపజీవకములేనిదే,యుపజీవ్య

మునిద్ధింపదు.] కనుక, నిచట [నైమిత్తికమగు] వ్యంగ్యమునకును,[నిమిత్తమగు] వ్యంజకమునకును, గూడ, ప్రాధాన్యము - సమానమేయగును. ఇంకొకప్పుడు, అప్రస్తుతమగు నైమిత్తికమే [వాచ్యముగా] వర్ణింపఁబడుచు, ప్రస్తుతమగునిమిత్తమును వ్యంజింపఁజేయుచుండును. దీనికుదాహరణము. సేతువు [సేతుబంధము] నందలిది,

ఆ॥వె॥ మథనమునకు ముందు- 'మధువైరియురమందు-
కౌస్తుభమును, రమనుగనను,' శివుని
జటలలేదుముగ్ధ చంద్రుఁడు, స్వర్గమ్ము
నపుడపారిజాతమని స్మరింతు.

ప్రథా :— ఇది జాంబవంతుఁడనినమాట. క్షీరసముద్ర మథనమునకు ముందలివాడనని భావము.

లోచనము :— తనకు మంత్రిపదవి నొసగుటకుఁదగిన యర్హతయగు, వృద్ధసేవ, చిరజీవత్వము, వ్యవహారకౌశలము, మున్నగు ప్రస్తుతమగు నిమిత్తము నభివ్యంగ్యముచేయుటకు జాంబవంతుఁడిచట, "కౌస్తుభమును, రమయు, లేనిమధుమథనుని వక్షము మున్నగువానిని స్మరింతును" అనునప్రస్తుతమగునైమిత్తికమును వర్ణించుచున్నాఁడు. ఇచట, [వృద్ధసేవాది] నిమిత్త ప్రతీతియందు - నైమిత్తికము వాచ్యభూతమగుచున్నది. అయినను మీఁది నిమిత్తముచేత - అనుప్రాణితమగుట వలనఁదానును, దలయెత్తుకొనుచున్నది. కనుక; నిప్పటఁగూడ- [నైమిత్తికమగు] వాచ్యమునకును, [నిమిత్తమగు] వ్యంగ్యమునకును,గూడ- ప్రాధాన్యము - సమానమేయగుచున్నది.

ఇట్లు, ప్రత్యేకము, రెండేసి భేదములుగలవియగు ప్రకారములు - రెండు - విచారింపఁబడినవి. సారూప్యలక్షణమగు తృతీయప్రకారమిపుడు పరీక్షింపఁబడును. దాని యందుఁగూడ - ప్రకారములు - రెండున్నవి. ఒకానొకప్పుడు - అప్రస్తుతమగు వాచ్యమువలన-చమత్కారము కలుగును. వ్యంగ్యమప్పుడు - దానిముఖమును జూచుచుండును. [వాచ్యమునకుపసర్జనీభూతమగుచుండును.] దీనికుదాహరణము - అస్మదుపాధ్యాయ భట్టేందురాజకృతము.

ప్రాణాయేన సమర్పితాస్తవబలాద్యేన త్వముత్థాపితః,
స్కన్ధేయస్యచిరంస్థితోఽసి, విదధేయస్తే సపర్యామపి।
తస్యాస్యస్మితమాత్రకేణ జనయన్ ప్రాణాపహారక్రియాం,
భ్రాతఃప్రత్యుపకారిణాంధురి పరం బేతాలలీలాయసే.

దీనియందలి యభిప్రాయమిది :—

ప్రభా :— "ఓయన్నా ! ఎవఁడు, నీకొఱకుతన ప్రాణములనుగూడ - సమర్పించెనో, ఎవనిబలముచేత నీవుత్థాపింపఁబడితివో, చిరకాలమునీ వెవనిభుజము నందుంటివో, ఎవఁడు నీకు సపర్యనుగూడ నొనర్చెనో, ఆయీవ్యక్తి - నవ్వినంత మాత్రముననే, తత్ప్రాణాపహరణక్రియ నొదవింపఁజేయు నీవు-ప్రత్యుపకారులలో మిగుల నగ్రేసరుఁడవగుచు, బేతాలలీలనాచరించువాఁడవుగా నున్నావు."

ఇచట నప్రస్తుతమగు బేతాలవృత్తాంతము - వాచ్యము.

లోచనము ;— ఇచట [ప్రాణసమర్పణాదుల నొనర్చిన యుపకారికి, అపకారము నొసర్చుటయను] సారూప్యవశముచేత - ప్రస్తుతుఁడగు, కృతఘ్నుఁ డొకానొకఁడాక్షేపింపఁబడుచున్నాఁడు. అయినను, అప్రస్తుతమగు, బేతాలవృత్తాంత మే-ఇచట, చమత్కారకారియగుచున్నది. అచేతనోపాలంభమువలె, నీయర్థము సంభవింపనిదికాదు. కనుకను, హృద్యముకానిదికాదు. కనుకను, వాచ్యముననే యిచట, ప్రధానతయున్నది.

ప్రభా :— అచేతనాశ్రయమగు నుపాలంభాదికము- సంభావ్యమానము కాదు. కనుక, అప్రస్తుతమగు నచేతననింబాదికమునకు ప్రాధాన్యమును - జెప్పుటకు వీలుపడదు. ఇచట, అప్రస్తుతమయినను, బేతాలవృత్తాంతము - అచేతనాశ్రయముకాదు. మఱియు, చమత్కారకారియునగుచున్నది. కనుక, నిచటవాచ్యమగు బేతాలవృత్తాంతముననే - ప్రాధాన్యము చెప్పఁదగుననిభావము.

అవ :— "అసంభావ్యమానమగు, నచేతనవృత్తాంతవర్ణనముచేత - ప్రస్తుతమగు నర్థము వ్యంజితమగునపుడది - చమత్కారకారియగునెడల నది - వస్తుధ్వనియేకాని, అప్రస్తుతప్రశంసాలంకారముకాదు" అని వ్యాఖ్యానించి, లోచ చనకర్త - స్వవిరచితమగు పద్యము నుదాహరించుచున్నాఁడు.

లోచనము ;— ఏమాత్రముునుగూడ సంభవింపని యప్రస్తుతార్థవిశేషణ ములుగలదియు, అప్రస్తుతమగునదియు, నగుచు, వర్ణింపఁబడునదియగు నచేతనా దికముచేత - ఆక్షేపింపఁబడునదియగు ప్రస్తుతము - చమత్కారకారియగునెడల, అది - వస్తుధ్వనియేయగును. దీనికుదాహృతి - నాయదియే :—

శా॥ భావవ్రాత ! నిజాత్మఁగప్పి, జనభావాలన్ వడింజొచ్చి యా
హా ! వైవిధ్యముఁగూర్చు భంగుల జనమ్మాడించి, క్రీడించు, నిన్
దావాక్రమ్ము జడమ్ముగా, సహృదయత్వభ్రాంత, మీలోకమున్
నీవున్ మూఢమవంట - స్తోత్రమెయగున్, నీసామ్య సంభావనన్.

ప్రభా :— 'చంద్రుఁడు - ఉద్యానము - చందనము,' మున్నగు రమణీయ పదార్థసమూహమిచట, 'భావవ్రాత !' అని సంబోధింపఁబడినది. ఓభావవ్రాత ! [చంద్రోద్యానాది సమూహమా !] నీవు - నీప్రకృతి నాచ్ఛాదించుకొని. లోకుల హృదయములను హఠాత్తుగా నాక్రమించి, బహుప్రకారములగు, [ఔత్సుక్య చింతాప్రహర్షాది ప్రకారములగు] వికారములచేత నగు పారవశ్యమున, వారిని నర్తింపఁజేయుచు, క్రీడించుచున్నావు. అట్టిచాతుర్యముగల నిన్ను, 'మేమే సహృదయుల'మనుకొనునదియగు లోకము - [జనము] జడమని చెప్పుచున్నది. నిజమగు సహృదయతలేనిదియు, చంద్రోద్యానాదులచేతఁగావింపఁబడు, వికారములకు వశపడునదియు, నగు, ఈలోకము - నిజముగా జడముకానిదియు, అతివిదగ్ధమగునదియు, నగు, చంద్రాదిభావపదార్థమవగు నిన్ను [లోకప్రసిద్ధిననుసరించి] జడమని చెప్పుటవలన, తానే - జడముగా సంభావింపఁబడఁదగియున్నది. కనుక, నెవఁడైనవివేకి, యీలోకమును "నీవును మూఢమవే" [జడమవే] అని, యనునెడల; అట్లు - ఈలోకమును జడమనుట - దీనిని స్తుతించుటయేయగును. ఏల యనిన :- సహృదయత్వముఁగలిగి, జడముకాని, భావవ్రాతమవగు నీవే - జడమవని చెప్పఁబడునపుడు, అసహృదయమయి, జడతఁగలిగియుండిన, యీలోకమునుజడముగాఁగూడఁజెప్పఁదగదు. అట్టిలోకమును జడమని చెప్పునపుడు, దానికి నీతోడిసామ్య సంభావన కలుగును. కనుక, నప్పుడు - ఈలోకమునకది-స్తోత్రమే యగును.

అవ :— ఇచట, మొదట-ప్రస్తుతమగు వ్యంగ్యమును జూపుచున్నాఁడు,

లోచనము :- ఒకానొక మహాపురుషుఁడు - గాఢమగు వివేకమను నాలోకముచేత, మోహమను నంధకారసమూహమును దిరస్కరించియున్నను, "వీతరాగుఁడుకూడ - సరాగునివలె" [ఉండవలయును.] అను న్యాయమున, లోకుల నడుమను, స్వాత్మ [తత్త్వజ్ఞానము] నాచ్ఛాదించుకొని, [గూఢముగా నుంచుకొని] లోకులు తన్నవమానించునవియగు మాటలు పెక్కులు - వదరునట్లుచేసికొనుచు, తనవిషయమున "జనులచేత నారోపింపఁబడిన, అనవబోధమునే [అజ్ఞా

నమునే] అంగీకరించుచు, ఆ, లోకముచేతనే- ''పిడు మూర్ఖుఁడు'' అనియవమానింపఁబడుచుండునపుడు, లోకోత్తరమగు వానిచరిత్రమిచట ప్రస్తుతమగుచున్నది. ప్రస్తుతమగు నాతత్త్వవిదుని చరితమే- ఇచట ప్రధానముగా వ్యంగ్యమై ప్రకాశించుచున్నది.

ప్రథా :— ''జ్ఞాత తత్త్వస్య లోకోఽయం జడోన్మత్త పిశాచవత్.
జ్ఞాతతత్త్వోఽపి లోకస్యజడోన్మత్త పిశాచవత్.''

గీ॥ ''జడము, నున్మత్తమును, పిశాచమును, బోలె;
జ్ఞానవిదున కీలోకమ్ము - గానుపించు;
జడుఁడు, నున్మత్తుఁడును, పిశాచమునుబోలె;
జ్ఞానవిదుఁడును, జగతికిఁగానుపించు.''

అను నభియుక్తోక్తి ననుసరించి, తత్త్వవిదుఁడగు మహాత్ముఁడు - లోకమునకు జడునివలెఁగాన్పించునుగదా! లోకోత్తరమగు, వాని చరితమిచట వ్యంగ్యము.

లోచనము :— ఉద్యానము, చంద్రోదయము [చందనము] మున్నగు భావ [పదార్థ]ము - లోకులచేత - ''ఇది - జడము'' అనిగదా యవమానింపఁబడుచుండును! ఆయుద్యానాదిభావముకూడ - మీదుమిక్కిలి [జడముకానిదగుట యేకాక, విదగ్ధ (నిపుణ) స్వభావముగూడనగుచు] విరహియగు నొకానొకని మనస్సును, ఔత్సుక్యచింతాది భావములచేత కలఁతనొందించును. కాని [ప్రియతమతోఁగూడిన] వేరొకని మనస్సునకు ప్రహర్షముచేతనగు పారవశ్యమును గలిగించును. హఠాత్తుగా [ఔత్సుక్యము, ప్రహర్షము - మున్నగుభావభేదములచేత వివిధములగు] వికారప్రవర్తనలచేత [లోకులహృదయములయందు ప్రవేశించి, వారిని] నర్తింపఁజేయుచుండును. ''ఇదిఎటువంటిది ?'' ''ఈ భావవ్రాతము యొక్క హృదయము [ప్రకృతి] - మేమనుకొనునట్లు జడముకాదు. సరి' గదా ! ఇది మహాగంభీరము, అతివిదగ్ధము, గర్వహీనము, అధికక్రీడాచతురము' అని, యెవ్వనికిని దెలియకున్నది. [లోకాతీతమగు, మహాగాంభీర్యము మున్నగు గుణములతోఁగూడిన] ఆభావవ్రాతము - లోకముచేత జడమని సంభావింపఁబడిన యెడల; విదగ్ధమగుభావవ్రాతమును జడముగాసంభావించుటవలన, సహృదయుఁడ ననుకొనుచున్న, [అసహృదయ] లోకముకూడ-''జడము'' అనియే, సంభావింపఁబడఁదగినదగును. [అయినను] [ఎవఁడైనను, ''ఓలోకమా! అతివిదగ్ధమగు భావవ్రాతమును జడమనుచున్న] నీవేజడమవు.'' అనియీలోకమునకు అతివిదగ్ధమగు

భావవ్రాతముతోడి [జడత్వ] సామ్యమును జెప్పునెడల, నప్పుడీలోకమునకుఁగూడ అజడత్వసంభావనకలుగును. కనుకనది-యీలోకమునకు [జనమునకు] స్తుతియే యగును. అదెట్లనిన :—

లోకమనునట్టి భావవ్రాతము జడముకాదు. అయినను, దానికి - జడమను జగత్ ప్రసిద్ధియున్నది. గతానుగతికమగు, నీలోకము - [జనము] ప్రసిద్ధిననుసరించి, అజడమగు భావవ్రాతమునే - జడమనుచున్నది. అజడమగు భావవ్రాతమును జడమనుటవలన, నీలోకమే-జడమగును. కనుక, నెవఁడయినను, "ఈలోకము-జడము" అనియనునెడల, నపుడుభావవ్రాతముతోడి సామ్యమునీలోకమునకుఁ జెప్పినట్లగును. అప్పుడు జడమగు నీలోకమునకుఁగూడ - అజడమను సంభావన కలుగును. కనుకనది- (జడమనిచెప్పఁబడుట) ఈలోకమునకు స్తుతియేయగును.

ప్రభా —— "భావవ్రాతము - జడము" అను గతానుగతికమగు లోకప్రసిద్ధిననుసరించి, జడమని చెప్పఁబడుచున్నను, అజడముగనే సంభావింపఁదగియుండునట్లు; దానితోడి సామ్యమువలన - లోకముకూడ, అజడమని సంభావింపఁబడవలసివచ్చును. కనుక; నీలోకమునకది- స్తుతిగనే పర్యవసించును. "జడమగు లోకమునకు [జడులగు లోకులకు] అజడత్వ సంభావన- స్తుతియేయగునుగదా!" అను నీసరూపమగు [ప్రస్తుతమగు వ్యంగ్యముతో సమానమగు రూపముగల] వాచ్యము - అప్రస్తుతము. "లోకాతీతములగు గుణములుగలిగి, వీతరాగుఁడయి, గుప్తచరిత్రుఁడగు, మహాత్ముని - మూఢుఁడని నిందించునదియగు లోకమును, మూఢమనుట - దానిని స్తుతించుటయేయగును" అను సరూపమగు [వాచ్యముతో సమానరూపముగల] వ్యంగ్యము - ప్రస్తుతము. "అచేతనమగు భావవ్రాతమును ద్దేశించి, యిట్లనుట- అసంభావ్యము. కనుకను, తదాక్షిప్తమగుమహాపురుషవృత్తాంతమే - ఇచట చమత్కారకారి. కనుకను, వ్యంగ్యమగు ప్రస్తుతమునకే - ఇచట, ప్రాధాన్యవివక్షయుండుటవలనను, ఇది - ధ్వనియేయగును" అనితెలియునది.

అవ :— ఇచట, నిట్లు, ప్రస్తుతమగు వ్యంగ్యమును, అప్రస్తుతమగు వాచ్యమును, వ్యాఖ్యానించి, పార్యంతికమగు [చిట్టచివరిదియగు] వ్యంగ్యార్థమును ప్రదర్శించుచున్నాఁడు.

లోచనము :— ఇచట, నిట్లు సారూప్యకృతమగు సంబంధముచేత [తత్త్వవేత్తయగు మహాపురుషుని లోకాతిశాయియగు ప్రవృత్తిని దెలిసికొనలేక వానిని 'జడుఁ'డని ప్రలపించునదియగు] "ఈలోకము [జనము] జడముకంటెను

గూడ పాపీయము. [అధికమగు పాపముగలది]'' అను నర్థము- ధ్వనింపఁజేయ బడుచున్నది.

అవ :— ఈయంశమునే [వృత్తికర్త] చెప్పుచున్నాఁడు.

ప్రభా :— ''అప్రస్తుతవిషయ సారూప్య సంబంధముచేత- వ్యంగ్యమున కిట్లు ప్రాధాన్యముకలుగునపుడు, అది - ధ్వనియేయగును.'' అను నంశమును దెలుపునదియగు, వృత్తి - అవతరింపఁజేయఁబడుచున్నది.

**(62)** మూలము :— ఎప్పుడీ యప్రస్తుతప్రశంసయందు- సారూప్యమాత్రవశమున, ప్రకృతాప్రకృతములకు సంబంధముండునో, అప్పుడుకూడ- సరూపమును, నప్రస్తుతమును, నగువాచ్యమునకు ప్రాధాన్య వివక్షలేనియెడలనో, అపుడాయప్రస్తుతప్రశంసాలంకారము - ధ్వనియందే యంతర్భవించును. [అది - ధ్వనియే గాని, యప్రస్తుతప్రశంసాలంకారముకాదు.] అట్లుకానప్పుడు మాత్రమే, [అనఁగా; అప్రస్తుతమును, సరూపమును, నగు వాచ్యమునకు ప్రాధాన్య వివక్షయుండునపుడుమాత్రమే,] అది - అలంకారాంతరమగును. [అలంకార విశేషమగు నప్రస్తుతప్రశంసయగును.]

లోచనము :— ''అట్లుకానపుడు మాత్రమే - అనఁగా; వ్యంగ్యమున కెట్లును ప్రాధాన్యము లేనప్పుడు మాత్రమే, అలంకారాంతరము [అనగా; అప్రస్తుతప్రశంసయను నలంకార విశేషము] అగును'' అనిభావము.

ప్రభామతి :— అప్రస్తుతమగు నర్థము-వర్ణింపఁబడునపుడు-ఆయప్రస్తుతార్థమగు వాచ్యము - చమత్కారకాక, కాఁగా, ప్రస్తుతమగు వ్యంగ్యము - దానికంగమగుచుండునప్పుడే, అది - అప్రస్తుతప్రశంసాలంకారమగును. ఇచట ప్రస్తుతమగు వ్యంగ్యమునకే ప్రాధాన్యముండునపుడు మాత్రమది - వస్తుధ్వనియేయగును. కాని, యలంకారముకాదు. కాఁగా; ''ఇది - అలంకారము; ఇది - ధ్వని,'' అను నిర్ణయము - ''వాచ్యవంగ్యప్రాధాన్య వివక్షాధీనమని, విజ్ఞులు గుర్తించి, పూర్వోక్తములును, అనంతరోక్తములును, నగుయుక్తులచేత - తత్ప్రాధాన్యమును వివక్షించుకొనవలయును'' అని తెలియునది.

లోచనము :— ఉద్దేశమునందు-"సమాసోక్తి" ఇత్యాది (48వ) వాక్యమున - "మొదలగు" అనుపదము [వృత్తికర్తచేత[ గ్రహింపఁబడినది. దానిచేత "వ్యాజస్తుతి" మున్నగు నలంకారవర్గముకూడ - సంభావ్యమానమగు వ్యంగ్యానుప్రవేశముగలదిగా సంభావింపఁబడినది.

"ఆయలంకారవర్గమునకంతకును[కంఠోక్తిగా]ప్రత్యేకించి[ప్రత్యుత్తరములను] ఎంతయనివ్రాయుదుము ?" అనునభిప్రాయమున వానికన్నిఁటికిని సాధారణమగు నుత్తరము నుపక్రమించుచున్నాఁడు.

## (63) మూలము :— దీనికంతకును, నిది-సంక్షేపము.

ప్రభా : అవ :— వృత్తికర్త-చెప్పుట కుద్దేశించిన, యలంకారవర్గమునందంతటను [వ్యంగ్యానుప్రవేశముచేత] ధ్వనికంతర్భావమును జెప్పునదియగు నాశంకనాశంకించి, సమాధానమును జెప్పకున్నను, లోచనకర్త . తదభిమతమునను సరించి, వ్యాజస్తుత్యాదులయందు - ధ్వనియంతర్భవింపదను నంశమును సోదాహరణముగాఁ బ్రదర్శించుచున్నాఁడు. అందు, "వ్యాజముచేత[మిషచేత]నగుస్తుతి - లేక, వ్యాజరూపమగుస్తుతి- 'వ్యాజస్తుతి" అనినామముచేతనే-లక్షణముసిద్ధించుట వలన, వ్యాజస్తుతి కుదాహరణమాత్రమును దెలిపి, విమర్శించుచున్నాఁడు.

లోచనము :— అందువ్యాజస్తుతి కుదాహరణము :—

శా॥ నాకేలా పొరుగిండ్లవార్తలివి ; యైనన్ దాక్షిణాత్య స్వభా
వైకాత్మన్, క్షణమూరకుండ,ఁబ్రకృతిన్-వాచాలుఁడన్, నేను, భూ
పా! కాంతున్ఁబ్రతిగేహమందు, విఫణిన్, పానీయగోష్ఠ్యాదులన్
"నీకీర్త్యంగన - పిచ్చిదానివలె హా! నిత్యభ్రమిన్ వర్తిలున్."

ప్రభా :-- ఒకకవి- ఒకనరేంద్రునికి, ప్రియయగుకీర్తిని-నిందావ్యాజమున,స్తుతించుచున్నాఁడు. [ఏతత్కర్త - ఉత్తరదేశీయుఁడేమోయని తోఁచును.]

ఇచట వాచ్యమగునింద - "ఓ మహాప్రభూ! నీకీర్తి - విశ్వమునందంతటనుగూడ నడ్డులేక వ్యాపించుచున్నది." అని, మహారాజగుణకీర్తన రూపమగు స్తుతిని -స్ఫురింపఁజేయుచున్నది.

అవ :— "ఇచట, వ్యంగ్యోపస్కృతమగు, వాచ్యమునకే ప్రాధాన్యముండుటవలన - నిది - ధ్వనికా"దనుచున్నాఁడు.

లోచనము :— ఇచట స్తుత్యాత్మకమగు వ్యంగ్యముచేత-వాచ్యమేయలం కరింపఁబడుచున్నదిగదా !. ఒకానొకనిచేత -

''ఓపతి ! నాయనమ్మయగు, నుర్వియె. పిమ్మటనీకునమ్మయై,
యాపయి నంబురాశి రశనాకలితాకృతియైన, కొమ్మయై,
యాపయి నూరువర్షములునేగ, నదేయనవద్యకోడలౌ !
భూపకులమ్మ - పూర్ణనయభూషిత, మందిది - యేమియుక్తమో ! ''

అను పద్యముదాహరింపఁబడినది.

ఇది - అత్యంతాసభ్యస్మృతిహేతువైయున్నది. కనుక, మాకుఁగ్రామ్యము గాఁదోచుచున్నది. దీనిచేతఁ గావింపఁబడిన స్తుతిఏమి ?

''నీవు వంశక్రమమున రాజవైయున్నావు'' అనునదియా ?

ఇది - ఎంతటిస్తుతి ! ఇట్టివ్యాజస్తుతి - సహృదయగోష్ఠులయందు నిందింపఁ బడును. కనుక, నుపేక్షింపఁదగినదియేయగును.

ప్రభా :— 'నాయనమ్మ - అమ్మగానయినది' అనునంశమును - విని నంతనే, అసభ్యస్మృతి యంకురించును. ఆయమ్మ - కొమ్మయై, ఆకొమ్మ-కోడల గును'' అనియనునపుడు, ఈయసభ్యస్మృతి - మిగులవ్యక్తపడి, అత్యంతమగును. కనుకనే ''ఇది - అత్యంతాసభ్యస్మృతి హేతువైయున్నది.'' అని చెప్పఁబడినది. ''మాకు'' అనఁగా; ''పరాకాష్ఠనధిష్ఠించిన సహృదయభావముగలమాకు'' అను నర్థము గ్రహించునది. ఇందలివ్యంగ్యమునందుమాత్రము - తదితరభూపతులయం దుకంటె నీరాజునందుఁగల యుత్కర్షాతిశయమేమియు, స్ఫురింపఁజేయఁబడుట లేదు. కనుక, నిందున్నవ్యంగ్యమునందుఁగూడ, సౌందర్యమేమియులేదు.

ప్రభా :— ''వ్యాజస్తుతి మున్నగు'' అనుచోట 'మున్నగు' అనుదాని చేతగ్రహింపఁబడిన భావాలంకారము నుదాహరించుటకు, రుద్రటకృతమగుకావ్యా లంకారమునందుఁగల దానిలక్షణమును దెలుపుచున్నాఁడు.

లోచనము :—

యస్యవికారః ప్రభవన్నప్రతిబద్ధేనహేతునాయేన।
గమయతి తదభిప్రాయం తత్ప్రతిబన్ధంచభావోఽసౌ॥

ప్రభా :— "వికారముగలదియగు [వికారవంతమగు] దేనికి [అనురాగాది చిత్తవృత్తి విశేషమునకు] అప్రతిబద్ధమగు [అనియతమగు] నే హేతువుచేత [వాగ్వ్యాపారాదిరూపమగు] వికారమగు, కార్యముపుట్టింపఁబడి, ఆవికారముగల దానికి సంబంధించిన, యభిప్రాయమును జ్ఞాతకున్ఫురింపఁజేయునో, అట్లే, ఆవికారమే-ఆవికారహేతువునకును, దాని వికారమునకును, కార్యకారణ భావమును స్ఫురింపఁజేయునో, భావనిశ్చయము, అనగా; అభిప్రాయనిశ్చయము - దీనివలన నగును. కనుక; ఇట్టిరూపముగలయిది - భావమను పేరుగల అలంకారముగాఁ జెప్పఁబడును". [ఇది - రుద్రటకావ్యాలంకారవివరణము ననుసరించినయర్థము.]

లోచనము :— 'అనురాగము' మున్నగు, నేచిత్తవృత్తి విశేషమునకు [వికారముగలదానికి] సంబంధించిన [జన్యమగు] వాగ్వ్యాపారాదిరూపమగు వికారము-నియతముకానిదయినను, [జనించి,] 'ఆ' చిత్తవృత్తి విశేషరూపమగు [అనురాగాదికమునకు సంబంధించిన]అభిప్రాయమును, [వాక్యప్రతిపాద్యమగు] నేహేతువుచేత - అవగమింపఁజేయునో, "యథేష్టముగా నుపభోగింపఁదగియుండుట" మున్నగులక్షణముగల, హేతురూపమగు నాయర్థమే - 'భావము' అనుపేరుగల (యా)అలంకారము. ఇచ్చటఁగూడ - వాచ్యము - ప్రధానమగు నెడల, భావాలంకారమగును.

ప్రభా :— రుద్రటకృతమగు కావ్యాలంకారమునందు - మీఁది భావాలంకార లక్షణమునకు-

> "గ్రామతరుణం తరుణ్యానవవఞ్జుల మఞ్జరీసనాథకరమ్,
> పశ్యన్త్యాభవతి ముహుర్నితరాం మలినా ముఖచ్ఛాయా."

అను శ్లోకముదాహరణముగాఁ జేయఁబడినది. తరువాత, వేఱొకలక్షణ ప్రకారమిట్లు తెలుపఁబడినది.

> "అభిధేయ మభిదధానం, తదేవ, తదసదృశసకలగుణదోషమ్।
> అర్థాన్తరమవగమయతి, యద్వాక్యం, సోఽపరోభావః."

"ఒకవాక్యము పదార్థమగు వాచ్యమును, ప్రతిపాదించుచు, పదార్థమగు నర్థమునకు విలక్షణములగు [విధిప్రతిషేధాదిరూపములగు] గుణదోషములు గలదియగు, వేఱొకయర్థమును, [వక్తయొక్క యభిప్రాయరూపమును] అవగమింపఁజేయునపుడది - వేరొకవిధమగు భావాలంకారమగును" అని.

తదుపరి - ఈరెండవలక్షణమున కుదాహరణముగా [లోచనోక్తమగు] నీ శ్లోకముదాహరింపఁబడినది,

ఏకాకినీ, యదబలా, తరుణీ, తథాఽహ
మస్మిన్గృహే గృహపతిశ్చగతో విదేశమ్।
కంయాచసే తదిహవాసమియంవరాకీ
శ్వశ్రూర్మమాన్ధబధిరా ననుమూఢ । పాన్థ.

దీని యర్థమును నాచేత నాంధ్రీకృతమగు "నేనేకాకిని" అనువక్ష్యమాణ పద్యమునందుఁ జూచునది. ఈపద్యము - మీఁది రెండవలక్షణమునకే - లక్ష్యముగానుండఁదగునని, విజ్ఞులు గ్రహింపఁగలరు. అయినను, లోచనసరణినను సరించి, మొదటిలక్షణమునే-దీనియందునమన్వయించుచున్నాను. పరిశీలించునది.

ప్రభా :— క్రింది పద్యమునందు - ఆహేతువునకు సంబంధించినది - "నీవు - నన్ను నీయిచ్చవచ్చినట్లనుభవించుట కెట్టి యాతంకమునులేదు" అను నాయికా మనోగతాభిప్రాయము. అది - చిత్తవృత్తివిశేషరూపమని తెలియునది. ఈయలంకారవిషయమునఁగూడ - ద్వైవిధ్యమున్నది,

(1) వాచ్యము - ప్రధానమైనపుడు, వ్యంగ్యము దానికుపస్కారకారి యగుట.

(2) వ్యంగ్యము - ప్రధానమైనపుడు, వాచ్యము దానికంగమగుట.

ఇందు మొదటివిధముగలది - అలంకారమేయగును. రెండవవిధముగలది - ధ్వనియేయగును. అందు, వాచ్యము - ప్రధానమగునపుడలంకారమగుట కుదాహృతి నొసఁగుచున్నాఁడు అది - ఒకబంగళా. నిరాతంకమగునట్లు గాలికి ప్రవేశమునిచ్చుచు, నందముగానున్నది. ఊరుచివరను,ప్రత్యేకముగానున్నయాయింటి యందేకాకినిగానిలిచి,సాభిలాషముగాఁదన్ను నిరీక్షించుచున్న, యొకతరుణినిజూచి, మదనావేశవివశుఁడయిన, యొక తరుణుఁడగు బాటసారి - [లేక పాంథవేషధారి] ఈయింటనేనీదినమునబసచేయవచ్చునా ? అనియడుగ, స్వైరిణియగునాప్రౌఢ - ఇట్లనుచున్నది.

లోచనము :—

శా॥ నేనేకాకిని, చిన్నదాన, నబలన్, వీక్షింపుమీయింటను
న్నా, నీగేహముభర్త - యిప్పుడచనెన్, దానున్ విదేశాలకున్;

గానన్,నీవిచటన్ వసింపనెవనిం బ్రార్థింతు, వోమూఢ ! యీ
నా నిర్భాగ్యపుటత్త-నిన్ గనునొ? పాంథా ! మాటలాలించునో?.

ప్రభా : ఇందలి వాచ్యమిది :— "ఓయీ, తెరువరీ! అబలను, తరుణిని, ఒంటిదానను, నగుదన్ను- "ఈయింటనేను బసచేయుదునా ? అని తరుణుఁడవగు నీవడుగుటయు, నేనంగీకరించుటయుఁగూడ - అనుచితము. నీభర్తనడుగఁగోరితి నందువా ? అతఁడు, కొలఁది దినములకుముందే, దేశాంతరగతుఁడయినాఁడు. మా యత్తనడుగుదువా ? ఆమె - గ్రుడ్డిదియు, చెవిటిదియుఁగూడనై యున్నది. ఇచట నివసించుటకు బసనడుగఁగోరిన, నీవు - యుక్తాయుక్తవిచారములేని మూఢుఁడవు వలెనున్నావు" అనునది.

ఇందు, ప్రతిపదమునందునుగల వ్యంగ్యముల నిట్లు గ్రహించునది.

"ఏకాకిని." అసహాయురాలను - కనుక, నీసహాయమును గోరనిదానను గాను. "(నాకు నీజోడుకావలయును)."

"చిన్నదానను." [తారుణ్యముగల వయసునందున్నాను. కనుక,] విశృంఖలముగాఁ బ్రసరించుచున్న మదనవికృతికి, లోఁబడకుండుదాననుగాను. "నన్నీ వికృతినుండి నీవే రక్షింపవలెను."

"అబలన్." నాశీలమును రక్షించుకొనుటకుఁదగిన మనోబలములేనిదానను. కనుక, నీకుపభోగ్యను. "నన్నెట్లు సబలనొనర్తువో."

"నేను." నాయీయవస్థను [ఆకారచేష్టాదివికారమును] జూచుచు, నిట్టి యవస్థనే యనుభవించుచున్ననీవు - నేనుజెప్పకున్నను, నన్ను గ్రహించుకొన వచ్చును. "నీగుణరూపములకుఁజిక్కి, నీయెడల గాఢగూఢమగు ననురాగముతో నున్ననేను"

"వీక్షింపుము + ఈయింటనున్నాను." భోగ్యపురుషాంతర శూన్యురాలనై, చూచినంతమాత్రముననే, ఇదిశూన్యగృహమని, నీచేత-ప్రత్యక్షముగాఁదెలియఁదగినదియు, పరతంత్రముకానిదియు, నిజసన్నివేశముచేత మదనోద్దీపనమును గూర్చునదియు, నగు నీగృహమున భోగశూన్యురాలనై యెట్లోయున్నాను. "ఈలోపము నీవలననే పూరింపఁదగినది."

"ఈగేహము భర్త," నాకుభర్తగాఁజెప్పబడునతఁడు - నాకుప్రియుఁడగు భర్తకాఁడు. అతఁడీయింటికిభర్త. [ఇంటియజమానిమాత్రమే,]

"అతఁడు. నాకు ప్రియుఁడగు భర్తకాఁడు" "నీవేప్రియభర్తవు."

"చనెన్ దానున్ విదేశాలకున్" [వాఁడైన నిచ్చటలేఁడు. వాడుకూడ - అతిదూరవర్తులగు దేశాంతరములకు వెళ్ళెను. కనుక,] ఇంతలో వచ్చుననుశంక కవకాశములేదు. కనుక, "నాతోడి కూటమికి వీలుకలుగదని శంకింపకుము." "బహుకాలము నీవిచట నాతోవిహరింపవచ్చును".

"ఇప్పుడె." అతని పయనముకూడ - ఈనడుమనేజరిగినది. కనుకను, కార్యాంతరములు- పెక్కులున్నవి కనుకను, "ఇంతలోవచ్చునను చింతకొక్కింతయు నవకాశములేదు" "మనవిహారమునకు సుముహూర్తమిదియే"

"ఈనానిర్భాగ్యపుటత్త." ఈమె- నీవులక్ష్యపెట్టవలసినది కానేకాదు.'తెలివి తక్కువది.'

"నిన్గనునో." [గ్రుడ్డిదిగనుక] ఇచట - మనమెట్లు విహరించినను, గ్రహింపఁజాలదు. "నిరాతంకముగా నీప్రణయదృక్కులు - నామెపైఁబ్రసరింప వచ్చును." "మాటలాలించునో" "నీయిచ్చవచ్చిన సరసవచనములను నీవు - నీకుసహజమగు ధ్వనితో నిశ్శంకముగాఁబలుకవచ్చును"[చెవిటిదిగనుక] "మన మాటలామెకు వినఁబడవు."

"నీవిచటన్ వసింప నెవరిన్ బ్రార్థింతువోమూఢ ! "

"ఇచటి సన్నివేశమును జూచినతోడనే - నీవు తత్త్వము నెఱిఁగియుండ వలసినది. కర్తవ్యమును గ్రహింపవలసినది. నీయంతట, నీవే, నీకుఁగావలసినవాస మునుజూచుకొనక, మీనమేషములు లెక్కించుచున్నావు. కనుక - నీకెంతయుబ లాటమున్నదో, దానికితగినంత తెలివిగాని, నైపుణిగాని, యున్నట్లుతోఁచదు."

"పాంథ !". "అంతమించిపోయినపనియేమియునులేదు. హాయిగ, నిచట, చాలకాలముండి వెళ్ళుము" "సుఖభోగ పథికుఁడవుకమ్ము." కాఁగా; "నన్ను నీవు యథేష్టముగాభోగింపవచ్చును" అనుభావమిచటవ్యంగ్యము. అది-వాచ్యము నలంకరించుచున్నది. కనుకనిది-భావాలంకారమని చెప్పఁబడును.

లోచనము :— ఇచట - వ్యంగ్యము, ప్రతిష్ఠలమునందునుగూడ - ప్రతి పదార్థమునకును, సొగసునొసఁగుచు, వాచ్యమునకే-ఉపస్కారకారియగుచున్నది. కనుక, నిచట, వాచ్యమే - ప్రధానము. [కనుకనిది - భావాలంకారము.]

ప్రభా :— ఇచటనిట్లు,ప్రతిపదార్థముచేతను-స్ఫురింపఁజేయఁబడుచున్న, వ్యంగ్యము-స్ఫురించి, అది - తిరుగవాచ్యమునే యలంకరించుచున్నది. కనుక, నిచట, వాచ్యమే - ప్రధానము. కనుక, నిది-భావమను నలంకారమేయగును.

అవ : ప్రశ్న :— అయ్యా ! ఇచటివాచ్యము - వ్యంగ్యము నపేక్షింప కయే - విశ్రాంతిగలదై యున్నది. మఱియు, నది - స్వరూపము నప్రధానముగాఁ జేసికొని, యీవ్యంగ్యార్థము నంతను -స్ఫురింపఁజేయుచున్నది. కనుక, నిచట, వ్యంగ్యప్రాధాన్యమున కెట్టిలోపమునులేదు. కనుక, నిది - యేలధ్వనికారాదు ?

లోచనము :— "వ్యంగ్యము ప్రధానమగునపుడేదియుఁగూడ - అలంకా రముకాదు" "అది ధ్వనిప్రభేదమేయగును" - అని యింతకుముందే తెలిపియు న్నాము. కనుక, దీనిని [అలంకారములయందగు వాచ్యవ్యంగ్యప్రాధాన్యవిమర్శ నమును] ఇక్కడికి చాలింతును.

ప్రభా :— ఇచట, వ్యంగ్యమే-ప్రధానమగునెడల, ఇది - వస్తుధ్వనియే యగును. అప్పుడు భావాలంకారముకాదు. "ఉపమేయోపమ, అనన్వయము, మున్నగు వానియందుఁగూడ- ఇట్లే, వ్యంగ్యప్రాధాన్యముండినయెడల; 'అదియు- ధ్వనియే యగును.' అని,స్వయముగనే విమర్శించుకొనవచ్చును." అని లోచనాభి ప్రాయము.

అవ :— ఈయంశమునంతను, సంగ్రహించునవియు, వృత్తికర్తృకృత ములును, నగు, క్రింది పరికరపద్యములవలన- ధ్వనియుండని స్థలములను- గుర్తిం చుకొనవలయును. వృత్తికారోక్తములగు, ఈపరికరపద్యములిచట, మూడున్నవి. ఈపద్యములు - కారికలుకావు.

(63) మూలము :—

గీ॥ వాచ్యమాత్రానుయాయియౌ, వ్యంగ్యమునకు
నప్రధానత గలుగు కావ్యమున, నెచట,
స్ఫుటములగునో సమాసోక్తిముఖ్యము, లవి-
కృతులవాచ్యమ్మునకు నలంకృతులెయగును. (౧)

లోచనము :— "కావ్యమునసెచట" అనగా; ఏకావ్యమునందు - అని యర్థము. ఈసమాసోక్త్యాదులు "అలంకృతులు" అగుటవలననే - అవి,వాచ్యోప స్కారములగుట, సిద్ధించెను.

ప్రభా :— "సమాసోక్తి" మున్నగునలంకారములయందు, వ్యంగ్య ముండును. అయినను, ఈయలంకృతులు - వాచ్యమునలంకరించునవి. కనుక, వీని - యందున్న వ్యంగ్యము - వాచ్యమునను సరించును. వాచ్యమునను సరించుట వలన,నిందలి వ్యంగ్యమునకు ప్రాధాన్యముండదు. కనుక,నివి - అలంకారములే యగును.

(64) మూలము :—

గీ॥ వ్యక్తికిప్రతీతిమాత్రమై యగునపుడును,
వాచ్యతుల్య ప్రధానమై వరలునపుడు,
దాని ప్రాధాన్యమస్ఫుటమ్మైనపుడును,
కావ్యమయ్యది - ధ్వనికాని కావ్యమగును. (౨)

లోచనము :— ఎచట, ఉపమాదులయందు(వలె) వ్యంగ్యార్థప్రతీతి - స్పష్టముకాకుండునో, అపుడును, అప్రస్తుతప్రశంసాదులయందువలె, వ్యంగ్యము నకు - వాచ్యముతో సమానమగు ప్రాధాన్యముండునపుడును, [వ్యంగ్యప్రతీతి యున్నను]అవ్యంగ్యమునకుఁగల ప్రాధాన్యము-స్పష్టముగాఁప్రకాశింపనపుడును. అది - ధ్వనికావ్యముకాదు. [ఇట్లేల చెప్పవలసివచ్చినదనిన;] వ్యంగ్యమునకు ప్రాధాన్యము స్పష్టముగా ప్రకాశింపకున్నను, ఒకప్పుడు, బలాత్కారమున,నిచట వ్యంగ్యమే-ప్రధానమని [అసంగతసూక్తిబలముచేత] కల్పింపఁబడును. అయినను; "మగువనినువేడెద" అని, వెనుకనుదాహరింపఁబడిన పద్యమున, మాకంటె నిత రులొనర్చిన వ్యాఖ్యలయందు - ప్రదర్శితమగు ధ్వనివలె [అది - ధ్వనిగా-]సహృ దయహృదయములయందనుప్రవేశించునదికాదుగదా !

ఇట్లు చెప్పుటచేత [సమాసోక్త్యాదులయందువలె] 1 వ్యంగ్యమున్నను, దానికి ప్రాధాన్యములేనపుడును, "పిలువంబడియు" అనుచోటనువలె, అది అస్పష్టముగా ప్రతీతమగునపుడును, [రమణీయముకానపుడును,] "అదియేమం తది" అనుచోటనువలె, 3 [వ్యంగ్యము] - వాచ్యముతో సమమగు ప్రాధాన్యము కలిగియున్నపుడును; 4 [వ్యంగ్యము-స్ఫుటముగా,ప్రకాశించుచున్నను, సందేహ

సంకరమునందువలె] దానికిఁగల ప్రాధాన్యము- స్పష్టముకానప్పుడును, నాలుగు ప్రకారములయందునుగూడ - ధ్వనివ్యవహారముండదు.

అవ :— "అట్లయినయెడల; ఈధ్వని - ఎచటనుండును ? [ఏదిధ్వని కావ్యము?" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.]

(65) మూలము ; —

గీ॥ తత్పరమ్మ్మెయగుచు, శబ్దార్థములుభ
యమును, వ్యంగ్యముకొఱకునెందలరుచుండు,
నదియె సంకర [సాంకర్య] వర్జితమ్మ్మెనయెడల;
ధ్వనికివిషయమ్మని తలంపఁదగినదగును. (౩)

లోచనము :— సంకరవర్జితమనఁగా; 'వేఱొక యలంకారముతోడియను ప్రవేశముగలదను సంభావనచేత విడువబడినది' అనియర్థము. కాని, 'సంకరాలంకారముచేత విడువఁబడినది' అని యర్థముకాదు. [ఈ యర్థమును చంద్రికాకర్త చెప్పియుండవచ్చును.] [సమాసోక్త్యాది] ఇతరాలంకారోపలక్షితమగునపుడు [వ్యంగ్యనిరూపణము] క్లిష్టమగునుగదా !

(66) మూలము :— కావున [పూర్వోక్త హేతువువలన] ధ్వని - తదితరములగు నలంకారములయందంతర్భవించునదికాదు.

ప్రభా :— అవ :— ఈయంశమునిట్లు ముగించి, ధ్వని -అలంకారాదుల యందంతర్భవింపదనుటకు [వృత్తికర్త] వేఱొక హేతువును జెప్పుచున్నాఁడు.

(67) మూలము :— 'ధ్వని- కావ్యవిశేషము. అంగి.'అని చెప్పఁబడియుండుటవలనఁగూడ, ఇది- తదితరములయందు [గుణాలంకారాదులయందు] అంతర్భవించునదికాదు. మఱియు,"నీధ్వనికి- అలంకారములు, గుణములు, వృత్తులు, అనునవి - అంగములు" అని ముందుప్రతిపాదింపఁబడును. పృథగ్భూతమగు[ప్రత్యేకమగు] నవయవమే - అవయవియని ప్రసిద్ధమగునదికూడ - కాదుగదా !

లోచనము :— వాచ్యవాచకభావమును, వ్యంగ్యవ్యంజకభావమును, [అనునవి] ఒకదానికొకటి విరుద్ధములు. కనుక, కేవలము, వానినాశ్రయించుట వలననే - అలంకారములకును, ధ్వనికిని, తాదాత్మ్యము [అలంకారములే ధ్వని యగుట,] [లేక, ధ్వనియే - యలంకారములగుట] లేకుండుటయేకాక, స్వామి వలె,ధ్వనియంగియు, భృత్యునివలె, అలంకారమంగమును, నగుచుండుట; అను విరోధమువలనఁగూడ - వానికి తాదాత్మ్యము [ఏకత్వము] కలుగదనిభావము.

"అవయవము [అంగము] ఏకైకముగా (ప్రత్యేకముగా) అవయవికాదు గదా ! " అనునంశము - "పృథగ్భూతమగు నవయవమే" అనువాక్యముచేతఁ జెప్పఁబడినది.

ప్రభామతి :— "అయ్యా! అవయవములకంటె, వేరుగా నవయవి - సిద్ధింపదు. కనుక, ఇచట, "అవయవమే - అవయవికాదు" అను నిషేధమెట్లు కుదురును ?" అను నాశంకను దొలగించుటకు "పృథగ్భూతమగు" అని చెప్పఁబడినది. "పృథగ్భూతమగు" అనఁగా; ఏకైకమగు [ఒక్కటియేయగు] అవయవమను నర్థమేర్పడును. "అప్పుడు, ప్రత్యేకమగు నవయవము- అవయవికాదు" అని సిద్ధించును.

లోచనము :— "వేరయిన యవయవము-అవయవిగాకున్నను, సముదాయ మధ్యపతితమగు నవయవము మాత్రము - అవయవియేయగుఁగాక !" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

**(68) మూలము :— ఆయంగము [అవయవము] పృథగ్భూతము కానపుడుకూడ - తానాయవయవికి [ధ్వనికి] అంగమే - [అవయవమే] యగును. [అంగమగు నాయలంకారము - తాను] అంగియే యగునదికాదు.**

లోచనము ;— సముదాయము నడుమను ప్రవేశించునపుడుకూడ-సముదాయిరూపమగు] ఆయలంకారమొక్కటియే - సముదాయముకాదు. ఏలయనిన- సముదాయులగు నితరావయవములుకూడ - సముదాయమునందుండునుగదా!.

ప్రభా :— "సముదాయమునందు సముదాయులగు నంగములు-పెక్కులుండును, కనుక, అంగమగు నలంకారము - తానువేరుగానుండక, తదితర

సముదాయులగు నవయవముల నడుమను బ్రవేశించియున్నను, వానితోఁబాటు తానుగూడ - అవయవికి - ఒకయంగమేయగునుగాని, తానే - యవయవికాదు" అని యభిప్రాయము.

లోచనము :— ఆసముదాయుల [అవయవముల] నడుమ నొకప్పుడు ప్రతీయమానముకూడ నుండినయెడల; అది - ప్రధానమగునపుడు ధ్వనియే యగును. కాని, అలంకారముకాదు. అది అప్రధానమగుటవలన, అలంకారరూప మగునపుడు, ధ్వనికాదు. ఈయంశమే "అంగియేయగునదికాదు." అని, చెప్ప బడినది.

అవ :— "[సమాసోక్తిమున్నగు నలంకారములలోనిదగు] ఏదోయొక యలంకారమునకే ప్రధానతాభిషేకము నొసఁగి, "ధ్వని" యనియు, "ఆత్మ" యనియు, ధ్వనివాదివగు నీవుచెప్పుచున్నావేమో!" అనియాశంకించిచెప్పు చున్నాఁడు.

(69) మూలము :— ధ్వని - మహావిషయము. కనుక, [సమాసోక్తి, పర్యాయోక్తము, సంకరము, మున్నగు నలంకార ములయందు] ఎచ్చటనయినను, అవయవిత్వము [వ్యంగ్య ప్రాధా న్యముచేతనగు ధ్వనిత్వము] ఉన్నను, అచ్చటఁగూడ - ధ్వని - తన్నిష్ఠమేయగునదికాదు. [ధ్వనింపఁజేయఁబడుటవలన, నవయవి యగునాయలంకారముమాత్రమే - ధ్వనికాదు.]

ప్రభా :— "అలంకారము - ధ్వనింపఁజేయఁబడి, యంగియయినను, అదియే - ధ్వనికాదు." అదియు, నొకధ్వనిభేదమగును. ధ్వని - మహావిషయము గదా!

లోచ :— సమాసోక్త్యాదులు లేకున్నను, 'ఒడలెఱుఁగదు; 'ఎవనికయిన' మున్నగు పెక్కుస్థలములయందు, (మాచేత) ధ్వని - ప్రదర్శింపఁబడినది. కనుక; సమాసోక్తి, (పర్యాయోక్తము) మున్నగు నలంకారములలోనిదియగు, నేదోయొక అలంకారమునే - మేము - ధ్వనిగాఁ జెప్పుచున్నవారలముకాము. 'సమాసోక్తి' మున్నగు నలంకారస్వరూపము, సమస్తమునుగూడ-లేకున్నను, 'ఒడలెఱుఁగదు' ఇత్యాదులగు స్థలములయందు ధ్వనియున్నదిగదా!

ప్రభా :— "ధ్వని - మహావిషయము. సముద్రమువంటిది. ధ్వనించిన యలంకారమైనను, తరంగమువంటిదియే యగును. కాఁగా, ఒకేతరంగమే -సముద్రము కాదుగదా! అలంకారము - ధ్వనింపఁజేయఁబడినపుడుగూడ, అది - ధ్వని యందొక ప్రభేదమే యగును. కాని, అదియే - ధ్వనికాదు. సమాసోక్త్యాదులకంటె భిన్నమగు, స్థలమునందుగూడ - ధ్వని -వ్యాపకమగుచున్నది. కావున, ధ్వనింపఁజేయఁబడిన యలంకారములకే - ధ్వనియందంతర్భావమును జెప్పఁదగును. కాని, సర్వవ్యాపకమగు ధ్వనికి, వానియందంతర్భావమును - చెప్పఁదగదు." అని భావము. ధ్వనించిన యలంకారము - వేరొకదాని నలంకరించునది కాకుండుట వలన, అలంకారము కాకున్నను, బ్రాహ్మణశ్రమణన్యాయమున. 'అలంకార ధ్వని" అని చెప్పఁబడుట - అయుక్తముకాదు.

అవ :— "ఆ-కృతివిశేషమును ధ్వని - యనిరి బుధులు" అనుకారికావయవము నుపయోగింపఁజేయుటకై చెప్పుచున్నాఁడు.

**(70) మూలము :—** "ధ్వనియనిరి బుధులు" అనుటచేత - "ధ్వనియను నీయుక్తి (సంజ్ఞ) విద్వదుపజ్ఞ (విద్వాంసుల నుండి మొట్టమొదట నుపక్రమముగలది) అగుచున్నది. కాని, అధిక ప్రయత్నముచేత నెట్లో ప్రవర్తింపఁజేయఁబడినదికాదు." అని ప్రతిపాదింపఁబడినది.

లోచనము :— "విద్వదుపజ్ఞ" అనుచోట "ధ్వనియనునుక్తి - విద్వాంసులవలననగు, ఉపజ్ఞగలది." అనగా - "ప్రథమోపక్రమముగలది." అని బహువ్రీహిని జెప్పఁదగును. కనుక, "విద్వాంసుల యుపక్రమము" అని తత్పురుషాశ్రయమగు నపుంసకత్వము - నిరవకాశమని తెలియునది.

ప్రభా :— చంద్రికాకర్త - ఇట్లువ్యాఖ్యానించెనేమో.

—: "ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః" :—

**(71) మూలము :—** సర్వవిద్యలును వ్యాకరణ మూలములు. కనుక, వైయాకరణులు - ప్రథములగు విద్వాంసులుగదా! [వైయాకరణులే,విద్వాంసులలో అగ్రగణ్యులుగదా!] ఆశాబ్దికులు- వర్ణములు- శ్రవణేంద్రియగోచరీ క్రియమాణములగునపుడు,[వానిని] "ధ్వని" అని, వ్యవహరించుచున్నారు.

ప్రథా :— సర్వవిద్యలకును మూలభూతమగు, శబ్దబ్రహ్మమును దెలిసినవారు - కనుక, వైయాకరణులు - విద్వాంసులలో, ముఖ్యులగుచున్నారు. కనుకనే అగ్రగణ్యులగుచున్నారు. ఆశబ్దబ్రహ్మముచేత - సమస్తభువనములును వ్యాప్తములు కాఁగా- చతుర్దశయో, అష్టాదశయో, అగు,విద్యలనుగూర్చి చెప్పవలెనా ?. ఇచట, లోచనకర్త - (1) వ్యంగ్యమగునర్థము; (2) తద్వ్యంజకమగు, శబ్దము, (3) వ్యంజకమగునర్థము, (4) తద్వ్యాపారమగువ్యంజన, (5) తత్సముదాయరూపమగు కావ్యము, అనునైదునుగూడ - విద్వద్ వైయాకరణప్రసిద్ధిననుసరించి, "ధ్వని" అనుశబ్దముచేతఁ జెప్పఁబడుట కనుగుణములగునట్లు, వ్యాఖ్యానించుటకుద్దేశించి, అందు మొదటిదగు వ్యంగ్యార్థము - 'ధ్వని' అనుశబ్దమున, నెట్లుచెప్పఁబడినదియుఁ జెప్పుచున్నాఁడు.

లోచ :— శ్రోత్రశష్కులిని [చక్కిలమువంటి చెవితోఁగూడినయాకాశమును]వీచీ[తరంగ] సంతానన్యాయమునఁబ్రవేశించిన, అంత్యములగు, శబ్దములు- [శ్రూయన్తేఇతి] 'వినఁబడుచుండునవి'. కనుక; [వైశేషికాదుల] ప్రక్రియయందు - శబ్దమునుండి పుట్టినవగు, నాచివరి శబ్దములు - "శ్రూయమాణములు" అనిచెప్పబడినవి. వినఁబడుచున్నవియు, [మొదటి] శబ్దమువలనఁబుట్టినవియు, చివరివియు, అగు నాశబ్దములకు - ఘంటానురణనరూపత్వముండును. కనుక; అవికూడ - "ధ్వని" అనుశబ్దముచేతఁ జెప్పఁబడినవి.

భగవానుఁడగు 'భర్తృహరి' - [వాక్యపదీయమను గ్రంథమునందు] ఇట్లే - చెప్పెను.

"యఃసంయోగ వియోగాభ్యాంకరణై రుపజన్యతే।
సస్ఫోటః, శబ్దజాశ్శబ్దాధ్వనయోఽన్యైరుదాహృతాః" అని.

ప్రథా :— "జిహ్వాగ్రము మున్నగు కరణములకు - అయా(తాల్వాది) స్థానములతోడి, సంయోగవియోగములు కలుగునపుడు, ఆ జిహ్వాగ్రాదికరణములచేత - మొదట నుపజనితమగుశబ్దము - స్ఫోటమని చెప్పఁబడును" అనునది - దీనియర్థము. కనుక, కరణ - స్థాన-సంయోగ, వియోగముల, వలన - మొదటు, నుత్పద్యమానమగుశబ్దము - 'స్ఫోటము' అని, ఉత్పత్తివాదులమతము. కాఁగా "గంటవాయించునపుడుదయించునదియగు, ప్రథమశబ్దమునననుసరించి, కలుగునవియగు, శబ్దములవలె, స్ఫోటరూపమగు ప్రథమశబ్దమునుండి, శ్రూయమాణముల

గుచు, పుట్టినశబ్దములు - [జ్ఞాతృశ్రుతి పథమునఁబడినవి] అన్యులచేత- [వైయాకరణులకంటె అన్యులగు, ఉత్పత్తివాదులచేత] 'ధ్వనులు' అని చెప్పఁబడినవి.'' - అనునది - దీనియర్థము.

లోచ :— ఇట్లు, ఘంటాద్యనురణన స్థానీయమును, [కనుకనే;] అనురణనాత్మోపలక్షితమును, అగు వ్యంగ్యమగునర్థముగూడ- ''ధ్వని''అని వ్యవహరింపఁబడినది.

ప్రభా :— ఇట్లే, గంటమ్రోగించునపుడు, కలుగు మొదటిధ్వనిననుసరించి, కలుగునదియగు, ధ్వనివంటిదగుటవలన - సంలక్ష్యక్రమవ్యంగ్యమగు నర్థముకూడ-''ధ్వని'' అనిపేర్కొనఁబడినది. కనుకనే, 'దీనికి'అనురణన(వ్యంగ్య) ధ్వని' [మొదటిధ్వనిననుసరించి ధ్వనించునది] అనునామాంతరముకూడ నొసఁగఁబడినది. ''అసంలక్ష్యక్రమమగు, వ్యంగ్యమగు రసాదికము - తెలియఁబడనిక్రమముగలదగుటవలన - అనురణనాత్మకముకాకున్నను, అదికూడ - దీనిచేత ఉపలక్షితమగును.'' అనిచెప్పుటకే, లోచనకర్త-''అనురణనాత్మోపలక్షితమును'' అని వ్యాఖ్యానమొనర్చెను. కాని, రసాదికమనురణించునదివలె, కనుపింపకుండుటవలన, దానికి - అనురణనవ్యంగ్యమను నామాంతరమీయఁబడకున్నను, అది కూడ - అనురణింపనిదికాదు. దానియందును, అసంలక్ష్యక్రమమగు [చక్కఁగాఁ గనుపింపని క్రమముగల] అనురణనమున్నది. కనుక, అనురణనసామ్యమువలన నదియు, ధ్వనియని పేర్కొనఁబడునని తెలియునది. అనురణనమనఁగా; మొదటి దానిననుసరించి, [కొంతకాలమువఱకును] ధ్వనిచేయుట. మొదటమ్రోగునదివలెఁ బ్రకాశించు, వాచ్యముననుసరించి-మ్రోగునదివలె స్ఫురించునదియగు,వ్యంగ్యము- అనురణనరూపమగుటయుక్తమేగదా !. అనురణనరూపమగు వ్యంగ్యము-[ప్రధానముగాఁ] గలది - ''అనురణనవ్యంగ్యధ్వని'' అనిముందు వ్యవహరింపఁబడును. వెనుకనుదాహరింపఁబడిన, గాథలు - అనురణనవ్యంగ్యధ్వని ప్రభేదమునకుదాహరణములేయని తెలియునది. వానియందు, వాచ్యముననుసరించియే వ్యంగ్యములు స్ఫురించుచున్నవిగదా !

అవ :— ఇప్పుడు ''వ్యంజకమగు శబ్దమును, వ్యంజకమగు నర్థమును గూడ - ధ్వనియని వ్యవహరింపఁబడును.'' అని సాధించుచున్నాఁడు.

లోచనము :— అట్లే, పూర్వాపూర్వవర్ణముల యనుభవముచేత, జనితమగు సంస్కారముచేత, సహకరింపఁబడిన, అంత్యవర్ణబుద్ధిచేత - నిర్గ్రాహ్యమగు, [మిగుల వ్యక్తమగు రూపమున గ్రహింపఁబడునదియగు,] స్ఫోటమునకు - అభి

వ్యంజకములగుచు, శ్రూయమాణములగునేవర్ణములు - "నాద"శబ్దవాచ్యములో, [వైయాకరణులు - నాదశబ్దముచేత. వేనిని జెప్పుదురో] అవియు - "ధ్వని"అను శబ్దముచేతఁ [శాబ్దికులచేతఁ]జెప్పఁబడినవి. భగవానుఁడగునతఁడే, యిట్లుచెప్పెను.

"ప్రత్యయై రనుపాఖ్యేయైర్గ్రహణానుగుణైస్తథా।
ధ్వనిప్రకాశితేశబ్దే స్వరూపమభిధీయతే"అని.

ప్రభామతి :— "ఇది, యిట్లు" అని వ్యాఖ్యానించుటకు, శక్యముకానివియు, వ్యక్తరూపమగు స్ఫోటమును గ్రహించుటకనుకూలించునవియు, ధ్వనిచేత ప్రకాశితమగు శబ్దమునుండి పుట్టినవియు, అంతరాళమునందుండునవియు, స్ఫోటవిషయకములగునవియు, వ్యక్తములుకానివియు, నగుప్రత్యయములచేత - స్ఫోటస్వరూపము - వ్యక్తముగాఁదెలియఁబడును." అనిదీనియర్థము. "పూర్వపూర్వవర్ణానుభవజనితసంస్కార సహకృతమగు నంత్యవర్ణముయొక్క జ్ఞానమువలన స్ఫోటము - వ్యక్తపడును." అనునది వైయాకరణులమతము.

లోచనము :— దీనిచేత - [వ్యంజకములగు వానిని, వారిట్లు ధ్వనియని వ్యవహరించుటచేత] వ్యంజకములగు శబ్దార్థములుకూడ - [వారిననుసరించిన, మాచేత -] ధ్వనిశబ్దముచేత, వ్యవహరింపఁబడినవి.

ప్రభామతి :— తదుపరి, 'వ్యాపారమగు వ్యంజనకూడ-ధ్వనియనిచెప్పఁబడు'నని సాధించుచున్నాఁడు.

లోచనము :— మఱియు, వర్ణములు-తావన్మాత్ర ప రి మా ణ ము లుగా శ్రూయమాణములగునపుడు—

"అల్పీయసాపియత్నేన శబ్దముచ్చారితం మతిః।
యదివానైవగృహ్ణాతివర్ణం వాసకలంస్ఫుటమ్॥"అని

ప్రభా :— వర్ణములు - ఎంతపరిమాణముగల, వర్ణము, శ్రోత్రేంద్రియముచేత గ్రహింపఁబడునో, అంతపరిమాణముతోఁగూడినవిగా, వినఁబడినవైనను. బుద్ధి - మిక్కిలియల్పమగు, యత్నముచేత, నుచ్చారితమైన శబ్దమునుగ్రహింపకుండవచ్చును. లేక, వర్ణములన్నిఁటిని స్పష్టముగా గ్రహింపకుండవచ్చును, అప్పుడు —

లోచ :— ఆ వర్ణములంతమాత్రముగనే వినఁబడునపుడు, వక్తయగువాఁడు ప్రసిద్ధమగు [తనకుసహజమగు] నుచ్చారణవ్యాపారముకంటె మిగులనధికమును, ధృతవిలంబితాదివృత్తిభేదాత్మమును, నగు [శీఘ్రతగలదియో, ఆలస్యముగలదియో, యగు] వేణాకవ్యాపారమునొనర్చునపు డట్టివ్యాపారముకూడ - ధ్వనియని [వైయాకర్తయగు, భర్తృహరిచేతనే] చెప్పఁబడినది. అతఁడే - యిట్లుచెప్పెను.

''శబ్దస్యోర్ధ్వమభివ్యక్తేర్వృత్తి భేదేతువైకృతాః।
ధ్వనయః సముపోహన్తే స్ఫోటాత్మాతైర్నభిద్యతే''అని.

ప్రభా :— ''(స్ఫోటరూపమగు) శబ్దమునకు అభివ్యక్తికల్గినపిమ్మట.[ఆలస్యాదులచేత] వైకృతములగుధ్వనులుపుట్టును.కాని, యివి, [ఆలస్యాదికృతములు కనుక] ధృతాదివృత్తిభేదమునందు కారణములగుచుండును. [వృత్తిభేదమును పుట్టించును.] స్ఫోటముమాత్రమువానిచేత భేదింపఁబడునదికాదు.'' అని,యాతఁడే చెప్పెను.

లోచ :— [కనుక, ఆశబ్దబ్రహ్మవిదులననుసరించిన] మాచేతఁగూడ - ''ప్రసిద్ధములగు, శబ్దవ్యాపారములగు, అభిధాతాత్పర్య లక్షణారూపములకంటె, అతిరిక్తవ్యాపారమగు, వ్యంజన-'ధ్వని' - అనిచెప్పఁబడినది.'' ఇట్లు [వ్యంగ్యము, వ్యంజకశబ్దము, అర్థము, వ్యంజన, అను] నాలుగునుగూడ - ''ధ్వని'' అని వ్యవహరింపఁబడఁదగినవగుచున్నవి. వీనితోడి సంబంధమువలన-సమస్తమగు [వ్యంగ్య, వాచ్య, వాచక, వ్యాపార, సముదాయ. రూపమగు] కావ్యముగూడ - ధ్వనియని చెప్పబడినది. కనుక, [ఇట్లు, కావ్యముకూడ-ధ్వనియనుటచేత-''ధ్వనికావ్యమ్మన కాత్మగా''-అనుచోట, కావ్యమునకును, దానియాత్మ యగుధ్వనికిని, జెప్పఁబడిన] భేదవ్యపదేశమును, [ఆకృతివిశేషమును 'ధ్వని'యనిరి ఇత్యాదిస్థలమున విశిష్టమగుకావ్యమునకును, ధ్వనికిని,జెప్పఁబడిన] అభేదవ్యపదేశమునుగూడ-యుక్తము కానిదికాదు. [యుక్తమేయగును.]

ప్రభా :— ''స్ఫోటోత్పత్తివాదిమతమున, స్ఫోటమనునది- ధ్వనికంటె, భిన్నమైనది. 'జిహ్వాగ్రము' మున్నగు కరణములకును, 'తాల్వాది' స్థానములకును, సంయోగవియోగములు కలుగునపు, డుత్పత్తినొందునదియగు, మొదటి శబ్దము - స్ఫోటమనునది - ఉత్పత్తివాదులమతము. దీనినుండి పుట్టినశబ్దములే- మనకు వినఁబడును. శ్రూయమాణములగు నీశబ్దములు - వారిచేత 'ధ్వని'యని చెప్పఁబడినవి. వైయాకరణమతమునందుమాత్రము, శ్రూయమాణములగు వర్ణములతే - నాదమను నామమున్నది. ''ఈనాదమే - స్ఫోటకమున కభివ్యంజకమగు

చుండు"నని వైయాకరణులు చెప్పుచుందురు. కనుక వీరిమతమున ప్రథమశబ్దము-స్ఫోటముకాదు, అంత్యవర్ణబుద్ధినిర్గ్రాహ్యమగునదియే - స్ఫోటము. ఈస్ఫోటమునకు వ్యంజకమగు నాదము - వైయాకరణులచేత, ధ్వనియనివ్యవహరింపఁబడినది. కనుక, వ్యంజకత్వసాదృశ్యము ననుసరించి- వ్యంగ్యమునకు వ్యంజకములగు, శబ్దార్థములు రెండును - మాచేత ధ్వనియనిచెప్పఁబడినవి. ప్రసిద్ధోచ్చారణ వ్యాపారముకంటె నధికమగు వ్యాపారమునుగూడ - వారుధ్వనియనిరి. కనుక, ప్రసిద్ధ శబ్దవ్యాపారములకంటె, భిన్నమగు, వ్యంజనను, మేమును - 'ధ్వని'యంటిమి". అనిభావము.

అవ :— "శబ్దబ్రహ్మవిదులగు వైయాకరణులు - అభిప్రాయవ్యంజకములగు, వర్ణములు - వినఁబడునవుడు, వానిని ధ్వనియనియనుచున్నారు. అట్లే, ధ్వన్యాత్మవిదులగు నాలంకారికులుకూడ - వ్యంగ్యవ్యంజకములగు శబ్దాదులను ధ్వనియని వ్యవహరించిరి" అని. [వృత్తికర్త] చెప్పుచున్నాఁడు.

(72) మూలము :— అట్లే, తన్మతముననుసరించిన, కావ్యతత్త్వార్థదర్శులగు విద్వాంసులు-వాచ్య, వాచక, సమ్మిశ్రము, శబ్దాత్మ, కావ్యపదవ్యపదేశ్యము, అనువానిని [ఐదింటిని] వ్యంజకత్వసామ్యమువలన ధ్వనియని వ్యవహరించిరి.

ప్రభా : అవ :— "ఈవ్యంగ్యాదుల నైదింటినిగూడ- ధ్వనిగాఁబ్రదర్శించుట-వృత్తికారాభిమతమేయగును" అనిచెప్పుచున్నాఁడు.

లోచనము :— "వాచ్య, వాచక. సమ్మిశ్రము" అనుచోట, 'వాచ్యవాచకసహితము, సమ్మిశ్రము'. అని, మధ్యమపదలోపియగు సమాసమును జెప్పవలయును. ఇచ్చట సముచ్చయమునుదెలుపుపదమగు 'చ'కారములేకున్నను, [గామశ్వంపురుషంపశుమ్] "గోవును, అశ్వమును, పురుషుని, పశువును, అనుచోటనువలె, సముచ్చయార్థమును దెలుపవలయును. [అపుడు - "వాచ్యమును, వాచకమును, సమ్మిశ్రమును, శబ్దాత్మయు, కావ్యపదవ్యపదేశ్యమును" అను సముచ్చయవిశిష్టమగు నర్థమేర్పడును.] దానిచేత-వాచ్యమగు నర్థమును. వాచకమగు శబ్దమునుగూడ - ధ్వనియగును. రెంటికిని వ్యంజకత్వమున్నది. కనుక, [ధ్వనతీతి] 'ధ్వనించును' అనువ్యుత్పత్తిచేత - అవిరెండునుగూడ - ధ్వనులని చెప్పఁబడును. ["సంమిశ్ర్యతే, విభావానుభావసంవలనయా"]విభావానుభావముల

తోడి సంబంధమువలన వ్యంజింపఁజేయఁబడును. కనుక, వ్యంగ్యముగూడ—ధ్వని యగును. శబ్దాత్మయు, అనుచోట [''శబ్దనంశబ్దః] 'శబ్దించుట-శబ్దము. అనఁగా; శబ్దవ్యాపారముగూడ - శబ్దమని చెప్పఁబడుననియర్థము. ఇదికూడ - అభిధాది రూపముకాదు. ఇంకేమనిన - ఆత్మరూపమే (వ్యంజనయే) యగును.

కనుక, ఆశబ్దవ్యాపారముగూడ - (ధ్వననమ్-ధ్వనిః) ''ధ్వననమే-ధ్వని'' అనువ్యుత్పత్తిచేత - ధ్వనియగును. ఇట్లు, ఉక్తప్రకారధ్వని చతుష్టయమగుటవలన కావ్యమనివ్యవహరింపదగినయర్థము, అనగా; సముదాయరూపము-కూడ-ధ్వనియని చెప్పఁబడినది, కనుకనే, ''వ్యంజకత్వసామ్యమువలన'' అనుసాధారణహేతువు చెప్పఁబడినది, పక్షములన్నిఁటియందును ''వ్యంగ్యవ్యంజకభావము - సామాన్య రూపము'' అనఁగా; 'సాధారణము' అని దీనియర్థము.

అవ :— ''వాగ్వికల్పములు - [వాగ్వైచిత్ర్యములు] అనంతములు. కావున'' ఇత్యాదిగా వేరొకకొందఱు [9వ పేరాలో] చెప్పినదానిని పరిహరించు చున్నాఁడు.

(73) మూలము : — వక్ష్యమాణములగు [ముందుచెప్పఁబడినవియగు] ప్రభేదములయు, వానికిగల భేదములయు, సంకలన చేత - మహావిషయమగు, నిట్టిధ్వనిని బ్రకాశింపఁజేయుటయనునది-అప్రసిద్ధములగు నలంకార విశేషములను మాత్రమే - ప్రతిపాదించుటవంటిదికాదు. కనుక, ధ్వనిస్వరూపభావితమగు, చేతము [చమత్కారరూపమగు ధ్వని స్వరూపముచేత - అధివాసితము, కనుక, ముకుళితలోచనత్వాది వికారకారణమగు హృదయము] గలవారికిఁ [ధ్వనివాదులకు] గలుగునదియగు సంరంభము-యుక్తమేయగును. (కనుక) వారియెడల, ఈర్ష్యాకలుషితమగు శేముషి - ఆవిష్కరింపఁదగినదికాదు. కాఁగా; "ధ్వన్యభావవాదులు" ['ధ్వనిలేదు' అను వారందఱునుగూడ] ఇట్లు, తిరస్కృతులగుచున్నారు.

లోచనము :-- [ద్వితీయోద్యోతమున, కారికాకర్తచేత] వక్ష్యమాణములగు ప్రభేదములెట్లనిన :- ముఖ్య (ప్రభేద)ములు - రెండు రూపములు. [అవి - అవివక్షితవాచ్యము, వివక్షితాన్యపరవాచ్యము అనునవి.] ఆప్రభేదములకు సంబందించిన భేదములులేవనిన :- అందు, అవివక్షిత వాచ్యమునకు సంబంధించిన భేద

ములు - 1 అర్థాంతర సంక్రమితవాచ్యము 2 అత్యంత తిరస్కృతవాచ్యము. అనునవి. అందు, వివక్షితాన్యపరవాచ్యమునకు సంబంధించిన భేదములు - 1 అసంలక్ష్యక్రమవ్యంగ్యము, 2 సంలక్ష్యక్రమవ్యంగ్యము, అనునవి.

మరల వీనియందు అవాంతరభేదములు - పెక్కులున్నవి. ( ధ్వని ) ''మహావిషయము'' అనగా, 'అశేషములగు లక్ష్యములయందు వ్యాపించునది' యనియర్థము.

''అలంకార విశేషములను'' అనుచోట ''విశేషగ్రహణముచేత, అవి - వ్యాపకములుకావనిచెప్పఁబడినది. 'మాత్రమే' అనుశబ్దముచేత [లేశములుగనుక] ''అవి - అంగికావు.'' అని చెప్పఁబడినది. ధ్వనిస్వరూప భావితమగు చేతముగల వారికి - అనగా; ''ధ్వనిస్వరూపమునందు ప్రణిహితమగు హృదయముగలవారికి- అనిగాని, ''చమత్కారరూపమగు ధ్వనిస్వరూపముచేత - భావితమగు-అనఁగా - అధివాసితమును, కనుకనే, ''కన్నులుమూసికొనుట మున్నగు వికారములకు కారణమును, నగుహృదయముగలవారికి'' అనిగాని, యర్థము. ''ధ్వన్యభావవాదులు'' అనఁగా, 'అవాంతరప్రకార త్రయభిన్నులుగూడ' - అనియర్థము.

ప్రభా :— ధ్వనివాది ప్రతిపక్షులగు, ''1 అభావవాదులు 2 భాక్తతావాదులు 3 అనిర్వచనీయతావాదులు ''అను,వాదులలో - మొదటివారగు నభావవాదులు - మరల ముగ్గురుగాఁదెలుపఁబడిరిగదా!. వారికంటె భిన్నులగు నభావ వాదులుకూడ నుండవచ్చును. వారందఱును - మీఁది సిద్ధాంతముచేత-తిరస్కృతు లగుచున్నారని భావము.

లోచనము :— ఇట్లు - అభావవాదులను దిరస్కరించుటవలననగు ఫలమును జెప్పుచున్నాఁడు.

**(74) మూలము :— ధ్వని -ఉన్నది. అదికూడ[వస్తు-అలంకార-రసాదివిశేషరూపమునత్రివిధమైనను,]అవివక్షితవాచ్యము, వివక్షితాన్యపరవాచ్యము - అని, సామాన్యరూపమున, ద్వివిధము.**

ప్రభా ;— అవ : - ''అయ్యా! అభావవాదఖండనము నొనర్చిన పిమ్మట, భాక్తతాదిపక్షములను ఖండింపవలసియున్నను. వానినివిడిచి, వృత్తికర్త-(''అస్తిధ్వనిః') ధ్వని - ఉన్నది!'' అనిచెప్పి' ధ్వనిభేదములను ప్రదర్శించుట -

సముచితమా?'' అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

లోచ :— ''భాక్తతావాదమును, అలక్షణీయతావాదమును, మొదట పరిహరింపవలసియున్నను, ముందుగా నుదాహరణమును బ్రదర్శించినయెడల, భాక్తతావాదము-సుశంకమును, సుపరిహరమునుగూడనగును'' అను నభిప్రాయముచేత - వానిని బరిహరింపక, ఉదాహరణములనొసఁగు నవకాశముకొఱకు [వాచ్యమవివక్షితమ్మగుధ్వనికి అను] భవిష్యదుద్ద్యోతానువాదము ననుసరించి, [కారికాకారస్థానమునందుండి]వృత్తికర్తయే[''అవివాక'' అనువానిచేత] ప్రభేద నిరూపణము నొనర్చుచున్నాఁడని తెలియునది. [వెనుకఁదెలిపిన] పంచవిధమగు ధ్వనిశబ్దార్థమునందునుగూడ - ''దేనిచేత, దేనియందు, దేనివలన, దేనికిసంబంధించిన, దేనికొఱకు'' అను బహువ్రీహిసమాసమునాశ్రయించుటచేత, యథోచితమగు సామానాధికరణ్యము - సుయోజ్యము-

ప్రభా :— 'వాచకమగుశబ్దము - ధ్వనిపదార్థము' అనునపుడు, ఏశబ్దముచేత - వాచ్యము - అవివక్షితమో [వ్యంజకమగు] అది -అవివక్షితవాచ్యమగు ధ్వని. [అవివక్షితమగు వాచ్యముగలధ్వని] అని, సమన్వయింపవలయును. ఇట్లే, క్రమముగా సప్తమీ, పంచమీ, చతుర్థీ, షష్ఠీ, విభక్తులచేత - బహువ్రీహినాశ్రయించి - వ్యంగ్యము, వ్యంజన, కావ్యము, అనునవి - ధ్వనులగునట్లు, సమన్వయింపవలయును.

లోచ :— ''వాచ్యమగునర్థము - ధ్వని'' అనునప్పుడుమాత్రము [మీఁదిపదములయందలి] వాచ్యపదమునకు, స్వాత్మ-అనఁగా, 'వాచ్యార్థముయొక్క-స్వరూపము' - అర్థమగును. అప్పుడు, 'దేనిచేత [ఏవాచ్యముచేత] తనస్వరూపము - వివక్షితముకానిది - అనఁగా; అప్రధానముగాఁజేయఁబడినది, యగునో; వ్యంజకమగు నాయర్థమే - అవివక్షితవాచ్యమగు ధ్వని'' అని, సమన్వయింపవలయును. వివక్షితము, అన్యపరము, అగు - వాచ్యముగలదియగు] వివక్షితాన్యపరవాచ్యమునందుఁగూడ - [ఇట్లే, యీపంచకము - వ్యంజకమగుటవలన]ఇట్లే [అది] ధ్వనియనిచెప్పఁబడుట కుచితమగునట్లు సమన్వయింపవలయును.

ప్రభా :— ''అవివక్షితవాచ్యము'' అనుపదమునకు పక్షాంతరమున యథాశ్రుతమగు నర్థముఁగూడఁ జెప్పవచ్చునను నభిప్రాయమునఁజెప్పుచున్నాఁడు.

లోచ :— అట్లుగాక, కర్మధారయపక్షము నాశ్రయించునెడల; [అవివక్షితశ్చాసౌ వాచ్యశ్చ ఇతి] 'అవివక్షితమగువాచ్యము' అనియు, వివక్షితాన్యపర

శ్చాసౌవాచ్యశ్చేతి] వివక్షితమును, అన్య [వ్యంగ్య] పరమును, అగువాచ్యము, అనియు, [కర్మధారయ విగ్రహమునుగూడ] చెప్పవచ్చును.

అచట, [అవివక్షితవాచ్యమునందు] వాచ్యమగునర్థము- ఒకప్పుడు కుదుర కుండుట, [ఉపయోగింపకుండుట] మొదలగు నిమిత్తముచేత - అవివక్షితము [వివక్షింపఁబడనిది, అనఁగా; అన్వయబోధమునకు విషయముగా నపేక్షింపఁబడ నిది]అగుచుండును. వాచ్యార్థమొకప్పుడు- ఉపపద్యమానమగుటవలన-వివక్షితమే- [వివక్షింపఁబడునదియే అనఁగా; అన్వయబోధమునకు విషయముగా నపేక్షింపఁ బడునదియే] యగుచున్నను, స్వసౌభాగ్యమహిమచేత-వ్యంగ్యపర్యంతమగుప్రతీతిని గలిగించుచుండును. [వ్యంజకమగుచుండును.] కనుకనే; వివక్షితాన్యపరవాచ్య మునందు - అర్థమేప్రధానముగా వ్యంజకమగును, అవివక్షిత వాచ్యమునందు - శబ్దమే - ప్రధానముగా వ్యంజకమగును.

ప్రశ్న : అయ్యా! వివక్షయు, అన్య [వ్యంగ్య] పరతయు, నునది - విరుద్ధముగనున్నదే ! [అర్థము వివక్షితమగునపుడది - అన్యపరమెట్లగును ?]

ఉ :— అన్యపరమగునట్లే, వివక్షింపఁబడును. కనుక, విరోధమేమున్నది? [అన్యమగు వ్యంగ్యమునకు, వ్యంజకమగునట్లు వివక్షింపఁబడుటవలన విరోధము లేదు.] ''సామాన్యముగా'' అనఁగా; ధ్వని - వస్తువు, అలంకారము, రసము- అనురూపములచేత, త్రివిధమగుచున్నను, సామాన్యరూపమున నది - మీఁదిభేద ద్వయముచేతనే, సంగృహీతమనిభావము.

ప్రభా ; — వస్తురూపమును, అలంకారరూపమును, రసాదిరూపమును, నగు ధ్వనివిశేషత్రియమిచట-''అవివక్షితవాచ్యము, వివక్షితతాన్యపరవాచ్యము'' అనుసామాన్యరూపమున గ్రహింపఁబడియెను. అనిభావము.

ప్రశ్న :-- ధ్వనినామమునకు వెనుక, అవివక్షితవాచ్యము, వివక్షితాన్య పరవాచ్యము, అనునీనామములనుంచుటవలననగు ఫలమేమి ?

ఉ :— ''ధ్వననమనుపేరుగల వ్యాపారమునందు 'పూర్వము, ప్రసిద్ధ ములగు, అభిధ, లక్షణ, తాత్పర్యము' అను వ్యాపారత్రియమువలన, సహృద యజ్ఞాతకుఁగలుగునదియగు, నర్థప్రతీతియు, ప్రయోక్త [వక్త]కు సంబంధించిన యభిప్రాయరూపమగు వివక్షయుఁగూడ, సహకారులగును.'' అనునంశమును

దెలుపుటకే, యీనామద్వయముంచఁబడినది. కనుక; 'అవివక్షితవాచ్యము, వివక్షితాన్యపరవాచ్యము,' అనునీనామములచేతనే - ధ్వనిస్వరూపమే - ప్రకృష్టముగానుజ్జీవితమగునని తెలియునది. —

ప్రభా :— "ధ్వనికి - ప్రభేదములను ప్రతిపాదించుటకే, ఈనామద్వయము - ప్రసాదితమని తలపఁదగదు" అనిభావము.

అవ :— వానియందు-అవివక్షితమగు వాచ్యముగల ధ్వని నుదాహరించుచున్నాఁడు.

**(75) మూలము :— అందు మొదటిదగు, నవివక్షితవాచ్య ధ్వని కుదాహరణము :**

కం॥ పరిచరణ కృతియు, విద్యా
పరిచయయుక్తుఁడును, శౌర్యవంతుఁడు, ననఁగన్
బరగునరులు, చయనింతురు
పురుషులు-ముగ్గురు-సువర్ణపుష్పఁగఁబృథివిన్.(౧౧)

లోచ :— [సువర్ణానిపుష్ప్యతి, ఇతి, సువర్ణపుష్పా] సువర్ణములను పుష్టించునది కనుక, 'సువర్ణపుష్ప' అని ['బంగారుపూవులను బూయునది'అని] యర్థము. ఈవాక్యమే-స్వార్థమునకన్వయము లేకుండుటవలన, అవివక్షితవాచ్యమగుచున్నది. కనుకనే; యిది - [మొదట] అభిధచేత - పదములయర్థమును దెలిపి, తాత్పర్యశక్తిచేత - వానికిఁగల పరస్పరాన్వయమును దెలిపియే, బాధకవశమున నాయన్వయమునువిడిచి, సాదృశ్యమను నిమిత్తమువలన,['సువర్ణపుష్ప' అనుపదముచేత] 'సమృద్ధి సంభారమును సులభముగాఁబొందఁగలుగుటను' లక్షింపఁజేయుచున్నది. ఆలక్షణా [వ్యాపార] ప్రయోజనము - పరిచరణకృతియగు, సేవకునికిని - విద్యాపరిచయయుక్తుఁడగు, విద్వాంసునికిని, - శౌర్యవంతుఁడగు, శూరునికిని - సంబంధించిన ప్రాశస్త్యమైయున్నది. ఇచ్చట, 'ఆ'ప్రాశస్త్యము - గోప్యమానమగుచు, [ఆంధ్రి] నాయికాకుచకలశయుగళమువలె, మహార్ఘతను [సౌందర్యాతిశయమును]బొందుచు, ధ్వనింపఁజేయఁబడుచున్నది. కనుక, వ్యంగ్యమగు ప్రాశస్త్యమునకు ఇచట, శబ్దము - ప్రధానముగా వ్యంజకమగుచున్నది అర్థముమాత్రము - దానికి సహకరించుటచేత - [అప్రధానముగా] వ్యంజకమగు

చున్నది. కనుక, నిచట, [అభిధ, తాత్పర్యము, లక్షణ, వ్యంజన, అను] వ్యాపారములు - నాలుగైయున్నవని తెలియవలయును.

ప్రభా :— "సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః।
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్."

అనునది-మీఁది యాంధ్రీకృతికి మూలము.

"పరిచరణకృతి" అనఁగా అధిపతులకు పరిచర్య [సేవ] నొనర్చుటయందు, జ్ఞానము [నేర్పు] గల సేవకుఁడు, "విద్యాపరిచయయుక్తుఁడు" అనఁగా; విద్యాపరిశ్రమనొనర్చిన విద్వాంసుఁడు. శౌర్యవంతుఁడనఁగా; విక్రమముగల శూరుఁడు. పురుషుఁడొనర్చునదియగు పనికి పౌరుషమని పేరు. ఆపౌరుషముగలవారు - పురుషులు. కనుక; మీఁదఁ దెలుపఁబడినవారలే - పురుషులు. ఆపురుషులు- ముగ్గురుగాఁ జెప్పఁబడిరి. వారు ముగ్గురును, పృథివిని - సువర్ణములను పుష్పించుదానినిగా 'చయనింతురు - అనఁగా; 'సంపాదింతురు'. అనునది వాక్యార్థము. ఇందు, "సువర్ణాని, పుష్ప్యతి," అని లోచనమునఁ జెప్పఁబడినది - విగ్రహవాక్యముకాక, అర్థప్రదర్శకముమాత్రమే అగును. కనుక, నిచట-[సువర్ణమేవపుష్పమ్, యస్యాస్సా] "సువర్ణమే, పుష్పముగాఁగలది" - "సువర్ణపుష్ప" అను బహువ్రీహి-యుక్తము. కాఁగా; "భూమి - బంగారుపూవులను పూచునది," అనునర్థముగాని, "భూమి-బంగారుపూవులుగలది" అనునర్థము, గాని, ఏదియును సంభవించునదియగు నర్థముగలదికాదు. కనుక, లక్షణచేత, "సేవానిపుణుఁడును, విద్వాంసుఁడును, శూరుఁడును, అని తెలుపఁబడిన ప్రత్యేకములగు సముచ్చయములచేత, వీరిలోనెవఁడయిననుగూడ, అనాయాసముగనే విపులమగు ధనమునుపార్జించును." అను లక్ష్యార్థము - లక్షితమగును. తదుపరి, ఈలోకమునందు-ఈముగ్గురే - అధికోత్కర్షముగలవారు" అనునర్థము - వ్యంగ్యమగును, ఈవ్యంగ్యము - మిక్కిలినిగూఢముగాక, యించుకగూఢమై యుండుటవలన, "ఘనతరఘూర్జరీ కుచయుగ క్రియ గూఢముగాక, ద్రావిడీస్తనగతిఁ దేటగాక, యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం జనుఁగవఁబోలె నుండును............"అని, తెలియునది.

ఇట్లు - "సువర్ణపుష్ప" అనుదాని వాచ్యము - [అత్యంతతిరస్కృతరూపమగు ప్రభేదముచేత] అవివక్షితమగుచున్నది. కనుక, "ఇది - మొదటిదగు, అవివక్షిత వాచ్యధ్వని ప్రభేదమున కుదాహరణమగుచున్నది." అని తెలియునది.

అవ :— వివక్షితాన్యపరవాచ్యధ్వనినుదాహరించుచున్నాఁడు. "రసికుఁ

డగు నొకతరుణుఁడు - తనకుఁ బ్రణయినియగు, నొకతరుణికి, దొండపండునాస్వా దించుచున్న, యొక, శుకతరుణుని జూపుచు, ననుచున్నాఁడు'' అనునది - ఇచటి సందర్భము.

(76) మూలము :— ద్వితీయమునకు [వివక్షితాన్యపర వాచ్యమునకు] ఉదాహరణము : —

గీ॥ ఏశిఖరి, నెంతచిరము, తానేసమాఖ్యఁ
గలతపమొనర్చె శుకశాబకమిది, తరుణి !
అట్లుగా, నెట్లు, నీదియౌనధరమట్లు,
పాటలప్రభనూను, బింబఫలమాను ?. (౧౨)

ప్రభా :— ''ఏపర్వతమునందు, ఎంతకాలము, ఏనామముగల, తపము నీశుకతరుణుఁడొనర్చెనో'' అనుదీనియర్థమును - వ్యంగ్యవిశేషనిరూపణపురస్సర ముగా విశదీకరించుచున్నాఁడు.

లోచ :— ''నిర్విఘ్నములగు, మహోత్తమసిద్ధులను సంఘటించునవి యగు శ్రీశైలాదులుగూడ - ఇట్టిసిద్ధిని [తరుణీమణివగు నీకుసంబంధించిన కెమ్మోవిని బోలుటచేత నొదవిన సౌభాగ్యముగల యీదొండపండు నాస్వాదించుటయను, మహాలాభమును] కలిగించునవికానేకావు. సహస్రదివ్యకల్పములు - మున్నగు నదియగు కాలముకూడ - ఇట్టి సిద్ధినిగూర్చుటయందు - పరిమితమేయగును. 'పంచాగ్ని' [పంచాగ్నులనడుమనుదపించుట] మున్నగునామముగల తపము గూడ - ఏవంవిధఫలజనకమని [అమూల్యమగు బింబఫలాస్వాదలాభమును గలిగించునని] వినియుండలేదు.''

'నీది' అనుపదము - వేరుగాఁజేయఁబడి [ప్రయోగింపఁబడి]నది. 'అట్లుగా కున్ననెట్లు నీయధరమట్లు?' అని, సమాసముచేయఁబడినయెడల; 'నీ'యనుయుష్మ దర్థము - [అప్రధానముగాఁజేయఁబడుటచేత] వేరుగా, ప్రతీతముకాకుండవలసి వచ్చును. కనుక; [''తవ''అనుపదము] ''నీది'' అనుపదము - వేరుగాఁజేయఁ బడినది. దీనిచేత ''నీదియగుదాని[అధరతుల్యబింబఫలము]నాస్వాదించుచున్నది'' అను నభిప్రాయము సిద్ధింపఁజేయఁబడినది. కనుక; ''వృత్తానురోధమువలన [పద్యమునందు గణభంగమేర్పడునను హేతువుచేత ''త్వదధరపాటలమ్'' అని]

"నీయధరమట్లు" అని, సమాసముచేయఁబడవలసియున్నను, సమాసముచేయఁబడుటలేదు.'అని, యొకానొకఁడు-వ్యాఖ్యానించినది -యుక్తముకాదు.

"ఆనును" అనఁగా; 'ఆస్వాదించుచున్నది.' అనియర్థము. "కుక్షింభరుని వలె బింబఫలమునకు బంధవిచ్ఛేదము కలుగునట్లు కడుపునిండభుజింపక, [ఈశుకశాబకమీదొండపండునకు] ప్రబంధవిచ్ఛేదముకలుగకుండునట్లు [మెల్లగా] సమాస్వాదించుచున్నది." అనిదీనిభావము. [రసాస్వాదమాధుర్యము నెఱుఁగనికుక్షింభరుఁడు - భోజ్యద్రవ్యములను మిగులనీయఁడుగదా!]

మఱియు, "ఈశుకశాబకము- ఈయంశమున [రసాస్వాదనక్రియయందు] రసజ్ఞముగానున్నది. కనుక, దీనికి తానొనర్చినతపఃప్రభావముచేతనే, నీకెమ్మోవి వంటి దొండపండులభించినట్లే, రసజ్ఞతకూడ - లభించియుండవచ్చును." అనియర్థము, "శుకశాబకము" అనుదానిచేత - చెప్పఁబడిన, తారుణ్యముచేత - [ఆశుకము - తరుణవయస్సుగల శాబకముగాఁజెప్పఁబడుటచేత] - 'ఉచితమగు [తారుణ్యముగల] కాలమునందే - దానికిఁగలిగిన, యిట్టి, బింబఫలాస్వాదనలాభముకూడ - తపఃప్రభావముచేతనయినదియే'అనిభావము.

ప్రభా :— "శుకశాబకము - తపించిన, పర్వతమే - వేరుగనుండవలయును. అతపఃకాలమును, దానినామమునుగూడ - ఊహింపరానివిగా నుండవలయును, అట్టితపమొనర్చినను, నీయధరమువంటి దొండపంటే, దానికిలభించినది. కాని, అనిర్వచనీయ సౌభాగ్యప్రపూర్ణమగు నీయధరముంలభించినదికాదు." అని భావము.

అవ :— ఇందలి ప్రధానవ్యంగ్యమును జెప్పుచున్నాఁడు.

లోచ :— "అనురాగియగు నొకనిచేత, ప్రచ్ఛన్నమగు స్వాభిప్రాయమును వెల్లార్చునట్టిదైన, వైదగ్ధ్యముచేత, నొనర్పఁబడిన [పూర్వోక్త] చాటువిరచనము ద్వారముగాఁగల, విభావోన్మీలనము" ఇచట- [ప్రధాన] వ్యంగ్యము.

ప్రభా : "అనురాగియగు నొకయువకుఁడు - ఆలంబన విభావమగు తనప్రియురాలిని గూర్చి, ఔచిత్యమునకు భంగముకలుగనీకేరున, మిక్కిలి నిపుణతతోఁగూర్చిన, యీచాటుకవితావిరచనము - ప్రణయినియగు నాతరుణికిఁగూడ-ఇట్టియభిలాషము నుదయింపఁజేయుట కుద్దీపకమగును." అని సహృదయులు గ్రహింతురుగదా!. "కామినామధరాస్వాదః, సురతాదతిరిచ్యతే" అనునభియుక్తో

క్తిననుసరించి, "రసజ్ఞులగు కాముకులకు-సురతముకంటె,అధరాస్వాదమే-ఎక్కు వయినది" కనుక, అదియే-లిప్సావిషయమగుట - సముచితముగదా !. "ఇచట, వాచ్యము - వివక్షితమైనను, వ్యంగ్యపరమగుచున్నది. ఇట్లు, వివక్షితమును, వ్యంగ్యపరమును, నగు వాచ్యముగల, వస్తురూపమగు [అభిప్రాయరూప మగు] ఈధ్వని - వివక్షితాన్యపరవాచ్యధ్వనియగును." అని తెలియునది. ఈ చాటు కవితారచనము :—

"ఓ ప్రణయినివగు తరుణీ ! అపూర్వమును, అమూల్యమును, అగు నీయ ధరసుధారసాస్వాదమున, నాకుగాఢమును, గూఢమును, నగు నభిలాషమున్నది సుమా!" అని గూఢమగు, తనయభిప్రాయమును - వెలార్చునదియగుచున్నది. ఇట్లే - దీనిచేత-తనకాలంబలాభావమగు నాతరుణినాతరుణుడుద్దీపింపజేయుట- ఇందు ప్రధానమగు, వ్యంగ్యము.

లోచనము :— ఇచట, ముఖ్యార్థమునకు బాధకలుగుట, మున్నగునవి లేవు. కనుక. మధ్యమకక్ష్యయందు [ప్రసరింపవలసిన] తృతీయవ్యాపారమగు లక్షణలేకుండుటవలన, ["ఏశిఖరి"అను] ఇచ్చట, వ్యాపారములు - అభిధా- తాత్పర్యము, ధ్వననము, అనునవి మూడేయగును, అట్లుగాక, [ఇచట, ఏశిఖ రిని, ఎంతచిరము, అనురూపముచేత] విశిష్టమగు ప్రశ్నరూపమగు నర్థము - ఆక స్మికము, [అసంభావితము] కనుక; ఆప్రశ్నార్థమున కన్వయముకుదురకుండుట వలన, ముఖ్యార్థమునకు బాధయుండునెడల; అప్పుడు, మీదివ్యాపారములనడు మను, సాదృశ్య [నిమిత్త]ముచేతనగు, లక్షణకూడ, నుండుగాక ; ఆలక్షణకు ప్రయోజనముమాత్రము - ధ్వన్యమానమే (ధ్వనింపజేయబడునదియే)యగును. అది-[వ్యంగ్యరూపమగు ప్రయోజనము] నాలుగవ కక్ష్యయందుండునది. [కదా!] పూర్వోదాహరణమున ["సువర్ణపుష్పాం పృథివీమ్" అనుచోట,] కేవలమును లక్షణయే , ధ్వననవ్యాపారమునందుప్రధానమగు, సహకారి. ఇచ్చటనో, [ధ్వన నమునకు సహకరించుటయందు అభిధా తాత్పర్యశక్తులే ప్రధానములు.- ఏల యనిన కేవలమును [అభిధాతాత్పర్యశక్తికృతమగు] వాక్యార్థ సౌందర్యము వలననే, ["ఏశిఖరిన్"అనుచోట] వ్యంగ్యార్థప్రతిపత్తి - కలుగుచున్నది. లేశమాత్రముగా, నిచట లక్షణావ్యాపారోపయోగముకూడ నుండవచ్చునని, యది యుజెప్పబడినది. [కాని, దానివలన వ్యంగ్యము - స్ఫురింపజేయబడునదికాదు.] అసంలక్ష్యక్రమవ్యంగ్యమునందన్ననో; అచట,లక్షణకు,సమున్మేషమేమాత్రమును గూడనుండునదికాదు. ఏలయనిన :—

"అసంలక్ష్యక్రమ [వ్యంగ్య]మునందు, [వాచ్య - వ్యంగ్యములకుగల]

క్రిమమే - సంలక్ష్యముకాకుండుటవలన, [క్రిమమునకు సంబంధించిన జ్ఞానము లేనిచోట, ముఖ్యార్థబాధాదులు - లేకుండుటవలన, లక్షణాప్రసారముండదు. కనుక] లక్షణకు సమున్మేషమేమాత్రమునుగూడ నుండునదికాదు'' అనునంశ మును ముందుచెప్పుదుము. కనుక, ద్వితీయభేదమునందుఁగూడ - ''ఏశిఖరి'' అనుచోటమాత్రము వ్యాపారములు - నాలుగేయగుచున్నవి. [ఇట్లు - వివక్షితా న్యపరవాచ్యమునందుఁగూడ - ఒక్కొక్కచోట - నాలుగువ్యాపారములున్నవి.] కనుకనే; ఈయుభయోదాహరణములవెంటనే, ''అది-భాక్తంబండ్రువేరొక్కరు'' అనుమతము ననుభాషించి, [కారికాకర్త] దూషించుచున్నాఁడు.

ప్రభా :— ''ధ్వనికి స్ఫుటమగు రూపభేదమ్మువలన'' ఇత్యాది కారికల భావమును ప్రదర్శించుచు, ఆకారికలనవతరింపఁజేయుచున్నాఁడు.

లోచ :— [దూషించుటయందలి] భావమిది :- ''ఇందుృడు,శక్రుఁడు, మున్నగు పర్యాయపదవాచ్యములకువలె, భక్తి, ధ్వనులకుతాదాత్మ్యమా ? [ఏకత్వమా ?] పృథివీత్వము- జలాదివ్యావర్తక ధర్మరూపతచేత, పృథివికి లక్షణ మగునట్లు, భక్తి - ధ్వనికి లక్షణమా ? లేక, దేవదత్తగృహము- కాకవంతము [కాకి యున్నది - దేవదత్తునియిల్లు] అనుచోట, ఒకానొకప్పుడు, సంభవమాత్రముచేత- కాకము, దేవదత్తగృహమున కుపలక్షణమగునట్లు, భక్తి-ధ్వనికుపలక్షణమా ? అనునది. అందు- ప్రథమపక్షమును నిరాకరించుచున్నాఁడు.

ప్రభా :— ''(1) ధ్వనియు, భక్తియు,ఒకటియా ? లేక, (2) భక్తి - ధ్వనికి లక్షణమా ? లేక. (3) భక్తి - ధ్వనికుపలక్షణమా ?'' అనియాశంకించి, వీనియందు ప్రథమపక్షమును [తాద్రూప్యమును'' అనఁగా; ఏకత్వమును] నిరా కరించుచున్నాఁడు.

(77) మూలము :— [''భాక్తంబండ్రు వేరొక్కరు'' అని కారికయందు జెప్పఁబడినమతమునసుసరించి] ''భక్తియే - ధ్వని'' అనుమతమేది-వెనుకఁదెలుపఁబడినదో, దానికిఁ బ్రత్యుత్తరమీయఁ బడుచున్నది.

[కా] ''భక్త్యాబిభర్తి, నైకత్వం రూపభేదాదయం ధ్వనిః''
గీ॥ ధ్వనికి స్ఫుటమగు రూపభేదమ్మువలన
భక్తితోనిది - యైక్యమ్ముఁ బడయదెపుడు.

మీఁదదెలుపఁబడిన ప్రకారములుగలదియగు నీధ్వని - భిన్న రూపముగలది. కనుక, భక్తితోడియేకత్వము నొందునదికాదు.

వాచ్య వ్యతిరిక్తమగు నర్థము - వాచ్యవాచకములవలన - తాత్పర్యముచేతఁ బ్రకాశింపఁజేయఁబడు స్థలమున, [ప్రకాశింపఁ జేయఁబడిన] వ్యంగ్యము - ప్రధానమగునపుడది - ధ్వనియగును. భక్తియో, ఉపచారమాత్రము.

లోచనము :— "తెలుపఁబడిన ప్రకారములుగలది." అనగా; "శబ్దము, అర్థము. వ్యాపారము, వ్యంగ్యము, సముదాయము, అనునైదువిధములునుగలది యగు, ధ్వని" అనియర్థము. "తాత్పర్యముచేత" అనఁగా; "విశ్రాంతిస్థానమగు టచేతనగు ప్రయోజనముగా" అనియర్థము. "ప్రకాశింపఁజేయఁబడుస్థలమున" అనఁగా; "ద్యోతింపఁజేయఁబడుచోటను" అనియర్థము.

ప్రభా : అవ :— "గుణవృత్తిరూపమును, లక్షణారూపమును, నగు భక్తియందు - 'ఉపచారమాత్రము' అని, ఉపచారశబ్దమునకు ప్రవృత్తియెట్లుసంగ తమగును ?" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచ :— ఉపచారమనఁగా; గుణవృత్తియు. లక్షణయుఁగూడ, నగును. ఉపచరణమనఁగా; "అతిశయితమగు వ్యవహారము." అనియర్థము.

ప్రభా :— ఏశబ్దమునకేయర్థమునందు - వ్యవహారము - ప్రసిద్ధమై యుండునో, దానినతిక్రమించి, దానికిసంబంధించిన, వేరొకయర్థమున, నాశబ్దము నకగువ్యవహారము - అతిశయితమగు వ్యవహారము. అదియే - ఉపచారమని చెప్పఁబడును.

లోచ :— "ఉపచారమాత్రము" అనుచోనున్న మాత్రశబ్దముచేత,నిది- చెప్పఁబడుచున్నది.

ప్రభా :— "ఇరుదెసలన్.... వచించుకృశాంగితాపమున్" ఇత్యాదివక్ష్య మాణోదాహరణస్థలములయందు - 'వచించున్' అనుపదము - తృతీయమగు లక్షణావ్యాపారమువలన, 'తోపింపఁజేయుచున్నది' అనులక్ష్యార్థమును దెలిపిన పిమ్మట, (ఆమెసంతాపమును) "మిగుల స్ఫుటీకరించుచున్నది." అనువ్యంగ్యా

ర్థమును స్ఫురింపఁజేయును.

లోచనము :— ఇట్టి స్థలములందు - తృతీయమగు లక్షణావ్యాపారము కంటె వేరగు ప్రయోజనద్యోతనాత్మకమగు చతుర్థవ్యాపారము-[వ్యంజన] వస్తుస్థితిచేత సంభవమైయున్నను, [ఆవ్యాపారముచేత స్ఫురింపఁజేయఁబడిన, ప్రయోజనరూపమగు నర్థము - సౌందర్యవిశేషమును సంఘటించునది కాకుండుటవలన] ఉపయోగింపఁబడకుండుటచేత - ఆదరింపఁబడకుండుటవలన, అసత్కల్పమే - (లేనట్లే) అగుచుండును. "యమర్థమధికృత్యప్రవర్తతే, తత్-ప్రయోజనమ్" "దేనినుద్దేశించి, లోకము ప్రవర్తించునో, అది-ప్రయోజనము" అనునదిగదా ! న్యాయసూత్రకారునిచేతఁ దెలుపఁబడినముఖ్యప్రయోజన లక్షణము !. అట్టిముఖ్య ప్రయోజన మిచట కానిపింపదు. ఇట్లు, ఎచ్చట ముఖ్య ప్రయోజనముండదో అచ్చటఁగూడ - [ముఖ్యప్రయోజనరహితములగు నిట్టియుదాహరణ స్థలములయందుఁగూడ] లక్షణయున్నది. కనుక, ధ్వననమును, లక్షణయు, ఏకతత్త్వమెట్లగును ?

ప్రభా :— ముఖ్యప్రయోజన రహితమగునది - లక్షణ. ముఖ్యప్రయోజన సహితము - ధ్వననము. కనుక, భక్తికిని, ధ్వనికిని, తాదాత్మ్యము, అనఁగా ఏకత్వము, లేదు, భక్తియు, ధ్వనియు, నొక్కటియేయగునెడల; ముందు ప్రదర్శింపఁబడు "ఇరుదెసలన్ మున్నగు నుదాహరణములయందు ధ్వనియుండుట; యు, లక్షణలేకుండుటయు సంభవింపవలయును, కాని, రెండునుగూడనుండుట సంభవింపదుగదా ! కావున లక్షణారూపమగు భక్తికంటె, ధ్వనిస్వరూపము-వేరని తెలియవలయును.

లోచనము : అప :— "ఈభక్తి - ధ్వనికి లక్షణము" అను ద్వితీయపక్షమునుగూడ - నిరాకరించుచున్నాఁడు.

(78) మూలము : — "భక్తియు, ధ్వనియు, ఏకతత్త్వము కాకపోనిమ్ము. భక్తి - ధ్వనికి లక్షణముగుఁగాక" అనియాశంకించి చెప్పుచున్నాఁడు.

"అతివ్యాప్తే రథావ్యాప్తేర్నచాఽసౌలక్ష్యతే ధ్వనిః." (14)
అటనతి వ్యాప్తివలన, నవ్యాప్తివలన,
దానిచేత - నీధ్వని - లక్షితమునుగాదు. (14)

అతివ్యాప్తివలనను, అవ్యాప్తివలనను, గూడ - (లక్షణారూప మగు) భక్తిచేత, ధ్వనిలక్షింపఁజేయఁబడునదికూడ - కాదు. (లక్ష్య మగు) ధ్వనికి వ్యతిరిక్తమగు, విషయమునందుఁగూడ [ధ్వనికిలక్ష్య ముకాని పదార్థమునందుగూడ] భక్తి-సంభవించుటవలన, భక్తికచట- అతివ్యాప్తి - కలుగును.

లోచనము :— "దానిచేత" అనఁగా; భక్తిచేతనని యర్థము. అయ్యా ! [లక్షణయందు] ధ్వననవ్యాపారముండి తీరవలయును. కనుక; అది ధ్వని వ్యతి రిక్తమగు విషయమెట్లగును ? అనియాశంకించి-చెప్పుచున్నాఁడు.

(79) మూలము :— వ్యంజకత్వముచేత [వ్యంగ్యముచేత] కావింపఁబడిన మహాసౌష్ఠవము లేనిచోటఁగూడ - ఉపచరితమగు శబ్దవృత్తి [ఆరోపితమగు శబ్దవ్యాపారము] చేత-[పారంపర్యమగు] ప్రసిద్ధిననుసరించి, వ్యవహరించినకవులు - కానుపించుచున్నారు గదా !

లోచనము :— కనుకనే; [మహాసౌష్ఠవము లేకుండుటవలననే] [అచటి] ప్రయోజనమునాదరణీయమగుచున్నది. కనుక, [అచట] వ్యంజనావ్యాపారము చేతనగు కృత్యముకొంచెమైనను లేదు. అనిభావము.

ప్రభా :— "వ్యంజన యుండినంతమాత్రమున, నది ధ్వనివ్యవహార ప్రయోజకముకాదు. 'సౌందర్యాతిశయశాలిగానున్న, వ్యంగ్యమే - ధ్వని' యని చెప్పఁబడుటకుఁ దగినదగును. క్రింది యుదాహరణములయందాసౌందర్యాతి శయముకాన్పింపదు. కనుక, నవి - ధ్వనివ్యవహారవిషయములు కానేరవు" అనిభావము.

లోచనము :— సౌష్ఠవమునకుముందు మహచ్ఛబ్దమును గ్రహించుటచేత [మహాసౌష్ఠవము లేకున్నను, కొంచెపుసౌష్ఠవమైన నచటనుండుటవలన] అది - [వ్యంజకత్వము] గుణముమాత్రమగును. "అన్యధర్మమును ప్రస్తుతమగు వేరొక వస్తువునందారోపించుట - సమాధి" అనులక్షణము పెద్దలచేత చెప్పఁబడినది. దీనిచేత - ఉపచారము - అనఁగా; క్రిందఁబ్రదర్శింపఁబడిన యుదాహరణముల యందుఁగలది - "సమాధి అనుగుణము మాత్రమే" అని ప్రదర్శింపఁబడినది.

అవ :— 'అయ్యా ! ప్రయోజనములేనియెడల నట్లేలవ్యవహరించెదరు ?' అని యాశంకించి - [అవిచ్ఛిన్నమగు] 'పరంపరచేతనట్లే ప్రయోగించుటవలన, ప్రసిద్ధిననుసరించి, కవులట్లు వ్యవహరించెద'రని చెప్పఁబడినది. కానమేమిట్లు చెప్పుదుము. ప్రసిద్ధియనగా; ప్రయోజనము - నిగూఢముగా నుండకుండుట. [ప్రకటముగానుండుట.]

ప్రభా :— ప్రయోజనమునకు సంబంధించిన ప్రకర్షముచేత [ప్రకటత చేత] నగుసిద్ధి అనఁగా; ప్రతీతి - 'ప్రసిద్ధి' అనిచెప్పఁబడును.

అవ :— "అయ్యా ! ధ్వనించినచోటఁగూడ - ప్రయోజనము స్ఫుట ముగా నవభాసించును. కనుక, నిగూఢముగాలేకుండుట - [ఉభయత్ర] సమా నమేగదా !" అని యాశంకించి, విశేషమున్నదనుచున్నాఁడు.

లోచనము :— [ధ్వనించినచోట] ఆప్రయోజనము- ఉత్తానమగు[స్ఫుట ముగా నవభాసించునదియగు] రూపముతోఁ బ్రకాశించుచున్నను, నిగూఢతను [గోప్యమానతను] నిధానమువలె నపేక్షించుచుండును. "వచించుఁ గృశాంగితాప మున్" అనునుపచారమునందు - "స్ఫుటీకరించుట" అనునదిగదా ! ప్రయోజ నము. [ఈప్రయోజనము-నిగూఢముకాదు.] గూఢముకాని యీప్రయోజనము - స్వశబ్దముచేత - [తోపింపఁజేయును- అని] చెప్పఁబడి, సౌందర్యముకానిదగునా? (వచించున్ అని,) గూఢముగాఁజెప్పఁబడి, అధిక సౌందర్యవంతమగునా ? ఈ యాశయముచేతనే-ఏది - ఉక్త్యంతరమున వచింపఁబడనో" అనిచెప్పనున్నాఁడు.

ప్రభా :— "ఆప్రయోజనమును గూఢముగాఁజెప్పినంత మాత్రమున నది - ధ్వనికాదు. అసలుప్రయోజన రూపమగు నభిప్రాయమే - స్వశబ్దవాచ్యావ స్థయందుద్భిన్నముగాని సౌందర్యమును స్ఫురింపఁజేయుచు, గూఢముగా నుండ వలయును. అప్పుడేయది - ధ్వనియగును. అసుందరమగు, ప్రయోజనరూపార్థ మును గూఢముగాఁజెప్పినను, ప్రకటముగాఁ జెప్పినను, గూడ-విశేషములేదు." "ఈయాశయమును, కారికాకర్త - "ఏది" అను శ్లోకముచేత ముందుచెప్పును" అనిభావము.

అవ : — ప్రసిద్ధిననుసరించిన కవివ్యవహృతుల నుదాహరించుచున్నాఁడు. హర్షమహారాజకృతమగు 'రత్నావళి'యందు, నాయకుఁడు విరహిణియగు ప్రియు రాలి, శయనస్థలమునుజూచి, యామె విరహతాపమునూహించుచున్నాఁడు,

**(80)** మూలము :—

ఇరుదెసలన్ వలత్కుచసమృద్ధలసజ్జఘన ప్రసంగ సం
భరమునవాడి, సూక్ష్మమగు మధ్యముతాకమినంతరమ్మునన్
హరితతఁగల్గి, ప్రశ్లథభుజాచ్యుతి, సుస్థితిఁబాసి, యీయసుం
దరబిసినీపలాశశయనమ్ము - వచించుఁగృశాంగితాపమున్.(౧౩)

పరిభా :— ''హరితతఁగల్గి'' అనఁగా; 'నడుమునన్నదిది గనుక, నది - పద్మదళముల నంటకుండుటవలన, మధ్యభాగమునందున్న పద్మదళములాకు పచ్చరంగుఁగలిగియే యున్న'వనిభావము. ఇచట - తామరాకులపాన్పు - అచేతనము కనుక, నది - కృశాంగికిఁ గలిగిన విరహసంతాపమును వచించుట - సంభవించునదికాదు, ''వచించున్'' అనుదానిముఖ్యార్థమునకిచట, బాధయుండుటవలన, సాదృశ్యమువలన, 'తోపింపఁజేయుచున్నది' అనునర్థము - లక్ష్యమగుచున్నది. తదుపరి, ''స్ఫుటీకరించుచున్నది'' అనుజ్ఞానము - దీనికిఁబ్రయోజనమగుచున్నది. కాని, ప్రయోజనరూపమగు నీయర్థము సౌందర్యప్రతీతిగలదికాదు. కనుక నాదరాస్పదముకాదు. కావున, నిచట లక్షణయేకాని, ధ్వనిలేదు. భక్తియే- ధ్వనికి లక్షణమయినయెడల, నిచటభక్తియున్నది. కనుక, ధ్వనియున్నదని చెప్పవలసివచ్చును. కాని, ఇచట, ధ్వనిలేదు, ధ్వనికి లక్ష్యముకానియిచటఁగూడ - లక్షణసమన్వయము కలుగుచుండుటవలన, ''భక్తియే - ధ్వనికిలక్షణము'' అనులక్షణమునకిచట నతివ్యాప్తి - కలుగుచున్నది. కాఁగా; ''వచించున్'' అనునది- ప్రసిద్ధిమాత్రకృతమగు వ్యవహారమే, అనఁగా; 'రూఢిమూలకమే'' అని తెలియునది.

**(81A)** మూలము :— ఇంకొక యుదాహరణము :—

నూర్లకొలఁదియు, ముద్దులన్గురియుచున్న,
వేలకొలఁదియు, పరిరంభవిధులొనర్చు
చున్న, విరమించియు, రమించుచుండ్రు తిరుగఁ,
బ్రియజనమునందు, పునరుక్తిలేదుగాదె ? (౧౪)

లోచనము :— 'పునరుక్తి' అనుచోట, 'తిరుగఁజెప్పుట'- సంభవింపదు. కనుక చుంబనాదులకగు అనుపాదేయత - లక్షితమగుచున్నది.

ప్రభా : ఇచట, ''పునరుక్తి'' అనుపదమునకు 'తిరుగఁజెప్పుట అని యర్థము. ''తిరుగఁజెప్పుట'' అనునర్థముగల పునరుక్తి - శబ్దమునకెగాని, ముద్దులు, - కౌగిలింతలు, మున్నగుక్రియలకు సంభవించునదికాదు. కావున, పునరుక్తిపదమునకు, పునఃకృతమునందు, అనఁగా: తిరుగనొనర్పుటయందు లక్షణ సంభవించును. 'అధికమగు ఫలమునొందుట' అనునది - ఫలము. అది - యిచట నాదరాస్పదముకాదు.

(81B.) మూలము :—

కం॥ అలిగినవారుగ, నగవులు
గలవారుగ, నేడ్చువారుగఁ, బ్రసన్నలుగా,
లలనలు స్వైరిణులు, గృహీ
తలగుదు, రెట్లటుహరించెదరు హృదయమ్మున్.(౧౫)

లోచనము :— ఇచట, గ్రహణముచేత- ఉపాదేయతయు, హరణముచేత- తత్పరతంత్రత నొందుటయు, లక్షింపఁజేయఁబడినది. ఇచట, ''స్వైరిణులగులలనలు - ఎట్లు గృహీతలో, అట్లుతత్ప్రియులను హరించెదరు.'' అనుచోనున్న ''గృహీతలు'' అనుపదమునకు ముఖ్యార్థమగు, ''పట్టుకొనఁబడుదురు'' అనునర్థమును, ''హరించెదరు'' అనుపదమునకు ముఖ్యార్థమగు, ''దొంగిలించెదరు'' అనునర్థమును, సంభవింపవు. కనుక, వీనికి, 'తెలిసికొనఁబడుదురు.' (చూడఁబడుదురు.) ''వశీకరించెదరు'' అనునవి - లక్ష్యములు. వీనిప్రయోజనములు :- ఎట్లు ప్రేమింతురో, అట్లు వివశులగుదురు.'' అను వ్యంగ్యములగు) నర్థములు. ఇవి- ఆదరాస్పదములుకావు.

(82) మూలము :— వేఱొక యుదాహరణము :—

ప్రియుఁడు - చిన్నపెండ్లముస్తన పృష్ఠమందు
నవలతాప్రహారమును దానమ్మొనర్చె,
అది - మృదులమయ్యు, దుస్సహమ్మయినరీతి
నయ్యె, తత్సపత్నుల హృదయమ్మునందు. (౧౬)

లోచనము :— కనిష్ఠభార్యయొక్క స్తనాగ్రమునందు, తమకాంతుఁడు

సముచిత క్రీడాపరిసంగమున-నవలతనుగొని, దానితోడి ప్రహారమును [దెబ్బను] దామెనరచ్చెను ఆప్రహారదానము - మిక్కిలి మృదువైనది. సౌభాగ్యసూచకమగు తత్క్రీడా సంవిభాగమును బొందని, యామె సవతుల హృదయమునకది - మృదువైనదగుటవలననే, దుస్సహమువలెనయ్యెను. ఒకరికియఁబడిన మృదువగు పరిహారమువలన, నింకొకరికి బాధకలుగుటయు. అదిమృదువైనదైనను, దుస్సహమగుటయు, అనునది - [విరోధము] చిత్రమైనది. ఇచట, దానముచేత- సఫలత - లక్ష్యమగుచున్నది.

పరిభా :— ఇచ్చట- నవలతాపరిహారమును [నవలతచేతనయిన, దెబ్బను] దానమ్మొనర్చుట - అసంభవత్ స్వార్థము. పరిహారమును దానమొనర్చెననఁగా; "పరిహారము నొనర్చెను." (దెబ్బకొట్టెను) అనిగదాయర్థము ; ఇచట, దానము చేత - దానసాధ్యమగు కనిష్ఠభార్యయొక్క చరితార్థత - లక్షితమగుచున్నది. పరిహారము - "సుఖముగా [ఉల్లాసముగా] అనుభవింపఁదగినది." అనునది - ఇచటి పరియోజనము, కానియిదియు, ఆదరాస్పదముకాదు.

(83) మూలము : మఱియు, నింకొకయుదాహరణము.

ఎయ్యది పీడనమ్మనుభవించు పరార్థము భంగమొందియున్,
దియ్యనిదై, యదీయవికృతిస్థితియున్, జనసమ్మతంబొ, తా
నయ్యది-దుష్ప్రదేశగతమై, యభివృద్ధి గడింపకున్నఁ, ద
ప్పయ్యగుణోషరావనిదెయౌ, నదియిక్షువుదోషమెట్లగున్? (౧౭)

అనునిచట, ఇక్షుపక్షమునందు - అనుభవించు ననుశబ్దము - లాక్షణికము. ఇటువంటిదెప్పుడునుగూడ - ధ్వనికి విషయముకాదు.

పరిభా :— అనుచితమగు స్థానమునందుండుటవలన, నభ్యుదయమునందని మహాపురుషునివర్ణనమిచట, ప్రస్తుతము. అది - వ్యంగ్యమైయున్నది. ఇక్షువు [చెఱకు] యొక్కవర్ణనము - అప్రస్తుతము. అది - వాచ్యమైయున్నది. ఇందువాచ్య - వ్యంగ్యములగు, అప్రస్తుత-ప్రస్తుతముల, యర్థమును, క్రమముగా నిల్లెఱుఁగునది.

ఏది = ఏయిక్షువు, ఏమహాపురుషుఁడు. పరార్థము = ఇతరులకొఱకు. పీడనమ్ము = పీడింపఁబడుటను, అనుభవించున్ = కలిగియుండునో, అనుభ

వించనో, భంగమొందియున్ = విరుపఁబడినను, పరాభవము నొందినను, తియ్య నగున్ = తీపిగలదియేయగునో, అనుకూలస్వభావుఁడేయగునో, యదియవికృతి స్థితియున్ = ఏచెఱకునకు సంబంధించిన బెల్లముము న్నగునదికూడ, ఏమహాపురు షుని కోపాదికముకూడ, జనసమ్మతమ్మై = ఎల్లరకును సభిమతముగనేయుం డునో, అయ్యది = ఆయిక్షువు, ఆమహాపురుషవ్యక్తి,దుష్ప్రదేశగతమై = ఊషర క్షేత్రమునొందినదై,అనుచితస్థానమునొందినదై,అభివృద్ధి, గడింపకున్నన్ = అధిక మగువృద్ధినొందనియెడల,తప్పు = దోషము. ఆ + అగుణ + ఊషర + అవనిదె + జౌన్ = నిస్సారమగు నూషరభూమియొక్క దోషమేయగును. గుణరహితమగు స్థానముయొక్క దోషమేయగును. అది - అభివృద్ధినొందకుండుట - ఇక్షువుదోష మెట్లగున్ = చెఱకుయొక్క దోషముకాదు. ఆమహాపురుషుని దోషముకాదు.

అవ :— ఇక్షుపక్షమునందు - "అనుభవించును" అనుదానియర్థము - సంభవింపకుండుటవలన నగు, లాక్షణికత్వము, నుపపాదించుచున్నాఁడు.

లోచనము :— ఇచట, ప్రస్తుతమగు మహాపురుషు నపేక్షించునపుడు, "అనుభవించును" అనుశబ్దము - ముఖ్యమేయగును. అయినను, నిచట, ప్రశం సింపఁబడుచున్న, యప్రస్తుతమగు నిక్షువునందు - అసంభవమగు పీడయొక్క అనుభవనముచేత [జ్ఞానరూపమగు ననుభవనముచేత] పీడనముగలదియగుట - లక్షితమగుచున్నది. ఆయర్థముగూడ - పీడింపఁబడుటయందు [మర్దింపఁబడుట యందు] పర్యవసించును. [ఇచటి, ప్రయోజనము-సహృదయులకాదరాస్పదము కాదు.]

అవ :— ఇచ్చట, ప్రయోజనముండవచ్చును. కనుక, నిది - యేలధ్వని' కాదు ? అనియాశంకించి, [వృత్తికారుఁడు] సమాధానము నిచ్చుచున్నాఁడు.

ప్రభా :— "ఇటువంటిప్రయోజనము - అనఁగా; సహృదయుల యాదర మునందఁజాలని, ప్రయోజనము -ధ్వనివ్యవహారమునకు పాత్రమగునదికాదు.' అనునది-సమాధానము. ఇచటి-ప్రయోజనము-"కష్టావస్థత్వము" అని బాలప్రియ యందుఁజెప్పఁబడినది. అదియు, నచేతనమునసంభవింపదు. కనుక;"స్వరూపభ్రం శమునొందుట" అనునది- యిచటి ప్రయోజనముగాఁ జెప్పఁబడుట - యుక్తమగు నని నాయభిప్రాయము-

(84) మూలము :—

ఉక్త్యన్తరేణాశక్యం యత్తచ్చారుత్వం ప్రకాశయన్।
శబ్దోవ్యఞ్జకతాం బిభ్రద్ధ్వన్యుక్తేర్విషయీభవేత్. (15)

ఏలయనిన :—

గీ॥ ఏది - ఉక్త్యంతరమున వచింపబడదొ,
ఆమనోజ్ఞత - భాసిల్లునట్లుగాఁగఁ
జేయుచును, వ్యంజకతభరించి, విలసిల్లు
నట్టిశబ్దము - 'ధ్వనిసమాఖ్యాతమగును.' (15)

ఇచట [వెనుక] ఉదాహరింపఁబడిన ["వచించున్"ఇత్యాది] విషయమునందు ఉక్త్యంతరముచేత [ధ్వనన వ్యాపారముకంటె వేరగు వ్యాపారముచేత] ఏసౌందర్యము ప్రకాశింపఁజేయఁబడుటకు శక్యముకానిదో, ఆసౌందర్యమును బ్రకాశింపఁజేయుటకు హేతువగు శబ్దములేదు.

లోచనము :— "ఉక్త్యంతరమునన్" అనఁగా; ధ్వనికంటె వేరయి, స్ఫుటమయిన, [వ్యవహారములయందుఁ బ్రసిద్ధమయిన] శబ్దార్థవ్యాపారవిశేషముచేత - [అనఁగా, 'అభిధా, తాత్పర్య, లక్షణలచేత'] అనియర్థము. వ్యంజకతతోఁ గూడినశబ్దము - "ధ్వని" అనుశబ్దముచేతఁజెప్పఁబడును. "అట్టిశబ్దము" అనుచో నున్న "శబ్దము" అనుపదమునందు - [ధ్వనిపదార్థములగు] అర్థముల నైదింటిని గూడ - యోజింపవలయును.

పరీక్షా :— "ఉక్త్యంతరమునన్" అనఁగా, "వేరొకవ్యాపారముచేత" అనియర్థము, అర్థములైదునుగూడ "శబ్దము" అనుదానిచేత నిట్లుచెప్పఁబడును. [శబ్ద్యతే = అభిధీయతే] "శబ్దింపఁజేయఁబడును." అనఁగా; అభిధచేతఁదెలియఁ జేయఁబడును. కనుక, 'శబ్దము' అనఁగా; వాచ్యమని యర్థమగును. [శబ్ద్యతే అనేన] దీనిచేత అర్థము శబ్దింపఁజేయఁబడును. చెప్పఁబడును. కనుక, "శబ్దము" అనఁగా; వాచకమని యర్థమగును. [శబ్ద్యతే = వ్యజ్యతే] శబ్దింపఁజేయఁబడును.

అనఁగా; వ్యంజింపఁజేయఁబడును. కనుక, "శబ్దము" అనఁగా; వ్యంగ్యమని యర్థమగును. [శబ్దనమ్] "శబ్దించుట" వ్యాపారము. కనుక, "శబ్దము" అనఁగా; అభిధయని యర్థమగును. మీఁదఁ జెప్పఁబడిన చతుష్టయ సముచ్చయముగలదగుట వలన, సముదాయరూపమగు కావ్యముకూడ - 'శబ్దము' అని చెప్పఁబడును. ఇట్లు వ్యంజకమగు నర్థమును, శబ్దమును, వ్యంగ్యమును, వ్యాపారమును, కావ్యమును, గూడ - శబ్దపదార్థములగును.

లోచనము : అవ :— "ప్రయోజనమున్నచోటఁగూడ - అదియాదరాస్పదము కానపుడచట, ధ్వననవ్యాపారముండదు." అనిచెప్పి, ఎచ్చట, మూలమగుప్రయోజనముకూడ-లేకుండునో, ఉపచారముమాత్రమే యుండునో, అచ్చట ధ్వననవ్యాపారమెట్లుండును ? అని చెప్పుచున్నాఁడు.

ప్రభా :— "రూఢిహేతుకమగు లక్షణాస్థలమునందుండునవియగు, నర్థములుకూడ - 'ధ్వని' అని వ్యవహరింపఁబడునవికావు." అని చెప్పుచున్నాఁడు.

(85) మూలము :—

రూఢాయే విషయేఽన్యత్ర శబ్దాః స్వవిషయాదపి।
లావణ్యాద్యాః ప్రయుక్తాస్తే, నభవన్తి పదం ధ్వనేః. (16)

గీ॥ స్వార్థమునకంటె నన్యమౌనర్థమందు
రూఢములును, లావణ్యాదిరూపములును,
నయినశబ్దముల్ - స్వార్థేతరార్థమునఁ బ్ర
యుక్తములెయయ్యు ధ్వనినామయుక్తిఁగనవు.

వానియందుఁగూడ [నిరూఢ లక్షణాస్థలములందుఁగూడ] - ఉపచరితమగు [ఆరోపితమగు]శబ్దవృత్తియున్నది. [కనుక, సామాన్యముగా నచటఁబ్రయోజనము లేకుండుటవలన, ధ్వనివ్యవహారముండదు.] అట్టిస్థలమునందుఁగూడ - ఎచ్చటనయినను, ధ్వనివ్యవహారము - సంభవించుచున్నను, అది - వేఱొకవిధమున [వ్యంజక

త్వముచేతనే] ప్రవర్తించునదియే యగుచుండును. కాని, అట్టి శబ్దముల ద్వారమునఁ బ్రవర్తించునదికాదు.

లోచనము :— లావణ్యశబ్దమునకు 'లవణరసయుక్తత' అనునది ముఖ్యమగునర్థము. "లావణ్యము" మున్నగుశబ్దములు - తమకు ముఖ్యముగా వివక్షితములగు "లవణరసయుక్తత" మున్నగుస్వార్థములకంటె. వేరయిన, "హృద్యత" మున్నగు నర్థములయందు రూఢములగుచున్నవి. ఈశబ్దములు - రూఢములగుట వలననే, ముఖ్యార్థబాధ, దానిసంబంధము. ప్రయోజనము అను, త్రితయసాన్నిధ్యమునపేక్షించుటవలననగు, వ్యవధానము - లేనివగుచున్నవి. [భట్టకుమారిలపాదులు] ఇట్లు చెప్పిరిగదా : "నిరూఢా లక్షణాః కాశ్చిత్సామర్థ్యాదభిధానవత్" "కొన్ని లక్షణలు - అభిధానమువలె, నియతమగు ప్రయోగసామర్థ్యమువలన నిరూఢములగుచుండును" అని. ఆశబ్దములు - తమకు విషయములగు ముఖ్యార్థములకంటె వేరయిన ['హృద్యత' మున్నగులక్ష్యమయిన] యర్థమునందు [రూఢములయి] ప్రయోగింపఁబడినవైననుగూడ- ధ్వనిపదము [చమత్కారాతిశయశాలి ప్రధానవ్యంగ్యస్థానములు]కావు. అచట[తన్మూలకమగు]ధ్వనివ్యవహారముండదు. ఉపచరితమగు శబ్దముయొక్క వృత్తియనఁగా; గౌణియు, లాక్షణికయుఁ, గూడ నగును. "లావణ్యాది" అనుచోట, "ఆది" అనుదానిని గ్రహించుటచేత, అనులోమము, ప్రతికూలము, సబ్రహ్మచారి, మున్నగు లాక్షణికశబ్దములను [లావణ్యమువంటివానిని] గ్రహింపవలయును. అనులోమశబ్దమునకు - [లోమ్నామనుగతమ్] కేశములననుసరించియుండుట [మర్దనము] అనునర్థమును, ప్రతికూలశబ్దమునకు - కూలమునకు- [తీరమునకు] ప్రతిపక్షముగానుండునదియగు ప్రవాహము' అనునర్థమును, 'సబ్రహ్మచారి శబ్దమునకు - తుల్యుఁడగు గురువుగల [ఏకగురువుగల] 'శిష్యుఁడు' అనునర్థమును. ముఖ్యములగు నర్థములు. ఈయర్థములకంటె వేరయిన యర్థములు మాత్రము - [అనుకూలశబ్దమున కనురోధి [అనుసరించువాఁడు] అనియు, ప్రతికూలశబ్దమునకు విరోధియనియు, సబ్రహ్మచారి శబ్దమునకు సదృశుఁడనియు, ]రూఢములగుచున్న లాక్షణికార్థములు] ఉపచరితములే [ఆరోపితములే] యగును. ఇచ్చటి, లక్షణ - ప్రయోజనమునుదేని నైన నుద్దేశించి - ప్రవర్తించునదికాదు. కనుక; ప్రయోజనము విషయముగాఁగలదియగు ధ్వనన వ్యవహారము [నిరూఢలక్షణాస్థలములయందు]లేదు.

ప్రభా :— "ధ్వనియగు నర్థము - ప్రయోజనరూపమును, చమత్కారాతిశయయుక్తమగుటచేతసహృదయాదరపాత్రమును గూడనయియుండవలయును.

"వచించున్" ఇత్యాది పూర్వోదాహృతులయందు - ప్రయోజనమున్నది. అయిన నది - సహృదయాదరపాత్రముకాదు. కనుక, 'అవి - ధ్వనివిషయములుకావు' అని నిరసింపఁబడినవి. నిరూఢలక్షణాస్థలములయందు- అసలాప్రయోజనముకూడ నుండదు. కొన్ని శబ్దములు - స్వార్థమునుడిగి, లక్షణాబీజములగు ముఖ్యార్థబాధా దుల నపేక్షించునదియగు వ్యవధానమునుగూడ సహింపక, వేరొకయర్థమును సమర్పించును. కనుకనే, [అన్యార్థమును బోధించుటయందు ప్రసిద్ధములగు] లావణ్యము, అనుకూలము, ప్రతికూలము, సబ్రహ్మచారి. సోదరము, మున్నగు నాపదములు- "రూఢములు" అనిచెప్పఁబడుచున్నవి. ఇవి-యిట్లు రూఢ్యర్థమును దెలుపుటయందు, ప్రయోజనమేదియులేకుండుటవలన, ఇచట - ధ్వని అను వ్యవ హారముకలుగదు" అని తాత్పర్యము.

లోచనము : ప్రశ్న :— అయ్యా! "లావణ్యప్రభ - దిఙ్ముఖంబులను బర్వంజేసి" ఇత్యాదులగు నుదాహృతులయందు లావణ్యాదిశబ్దసన్నిధానమునందు [రూపకాది] ప్రతీయమానము - స్ఫురింపఁజేయుఁబడుచుండుటలేదా ? ["రూఢి మూలకములగు లావణ్యాది శబ్దములున్నచోట ధ్వనియుండదు" అనిచెప్పుట - యెట్లు ?]

ఉత్తరము : లావణ్యశబ్దమువలన నచట ప్రతీయమానార్థమున, కభి వ్యక్తికలుగుటలేదు. ఇంకెట్లనిన; సమగ్రమగు వాక్యార్థప్రతీతి కలిగిన పిమ్మట ధ్వననవ్యాపారమువలననే [రూపక] ధ్వనిప్రతీతి కలుగుచుండును. ఈయంశమే [వృత్తికాదనిచేత] "వేరొక విధమున" అని చెప్పఁబడినది. "వేఱొకవిధమున" అనఁగా; "వ్యంజకత్వముచేతనే" అని యర్థము "వ్యంజకత్వముచేతనే [నిరూఢ లక్షణాస్థలమునందు ధ్వనివ్యవహారము సంభవించును.] కాని, ఉపచరిత శబ్దప్రయో గమువలన సంభవింపదు." అనియర్థము.

ప్రభా :— "దేవడితిలుణాహిపలు తంబిమ్మగమిజ్వాలపఙజ్వలంగుమరి పోల్లపరణ్య ?" అని, యిచట లోచనమునందున్న యుదాహృతి - లేఖకప్రమాద మున దోషయుక్తముగా నుండుటచేత - తత్సదృశమగు "లావణ్యప్రభ" అను నుదాహరణమును బ్రదర్శించి, "దేవడితి" అనుదానికిఁ్రిందనున్న, లోచనమునే, [సముచితమగుటవలన] దీనికి సమన్వయించితిని. "లావణ్యాది ప్రయోగముల యందు భక్తియున్నను ధ్వనిలేదు." అచట, ధ్వనియున్నను, అది - లావణ్యాది శబ్దద్వారమున నేర్పడినదికాదు." అనునది ఫలితార్థము.

లోచనము :— ఇట్లు "ఎచ్చటనెచ్చట, భక్తియుండునో, అచ్చటనచ్చట-

ధ్వనియుండుట'' లేదు. ఆకారణమున, 'భక్తి-ధ్వనికి లక్షణ'మనినయెడల, అప్పుడు-భక్తియుండిన స్థలములయందంతటనుగూడ-ధ్వనియుండునని చెప్పవలసివచ్చును. [భక్తియుండినచోటులందెల్ల ధ్వనిలేదు. కనుక, ''భక్తి- ధ్వనికిలక్షణము'' అను లక్షణమునకు] అతివ్యాప్తి చెప్పఁబడినది. పోనిండు. ''ఎచ్చటనెచ్చట- భక్తియుండునో, అచ్చటనచ్చట- ధ్వనియుండును'' అని. అభ్యుపగమించి [అంగీకరించి] కూడ-[సమాధానమును]చెప్పుదుము. ''భక్తియున్నచోటనెల్లను ధ్వనియుండును'' అని. యంగీకరించినను, లక్షణావ్యాపారమునకు విషయమగు నర్థము - ధ్వనన వ్యాపారమునకు విషయమగు నర్థముకానేరదు. [ఇట్లు] భిన్నవిషయములగువానికి ధర్మ్యధర్మిభావముకూడ నుండునదికాదు. [దేనియందేయసాధారణధర్మముండునో, ఆ]ధర్మమే - [దానికి] లక్షణమని చెప్పఁబడును. అచట, లక్షణ - అముఖ్యార్థవిషయమగు వ్యాపారము. [''గంగయందు గొల్లపల్లె'' అనుచోట లక్షణకు- 'తీరము' అను నముఖ్యార్థమే - విషయముగదా !] ధ్వననమో- ప్రయోజనవిషయము - [ఇచట, శైత్యపావనత్వాది ప్రయోజనము - ధ్వననవ్యాపారమునకు విషయముగదా !]

ఇట్లు - భక్తియు, ధ్వనియు, భిన్నవిషయములు. కనుక, వీనికి ధర్మ్యధర్మిభావములేదు. కావున, భక్తి - ధ్వనికి లక్షణముకాదు.

—• ధ్వని - లక్షణ లక్షణయుఁగాదు. •—

లోచనము : ప్రశ్న :— ప్రయోజన విషయమునందుఁగూడ [లక్షణ లక్షణయను నింకొక] ద్వితీయలక్షణావ్యాపారము - యుక్తము కాఁగూడదా ?

ఉ ;— అచట, [ముఖ్యార్థబాధాది] లక్షణాసామగ్రిలేదు. కనుక; ద్వితీయ లక్షణ - యుక్తముకాదు. ఈయభిప్రాయముచేతనే [కారికాకారుఁడు] చెప్పుచున్నాఁడు. [చూడుఁడు.]

(86) మూలము :—
ముఖ్యాంవృత్తిం పరిత్యజ్య, గుణవృత్త్యార్థ దర్శనమ్।
యదుద్దిశ్య ఫలంతత్ర, శబ్దోనైవ స్ఖలద్గతిః. (17)

గీ॥ ముఖ్యమగుచున్న వ్యాపారమును త్యజించి,
గౌణమగు వృత్తినర్థమ్ముఁగనుట - ఫలము

దేనికై యేర్పడెనో, దానిఁదెలుపునపుడు,
శబ్దగతికెట్లు స్ఖలనమ్ము సంభవించు ?.

లోచనము :— ''ముఖ్యమగుచున్న వ్యాపారమును అనఁగా; అభిధావ్యాపారమును ''త్యజించి'' అనఁగా; పరిసమాప్తి నొందించి, [అభిధాద్వారకమగు నర్థాంతరమును బోధించుటకు పరుగుపెట్టి,] గౌణమగు వృత్తిచేతననఁగా; లక్షణారూపమగు వ్యాపారముచేత - అర్థమ్ముఁగనుట = అముఖ్యమగు నర్థమునుగొనుట [లక్ష్యార్థమును బ్రకాశింపఁజేయుట] ఫలము దేనికైయేర్పడెనో = కర్మభూతమ్ముదునే ప్రయోజనము నుద్దేశించిచేయఁబడునో, ఆ ప్రయోజనమును దెలుపునపుడు అముఖ్యార్థవిషయ వ్యాపారముకంటె వేరగు ద్వితీయ వ్యాపారమంగీకరింపఁదగినది. [అనియర్థము.] ''ఈప్రయోజన విషయమునందుఁ బ్రవర్తించునదియగు వ్యాపారముకూడ- లక్షణయేకాఁగూడదా?'' అనియాశంకింపఁదగదు. ఈద్వితీయ వ్యాపారము - లక్షణకాదు. ఏలయనిన :— ఒకశబ్దమునకు సంబంధించిన 'గతి' అనఁగా; అవబోధనశక్తి - బాధకప్రమాణ వ్యాపారముచేత - విధురీక్రియమాణమగునపుడు, [నిరోధింపఁబడునపుడు] ఆశబ్దమునకు సంబంధించిన వ్యాపారము- లక్షణయగును. కాని, ప్రయోజనము నవగమింపఁజేయునపుడాశబ్దమునకు [గంగాదిశబ్దమునకు] బాధకయోగములేదు. ప్రయోజనము - బోధింపఁదగియుండునపుడుకూడ - ముఖ్యార్థబాధాదియోగముండునెడల, తిరుగనింకొక నిమిత్తమును, వేఱొక ప్రయోజనమును, వెదుకవలసివచ్చును. మరల, మరల, దానినిట్లువెదుకుచుండవలసియేయుండును. కనుక, నప్పుడనవస్థానదోషముసంభవించును. కనుక, [ప్రయోజనవిషయమున, ఱనకు ముఖ్యార్థబాధాదికములేదు. కనుక, శబ్దమచటస్ఖలద్గతిగలది. కాదు'' అనఁగా; కుంఠీక్రియమాణమగు బోధనసామర్థ్యముగలది కాదు. కనుక,] ప్రయోజనము-లక్షణలక్షణకు విషయమగునదికాదు.

(87) మూలము :— అచట, చారుత్వాతిశయ విశిష్ట వ్యంగ్యార్థ లక్షణమగు ప్రయోజనము - కర్తవ్యమైయుండునపుడు, [స్ఫురింపఁజేయఁదగియుండునపుడు] శబ్దము- అముఖ్యమగునెడల, [బాధితమగు నర్థముగలదియగునెడల] ఆశబ్దమును బ్రయోగించుట- దుష్టమేయగును. [వ్యంగ్యార్థము- వ్యంజనచేత స్ఫురింపఁజేయఁబడినపుడు, ముఖ్యార్థబాధాదులచేతనగు విఘ్నములేకుండఁగనే ప్రయోజనప్రతీతికలుగును. కనుక,] ప్రయోజనవిషయమున నిట్లు దోషము

కలుగునదికాదు. [కావున, లక్షణ - ధ్వనికి లక్షణము - కాదు.]

లోచనము :— కర్తవ్యమైయుండునపుడు - వ్యంజింపఁజేయఁదగియుండు నపుడు, అముఖ్యమగునెడల = బాధకమగు ప్రమాణము చేత బాధితమగునర్థము గలదియగునెడల, "ఆశబ్దమును బ్రియోగించుట దుష్టమేయగును." [అనుచోట, గ్రిందియర్థము నెఱుఁగునది.]

[శౌర్యాతిశయాది రూపమగు] ప్రియోజన జ్ఞానమును సుఖముగానుదయిం పఁజేయుటకు [సింహమున్నగు] ఆశబ్దము - [లక్షకశబ్దము] అముఖ్యమగు [వట్వాదిరూపమగు] అర్థమునందు ప్రయోగింపఁబడుచుండును గదా !

"వటుఁడు - సింహము" అను ప్రియోగముచేత [వటునివలె] శౌర్యాతిశ యముగూడ-ప్రికాశింపఁజేయఁదగియుండునపుడు, శబ్దము- స్ఖలద్గతిగలదియగుచు, ఆశౌర్యాతిశయాదిప్రతీతినిగూడ గలిగింపనియెడల, దానిని బ్రయోగించు టెందులకు?

ప్రిభా :— "దుష్టమేయగును" అనఁగా; "అప్రియోగము-వ్యాకర ణాది సంస్కారములేనిదియేయగును." అని భావింపఁదగదు. 'శౌర్యాతిశయాది రూపమగు నర్థమును దెలుపుటకై ప్రియోగింపఁబడిన, సింహాదిశబ్దము - శౌర్యాతి శయాదిరూపమగు తత్ప్రయోజన ప్రితీతిని జనింపజేయఁజాలకుండుటవలన, వ్యర్థమగుటయే - యిచట, దుష్టమగుట' అని తెలియునది.

లోచనము :— "[సింహాదిశబ్దముచట] ఉపచారముచేత [శౌర్యాతిశయాది ప్రితీతిని] కలిగించును." అనునెడల, నచటఁగూడ [అనఁగా; ఆశౌర్యాతిశయాది కము - లక్ష్యమగునపుడుగూడ] వేరొక ప్రియోజన మన్వేషింపఁదగియుండును. ఆప్రియోజనమునందుఁగూడ - తిరుగ నుపచారము నంగీకరింపవలసివచ్చును. కనుక, [ఇట్లు, దీనికి తెంపులేకుండుటవలన, మూలక్షయకారిణియగు] అనవస్థా దోషము కలుగును.

ప్రిభా :— కనుక, ప్రియోజనమును బోధించునపుడు, శబ్దము - స్ఖలద్గతి గలది - కాదు.

అవ :— "అయ్యా ! స్ఖలద్గతిగలదికాకున్నను శబ్దమున లక్షణయుండఁ గూడదా ?" అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

లోచనము :— ఇచట శబ్దగతికి స్ఖలనములేనియెడల, స్ఫురింపఁజేయఁదగిన ప్రయోజనవిషయమున లక్షణాసామగ్రిలేకుండుటవలన, లక్షణయను వ్యాపారముకలుగదు. [ఈప్రయోజనవిషయమున] వ్యాపారములేదనుటయుక్తము కాదుగదా! ప్రయోజన విషయమునందు శబ్దమునకు సంకేతములేదు. కనుక; ఇది-అభిధకాదు. కనుక, "అభిధా, లక్షణలకంటె వేరగువ్యాపారమేదియున్నదో, అధ్వననమే - యిచటవ్యాపారము" అని సిద్ధించుచున్నది. "ఇట్లు, దోషములు గునదికాదు." అనఁగా; ప్రయోజనరూపమగు వ్యంగ్యము - విఘ్నములేకుండనే ప్రతీతమగుచున్నది. కనుక, శబ్దమును వ్యంజకముగాఁ బ్రయోగించునపుడు - దోషమేదియులేదు." అనిభావము. కనుక, అభిధయే- [అభిధతోఁగూడినగంగాది పదమే] ముఖ్యార్థమునఁ బ్రవేశింపఁజనునదియగుచు, బాధకముచేతనిరోధింపబడినదియై, [ముఖ్యార్థమును బోధింపఁజాలకుండుటవలన] చరితార్థముగాక, ముఖ్యార్థమగు, ప్రవాహాదికముకంటె, అన్యమగు తీరాద్యర్థమునందు ప్రసరించును. కనుకనే; [గంగాది] శబ్దమునకీయర్థము [ప్రవాహాదికమువలె] ముఖ్యముగానిదని వ్యవహారమున్నది. [గంగాది] శబ్దమునకు, ముఖ్యార్థమునందెట్లు సంకేతగ్రహణమున్నదో, అముఖ్యార్థమునందుఁగూడ - అట్లే సంకేతగ్రహణమున్నది. కనుక లక్షణ - అభిధాపుచ్ఛభూతమే [అభిధకు తోకవంటిదే] యగును.

అవ :— "కావున" అని దీనినుపసంహరించుచున్నాఁడు.

(88) మూలము :— తస్మాత్.

[కారికా] వాచకత్వాశ్రయేణైవ గుణవృత్తిర్వ్యవస్థితా।
వ్యఞ్జకత్వైకమూలస్యధ్వనేః స్యాల్లక్షణంకథమ్. (18)

కావున,

గీ॥ వాచకత్వాశ్రయమెయైన వర్తనమున
స్థితము - గుణవృత్తిగా వ్యవస్థితముగాగ,
వ్యంజకత్వైకమూలమై వరలుచుండు
నట్టి ధ్వనికది - లక్షణమ్మెట్లులగును ?.

కనుక; ధ్వనివేఱు; గుణవృత్తియు, వేఱే.

(ఇంతవఱకు నతివ్యాప్తి నిరూపింపఁబడినది.)

లోచనము :— "కావునన్" అనఁగా: ఏ హేతువువలన, లక్షణ- అభిధా పుచ్ఛభూతమో, ఆ హేతువువలన, నది - వాచకత్వమును, అనఁగా, అభిధావ్యాపారము నాశ్రయించి, దానినిబాధించి, లేచుటవలనను, అభిధాపుచ్ఛభూతమగుట వలనను, 'గుణవృత్తి' అనగా; 'గౌణలాక్షణిక ప్రకారము.' అగుచున్నది. "ఆగుణవృత్తి" అనఁగా; "గౌణియగులక్షణ- భిన్నవిషయము. కనుక, వ్యంజనాత్మయగు ధ్వనికెట్లు లక్షణమగును ?" అని చెప్పఁబడినది. ["భక్తి - ధ్వనికి లక్షణము" అను లక్షణమునకిట్లు] అతివ్యాప్తిని జెప్పుప్రసంగమున-భక్తికిని, వ్యంజనకును, భిన్నములగు విషయముల కలిమియుఁ, జెప్పఁబడినది. కనుక, 'ధ్వనివేఱు, భక్తి వేఱు. అని ముగింపఁబడినది.

అవ :— "అటనతివ్యాప్తివలన, నవ్యాప్తివలన,
దానిచేతనీధ్వని - లక్షితమునుగాదు"

అను కారికయందుఁ దెలుపఁబడిన యతివ్యాప్తిని వ్యాఖ్యానించి, అవ్యాప్తిని వ్యాఖ్యానించుచున్నాఁడు.

(89) మూలము :— ["ధ్వని-భక్తిరూపము" అను] లక్షణమునకవ్యాప్తి గూడఁ గలుగుచున్నది.

వివక్షితాన్య పరవాచ్యలక్షణమగు ధ్వనిప్రభేదమును,[దానికి సంబంధించిన] తదితరములగు ననేకధ్వని ప్రకారములునుగూడ - భక్తిచేత వ్యాపింపఁబడునవికావుగదా !

కనుక, భక్తి - [ధ్వనికి] లక్షణముకాదు.

లోచనము :— "ఈలక్షణమున కవ్యాప్తికూడ" అనఁగా; "గుణవృత్తి రూపమగు నీలక్షణమున కవ్యాప్తికూడ కలుగుచున్నది." అనియర్థము.

ఎచ్చటనెచ్చట, ధ్వనియుండునో, ఆచ్చటనచ్చట, భక్తియుండునెడల, అవ్యాప్తికలుగదు. కాని, యిట్లుండుటలేదు. అవివక్షిత వాచ్యమగు "పురుషులు

ముగ్గురు సువర్ణపుష్పగఁబృథివిన్'' ఇత్యాదికమునందు భక్తియున్నది. కాని, ''ఏశిఖరిన్'' అనుచోట [వివక్షితాన్యపరవాచ్యమునందు] ఆభక్తిలేదు. [కనుక, నవ్యాప్తి కలుగును.]

ప్రభా :— ''గౌణస్థలమునందుఁగూడ - లక్షణప్రసరించును. కనుక, ''ఏశిఖరి'' అనుస్థలమునందుఁగూడ; నది - ప్రవర్తించునదియేయగును. కనుక, నచట, భక్తి - లేదనుటయుక్తముకాదు.'' అనుపూర్వపక్షము, నుపక్షేపించు చున్నాఁడు.

పూర్వపక్షి :— అయ్యా! ['ఈవటుఁడుసింహము' అను] గౌణస్థలమునందుఁ గూడ - లక్షణాసామగ్రియుండుటవలన, లక్షణ - వ్యాపించును. [ఈగౌణమున కును, లాక్షణికమునకును, భేదమెట్లనిన ;- ] గౌణస్థలమున [సింహాది] శబ్దము [వట్వాదిరూపమగు] ఆయర్థమును, లక్షింపఁజేసి, దానితోనే [వట్వాద్యర్థమును దెలుపునదియగు వట్వాదిశబ్దముతోడనే] సామానాధికరణ్యమునొందును. శబ్దము లకు సామానాధికరణ్యమనఁగా; వేరువేరగురూపములచేత - ఏకార్థమును బ్రతి పాదించుట. అర్థమే [సింహాదిపదార్థమే] అర్థాంతరమును [వటురూమగు వేఱొక యర్థమును] లక్షింపఁజేసి, స్వవాచకముతో [సింహాదిపదముతో] తద్వాచకమును [వట్వాదిశబ్దమును] సమానాధికరణముగా నొనర్చును. లేక, శబ్దార్థములు [సింహాదిశబ్దమును, దానియర్థమును] దానిని [వట్వాద్యర్థమును] ఒక్కసారిగానే లక్షింపఁజేసి, అన్యములగు శబ్దార్థములతో [వట్వాదిశబ్ద - తదర్థములతో] కలి యును. [శబ్దములేకధర్మినిబోధించును. అర్థములభేదమున, నన్వయించును.'' అనునది- గౌణమునకుఁగల విశేషము.] కేవలమునిట్లు గౌణమునకు, లాక్షణికము నంటె భేదమున్నది.కనుకనే ''గౌణమునందు శబ్దప్రయోగముండును. [''వటుఁడు సింహము'' ఇత్యాదులయందు వట్వాదిశబ్దప్రయోగముండునట్లు, లక్ష్యవాచకపద ప్రయోగముండును.] లక్షణయందుండదు. [''గంగయందు గొల్లపల్లె'' అనుచోట తీరాదివాచకపదప్రయోగముండనట్లు, లక్షణాస్థలమునందు లక్ష్యవాచక పద ప్రయోగముండదు.] అని, [పెద్దలచేత] చెప్పఁబడినది. [స్వల్పమగు భేదమిట్లు న్నను] ఈగౌణస్థలమునందుఁగూడ- లక్షణయుండనేయున్నది. కనుక, నంతటను గూడ - లక్షణయే - వ్యాపించియున్నది.

ప్రభా :- ''శ్లో॥ అభిధేయేన సంయోగాత్, సామీప్యాత్, సమవాయతః।
వైపరీత్యాత్, క్రియాయోగా, ల్లక్షణా-పఞ్చధాస్మృతా.''

అనులాక్షణిక వచనమును విభజించి, వ్యాఖ్యానించుచున్నాఁడు. ఆలక్షణ కూడ - పంచవిధమగుచున్నది.

అదియెట్లనిన :— [అందుమొదటిది] అభిధేయముతోడి సంయోగము [వాచ్యవాచకరూపమగు సంబంధము] వలననగులక్షణ :- [ద్విరేఫశబ్దము-తుమ్మెదను బోధించునపుడీలక్షణ ప్రసక్తించును.]

[ద్వౌ + రేఫౌ + యస్యసః] రెండురేఫములుగలది- భ్రమరశబ్దము. కనుక నది - ద్విరేఫశబ్దమున కభిధేయమగుచున్నది. ద్విరేఫశబ్దముచేతఁ జెప్పఁబడునది యగు, నాభ్రమరశబ్దముతోడి 'సంయోగము' అనఁగా; [వాచ్యవాచకభావరూపమగు] సంబంధము - షట్పదలక్షణమగు నర్థమునకుఁ[తుమ్మెదకుఁ]గలదు. కనుక; నిట్లు ద్విరేఫశబ్దము- భ్రమరశబ్దముతోఁదనకుఁగల వాచ్యవాచకభావమను, సంబంధమును - నిమిత్తముగాఁజేసికొని, తుమ్మెదను లక్షింపఁజేయును. రెండవది - ముఖ్యార్థముతోడి సామీప్యమువలననగు లక్షణ. "గంగయందు గొల్లపల్లె" అను చోట - గంగాశబ్దము - తనయర్థమగు గంగకు సమీపమునందున్న తీరమును బోధించును. మూడవది - సమవాయమువలన - అనఁగా; ఆధారాధేయభావరూపమగు సంబంధమువలన నగులక్షణ. ఇది - "చేతికఱ్ఱలను బ్రవేశింపజేయుము' ఇత్యాదులయందు "చేతికఱ్ఱలుగలవారిని బ్రవేశింపఁజేయుము" అను నర్థమును లక్షింపఁజేయును. నాల్గవది - [ముఖ్యార్థమునకు] వైపరీత్యమువలననగు లక్షణ ఒకానొకఁడు - శత్రువునుద్దేశించి పలుకుచున్నాఁడు- "వాఁడు నాకొనర్చని యుపకారమేమున్నది ?" అని. ఇచట, లక్షణచేత దీనికి విపరీతమగు నపకారము లక్షింపఁజేయఁబడును. అయిదవది- క్రియాయోగమువలన, అనఁగా; కార్యకారణభావమువలననగు లక్షణ. దీనికుదా :— అన్నమునపహరించు వానినిగుఱించి- "వీఁడు ప్రాణములను హరించుచున్నాఁడు." అని వ్యవహరించుట. ఇచట "ప్రాణములను" అనుదానిచేత అన్నము - లక్షింపఁజేయఁబడును. ఇట్లు పంచవిధమగు నీలక్షణచేత [అముఖ్యార్థ వ్యవహారభూమిపతితమగు] విశ్వమే - వ్యాప్తమగుచున్నది.

అదెట్లనిన ;— "ఏశిఖరి నెంతచిరము', అని, "యాకస్మికమగు ప్రశ్నవిశేషము" మున్నగు బాధకములయనుప్రవేశమున్నపుడుకూడ, సాదృశ్యమువలననగులక్షణ యుండనేయుండును.

[ ఇంతవఱకును పూర్వపక్షముపన్యసింపఁబడినది. ]

సిద్ధాంతి :— [మీకొనర్చిన పూర్వపక్షము ననుసరించి] ఇచ్చటఁగూడ - నడుమను లక్షణయున్నదని [వెనుకమాచేతఁగూడ] అంగీకరింపఁబడియేయున్నది.

పూర్వపక్షి :— అట్లయినయెడల, [వృత్తియందు] "వివక్షితాన్యపర వాచ్యము" అనియేల చెప్పఁబడినది.

[ఇచట లక్షణయుండినయెడల, వాచ్యము - వివక్షితమెట్లగును ?]

సిద్ధాంతి :— వివక్షితాన్యపరవాచ్య శబ్దముచేత [వృత్తియందు] వివక్షితా న్యపరవాచ్యధ్వనికవాంతర భేదమును, ముఖ్యమునునగు, అసంలక్ష్యక్రమ ధ్వని స్వరూపము-[ముఖ్యముగా] వివక్షితము. [మఱియు, వృత్తియందు] దానికి సంబం ధించిన తదితరములగు ననేకధ్వనిప్రకారములును" అనుదానిచేత [శృంగారహా స్యాది]రసములును, భావములును, రసాభాస, భావాభాస, తత్ప్రశమాది భేదము లును, తదవాంతరభేదములును, వివక్షింపఁబడినవి. వానియందు లక్షణప్రసరించు టకుఁగూడ - వీలులేదుగదా !

అదెట్లనిన :— విభావానుభావ ప్రతిపాదకమగు కావ్యమున ముఖ్యమగు నర్థమునందు, బాధకములయనుప్రవేశముకూడ [లక్షణాప్రయోజనముకూడ] అసంభావ్యము. కనుక, నచట, లక్షణకవకాశమేదీ ?

పూర్వ :— [ముఖ్యార్థబాధలేనిచోట, లక్షణ కవకాశములేదని ధ్వనివా దుల యభిప్రాయము. కాని] బాధచేతనగు ఫలమేదియు, నిచట, నావశ్యకము కాదు. [భట్టవార్తికమునఁ జెప్పఁబడినట్లు]

"అభిధేయావినాభూతప్రతీతిర్లక్షణోచ్యతే"

"ఏసంబంధముచేతనయినను వాచ్యార్థముతో సంబద్ధమైయుండి, అభిధేయ మును విడిచియుండని, యర్థమునకగు ప్రతీతియే, [లేక తత్ప్రతీతిహేతువే] లక్షణ." అనిచెప్పఁబడును." అనునింతమాత్రమే - లక్షణాస్వరూపమైయున్నది. "రసమునకు, విభావములు - కారణరూపములును, అనుభావములు - కార్యరూప ములును, వ్యభిచారిభావములు - తత్సహకారులును, నగుచుండును. కనుక,అసం లక్ష్యక్రమవ్యంగ్యధ్వని ప్రభేదమునందుఁగూడ - అభిధేయములగు విభావానుభా వాదుల కీయసంలక్ష్యక్రమవ్యంగ్యధ్వనిభేదములగు రసాదులు - అవినాభూతము

లగుటవలన, [ఈనూతన లక్షణమునను సరించి] అవియు - లక్ష్యములేయగును.

సిద్ధాంతి :– [ముఖ్యార్థబాధయే-లక్షణాబీజము. కనుక, మీరుచెప్పిన నూతన లక్షణమునను సరించి] రసాదులు - లక్ష్యములగునవికావు. అట్లయినయెడల, ధూమశబ్దమువలన - పొగయొక్క జ్ఞానముకలుగునపుడు [ధూమమున కవినాభూతమగు] అగ్నియొక్క స్మృతికూడ - లక్షణాకృతమేకావలసివచ్చును. తదుపరి, ఈయగ్నిస్మృతినుండి- అగ్నినివిడిచియుండని ‘‘శీతాపనోదము [చలినిబోగొట్టుట] యొక్కస్మృతి’’ మున్నగునదియగు నర్థము-తెంపులేకుండ, ప్రతీతమగుటవలన, ధూమశబ్దార్థమునకు ముగింపు కలుగకుండవలసివచ్చును.

పూర్వ :- ధూమశబ్దమునకు స్వార్థమునందు [ధూమార్థమునందు] విశ్రాంతి యున్నది. కనుక, [స్వార్థముకంటె నితరమగు] అగ్ని మున్నగునర్థమునందు వ్యాపారముండదు. [కావుననచట, లక్షణకు ప్రసక్తిలేదు.]

సిద్ధాంతి :— [స్వార్థమునందు విశ్రాంతిలేనప్పుడు, లక్షణనాశ్రయింపవలయునని మీరు నంగీకరించుచున్నారుగదా !] అట్లయినయెడల, ముఖ్యార్థబాధయుండునపుడు, దేనికినిగూడ, స్వార్థమునందువిశ్రాంతికలుగదు. కనుక; ముఖ్యార్థబాధయే - లక్షణకు జీవితమని సిద్ధించుచున్నది. విభావాదులు ప్రతిపాదింపఁబడునపుడిట్లు బాధకమేదియుఁగూడలేదు.

ప్రభా :— కాఁగా; ‘‘ధూమశబ్దము ధూమరూపమగు స్వార్థమునందే విశ్రాంతినిబొందునట్లు, విభావాదులను బోధించునవియగు శబ్దములు - విభావాదిరూపమగు నర్థమునందే, విశ్రాంతములగును. కనుక, నిచట; లక్షణాప్రసారమున కవకాశములేదు’’ అని సిద్ధాంతము. ☞ ఇచట, రసప్రతీతివిషయమున నేర్పడునవియగు పూర్వపక్షములు - లోచనకర్తచేత ఖండింపఁబడి, రసము-అలౌకికమనియు, శబ్దవ్యాపారజన్యమనియు, నిరూపింపఁబడి, ఆవ్యాపారముకూడ-వ్యంజనయేకాని, అభిధా, లక్షణారూపముకాదని సిద్ధాంతీకరింపఁబడినది. ద్వితీయోద్ద్యోతము చివరను ‘‘రసాలోకము’’ అను ననుబంధమున, నిచట లోచనోక్తమగు విషయమంతయు, ప్రభామతి వివరణముతోఁగూడ, సమగ్రముగ విశదీకరింపఁబడును. కనుక; పాఠకులీ యంశమునచట [ప్రథమభాగము చివరనున్న యనుబంధమునందు] సమీక్షింపఁగోరెదను.

లోచనము :— [రసాస్వాదమునకు - అనితరసాధారణమగు సౌభాగ్యమున్నది.] కనుకనే, ‘‘శిశిరన్’’ ఇత్యాది వివక్షితాన్యపరవాచ్య స్థలములయందుఁ

గూడ - ముఖ్యార్థబాధాదికము నపేక్షింపకయే, సహృదయులు-చాటుప్రీత్యాత్మక మగు వక్తృయభిప్రాయమును జక్కఁగనే, తెలిసికొనుచున్నారు. కనుకనే; గ్రంథ కారుఁడు-సామాన్యముగా వివక్షితాన్యపరవాచ్యమగు ధ్వనియందు, భక్తి లేదనెను. మేముమాత్రము [అచట భక్తియున్నదను నభినివేశముగలవారికిఁగల] దుర్దురూ టమును [ధ్వనిలేదను దురభిమతమును] మరలించుటకు, భక్తినంగీకరించికూడ, వ్యాఖ్యానించితిమి. పోనిండు ! ఇచ్చట [''ఏశిఖరిన్'' ఇత్యాదివివక్షితాన్యపర వాచ్య ప్రభేదమగు సంలక్ష్యక్రమమునందు] లక్షణయుండిన నుండుఁగాక! అసంలక్ష్యక్రమమగు ధ్వనియందుమాత్రము, నీవుకుపితుఁడవైననుగూడ - ఏమి చేయుదువు ? [అచట - లక్షణ ప్రసరించుననఁజాలవుగదా !.] నీవు కోపగింపని యెడల, [సత్యమునుదెలుపుదుము.] ''ఏశిఖరిన్ - అనుచోటనేకాక, ''పురుషులు ముప్వురు సువర్ణపుష్పగఁబృథివిన్'' మున్నగు అవివక్షిత వాచ్యస్థలములయందుఁ గూడ - ముఖ్యార్థబాధాది సామగ్రి నపేక్షింపకయే, వ్యంగ్యార్థమునకు విశ్రాంతి యున్నది'' అని తెలిపి - మఱిపెంచక, యీయంశము నిక్కడికి ముగింతుము.

ఈయభిప్రాయముచేతనే వృత్తికర్త, ''భక్తి - ధ్వనికి లక్షణముకాదు.'' అనిముగించెను.

అవ ; పూర్వపక్షి :— ధ్వనియు, భక్తియు, నేకరూపముకాకపోనిండు ! మఱియు, భక్తి - ధ్వనికి లక్షణముగాకపోనిండు! ఉపలక్షణము మాత్రముకాఁ గలదు. ఎచ్చట. ధ్వనియుండునో. అచ్చట భక్తికూడనుండును. కనుక, ధ్వని - భక్త్యుపలక్షితమగును.

సిద్ధాంతి :— ''ఉపలక్షణమగు, భక్తికూడ - అంతటనులేను. [ధ్వనిస్థల మునందొకానొకచోట] భక్తి - ఉపలక్షణముగా నున్నంతమాత్రమున, పరునికిఁ గలిగినలాభమేమి ? మాకుఁగలిగిన నష్టమేమి ? అనిచెప్పుచున్నాఁడు.

## (90) మూలము :— (కారికా)

"కస్యచిద్ ధ్వనిభేదస్య సాతుస్యాతుపలక్షణమ్"

గీ॥ తాను, నుపలక్షణముగ మాత్రమగు, నది-యొ
కానొకండయిన ధ్వనిప్రకారమునకు.

ఇంతేమనిన :- ముందు తెలుపఁబడునవియగు ధ్వనిప్రభేద ములనడుమ [అవివక్షిత వాచ్యమను] ఒకానొక ధ్వనిభేదమున, కీభక్తి - ఉపలక్షణమాత్రముగా సంభావింపఁదగి యుండుటవలన, గుణవృత్తిచేతనే - ధ్వని - లక్ష్యమగుననునెడల; నప్పుడు - [ప్రసిద్ధమగు] అభిధావ్యాపారముచేతనే, తదితరమగు నలంకారవర్గము-సమగ్రముగనే, బోధింపఁబడుచున్నది. కనుక, ప్రత్యేకములగు నలంకారములకు లక్షణకరణము - వ్యర్థముకావలసివచ్చును.

లోచనము : పూర్వ :— ''అయ్యా! భక్తిలక్షణమును - వీరంతను తెలిపియున్నారు. కనుక, ఉపలక్షణమగు భక్తిముఖమున [సహృదయులు]సమగ్ర భేదమగు ధ్వనినిగూడ లక్షింపఁజేయఁగలరు. తెలియనుగలరు. కనుక, ధ్వని లక్షణముచేత ప్రయోజనమేమున్నది ?'' అని యాశంకించి, ''గుణవృత్తిచేతనే ధ్వనిలక్ష్యమగును. అనునెడల'' అనివృత్తికర్తచేత సమాధానము చెప్పఁబడినది.

[దానిభావమిది :—] అభిధానాభిధేయభావము [అభిధ] సర్వాలంకారము లయందును వ్యాపించియున్నది. కనుక; ఆయభిధావృత్తిని, వైయాకరణులును, మీమాంసకులును, నిరూపించియేయున్నారు. కనుక, అలంకారగ్రంథకర్తలు- అలంకారనిరూపణమునొనర్చుట - వ్యర్థముకావలసివచ్చును. [ఇంకొకయనిష్టముకూడనున్నది]అట్లే''హేతుబలమువలనకార్యముజనించును.''అనితార్కికులుచెప్పుటవలన, ఈశ్వరప్రభృతులగు కర్తలకు, లేక జ్ఞాతలకు, సంబంధించినకృత్యమపూర్వము కాకుండుటవలన, ఈశ్వరుఁడుమున్నగుకర్తృవర్గము- లేక జ్ఞాతృవర్గము-ప్రయత్నములేనిదికావలసివచ్చును. ఈయంశమే - ''లక్షణకరణము - వ్యర్థము - కావలసివచ్చును.'' అనుదానిచేతఁజెప్పఁబడినది. [లక్షణకరణమనఁగా; ధ్వనిలక్షణమును, దానినిరూపణమును, ననియర్థము.] ''ఇది - అపూర్వోన్మీలనముకాకపోవిందు. [అప్పుడు] పూర్వోన్మీలితమునే, మేమును - చక్కఁగా నిరూపించితిమి. కనుక, అట్లయినను దోషమేమి ?'' అనిచెప్పుచున్నాఁడు.

(91) మూలము :— మఱియు,

లక్షణేఽన్యైః కృతే చాస్య పక్షసంసిద్ధిరేవనః. (19)

ఈధ్వనికి లక్షణమున్యులెవరొమున్నె
చేసినను, మాకెపక్షసంసిద్ధియగును. (19)

ఇంతకుముందే-యితరులెవ్వరయినను, ధ్వనిలక్షణమునొనర్చి యేయుండినయెడలను, గూడ - మాపక్షమే - సిద్ధించినదగును.

"ధ్వనియున్నది" అనునది- మాపక్షము. కనుక; అదికూడ- ఇంతకుముందే సంసిద్ధమగుటవలన, ప్రయత్నములేకయే, మేము స్వాభీష్టార్థము నొందినవారలమగుదుము.

లోచనము :— "ఇంతకుముందే" అనఁగా; "మాప్రయత్నముకంటె పూర్వమునందే" అనియర్థము.

ఇట్లు ప్రకారత్రయముగలదియగు, ధ్వన్యభావవాదమును, "ధ్వని - భక్తియందంతర్భవించును." అనువాదమును, గూడ - నిరాకరించిన, కారికాకర్తచేత- "ధ్వని - అలక్షణీయము" అనువాదముకూడ - వీనినడుమను నిరాకరింపబడినదియేయగుచున్నది. కనుకనే, మూలకారిక , [ధ్వనిసూత్రము] సాక్షాత్తుగా దానిని, నిరాకరించు నభిప్రాయము గలదిగా వినఁబడుటలేదు. "ఇట్లు [అలక్షణీయతావాదముగూడ] నిరాకరింపఁబడినను, ప్రమేయశయ్యాపూరణమునకై [ధ్వని - అనాఖ్యేయమనువాదముగూడ నిరాకరింపఁబడనియెడల, ప్రమేయసన్నివేశవిశేషము పూరింపఁబడదు." అను నభిప్రాయమున, వృత్తికర్తదానినిబూరించుటకు] స్వకంఠముతో - ఆపక్షమునుగూడ ననువదించి, నిరాకరించుచున్నాఁడు.

(92) మూలము :- "ధ్వనిస్వరూపము- సహృదయహృదయైకవేద్యము. కావున,అనాఖ్యేయమే[అనిర్వచనీయమే]యగును." అని యెవ్వరుచెప్పిరో వారుకూడ-పరీక్షించి, వచించినవారుకారు.

ఏలయనిన; వెనుకఁదెలుపఁబడిన, నీతిచేతను, ['అర్థమయిన శబ్దమయిన' అనుసామాన్యలక్షణముచేతను] ముందుతెలుపఁబడునదియగు,నీతిచేతను,['స్వార్థభిన్నమ్మయిన' అనివక్ష్యమాణ విశేషలక్షణముచేతను]ధ్వనికి సామాన్య,విశేష,లక్షణములు-ప్రతిపాదింపఁబడినను గూడ, ధ్వని - అనాఖ్యేయమేయగునెడల, సర్వవస్తువులును గూడ- అనాఖ్యేయములే- [లక్షణమునుదెలుపుటకు శక్యముకానివే]

కావలసివచ్చును. అట్లుగాక,ధ్వన్యతిశయోక్తి యగు నీవాక్యముచేత, వారుకూడ ధ్వనికి, కావ్యాంతరాతిశాయియగు [ధ్వనికావ్యముకంటె నితరములగు చిత్ర, గుణీభూతవ్యంగ్యముల నతిశయించు సారతా రూపమగు] స్వరూపమును జెప్పినవారగునెడల, నప్పుడువారుకూడ యుక్తముగాఁజెప్పినవారలే యగుచున్నారు.

లోచనము :— "అర్థమయిన శబ్దమయిన" అని వెనుకసామాన్యలక్షణము తెలుపఁబడినది. "స్వార్థభిన్నమ్మయిన" ఇత్యాదులచేత ముందు విశేషలక్షణము-తెలుపఁబడును. ఇచటనీప్రథమోద్ద్యోతమున, కారికాకారునిచేత- ధ్వనికి సామాన్య లక్షణమే తెలుపఁబడినది. ద్వితీయోద్ద్యోతమునందే - కారికాకారుఁడు - అవాంతర విభాగమును, విశేషలక్షణమునుగూడ నొనర్చుచు, అనువాదముఖమున మూల విభాగమును ద్వివిధముగా సూచించును. వృత్తికారుఁడో [ఆనందవర్ధనాచార్యుఁడో] తదాశయము ననుసరించి, యీప్రథమోద్ద్యోతమునందే "అదికూడ - 1 అవివక్షితవాచ్యము. 2 వివక్షితతాన్యపరవాచ్యము' అని సామాన్యరూపమున, ద్వివిధము"అని మూలవిభాగమును [గూడఁ] దెలిపెను.

ప్రభా :— సత్యమేమయినను. 'ధ్వని [కారికా]కారుఁడును, ఆలోక [వృత్తి] కారుఁడును, భిన్నులు" అని లోచనము వాకొనినట్లు దీనివలనఁదోచును.

లోచనము :— [ఇట్లు నిరూపింపఁబడినధ్వని - అనాఖ్యేయమగునెడల,] లౌకికములును, శాస్త్రీయములును, నగు సర్వవస్తువులునుగూడ-అనిర్వచనీయము లేయగును. "తాన్యక్షరాణి హృదయేకిమపిస్ఫురన్తి" అనుచోటనువలె - ధ్వనికి-సారరూపతను - ప్రతిపాదించుటకుఁ దెలుపఁబడిన, యీయతిశయోక్తిచేత - [చెప్పుటకు వీలున్నను - చెప్పుటకు శక్యముకాదని చెప్పునదియగు నతిశయోక్తి చేత] ధ్వని – అనాఖ్యేయమని చెప్పఁబడినయెడల; వారిచేతఁగూడ నుచితముగనే దర్శితము. కనుక, (సర్వమును) శివమగుగాక ః

ప్రభా ;— "తాన్యక్షరాణి హృదయేకిమపిస్ఫురన్తి" "ఆయక్షరములు, హృదయమున నిప్పుడును, ఏదోస్ఫురింపఁజేయుచున్నవి." అనుచోట - "ఏదో" అనుదానిచేత-చెప్పబడిన అనాఖ్యేయతచేత, ఆయక్షరముల యతిశయము. స్ఫురింపఁజేయఁబడుచున్నది. క్రిందిది - "తాన్యక్షరాణి" అను మూలశ్లోకమునకు ముత్యాలసరముతోఁగూర్పఁబడిన యాంధ్రీకృతి. [ఒకానొకప్రియుఁడు - తన ప్రేయసిపలికిన రహఃప్రణయభాషితములను స్మరించుచున్నాఁడు.]

— మూడు ముత్యాలసరము —

౧

"బెదరుగదిరిన లేడిచూపులఁ
గొదవఁజూపిన, కనులుగలిగిన
సుదతి, నాప్రియురాలు నాదరి,
సోలి, పవళించెన్.

౨

నిదురకై, యరమోడ్పులుగ, నిజ
నేత్రములు ముకుళింప, మెల్లగ,
మృదుల మధురములయిన నుడువుల
నెదియొ వచియించెన్.

౩

అక్షరములవి-సార్థకములో, నిరర్థకమ్ములో, గాని,
అక్షరములయి, 'యేదో' హృదయము
నందు [స్ఫురియించున్] మెరయించున్.

ఈ చివరి ముత్యమున, 'ఏదో' అనుచోటఁ జెప్పఁబడిన - అనాఖ్యేయత [తెలుపరాకుండుట] చేత - ఆయక్షరముల యతిశయము - తదితరములకంటె విశిష్టమని స్ఫురింపఁజేయఁబడినదిగదా!. ఇట్లే - తదితరకావ్యములకంటె, ధ్వని కావ్యమునకు విశిష్టతను ప్రతిపాదించుటకు, అనాఖ్యేయతావాదులిట్లు చెప్పిన యెడల వారును యుక్తముగాఁ జెప్పినవారే యగుచున్నారు.

లోచనము ;— గీ॥ లోచనములేక సహృదయాలోకమెట్లు
భాసితమ్మగు చంద్రికవలనఁ, గానఁ,
గూర్చెదీనికి నభినవగుప్తనామ
ధేయుఁడగు, వీఁడు-లోచనోన్మీలనమును.
[ధీరవర్యుండు లోచనోన్మీలనమును.]

గీ॥ ఎమ్మహాశక్తి - యున్మీలనము శక్తి,
జగతి - యున్మీలితమ్మగు క్షణమునందె,

స్వాత్మయను నాశ్రయమున విశ్రాంతయెవతె,
ప్రతిభ, కాశివాఖ్యకు, నమస్కృతిఘటింతు.

ఇది - శ్రీమహామాహేశ్వరాచార్యవర్యాభినవగుప్తోన్మీలితమును, ధ్వనిసంకేతమును, నగు సహృదయాలోకలోచనమున, ఉద్ద్యోతము- ప్రథమము.

ప్రభా :—

శా॥ ఆనందధ్వనిరూప తత్త్వమది, మున్నాలోకయుక్తమ్ముగాఁ,
దానాచార్య కులాశ్రియాభినవగుప్తాఖ్యుండు, శ్రీలోచన
జ్ఞాన శ్రీనొసఁగన్, ‘ప్రభామతి’ పరిష్కారమ్ము సంధించె ల
క్ష్మీనారాయణశాస్త్రి - భక్తుఁడయి, బ్రాహ్మీసత్కృపాయుక్తుఁడై.

అంబ! రసావలంబ! మహితార్థగుణ గ్రథితప్రలంబ! కా
దంబ చరన్మనోహర పదాంబుజ! సంభృతరీతి సంస్క్రియా
లంబ! ముఖేందుబింబ! విగళద్, విచలద్, విలసత్, స్మితప్రభా
చుంబితదిక్కదంబ! పరిశుద్ధకథానికురుంబ! భారతీ!

కం॥ చతురాననముఖవాసిని!
చతురాగమరూప! సుప్రసన్నాలాపా!
చతురక్షరపదదాయిని!
చతురాత్మగుణప్రచార! చతురాధారా!

ఓమ్. తత్. సత్.

ఇది - ప్రథమోద్ద్యోతము.

# శోధిక

| పేజి | పంక్తి | ఒప్పు |
| --- | --- | --- |
| కృతిసమర్పణమున 1 | 10 | విభావ్రిజత్ |
| మూలమున 1 | 12 | (1) మూలము :— |
| 1 | 15 | ప్రాణమొసఁగునవి. |
| 3 | 2 | లోచ :— ఈపద్యము. |
| 3 | 20 | త్త్రాసాపనయనోద్యమము |
| 7 | 3 | తత్ స్వరూపమ్. (1) |
| 7 | 11 | ఆహుః = చెప్పుచున్నారు. |
| 7 | 18 | (2) మూలము :— |
| 8 | 2 | (3) మూలము :— |
| 14 | 8 | [ఊహింపఁబడిన] |
| 15 | 19,20,21 | భూతార్థకమగు 'జగదుః' అనుక్రియ సంభావనా పరమే, అనఁగా: ఊహించిచెప్పినదేకాని, [ఆసంభావన] విని చెప్పినదికాదు. |
| 19 | 20 | (4) మూలము :— |
| 21 | 17 | వాదులు కావ్యసౌందర్య హేతువని చెప్పునది. |
| 22 | 5 | (5) మూలము |
| 23 | 27 | కవయస్తథా |
| 24 | 7 | అగుచు |
| 34 | 9 | హృదయాహ్లాది |
| 34 | 29 | ప్రస్థానము. |
| 42 | 19 | ధ్వనేః (౧) |
| 78 | 18 | ఆత్మతోఁగూడిన |
| 101 | 2 | చిదాత్మను |
| 104 | 13 | మొదటిదియు |
| 109 | 19 | వివక్షితమగు |
| 158 | 28 | ద్వారముననే |
| 159 | 6 | లోచనము : దీనికుదా :— శా॥ నాళీకాక్షుఁడు |

| పేజీ | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| 160 | 9 | [వ్యంజనచేత] |
| 166 | 13 | రస్యమానత |
| 168 | 9 | ఆదికవి |
| 184 | 24లో | (37) మూలము :— అమచోట క్రింది కారికనుజేర్చి చదువవలెను. |
| | | "శబ్దార్థశాసనజ్ఞాన మాత్రేణైవనవేద్యతే వేద్యతే సహికావ్యార్థ తత్త్వజ్ఞైరేవకేవలమ్." (7) |
| 192 | 20 | తెలిసికొననియెడల |
| 241 | 14 | నిచ్చుచున్నాఁడు] |
| 253 | 20 | విపణిన్ పానీయగోష్ఠ్యాదులన్ |

శ్రీ వేదవ్యాస ప్రెస్ - విజయనగరం 1958.